# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 13 సంచిక : 7 హైదరాబాద్ 168 జూలై 2015 పేజీలు : 68 రు. 20

* నోటుకు వోటే పార్లమెంటరీ రాజకీయం
* చెన్నై ఐఐటిలో భావ ప్రకటనా స్వేచ్ఛ
* మ్యాగీ నూడుల్స్‌లో విష పదార్థాలు
* రెండు రాష్ట్రాలు - ఒక సంవత్సరం
* పేదల ఇళ్లకు యూనివర్సిటీ భూములా?
* 'మావోయిస్టు కావడం నేరం కాదు'
* రోహింగ్యా శరణార్థుల విషాద గాథలు

## ఆంధ్రప్రదేశ్‌లో వీక్షణం రచయితల సమావేశం 2015

ప్రాంతీయ, దేశీయ, అంతర్దేశీయ పరిణామాలపై అవగాహనలను, తెలుగు సమాజం తనతో తాను జరుపుతున్న సంభాషణను అక్షరబద్ధం చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ప్రతి సంవత్సరం తన రచయితలతో, అభిమానులతో సంభాషణకు కూడ వేదిక కల్పిస్తున్నది. వీక్షణం ఎనిమిది సంవత్సరాల కింద ఈ వార్షిక రచయితల సమావేశం ప్రారంభించింది. వీక్షణం రచయితలు, పాఠకులు, అభిమానులు, సిబ్బంది కలిసి కూచుని వీక్షణంలో అచ్చవుతున్న రచనల గురించీ, అచ్చు కావలసిన అంశాల గురించీ చర్చించుకోవడానికి, పత్రిక వెలువడుతున్న తీరు గురించి అభిప్రాయాలు, సలహాలు, సూచనలు పంచుకోవడానికి, గతాన్ని సమీక్షించుకుని భవిష్యత్తుకు మార్గాలు వేసుకోవడానికి ఈ సమావేశాలు జరుగుతున్నాయి. రాష్ట్ర విభజన తరువాత తెలంగాణ సమావేశం మార్చ్ 8న జరిగింది. అదే వరుసలో ఆంధ్రప్రదేశ్ సమావేశం ఆగస్టు 9, ఆదివారం గుంటూరులో జరుగుతుంది.

ఇప్పటికే వీక్షణంలో రచనలు చేసినవారు, రచనలు చేయదలచుకున్నవారు, పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు – మొత్తంగా తెలుగు సమాజ జీవితం గురించి, ప్రజల గురించి ఆలోచించే ప్రతి ఒక్కరూ ఈ సమావేశానికి ఆహ్వానితులే.

పాల్గొనదలచినవారు అదనపు సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి ఫోన్ చేయగలరు.
ఫోన్ నం. 040-66843495, 9949391028



**పుస్తకాల ప్రతులకు :**

**వీక్షణం, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,**

**హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.**

**ఫాక్స్ / ఫోన్ : 040-66843495** Email : veekshanam2003@gmail.com

168

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2015
సంపుటి : 13
సంచిక : 7





### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎస్.తిరుపతి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల అసహజ మరణాల వివరాలు అందించిన వారు ఎస్. వెంకటేశ్)



**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**ప్రింటర్స్ : డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌పై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 జూన్ నెలలో వచ్చిన విరాళాలు - శ్రేయోభిలాషి, విశాఖపట్నం - రు. 5,000; ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి, భూంపల్లి, మెదక్ - రు. 500; కున్నేలు జవహర్, హైదరాబాద్ - రు. 10,000; మైకెల్, చెన్నై - రు. 1,500; బాలాజీ వరప్రసాద్ - రు. 5,000; కె. శశిరేఖ, అసిస్టెంట్ ప్రొఫెసర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జమ్మికుంట - రు. 500; డా. బొడ్డు రమేష్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, జమ్మికుంట - రు. 500; ఎన్. రజని, హైదరాబాద్- రు.500; పావని, హైదరాబాద్ - రు. 5000. మిత్రులందరికీ కృతజ్ఞతలు. - సం.**

**వీ**క్షణం జూన్ సంచికలో 'మోడీ ఏడాది పాలనలో తుపాకులు – నాగళ్లు' వ్యాసం వాస్తవ రూపం. దంతెవాడ, సుకుమ, బస్తర్‌లలో జరుగుతున్న సంఘటనల వాస్తవాలను పక్కనపెట్టి వక్రీకరించి తలకిందులుగా మీడియా కథనాలు వస్తున్నాయి. అవి చదివి కొంతమంది కుహనా మేధావులు వ్యాసాలు రాస్తున్నారు. వారిని మరికొంతమంది బలపరుస్తున్నారు. నాగళ్లు – తుపాకులు రెండూ అవసరమే. నాగళ్లతో పనిచేసేవాళ్ల దగ్గర భూమి లేదు. భూకబ్జాదారులకు నాగళ్ల గురించి తెలియదు. నాగళ్లు, పంటని, భూమిని కాపాడుకోవాలంటే తుపాకి, కత్తులు, బాణాలు అవసరమయ్యాయి. తెలంగాణ సాయుధ పోరాట కాలంలో వందలాది మంది రైతులు తుపాకి భుజాన తగిలించుకుని నాగలితో సేద్యం చేశారు. రాజ్యహింస నుండి మనల్ని మనం కాపాడుకోవాలంటే ఆయుధం తప్పనిసరి. ఇది అందరికీ తెలిసిన చారిత్రక సత్యం. ప్రధాని మోడీ మే 9న దంతెవాడ పర్యటనను లోతుగా అధ్యయనం చేయాలి. చత్తీస్‌గడ్ రాష్ట్రంలో ప్రతీరోజు గిరిజనులను పోలీసులు అపహరిస్తూనే ఉన్నారు. విశాఖ ఏజెన్సీ 11 మండలాలలో సుమారు 6 లక్షల మంది గిరిజనులున్నారు. ప్రతీరోజు డజన్ల కొలది గిరిజనులను నిర్బంధంలోకి తీసుకొని వారం రోజులు పోలీస్‌స్టేషన్లలో ఉంచుకుని చిత్రహింసలకు గురిచేసి కొందరిని విడిచిపెట్టి కొందరిపై కేసులు నమోదు చేసి జైలుకు పంపుతున్నారు. వాళ్ల చేతుల్లో ఆయుధాలు లేవు. నాగళ్లు ఉన్నాయి. కాని వారు రాజ్యానికి శత్రువులయ్యారు. మోడీ పాలనలో రైతుల చేతుల్లో నాగళ్లు మిగిలిపోతాయి. భూమి కార్పొరేట్ శక్తుల చేతుల్లోకి, పారిశ్రామిక వేత్తల చేతుల్లోకి బదలాయించ బడతుంది.

**– తుంపాల శ్రీరామమూర్తి**
విశాఖపట్నం

**వీ**క్షణం గత సంచికలో సంతోష్ రాసిన 'మోడీ రెడ్ కార్పెట్' వ్యాసం పార్టీ ఏదైనా భారతదేశంలోని పాలకవర్గాలు దేశాన్ని ఏ విధంగా పరాధీనం చేస్తున్నారో వివరంగా రాశారు. స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్లలో ముసుగులో ఉన్న బడా భూస్వామ్య వ్యాపార వర్గాల వారు ఈరోజు తమ ముసుగును తొలగించుకొని తమ దళారీ స్వభావంతో బహిరంగంగా విదేశీ సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకు దాసోహం అవుతున్న తీరును చాలా చక్కగా వివరించారు. 'సాయిబాబాపై కొనసాగుతున్న నిర్బంధం' అనే వ్యాసం వరవరరావు అందించారు. ఒక్క సాయిబాబానే కాదు దేశంలో విప్లవోద్యమం ముందడుగు వేస్తుందనేది పాలకవర్గాలకు బాగా తెలుసు. అందుకే విప్లవోద్యమానికి తోడ్పాటును అందించే విప్లవ మేధావులను వెంటాడి వేధిస్తూ హతమారుస్తున్నది. ఇదే సందర్భంలో వీక్షణం పత్రికను పక్షపత్రికగా తీసుకుని వస్తే మంచిదని సంపాదకవర్గానికి నా సూచన. పాఠకులకు ఎంతో సౌకర్యంగా ఉంటుంది కూడ. నేటి స్పీడ్ యుగంలో వార్తా సమాచారాలు పాలకవర్గాల ప్రచార సాధనాలతో తలదిమ్మెక్కిస్తున్నాయి. వీక్షణం చదివేవారి సంఖ్య కూడ పెరుగుతుందని గమనించగలరని కోరుతున్నాను.

**– కడియాల సుబ్బనాచారి**
నెల్లూరు

**ఈ** ఏడాది వీక్షణంలో ఫిబ్రవరి నుండి మే వరకు నాలుగు దఫాలుగా ప్రముఖ రచయిత్రి రంగనాయకమ్మ హిజ్రా సమస్య పేరుతో రాసిన వ్యాసాలు అశాస్త్రీయమైన, ద్వేషపూరితమైన, మానవ హక్కుల ఉల్లంఘన కలిగించే రాతలని ప్రచురించడం వీక్షణం చేసిన మరో స్థాయి ఘోరం. రాజకీయ ఆర్థిక సామాజిక మాసపత్రిక అని చెప్పుకునే వీక్షణం కనీస ప్రచురణకర్తకు ఉండవలసిన నైతికతను పక్కకు పెట్టి కేవలం రంగనాయకమ్మ తన ద్వేషపూరితమైన విషం కక్కుకుంటాను అంటే కనీస విచక్షణని కూడా మరిచి దానికి నాలుగు నెలలుగా చోటు కల్పించింది. రంగనాయకమ్మ తన ద్వేషాన్ని, అపోహలను మించి వాస్తవాలను చూడలేక హిజ్రా కమ్యూనిటీ గురించి అతి దారుణంగా అవాస్తవాలను రాసింది. కానీ ఒక సంపాదకుల స్థానంలో ఉండి వీక్షణం అలాంటి ఒక రాతని ఎలా ప్రచురించడానికి సిద్ధపడింది? కేవలం రంగనాయకమ్మ రాసింది అనా? 2014 ఏప్రిల్‌లో వచ్చిన ట్రాన్స్‌జెండర్స్ హక్కులకు సంబంధించి సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు వీక్షణంకి కనిపించ లేదా? ఇక వాక్ స్వాతంత్ర్యం అనే విషయాన్ని తీసుకొస్తారేమో! వాక్ స్వాతంత్ర్యం అంటే ద్వేషాన్ని, అసత్యాలను, అశాస్త్రీయతను వెళ్లగక్కడమా? అది ఒక అత్యంత దుర్భరమైన కమ్యూనిటీ గురించి! హ, హిజ్రాలే కదా, వీరేమంటారు, వీరేం చేస్తారు అనే అలుసు కాకపోతే, ఇంకో కమ్యూనిటీ గురించి అయితే వీక్షణం ఇల్లాంటి రాతలను ప్రచురించేదేనా? తన సంపాదకత నైతికతను, బాధ్యతను, విచక్షణను పక్కకు పెట్టి హిజ్రా కమ్యూనిటీ పట్ల వీక్షణం చేసిన పొరపాటుకు బహిరంగ క్షమాపణ చెప్పి ఒక సామాజిక పత్రికగా తన విలువను నిలబెట్టు కుంటుంది అనుకుంటున్నాను.

**– నవదీప్**
ట్రాన్స్‌జెండర్ క్వీర్ వ్యక్తి, హక్కుల కార్యకర్త
(ఈమెయిల్‌లో)

**జూ**న్ సంచికలో, 'రంగనాయకమ్మిజమా, మార్క్సిజమా?' అనే శీర్షికలో, జి. లింగమూర్తి రాసిన వ్యాసానికి ఇది ప్రతిస్పందన. అతని వ్యాఖ్యానాలను ప్రస్తావించి, నా అభిప్రాయాలు రాస్తున్నాను.

1) 'ఆమె నోట్లో నోరు పెట్టడం ఎందుకని చాలామంది తప్పించుకు తిరుగుతున్నారు.' – చాలా మంది తప్పించుకు తిరుగుతోంటే మీరెందుకు ఆమె నోట్లో నోరు పెట్టారు? మీరొక్కరే ధైర్యవంతుణ్ణనుకున్నారా? వాళ్లందరూ పిరికిపందలనుకున్నారా?

2) 'హిజ్రాల మీద ఉండవలసిన కనీస సానుభూతి రంగనాయకమ్మకి లేదు.'– హిజ్రా, కొజ్జా అనే మాటలే అసలు సమాజంలో ఉండకూడదనీ ఇంట్లో పెద్దలూ, బయట డాక్టర్లూ, ప్రభుత్వమూ ఎలాంటి బాధ్యతలు తీసుకోవాలో ఆ వ్యాసంలో చెప్పినది చూడలేదా?

3) 'రంగనాయకమ్మకు మాత్రమే రేవతిదీ, రేవతి లాంటి వాళ్లదీ తప్పు అనిపించింది' – రేవతి తన శిష్యులైన మగపిల్లలతో 'మీరు హిజ్రాగా మారవద్దు' అని చెప్పిన విషయాల్నే రంగనాయకమ్మ వివరించింది. రేవతికి కూడా ఆమె గురువు హిజ్రాగా మారవద్దని చెప్పింది. దీనర్థం, హిజ్రాగా ఉండడం వాంఛనీయం కాదనే!

4) 'తనను తాను మార్క్సిస్టుగా భావించుకునే రంగనాయకమ్మ పాలక భావజాలం నిర్ణయించిన మంచినీ, సహజత్వాన్నీ, న్యాయాన్నీ ఆమోదిస్తున్నారా?' – రంగనాయకమ్మ రచనలు తెలిసిన వాళ్లకి ఆమె, పాలక భావజాలానికి వ్యతిరేకమని స్పష్టంగానే తెలుస్తుంది.

5) 'మనది పాలక, పాలిత వర్గాల మధ్య స్పష్టమైన విభజన రేఖ ఉన్న సమాజం కాదు' – ఇది శుద్ధ తప్పు. బానిసత్వం మొదలైన కాలం నుంచీ, ప్రతీ దేశంలోనూ ఉన్న సమాజం పాలక – పాలిత వర్గ విభజన ఉన్న సమాజమే! వర్గ దృష్టిలేని వాళ్లకి ఆ రేఖ కనిపించదు.

6) 'హిజ్రా సమస్య మీద నిజంగా చర్చించవలసిన అంశాలెన్నో ఉన్నాయి' – ఎన్నో ఉన్నాయని తెలిస్తే, ఆ విషయం మీద చర్చించిన వ్యక్తిని వ్యతిరేకించాల్సిన అవసరం ఏమొచ్చింది?

7) 'లెస్బియన్, గే, బైసెక్సువల్, ట్రాన్స్‌జెండర్ మొదలైన వారిని వర్గ పోరాటంలో పీడితుల శిబిరంలో భాగంగా ప్రపంచ వ్యాప్తంగా చూస్తున్నారు'– అంటే, శిష్యుల శ్రమతో బతికే హిజ్రా గురువుని పీడితుల శిబిరం మనిషిగా చూడవల్సిందేనా? బ్రిటన్‌లో హోమోగా ఉన్నానని ప్రకటించుకున్న మంత్రిని పీడిత శిబిరం మనిషిగా చూడవల్సిందేనా? వర్గ పోరాటంలో భాగంగా ఉండే పీడితులంటే, శ్రమ దోపిడీకి గురయ్యే వర్గం. దీనికి జెండర్‌తో నిమిత్తం లేదు.

8) 'రంగనాయకమ్మ తన ఇష్టాయిష్టాలనే వీక్షణం పాఠకుల మీద రుద్ద

(మిగతా 61వ పేజీలో...)

# అసలు సమస్యలు వదిలి శీర్షాసనం!

దైనందిన సమస్యల గురించీ, పాలనా విధానాల మంచి చెడుల గురించీ ఆలోచించకుండా చేయడానికి ప్రజలను అనవసరమైన వ్యాపకాలలో ముంచివేయడాన్ని భారత పాలకవర్గాలు ఒక కళగా అభివృద్ధి చేశాయి. ఏడాది పాలనలో ప్రజలకు మెరుగైన జీవనం అందించడంలో, మెరుగైన పాలనను నిర్వహించడంలో అన్ని రకాలుగా విఫలమై, మతోన్మాదంతో బండి నడుపుకొస్తున్న ప్రధాని నరేంద్ర మోడీకి ఈ కళాపోషణలో కొత్తగా దొరికిన సాధనం యోగా. అందులో భాగమే ఐక్యరాజ్యసమితితో ప్రకటింపజేసిన జూన్ 22 అంతర్జాతీయ యోగ దినోత్సవం. సుసంపన్నమైన భారత సహజ వనరులనూ, సువిశాల భారత మార్కెట్ నూ ఆక్రమించనిస్తే, అందుకు బదులుగా ఏది కోరితే అది చేయడానికి సిద్ధంగా ఉన్న బహుళజాతిసంస్థల మద్దతు, ప్రతి రోజునూ ఒక సరుకుగా మార్చడానికి 365 రోజుల్లో ఏ రోజుకు ఏం దొరుకుతుందా అని చూసే ఐక్యరాజ్యసమితి సహకారం. ఇంకేం కావాలి? ఆ రోజున 177 దేశాల్లోనూ, దేశంలో అనేక చోట్లా యోగాసనాలు వేశారు. ఢిల్లీలో రాజపథ్ మీద ప్రధాని నాయకత్వంలో నలభై వేల మంది ఆసనాలు వేశారు. యోగ భారతీయ వారసత్వ సంపద అని, అది హిందూ సంప్రదాయం అని సంఘ పరివారం ప్రచారం చేసింది. ముస్లిం మతాధిపతులు యోగలో భాగమైన సూర్య నమస్కారం, ఓంకారం, మంత్రాలు తమకు అంగీకారం కావన్నారు. చర్చ మత స్వభావాన్ని సంతరించుకుంది.

నిజానికి ఈ చర్చ అనవసరమైనది. యోగ ఒక వ్యాయామంగా శారీరక దృఢత్వానికి అవసరమైనదే. వేదకాలానికి ముందే ఇటువంటి వ్యాయామం, ఆసనాలు ఉన్నాయని ఊహాగానాలున్నాయి. క్రీ.పూ. ఆరు, ఐదు శతాబ్దాలలోనే శ్రమణకుల ఆశ్రమాలలో యోగ చేశారని ఆధారాలున్నాయి. క్రీ.పూ. మూడో శతాబ్ది తర్వాత యోగం ఉపనిషత్తుల లోకి, బౌద్ధ పాళీ గ్రంథాల లోకి ఎక్కింది. క్రీ. శ. రెండో శతాబ్దికీ ఐదో శతాబ్దికీ మధ్య ఉండిన పతంజలి తనకంటె ముందున్న సాంఖ్య, యోగ, అభిధామ బౌద్ధ సంప్రదాయాలను మేళవించి రాసిన యోగ సూత్రాలు యోగాన్ని వ్యవస్థీకరించాయి. అంతకు ముందూ ఆ తర్వాతా కూడ దాదాపు అన్ని మత శాఖల లోనూ డజన్ల కొద్దీ వేరువేరు రకాల యోగాభ్యాసాలున్నాయి. పందొమ్మిదో శతాబ్దిలో హిందూ పునరుద్ధరణలో భాగంగా వివేకానందుడు మళ్లీ యోగాన్ని ప్రచారం చేసి, యోగానికి పతంజలిని ఏకైక వనరుగా స్థిరీకరించాక యోగం హిందువులది మాత్రమేననే అపోహ వ్యాపించింది. నిజానికి యోగం ప్రారంభమైన కాలానికీ, దాని మీద తొలి గ్రంథాలు వచ్చిన కాలానికీ హిందూ మతం అనేదే లేదు. అప్పటికి ఉండిన అన్ని మతాలూ యోగాన్ని శారీరక వ్యాయామంగా, మానసిక ప్రశాంతత సాధించే ధ్యాన సాధనంగా వాడుకున్నాయి. కాని ఇవాళ హిందూ మతోన్మాదులు దానికి మతం రంగు పులిమి, దానితో పాటు మంత్రోచ్చారణ సాగిస్తూ దాన్ని కేవలం హిందూ మత ఆచారంగా ప్రకటిస్తున్నారు. మరీ ముఖ్యంగా కొన్ని దశాబ్దాలుగా యోగను సరుకుగా మార్చి, అనేక దేశాలలో అత్యంత ఖరీదైన యోగ పాఠశాలలు నెలకొల్పి దాన్ని ఒక లాభసాటి వ్యాపారంగా మార్చారు. అలా యోగ ఇవాళ ఒక హిందూ ఉన్నత వర్గాల పెట్టుబడిగా మారింది. మత విద్వేష, మతోన్మాద హత్యాకాండల రూపశిల్పి నరేంద్ర మోడీ ప్రధానిగా, భాజపా నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటినుంచి జరుగుతున్న అనేక మత భావజాల పరిణామాల వరుసలో భాగంగానే ఇవాళ యోగ ప్రచారాన్నీ, ప్రాధాన్యత నూ చూడాలి. ఒక వ్యాయామంగా, ఆరోగ్యదాయినిగా యోగను వ్యతిరేకించనక్కరలేదు. నిష్కారణంగా ఎవరూ వ్యతిరేకించడం లేదు. ఒక ఆమోదయోగ్యమైన శారీరక వ్యాయామాన్ని ఏ తిరస్కరించవలసిన నేపథ్యంలో, ఏ అభ్యంతరకరమైన పద్ధతిలో ముందుకు తెస్తున్నారన్నదే ప్రశ్న. యోగను వ్యతిరేకించడం భారతీయ సంప్రదాయంలోని మంచిని వ్యతిరేకించడం కాదు. తప్పనిసరిగా దేశీయ సంప్రదాయంలోని మంచినంతటినీ స్వీకరించవలసిందే, వారసత్వం కొనసాగించ వలసిందే. కాని, ఒక మంచికి ముసుగు కప్పి, మత విద్వేషపు మురికి అంటించి, ఆ మురికితో సహా స్వీకరించమనడమే ఇవాళ చర్చనీయమవుతున్నది.

మన సమాజంలో నిరంతరం శారీరక శ్రమలో ఉండే శ్రామికులకూ, ఉత్పత్తి కులాలకూ, మహిళలకూ యోగ వంటి ప్రత్యేక వ్యాయామమే అవసరం లేదు. సాధారణంగా శారీరక శ్రమలో లేని, విశ్రాంతి వర్గ, మధ్యతరగతి ప్రజలకు అవసరమైన శారీరక వ్యాయామం అది. అంటే యోగానికి మతం కన్న ఎక్కువగా వర్గంతో సంబంధం ఉంది. అది ఒక మతానికి చెందినదా కాదా అనే చర్చ కన్న ఏదైనా ఒక అలవాటును ప్రభుత్వ అధికారంతో, ఇంత పెద్ద ఎత్తున, ఇంత ఖర్చుతో, గుత్తాధి పత్యంగా ప్రజల మీద రుద్దవచ్చునా అనే చర్చ జరగాలి. అది ఎంత అవసరమైన, ఆరోగ్యకరమైన అలవాటు అయినా, అది ఒక సాంస్కృతిక చిహ్నం అయినప్పుడు, దాన్ని ప్రభుత్వాధికారంతో ఇతర సంస్కృతులన్నిటి మీద రుద్దడం అభ్యంతరకరం. ఇది కచ్చితంగా 'ఒకే ప్రజ, ఒకే రాజ్యం, ఒకే నాయకుడు' అనే నాజీ సూత్రంతో సమానమైనది. దేశంలోని సాంస్కృతిక బహుళత్వానికీ, వైవిధ్యానికీ ప్రమాదకరమైనది. మెజారిటీ మతం తనదిగా ప్రకటిస్తున్న, అత్యల్ప సంఖ్యాక వర్గానికి చెందిన ఈ అలవాటును దేశ ప్రజలందరి మీద బలవంతంగా రుద్దడమే అభ్యంతరకరం. ఆ మతానికి చెందిన పెత్తందార్లు, తాము ప్రచారం చేస్తున్న పద్ధతిలోనే యోగాన్ని స్వీకరించాలని పట్టుబట్టడం అభ్యంతర కరం. ఒక మత భావజాలపు పునరుద్ధరణ ఎజెండాలో భాగంగా ప్రభుత్వమే దాన్ని ప్రోత్సహించడం అభ్యంతరకరం. యోగం శారీరక దృఢత్వాన్ని ఇవ్వవచ్చు. మానసిక ప్రశాంతతను ఇవ్వవచ్చు. కాని ఆకలి తీర్చదు. దప్పిక తీర్చదు. దుస్తులు ఇవ్వదు. ఆశ్రయం ఇవ్వదు. నిత్యజీవితావసరాలేవీ తీర్చదు. ఈ దైనందిన సమస్యల మీద ఆందోళన చెందుతున్న ప్రజలను, ఆ సమస్యల పరిష్కారాల దిశగా పోరాటాలవైపు వెళ్లకుండా ఆపడానికి, రొట్టె అడిగితే సర్కస్ ఇచ్చినట్టు, అసలు సమస్యలు వదిలి ఆసనాలు వేద్దాం అని ప్రభుత్వం పిలుస్తున్నది. అసలు ఈ వ్యవస్థే, పాలనే తలకిందులుగా, శీర్షాసనంలో ఉన్నాయి. ఇవాళ జరగవలసింది ఈ వ్యవస్థను దాని కాళ్లమీద సరిగా నిలబెట్టడం. ఆ గుర్తింపు రాకుండా చేయడానికే ఈ ఆసనాలు. వీ

# ఏడాది పాలన చర్చ లేని ఏలికల తమాషా

మళ్లీ ఒకసారి రెండు రాష్ట్రాలకూ కలిపి ఒకే సంపాదకీయవ్యాఖ్య రాయక తప్పడం లేదు. ఈ నెలలో రెండు రాష్ట్రాలలోను విడివిడిగా జరిగిన పరిణామాలు కూడ పరస్పర సంబంధంతో జరిగాయి. కలిసి జరిగిన పరిణామాలూ ఉన్నాయి. తెలంగాణ రాష్ట్ర మంత్రివర్గం ప్రమాణ స్వీకారం జరిగి జూన్ 2కు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రివర్గ ప్రమాణ స్వీకారం జరిగి జూన్ 8కి ఏడాది నిండింది. ఈ ఏడాదిలో ఆ ప్రభుత్వాలు తమ ప్రజల సమస్యలు తీర్చడానికి ఏయే పనులు చేశాయో చర్చ జరగవలసిన సమయానికి రెండు రాష్ట్రాల్లోను ఆ చర్చను మించిన రభస మొదలైంది. తెలంగాణ శాసనమండలికి జరుగుతున్న ఎన్నికలలో తమకు వోటు వేస్తే, ఐదు కోట్ల రూపాయలు ఇస్తామని, తెలుగు దేశం పార్టీ శాసనసభ్యుడు రేవంత్ రెడ్డి, నామినేటెడ్ శాసనసభ్యుడు స్టీవెన్సన్‌ను ప్రలోభపెడుతూ దొరికిపోయారు. అవినీతి నిరోధక శాఖ రేవంత్ రెడ్డిని అరెస్టు చేసి కేసు నడుపుతున్నది. ఆ పనికి వెనుక ఉన్నది తెలుగుదేశం నాయకుడు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కావచ్చుననడానికి కూడ ఆధారాలు దొరికాయి. ఆ ఆధారాలలో ఒకటైన ఫోన్ సంభాషణ తన ఫోన్ ట్యాప్ చేయడం వల్ల దొరికిందని ఒకసారి, అది తన గొంతు కాదని ఒకసారి, అసలు ఉమ్మడి రాజధానిలో ఉన్న తమపై ఇటువంటి చర్యలు తీసుకోవడానికి తెలంగాణ ప్రభుత్వానికి అధికారం లేదని ఒకసారి చంద్రబాబు నాయుడు అంటున్నారు. తన మీద దాడి ఆంధ్రప్రదేశ్ ప్రజలందరి మీద దాడేనని అంటున్నారు. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం సెక్షన్ 8 ప్రకారం హైదరాబాదులో ఆంధ్ర ప్రజల హక్కులను రక్షించవలసిన గవర్నర్ తటస్థంగా కాక ఒక పక్షం వహిస్తున్నారని కూడ ఆరోపణలు వస్తున్నాయి. రేవంత్ రెడ్డి పట్టుబడిన మే 31 నుంచి నాలుగు వారాలుగా రెండు రాష్ట్రాలలో, ప్రధానంగా ప్రచార సాధనాలలో ఇదే చర్చ జరుగుతున్నది.

ఒకరకంగా ఈ చర్చ అవసరమైనదే. రాజకీయాలలో అవినీతి, చట్టబద్ధపాలన, ఫోన్ ట్యాపింగ్, సమాఖ్య వ్యవస్థ, గవర్నర్ల అధికారాలు, ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం వంటి అనేక విషయాలలో జరగవలసిన చర్చలో భాగమే. కాని, అదే సమయంలో ప్రాంతీయాభిమానాల వల్ల, అప్రజాస్వామిక భక్తి భావాల వల్ల, విద్వేషాల వల్ల ఈ చర్చలో నిష్పాక్షికత లోపిస్తున్నది. అంతే అవసరమైన మరికొన్ని విషయాలు చర్చకు రావడం లేదు.

ఒక శాసనసభ్యుడికి డబ్బు ఎర చూపి వోటు అడగడం నూటికి నూరు శాతం అక్రమమే. నేరమే. తప్పనిసరిగా అందుకు విచారణ, శిక్ష జరగవలసిందే. కాని అదే సమయంలో అటువంటి అక్రమాలన్నిటి మీద అదే వైఖరి ఉండాలి. ఇదే శాసనసభలో తెలుగుదేశం పార్టీ టికెట్ మీద గెలిచిన ఐదుగురు, కాంగ్రెస్ టికెట్ మీద గెలిచిన నలుగురు, వైసిపి టికెట్ మీద గెలిచిన ఇద్దరు, బిఎస్ పి నుంచి గెలిచిన ఇద్దరు శాసన సభ్యులు తెలంగాణ రాష్ట్ర సమితిలో చేరారు. ఒక పార్టీ టికెట్ మీద గెలిచి మరొక పార్టీకి మారడం కూడ అక్రమమే. వారి మీద పార్టీ ఫిరాయింపుల చట్టం ప్రకారం చర్య తీసుకోకపోవడం, శాసనసభ్యత్వాన్ని రద్దు చేయకపోవడం కూడ అక్రమమే. వారిని పార్టీ మార్పుకు పురికొల్పినది భావజాల మార్పో, హృదయ పరివర్తనో కావచ్చు, కాని అలా అయితే పదవికి రాజీనామా చేసి మళ్లీ ఎన్నికలకు వెళ్లాలి. ఆ మార్పుకు కారణం హృదయ పరివర్తన కాకపోతే, అక్కడ కూడ డబ్బో, మరొక ప్రయోజనమో ప్రలోభాలుగా ఉంటే అవి కూడ అక్రమాలే. వారిలో కొందరిని మంత్రులుగా, ఆర్జనకు అవకాశం ఉన్న స్థానాలలో కూచోబెట్టడం కూడ పరోక్ష డబ్బు ప్రలోభమే. అలాగే, తెరాస మొదట గెలిచిన స్థానాలు 63. కొత్తగా చేరిన, పార్టీ ఫిరాయింపుల చట్టం ప్రకారం శాసనసభ్యత్వం రద్దయి ఉండవలసిన పన్నెండు, ఎంఐఎం 7, వైసిపి ఒకటి, నామినేటెడ్ ఒకటి కలిసి శాసనమండలి ఎన్నికల్లో ఐదు స్థానాలు గెలవడానికి అవసరమైన 85 వోట్లు వచ్చాయి. సొంతంగా 63 స్థానాలుండి, ఎవరినీ ప్రలోభపెట్టకుండా 85 సాధించడం సాధ్యమేనా? 'మనం చేస్తే లౌక్యం, ఇతరులు చేస్తే మోసం' అనేది మనం చేసే పనులను సమర్థించుకోవడానికి ఉపయోగపడే తర్కమే కావచ్చుగాని అది అవకాశవాదం అవుతుంది.

అసలు పార్లమెంటరీ రాజకీయాలంటేనే కప్పల తక్కెడ, ఆయారాం–గయారాం, అమ్మకం–కొనుగోలు స్వార్థప్రయోజన రాజకీయాలు అని గత ఆరు దశాబ్దాల భారత పార్లమెంటరీ వ్యవస్థ వేనోళ్ల ప్రకటిస్తున్నది. దేశ ప్రధానిగా ఉండి, పార్లమెంటులో అవిశ్వాస తీర్మానం నుంచి గట్టెక్కడానికి జార్ఖండ్ ముక్తి మోర్చా పార్లమెంటు సభ్యుల వోట్లు కొని దొరికిన కేసులో పి.వి. నరసింహారావుకు మూడు సంవత్సరాల జైలు శిక్ష పడింది. అంటే అత్యున్నత అధికార పీఠమైన ప్రధానమంత్రి పదవి నుంచి గ్రామ సర్పంచ్ పదవి దాకా బెదిరింపులు, ప్రలోభాలు, క్యాంపు రాజకీయాలు, అమ్మకం–కొనుగోళ్లు లేని పార్లమెంటరీ రాజకీయ నిర్మాణం ఒక్కటి కూడ లేదు. దొరికినవారే దొంగలు, దొరకని దొంగలందరూ దొరలే అనే పరిస్థితి ఇవాళ నెలకొని ఉన్నది. నిజానికి చర్చ జరగవలసినది ఈ మొత్తం అక్రమ రాజకీయాల వ్యవస్థ పైన. ఇవాళ బైటపడిన ఒకానొక అక్రమంపై చర్చ జరగవలసిందే, కనబడుతున్న ఆగ్రహం న్యాయమైనదే. కాని చెట్టును చూసి అరణ్యాన్ని వదలడం సరికాదు.

ఈ చర్చతో పాటే, అంతకన్న ఎక్కువగా చర్చ జరిగి ఉండవలసిన అంశం, రెండు రాష్ట్రాల ప్రభుత్వాలూ తమ ఏడాది పాలన పనితీరుపై నుంచి దృష్టి మళ్లించడానికే ఈ ఉదంతాన్ని సాగదీస్తున్నాయా అనేది. ప్రజలకు మరొక వ్యాపకం కల్పించి, ప్రజల మనోభావాలను రెచ్చగొట్టి, దృష్టి మళ్లించి తమ సొంత ప్రయోజనాలు నెరవేర్చుకోవడం భారత రాజకీయ నాయకులకు వెన్నతో పెట్టిన విద్య. మీ చొక్కా మీద మరక చూడండి అనీ, పది రూపాయల నోటు కింద పడింది చూడండి అనీ దృష్టి మళ్లించి చేతిలోని లక్షల రూపాయల సంచి ఎత్తుకుపోయే ప్రవీణులు కొందరుంటారు. భారత పార్లమెంటరీ రాజకీయ నాయకులూ ఆ ప్రవీణులూ ఒకే పాఠశాల విద్యార్థులు. ఈ దృష్టి మళ్లింపు కార్యక్రమాలను దాటి, ప్రజానుకూల పాలన సాగుతున్నదా లేదా అనే ఏకైక ప్రమాణం మీద అంచనా కట్టగల శక్తిని ప్రజలు సంతరించుకున్ననాడే ఈ దేశంలో ప్రజాస్వామ్యం ఉనికిలోకి వస్తుంది. ప్రజాస్వామ్యం అనేది బోర్డు కాదు, బ్యాడ్జి కాదు, ప్రకటన కాదు, అది నిరంతర ఆచరణ. ఆ ఆచరణ లేదనే విషయం మాయ చేయడానికే బోర్డులు పనికొస్తాయి. వీ

# టర్కీ ఎన్నికల్లో ప్రగతిశీల శక్తుల పురోగమనం

**2003** నుండి టర్కీని పాలిస్తున్న ఇస్లామిక్ పార్టీ అయిన జస్టిస్ అండ్ డెవలప్‌మెంట్ పార్టీ (ఎకెపి) జూన్, 2015లో జరిగిన ఎన్నికల్లో ఓడిపోయింది. దీంతో పార్లమెంటులో మూడింట రెండొంతుల మెజారిటీ సాధించి, దేశాధ్యక్షునికి అత్యున్నత అధికారాలుండేలా రాజ్యాంగ సవరణలు చేయాలని ఎకెపి వ్యవస్థాపకుడు ఎర్డోగాన్ కన్నకలలు విఫలమైనాయి.

టర్కీలో 20 శాతం కుర్దులు ఉన్నారు. కుర్దు జాతి ఎన్నో దశాబ్దాలుగా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అణచివేతకు గురవుతున్నది. వారి భాషలో చదువుకోవడానికి అవకాశం లేకుండా, వారి సాంస్కృతిక వారసత్వాలకు గౌరవ ప్రాధాన్యతలు లేకుండా పోయాయి. వీరి విముక్తి కోసం 1980లలో కుర్దిస్థాన్ వర్కర్స్ పార్టీ నాయకత్వంలో సాయుధ పోరు జరిగింది. ఈ పోరులో ముప్పై వేలకు పైగా చనిపోయారు. ఈ సమస్యకు మద్దతుగా పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ ఎచ్‌డిపి నిలిచింది. అలాగే అన్ని మైనారిటీల హక్కులను తన ఎజెండాలోకి తీసుకున్నది. మొన్నటి టర్కీ ఎన్నికల్లో 80 పార్లమెంటు సీట్లను గొలుపొంది టర్కీ రాజకీయాలను తీవ్రంగా ప్రభావితం చేస్తూ పీపుల్ డెమొక్రటిక్ పార్టీ (ఎచ్‌డిపి) ముందుకు వచ్చింది. మహిళలకు సమాన హక్కులు, లెస్బియన్, గే, బై సెక్సువల్, ట్రాన్స్‌జెండర్ (ఎల్‌జిబిటి) లకు సరైన గౌరవం, ప్రాతినిధ్యం, అందరికి సామాజిక భద్రత, కనీస వేతనాల రెట్టింపు, ప్రజలందరికి ఉచిత కరెంటు, నీళ్లు, విద్యా వైద్యంల గురించి ఎచ్‌డిపి మాట్లాడింది. సెక్యులరిజం, ప్రజాస్వామిక సోషలిజం, పెట్టుబడిదారీ విధానాన్ని వ్యతిరేకించడం, మైనారిటీ హక్కుల సాధన, పర్యావరణ పరిరక్షణలకు మద్దతుగా ఎచ్‌డిపి ముందుకు వచ్చింది. పాఠ్యప్రణాళికల నుండి మత బోధనల తొలగింపు, అన్ని స్థానిక భాషలకు సముచిత గుర్తింపు ఆ భాషల్లో విద్యాబోధన చేయడం, ప్రభుత్వాన్ని మతం నుండి వేరుచేయడం, మత విశ్వాసాల స్వేచ్ఛ, మతపరమైన విద్యను పిల్లలందరు నేర్చుకోవాలనే నిబంధనల తొలగింపుల గురించి మాట్లాడుతూ విస్తృతమైన ప్రగతిశీల భావాలను, ఆలోచనలను ప్రజల ముందుకు తెచ్చింది.

ఈ ఎన్నికల్లో మొత్తం 550 పార్లమెంటరీ స్థానాలకుగాను ఎకెపికి 258, రిపబ్లికన్ పీపుల్స్ పార్టీ (సిఎచ్‌పి) కి 132, ఎచ్‌డిపికి 80, నేషనలిస్ట్ యాక్షన్ పార్టీ (ఎంఎచ్‌పి) కి 80 సీట్లు వచ్చాయి. ఈ ఎన్నికల్లో ఎకెపికి ప్రభుత్వం నెలకొల్పే బలం లేకపోవచ్చుగాని 40.9 శాతం వోట్లు పొంది ఏకైక పెద్ద మెజారిటీ గలది (258/550) గా ఉన్న విషయం మరిచి పోవడానికి లేదు. లౌకిక, ప్రజాస్వామిక శక్తులైన సిఎచ్‌పి, ఎచ్‌డిపి మొత్తం బలం కలిపినా (212) ఎకెపి కంటే తక్కువగానే ఉన్న విషయం గమనంలో ఉంచుకోవాలి. ఈ నేపథ్యంలో లౌకిక, ప్రజాస్వామిక, సమానత్వ దిశలో నిరంతర కృషి జరగవలసిన అవసరమెంతో ఉందని అర్థమవుతుంది. ఇదే సమయంలో ప్రజాస్వామిక స్ఫూర్తిని ప్రతిబింబించిన టర్కీ దేశ ప్రజలను అభినందించకుండా ఉండలేం.

'ఎచ్‌డిపి విజయం స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని, శాంతిని, బలపరిచే వారిది. ఆర్మేనియన్లు, బోస్నియన్లు, ఎజిదీలు, సర్కేసియన్లు, కార్మికులు, నిరుద్యోగులు, గ్రామీణులు, దుకాణదారులు, శ్రమదోపిడికి గురవుతున్న వారు, మహిళలు సాధించిన సామూహిక విజయం. కుర్దుల సమస్యకు శాంతియుత పరిష్కారం, లౌకిక, ప్రజాస్వామిక సమానత్వ పునాదులపై నిలబడి రాజ్యాంగాన్ని కోరుకునేవారి విజయం' అని ఎచ్‌డిపి నేత డిమిర్టస్ చెప్పాడు. ఇది ఏదో ఉద్యమ ఉధృతిలో భాగంగా లేదా ఎన్నికల అవసరాల నేపథ్యంగా మాత్రమే మిగిలిపోకుండా భవిష్యత్‌లో క్షేత్రస్థాయి నుండి విధానాల అమలు వరకు ఇదే స్ఫూర్తి కొనసాగాలని ఆకాంక్షిద్దాం.

**- బి. రామకృష్ణ**




అరుణ్ ఫెరీరా కార్టూన్



❖ **నవ్య కథాశిల్పి బి.ఎస్. రాములు – కథా విశ్లేషణ** – విహారి – ప్రచురణ – విశాల సాహిత్య అకాడమి – 224 పేజీలు, 1/8 డెమీ, రు. 160, ప్రతులకు : విశాల సాహిత్య అకాడమి, 201, సులేఖ గోల్డెన్ టవర్స్ 2-2-186/53/5, రామకృష్ణనగర్, బాగ్అంబర్‌పేట్, హైదరాబాద్ – 500 013; ఫోన్ : 08331 966987



❖ **కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు** – శ్రీశ్రీ – ప్రచురణ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 39 పేజీలు, 1/8 డెమీ, రు. 35,



❖ **సాహితీ గోదావరి త్రైమాసిక సాహిత్య పత్రిక** – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : వంగాల సంపత్ రెడ్డి, ఇ.నెం. 1-1-850 & 850/202, సిద్ధార్థనగర్, కాజీపేట్, వరంగల్ – 506 004, తెలంగాణ, సెల్. నెం. 8897463990



❖ **కవృద్ధ విశ్వనాథ** – శ్రీశ్రీ – ప్రచురణ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 47 పేజీలు, 1/8 డెమీ, రు. 40,

పై రెండు పుస్తకాల ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి,305, ప్రగతి టౌవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ –520004; ఫోన్ : 9246277375; email : srisri_sahityanidhi@yahoo.com,



❖ **భారత సామాజిక చరిత్ర – బ్రాహ్మణవాదం – మూలాలు** – డా. కత్తి పద్మారావు – ప్రచురణ – లోకాయత ప్రచురణలు – 497 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు : కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, లుంబినీ వనం, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు – 522 124, ఫోన్ : 9849741695, E mail :padmaraokathi@yahoo.co.in



❖ **అక్షర గమనం** – తుంపాల శ్రీరామమూర్తి – ప్రచురణ – సమతా ప్రచురణలు – 69 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : తుంపాల శ్రీరామమూర్తి, 9-9-57/2, సమతా నిలయం, జోగవానిపాలెం, కొత్త గాజువాక, విశాఖపట్టణం – 530 026, దూరవాణి : 0891-2516192, సంచారవాణి : 9440260280

❖ **నీలి లాంతరు – ఆధునిక కవితల సమాహారం** – విజయచంద్ర – 268 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు : ఆంధ్రప్రదేశ్‌లో ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు, ఆర్. చంద్రశేఖర్, 20, సారథీనగర్, నీలకంఠ నగర్ హౌసింగ్ బోర్డ్‌కాలనీ, బరంపురం –760002, ఫోన్ :0680-2260065, 9438720409, Email :poetvijaychandra@gmail.com, Blog Name :poetvijaychandra.blog.com



❖ **కథక చక్రవర్తి డా. కేశవరెడ్డి** – కూర్పు – సాకం నాగరాజ – ప్రచురణ – తెలుగు భాషోద్యమ సమితి, తిరుపతి – 64 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : సాకం నాగరాజ ఫోన్ : 9440331016



❖ **స్వర్ణయాగం** – వేముల ప్రభాకర్ – ప్రచురణ –విరాట్ పబ్లికేషన్స్ – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : వేముల రోహిత్, అడ్వకేట్, ప్లాట్ నెం. 01, జయదర్శిని ఎన్‌క్లేవ్, పోస్టు : దేవరయంజాల్, సికిందరాబాద్ – 500 078, సెల్ నెం : 9247040332, 78938 19376



❖ **చే లాంగ్ లివ్ (ఎ డాక్యుమెంటరీ ఆన్ చేగువేరా)** – ప్రచురణ – మయుఖ ప్రచురణలు– 86 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : మయుఖ ప్రచురణలు, 2-1-477, గ్రౌండ్ ఫ్లోర్, ప్రతీక్ టవర్స్, నల్లకుంట, హైదరాబాద్ – 500 044



❖ **సామాన్యులకు మాటలు – సంపన్నులకు మూటలు** – వి. హనుమంతరావు – ప్రచురణ – ప్రజాశక్తి బుక్ హౌస్ తెలంగాణ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ప్రజాశక్తి బుక్ హౌస్, తెలంగాణ ఎంహెచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణ మండపం దగ్గర, హైదరాబాద్–500020, ఫోన్ : 27660013



❖ **ఉట్నూరు కవిత – 2014** – ఉట్నూరు సాహితీ వేదిక – ప్రచురణ – ఉట్నూరు సాహితీ వేదిక – 71 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : గోపగాని రమశ్రీ రవీందర్ ఇ.నెం. 9-76/2, ఫకీర్‌గుట్ట ఉట్నూరు, ఆదిలాబాద్ జిల్లా –504 311, సెల్ : 9440979882



❖ **ఎదురుమతం** – ప్రగతిశీల ముస్లిం కవిత్వం, నవ్యాంధ్ర తొలి ముస్లిం కవితా సంపుటి – షేక్ కరీముల్లా – ప్రచురణ – ముస్లిం రచయితల సంఘం, ఆంధ్రప్రదేశ్ – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : షేక్ మషురున్, ఇంటి నెం. 21-55, పెద్దమసీదు బజారు, వినుకొండ, గుంటూరు జిల్లా – 522 647, అన్ని ప్రముఖ పుస్తక విక్రయకేంద్రాలు



❖ **గూడ శ్రీరాములు వ్యాసాలు** – భిలాయి వాణి – 148 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : భిలాయి వాణి, 19-సి, క్రాస్ స్ట్రీట్ – 1, సెక్టర్ – 1, భిలాయి – 490001, జిల్లా దుర్గ్, ఛత్తీస్‌గఢ్; ఫోన్: 9827408579, 07389118826, 0889758808

# ప్రైవేట్ రంగపు సరుకులు- నాణ్యత మాయాజాలం

మన సమాజంలో సగటు మనుషులు, ముఖ్యంగా మధ్యతరగతి వ్యక్తులు, ప్రైవేట్ రంగం ఉత్పత్తి చేసే సరుకులూ, సేవలూ నాణ్యంగా ఉంటాయనీ, ప్రభుత్వ రంగంలోని సరుకులకైనా, సేవలకైనా నాణ్యత ఉండదనీ చెపుతారు. ప్రభుత్వ రంగ సేవల గురించి చులకనగా మాట్లాడతారు. ఈ అభిప్రాయం ఒక మూఢ విశ్వాసమంత బలంగా చాల మందిలో ఉంది. భయంకరమైన అసమానతలు ఉన్న సమాజంలో. సరుకులూ సేవలూ దొరికే మనుషులు తక్కువగా వేలల్లో, లక్షల్లో, దొరకని మనుషులు ఎక్కువగా కోట్లల్లో ఉన్నచోట నాణ్యత అంటే అర్థమేమిటని, ఆ అభిప్రాయం ప్రకటించేవాళ్లను నిలదీయవచ్చు. సమానత్వానికీ నాణ్యతకూ పోటీ ఉన్నప్పుడు ప్రాధాన్యత దేనికనే తాత్విక ప్రశ్న వేయవచ్చు. కాని అంత దూరం కూడ అవసరం లేదు. ప్రైవేట్ రంగం నాణ్యమైన సేవలూ సరుకులూ అందిస్తున్నదనే మాట పూర్తిగా నిజమేనా అని మాత్రం అడగవచ్చు. ప్రైవేట్ రంగం అంత నాణ్యమైనదైతే అవినీతి, కుంభకోణాలు, అక్రమాలు, కల్తీలు ఎందుకున్నాయని అడగవచ్చు. విషపూరితమైన, ప్రమాదకరమైన, అనారోగ్యానికీ, మరణానికీ కారణమయ్యే వస్తువులను, పనికిరాని వస్తువులను, సేవలను ఆకర్షణీయ పద్ధతుల్లో అమ్మడమే నాణ్యతకు అర్థమా అని అడగవచ్చు.

ప్రైవేట్ రంగపు నాణ్యత ఒక మాయ అని, అది నిజం కాదని చూపడానికి వేలాది, లక్షలాది ఉదాహరణలు మనచుట్టూ ఉన్నాయి. ఇటీవల మనందరి కళ్లముందు కొట్టవచ్చినట్టు కనబడిన ఉదాహరణ తినుబండారం పేరిట విషాన్ని అమ్ముతున్న నెస్లె ఇండియా అనే బహుళ జాతి సంస్థ తయారు చేసిన మాగీ నూడుల్స్ ది.

రెండు నిమిషాల్లో సులభంగా తయారవుతాయని గృహిణులనూ, ఆకర్షణీయమైన ప్రచారంతో పిల్లలనూ ఆకట్టుకున్న మాగీ నూడుల్స్ తో నెస్లె ఇండియా మారుమూల గ్రామాలతో సహా దేశవ్యాప్తంగా సరఫరా చేయగలిగిన మార్కెటింగ్ యంత్రాంగంతో ముప్పై సంవత్సరాలుగా రాజ్యం ఏలుతోంది. తాజా గణాంకాల (2014) ప్రకారం దేశంలో తక్షణమే వండి పెట్టగలిగిన నూడుల్స్ మార్కెట్ అమ్మకాలు రు. 3965 కోట్లు. అందులో 63 శాతం నుంచి 78 శాతం (రు. 2500 - 3100 కోట్లు) మాగీ నూడుల్స్ ఖజానాలోకే వెళ్తున్నాయి. ఇతర బ్రాండ్ల నూడుల్స్ అన్నీ కలిసి మిగిలిన 37 - 22 శాతాన్ని ఆక్రమిస్తున్నాయి. ఇక మాగీ నూడుల్స్‌తో పాటు కాఫీ పొడి, చాక్లెట్లు, బిస్కట్లు, పాలు, వగైరా సరుకులు కూడ ఉత్పత్తి చేసే నెస్లె ఇండియా మొత్తం అమ్మకాలు రు. 9800 కోట్లలో 25-30 శాతం ఆదాయం సంపాదిస్తున్నది మాగీ నూడుల్స్ నుంచే. ఇన్ని అమ్మకాలు, లాభాలు సాధించడానికి, ఇంత ఆకర్షణీయంగా కనబడడానికి, జనాదరణ పొందడానికి ప్రచారం, మార్కెటింగ్ యంత్రాంగం, చిల్లర వ్యాపారులకు హెచ్చు ప్రతిఫలం చూపించడం కన్న దానిలో రుచిని పెంచడానికనే పేరు మీద కలుపుతున్న విషపదార్థం పాత్ర ఎక్కువ.

మోనో సోడియం గ్లూటామేట్ (ఎంఎస్‌జి) అనే రసాయన పదార్థం ఏ పదార్థానికైనా రుచిని పెంచుతుంది. టమాటా, బంగాళాదుంప, పుట్టగొడుగులు వంటి ఆహార పదార్థాలలో సహజంగా ఉండే ఈ రసాయన పదార్థాన్ని పారిశ్రామికంగా తయారు చేసి రుచి కోసం ఆహార పదార్థాల్లో కలపడం దశాబ్దాలుగా సాగుతున్నది. అయితే, ఈ రసాయనాన్ని తగిన మోతాదులో కన్న ఎక్కువ తీసుకుంటే శరీరమంతా మందకొడితనం వస్తుందనీ, తలనొప్పి, వాంతులు, దాహం, గుండె పట్టేసినట్టు అనిపించడం జరుగుతాయని ఆధారాలున్నాయి. ఎంఎస్‌జి ప్రమాదకరమైనది గనుకనే తమ ఉత్పత్తులలో దాన్ని వాడుతున్న పారిశ్రామిక, వ్యాపార సంస్థలు కూడ తాము దాన్ని వాడడం లేదని అబద్ధం చెపుతుంటాయి. అలాగే మాగీ నూడుల్స్ ప్యాకెట్ల పైన కూడ 'నో ఆడెడ్ ఎంఎస్‌జి' (ఎంఎస్‌జి కలపలేదు) అని ప్రత్యేకంగా రాసి ఉంటుంది.

మార్కెట్లలో అమ్మకమయ్యే ఆహార పదార్థాల ఉత్పత్తిదారులు ప్రమాణాలు పాటిస్తున్నారా లేదా అని ఎప్పటికప్పుడు తనిఖీ చేయడం, సాంకేతిక పరీక్షలు జరపడం, ప్రజారోగ్యానికి ప్రమాదకరమైన పదార్థాలు ఉంటే వాటిని జప్తు చేసి, ఉత్పత్తిదారుల మీద, వ్యాపారుల మీద చర్యలు తీసుకోవడం ప్రభుత్వానికి చెందిన ఆహార భద్రత, ఔషధ నియంత్రణ శాఖ బాధ్యత. కాని సాధారణంగా ఈ శాఖ అధికారులు ఉత్పత్తిదారుల, వ్యాపారస్తుల దగ్గర మామూళ్లు వసూలు చేస్తూ వారి సేవకులుగా పని చేస్తుంటారు. ఆహార పదార్థాల నమూనాలను సేకరించి పరీక్షించే పని పెట్టుకోరు. ఎంత పెద్దఎత్తున కల్తీలు, అక్రమాలు, ప్రమాదకరమైన ఫలితాలు సంభవిస్తున్నా ఎవరిమీదా చర్యలు తీసుకోరు.

కాని ఉత్తరప్రదేశ్‌లోని బారాబంకి జిల్లాలో ఆ శాఖ అధికారి ఒకరు మాగీ నూడుల్స్ ప్యాకెట్ మీద ప్రకటించినట్టుగా ఎంఎస్‌జిని కలపలేదనడం నిజమేనా అని పరీక్షిద్దామనుకున్నారు. మార్చ్ 2015లో ఆయన సేకరించిన మాగీ నూడుల్స్ నమూనాలను పరీక్షించగా, వాటిలో ఎంఎస్‌జి ఉండడం మాత్రమే కాదు, మితిమీరిన మోతాదులో ఉందని తేలింది. అంతకన్న ప్రమాదకరంగా ఆ నూడుల్స్‌లో పెద్ద ఎత్తున సీసం కూడ ఉందని తేలింది. మామూలుగా పది లక్షల భాగాలలో 0.01 భాగాలు మాత్రమే ఉండడానికి అనుమతి ఉన్న సీసం ఆ నూడుల్స్‌లో 17 భాగాలు ఉందని తేలింది. ఇంతపెద్ద ఎత్తున సీసం శరీరంలోకి వెళ్తే గుండె, ఎముకలు, పేగులు, మూత్రపిండాలు, కేంద్ర నాడీ వ్యవస్థ, పునరుత్పత్తి అవయవాలు దెబ్బతింటాయి. అది నాడీ వ్యవస్థ మీద ప్రభావం వేస్తుంది గనుక ముఖ్యంగా పిల్లల ఎదుగుదల మీద, అభ్యసన శక్తి మీద ప్రమాదకర ప్రభావం వేస్తుంది.

రెండు నెలల్లో ఈ వార్త దేశవ్యాప్తంగా ప్రచారమయింది. దాదాపుగా అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమ రాష్ట్రాల్లోని ఆహార పదార్థాల మీద, ప్రత్యేకించి మాగీ నూడుల్స్ మీద పరీక్షలు జరిపించాయి. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మాగీని నిషేధించాయి. తాము అత్యున్నత ప్రమాణాలు పాటిస్తున్నామని, ఆ ప్రమాదకర, అభ్యంతరకర పదార్థాలను తమ తినుబండారాలలో కలపలేదని నెస్లె ఇండియా ప్రకటించింది. ఇలా ఒక బహుళ జాతి సంస్థను అప్రతిష్ట పాలు చేస్తే అది దేశంలోకి విదేశీ పెట్టుబడులు రావడానికి ఆటంకం అవుతుందని వ్యాపార వర్గాలు, వారి మేధావులు పత్రికల్లో, టివి ఛానళ్లలో గగ్గోలు పెట్టారు. కర్నాటక రాష్ట్ర

ప్రభుత్వం కొన్ని మాగీ నూడుల్స్ నమూనాలను సేకరించి, పరీక్షించమని మైసూరులో ఉన్న కేంద్ర ప్రభుత్వ సంస్థ సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ (సిఎఫ్‌టిఆర్ఐ)కు పంపితే, వాళ్లు పరీక్షలు జరపడానికి నిరాకరించారని, ఆ రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి ఫిర్యాదు చేసింది.

ఆ రాజకీయ, పారిశ్రామిక వాద ప్రతివాదాలు ఎలా ఉన్నా ఇక్కడ గుర్తించవలసిన విషయం నెస్లె ఇండియా అనే బహుళ జాతి సంస్థ తాను ఉద్దేశపూర్వకంగా తినుబండారాలలో కలిపిన రసాయనాన్ని కలపలేదని ప్రకటించి అబద్ధం ఆడింది. తినుబండారాలలో ఏయే పదార్థాలు ఏయే మోతాదులలో కలిపారో స్పష్టంగా ప్రకటించాలని నిర్దేశించే చట్టాలను ఉల్లంఘించి చట్టవ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడింది. అంతకన్న ముఖ్యంగా ఆ పదార్థాలు తినేవారి ఆరోగ్యాలనూ, జీవితాన్నీ ప్రమాదంలో, అనారోగ్యంలో పడేసే విధంగా ఉద్దేశపూర్వకంగా ప్రయత్నించింది. ఇదంతా రుజువైనా, ఈ అక్రమాలు ఎంతకాలంగా సాగుతున్నాయని ప్రభుత్వం నెస్లె ఇండియాను ఒక ప్రశ్న అడగలేదు. ముప్పై మూడు సంవత్సరాలుగా దేశంలో ఈ నూడుల్స్ అమ్ముతున్న బహుళ జాతి సంస్థ ఎన్ని కోట్ల మంది ఆరోగ్యాలను హరించిందో ప్రశ్న లేదు, నేరారోపణలు లేవు, విచారణ లేదు, శిక్ష అసలే లేదు.

ఎంతో చర్చ జరిగిన తర్వాత తప్పని పరిస్థితిలో నెస్లె ఇండియా ఉత్పత్తి ఆపివేయాలని ప్రభుత్వం ఆదేశించింది. అసలు ప్రమాదకర పదార్థాలే లేవని ముందు బుకాయించిన నెస్లె ఇండియా ప్రజాభిప్రాయం తనకు వ్యతిరేకంగా మారగానే తూతూ మంత్రంగా తన ఉత్పత్తులలో కొంత భాగాన్ని (27,000 టన్నులు) తానే మార్కెట్ నుంచి ఉపసంహరించుకుంటున్నానని ప్రకటించి చేతులు దులిపేసుకున్నది.

నిజానికి వినియోగదారుల, ప్రజల ఆరోగ్యాలనూ, భద్రతనూ, జీవితాలనూ ప్రమాదంలో పెట్టే సరుకులనూ సేవలనూ తయారు చేయడం బహుళ జాతి సంస్థలకు, వారి దళారీలకు కొత్త కాదు. భోపాల్ యూనియన్ కార్బైడ్‌లో ఏ రసాయనం వాడుతున్నారో చెప్పకుండా విషవాయువు వాడుతూ, ఆ వాయువు నిలువ చేసిన టాంక్ లీక్ అయి వేలాది మందిని బలిగొన్న ఉదంతం మన కళ్లముందే ఉంది. శీతల పానీయాలు ఎక్కువ కాలం నిలువ ఉండేలా చూడడానికి వాటిలో క్రిమిసంహారక మందులు కలిపారని నగ్నంగా బయటపడింది. బ్రిటానియా బిస్కట్లలో సీసం కలుపు తున్నారని పరీక్షల్లో తేలింది. గత రెండు మూడు ఏళ్లల్లో దేశంలో అన్ని కార్ల ఉత్పత్తి సంస్థలూ తాము మార్కెట్‌లోకి పంపించిన కార్లలో లోపాలు ఉన్నాయని లక్షలాది కార్లను మార్కెట్ నుంచి ఉపసంహరించుకున్నాయి. ఇక నిత్య జీవితావసర సరుకుల్లో, ఆహార పదార్థాల్లో ఎన్ని రకాల కల్తీలు ఉంటున్నాయో, ఎంతెంత ప్రమాదకరమైన, విషపూరితమైన పదార్థాలను కలుపుతున్నారో ప్రతిరోజూ వార్తలు వస్తూనే ఉన్నాయి. పారిశ్రామిక వస్తువుల్లో అత్యధిక భాగం నాసిరకంగా, ఎక్కువ కాలం మన్నిక లేకుండా తయారవు తున్నాయి. ఇటీవల విపరీతంగా పెరిగిన సేవారంగంలో అత్యధిక సేవలు వినియోగదారులకు అసంతృప్తినే మిగులుస్తున్నాయి.

అయినా మధ్యతరగతికి ప్రైవేట్ రంగంలో నాణ్యత ఉంటుందనే భ్రమ తరిగిపోవడం లేదు. దానికి తోడు ఇటీవలి కాలంలో విదేశీ సరుకులు, సేవలు, బహుళజాతి సంస్థల సరుకులు, సేవలు నాణ్యతా ప్రమాణాలతో ఉంటాయనే భ్రమ కూడ మొదలైంది. కాని పైన చెప్పిన అన్ని ఉదాహరణల్లోను కల్తీలకూ, అక్రమాలకూ, అబద్ధాలకూ, మోసాలకూ, తప్పుడు లెక్కలకూ, అనారోగ్యదాయకమైన రసాయనాలు వాడడానికీ పాల్పడినది బహుళజాతి సంస్థల్లో, వారి భారతీయ దళారీ సంస్థల్లో మాత్రమే. ఆ సంస్థలన్నిటిలోను అత్యధిక శాతం పెట్టుబడి, నిర్ణయాధికారం, అత్యున్నత స్థాయి నిర్వాహకవర్గం బహుళజాతి సంస్థలవే. కనుక నాణ్యత విషయంలో ప్రైవేట్ అయితేనో, విదేశీ అయితేనో, బహుళజాతి సంస్థ అయితేనో నమ్మవచ్చు అనేది ఒక పెద్ద భ్రమ. వాళ్ల సాంకేతిక విధానం అత్యాధునికమైనది గనుక, వాళ్ల నిర్వహణ పద్ధతులు మెరుగైనవి గనుక వాళ్ల సరుకులకూ సేవలకూ నాణ్యత ఉంటుందని కొందరు వాదిస్తారు. నిజానికి ఒక వస్తువు, సరుకు నాణ్యమైనదా కాదా అని నిర్ణయించేది సాంకేతిక విధానం కాదు, నిర్వహణ పద్ధతులు కాదు, యాజమాన్యం రూపొందించుకునే విధానం మాత్రమే. ప్రైవేట్ సంస్థల ఉత్పత్తి విధానానికి ఎప్పుడైనా పునాది లాభాపేక్ష మాత్రమే.

ఈ కల్తీలు, అక్రమాలు, హానికర చర్యలు అన్నీ కూడ ప్రైవేట్ ఉత్పత్తి దారులు, వ్యాపారస్తులు చేస్తున్నవే. ప్రైవేట్ అనగానే దానికదిగా నాణ్యత ఉంటుందని భావించేవాళ్లు ఈ ఉదాహరణలు జాగ్రత్తగా గమనిస్తే ప్రైవేట్ రంగం ఎంత ఘోరంగా నాణ్యతా ప్రమాణాలు లేకుండా ఉత్పత్తి, వ్యాపారం సాగిస్తున్నదో అర్థమవుతుంది. ప్రైవేట్ రంగం అంటేనే యజమానుల, నిర్వాహకుల లాభాపేక్ష కోసం ఏర్పాటయ్యేది, పనిచేసేది అని అర్థం. అంటే ప్రైవేట్ ఉత్పత్తి దారులకు, వ్యాపారులకు మిగిలిన ఏ ప్రమాణం కన్న, విలువ కన్న ముఖ్యమైనది లాభం మాత్రమే. లాభం కోసం ఏమైనా చేయవచ్చు, తమ వినియోగదారులను మోసం చేయడమైనా, వారి ఆరోగ్యాలను ధ్వంసం చేయడమైనా, వారిని బలిపెట్టడమైనా ఏదైనా సరే, లాభం వస్తుందంటే ప్రైవేట్ పెట్టుబడి దారులు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు నిరభ్యంతరంగా చేస్తారు.

భారత సమాజంలో ప్రభుత్వ రంగాన్ని పాలకులే ఉద్దేశపూర్వకంగా, కుట్రపూరితంగా ధ్వంసం చేసి, ప్రభుత్వ రంగ సరుకులకూ సేవలకూ గౌరవం మిగలని స్థితి కల్పించడం కూడ ప్రైవేట్ రంగం మీద భ్రమలు పెరగడానికి ఒక కారణం. దేశంలో వలస పాలన తర్వాత పాలకులు సోవియట్ యూనియన్ నుంచి ప్రణాళికా విధానాన్నీ, అమెరికా నుంచి వ్యక్తిగత చొరవనూ, సామర్థ్యాన్నీ తీసుకుంటున్నామనే పేరుతో ప్రభుత్వ, ప్రైవేట్ రంగాల మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అనే కిచిడీ తయారు చేశారు. ఆర్థిక వ్యవస్థలో ఉదాహరణ ప్రాయమైన సమున్నత శిఖరాలను ప్రభుత్వ రంగం ఆక్రమిస్తుందనీ, ప్రజల నిత్యజీవితావసరాలైన సరుకులనూ సేవలనూ ప్రైవేట్ రంగానికి అప్పగిస్తామనీ వాగ్దానాలు చేశారు. నిత్య జీవితావసర సరుకుల, సేవల రంగంలో కూడ ప్రైవేట్ రంగపు లాభాపేక్షను అరికట్టడానికి, ధరలను నియంత్రించడానికి ప్రభుత్వరంగ సంస్థలను ఏర్పాటు చేశారు. కాని ప్రభుత్వ రంగాన్ని మొదటి నుంచీ ధ్వంసం చేయడానికే ప్రయత్నాలు జరిగాయి. దాన్ని ప్రజారంగంగా నడపలేదు. దాన్ని ప్రైవేట్ రంగపు అవసరాలు తీర్చేదిగా నడిపారు. దాన్ని తమ ఆశ్రితులకు పునరావాస కేంద్రంగా మార్చారు. అవసరమైన చోట్ల తగిన నిధులు ఇవ్వలేదు. ఈ పనుల ద్వారా ప్రజలకు అవసరమైన సరుకులనూ సేవలనూ సృష్టించగలిగారో లేదో గాని ప్రైవేట్ రంగపు నాణ్యత గురించి విచిత్రమైన అభిప్రాయాలు పుట్టి పెరగడానికి వీలు కల్పించారు. భారత పాలకవర్గాల స్వభావం అర్థమైతే వారి నిర్వహణలోని ప్రభుత్వ రంగం మీద భ్రమలేమీ పెట్టుకోనక్కర లేదు. అలాగే మాగీ నూడుల్స్ లాంటి ఉదంతాలతోనైనా ప్రైవేట్ రంగం మీద భ్రమలనూ వదులుకోవాలి. వీ

# తెలంగాణ సంపూర్ణ అభివృద్ధికి విద్య

***తెలంగాణలో విద్యా హక్కు చట్టాన్ని అమలుపరచి, ప్రైవేట్ విద్యాసంస్థలను నిర్మూలించి, ప్రభుత్వ విద్యా సంస్థలను అభివృద్ధి చేస్తేనే విద్యాభివృద్ధి సాధ్యం అంటున్నారు ఎ. శ్రీనివాసరెడ్డి, బి. సత్యనారాయణ, ఎ. మధుసూదన్ రెడ్డి***

సాధారణంగా ఎన్నికల మానిఫెస్టోలలో విద్యారంగానికి సంబంధించిన విషయాలకు అంతగా చోటు ఉండదు. కాని తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు సందర్భం అన్నిదశల విద్యను ఉమ్మడిగా ఉచితంగా అందజేస్తామనే సాహసోపేత నిర్ణయాన్ని ఆయా పార్టీలు తమ మానిఫెస్టోలలో ప్రకటించే అనివార్యతను సృష్టించింది. తెలంగాణలో విద్యారంగం సంక్షుభితమై ఉన్నదని దానిని పటిష్ఠంగా నిర్మించుకోవలసిన అవసరమున్నదనే భావన అందిరికీ కలుగడం వలననే ఇలాంటి సాహసోపేత నిర్ణయాలు జరిగాయి. దీనికి అనుగుణంగా ఇప్పుడు తెలంగాణ విద్యారంగాన్ని పునాదుల స్థాయి నుండే నిర్మించుకోవలసిన సమయం ఆసన్నమైంది. అదే తెలంగాణ సమగ్ర అభివృద్ధికి దారి తీస్తుంది.

విద్యా సంస్కరణలలో హ్రస్వ దృష్టి, ప్రపంచీకరణ ఫలితాలు విద్యారంగంలో అనేక దొంతరలను సృష్టించాయి. ప్రతీ దొంతర మార్కెట్ అవసరాల నిమిత్తమే పోటీని కేంద్రంగా చేసుకుని పని చేసే పరిస్థితులేర్పడినాయి. ఏ దొంతరలోకి ఏ విద్యార్థి చేరుతాడనేది ఆ విద్యార్థి పుట్టుక, ఆర్థిక స్థితులు నిర్ణయిస్తున్నాయి. ప్రతీ దొంతర అంతిమంగా బహుళజాతి సంస్థల, పెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనాలను నెరవేర్చే సాధనంగా మార్చబడుతున్నది. డబ్బు వెచ్చించ గలిగిన వారికే మార్కెట్‌లో డిమాండ్ ఉన్న కోర్సుల్లోకి ప్రవేశం, వాటి ద్వారా ఉద్యోగాలు పొందే అవకాశం, ఆ పని చేయలేని ఆశక్తులకు విద్య, ఉద్యోగ అవకాశాలు దూరం కావడం, సామాజిక అసమానతల తీవ్రత పెరగడం చూస్తున్నాం. ఇంకా వలసవాద లక్ష్యాలతోనే కొనసాగుతున్న విద్యారంగంపై (ప్రభుత్వ, ప్రైవేట్) నయా వలసవాద నీడలు ముసిరి సంపూర్ణ విద్య, మానవీకరించే విద్య మృగ్యమైనాయి.

అనేక దొంతరలుగా ఉన్న విద్యా సంస్థలు అనేక అసమానతలను కలిగి ఉన్నాయి. కాబట్టి అసమానతలతో కూడిన విద్యా సంస్థల్లో విద్యార్జన కూడా అసమానతలతోనే ఉంటుంది. కాని ఈ అసమానతలనేమీ పట్టించుకోకుండా ఉన్నత చదువుల్లోకి, ఉద్యోగాల్లోకి ఎంపిక కోసం విద్యార్థులందరికీ ఒకే రకమైన పోటీ నిర్వహించ బడుతుంది. సంపూర్ణంగా ఈ పోటీ పరీక్షల కేంద్రంగానే నడుస్తున్న ప్రైవేట్ విద్యాసంస్థల దొంతరలు ఈ పోటీలో ముందుంటాయి. ఎందుకంటే ఇవి ముందుగానే ప్రతిభ కలిగిన విద్యార్థులు ఏ మూలన ఉన్నా వెతికి పట్టుకుంటున్నాయి. ఎదురు డబ్బులివ్వడం ఇంకా అనేక రకాలైన ప్రలోభాలకు గురి చేస్తున్నాయి. విద్యా ప్రక్రియలో అవాంఛనీయ, అనైతిక, చట్టరహిత ధోరణులను ప్రవేశపెడుతున్నాయి. ఎక్కువ సమయం పని చేయడం, ఎక్కువ పాఠ్యాంశాల్ని బోధించడం, సైన్స్, గణితం లాంటి కొన్ని సబ్జక్టులకే ప్రాధాన్యతనివ్వడం జరుగుతుంది. బోధనా పద్ధతుల్లో, పరీక్షా పద్ధతులలో వక్రీకరణలు జరుగుతుంటాయి. విశృంఖల పోటీతత్వాన్ని పిల్లల్లో, ఉపాధ్యాయుల్లో పెంపొందిస్తున్నాయి. క్రీడలు, సాహిత్య, సాంస్కృతిక, సామాజిక సేవా కార్యక్రమాలకు తావే ఉండదు. వీటన్నింటినీ విస్మరించి ఈ సంస్థలే బాగా పని చేస్తున్నాయనీ, అదే నాణ్యతని చాలా మంది భ్రమపడుతున్నారు. దీనిని పెట్టుబడిగా చేసుకొని విద్యా వ్యాపారులు తమ వ్యాపారాన్ని విస్తృతం చేసుకుంటున్నారు. సామాన్య చదువులకు సైతం భారీ ఫీజులు చెల్లించవలసి వస్తున్నది. ప్రొఫెషనల్ కోర్సులకైతే ఫీజులు ఆకాశాన్ని అంటాయి. దీంతో దిగువ మధ్యతరగతి, పేద ప్రజానీకం తమశక్తికి మించినా ఈ సంస్థల్లో తమ పిల్లల్ని చదివించడానికి అప్పుల పాలవుతున్నారు. ఆ ధైర్యం చేయలేని వాళ్లు ప్రభుత్వ సంస్థలను ఆశ్రయిస్తున్నారు.

ఈ పరిణామాలతో విద్యా సంస్థల మధ్య తీవ్ర విభజన జరిగి ప్రభుత్వ విద్యా సంస్థల్లో చేరేవారు తగ్గిపోయారు. వాటి పటిష్ఠత గురించి మాట్లాడేవారు లేకుండా పోయారు. ఈ విధంగా విద్యా సంస్థలు అనేక రకాలుగా వేర్వేరుగా ఉండే అవకాశం విద్యా వ్యాపారాన్ని పెంచుతున్నది. వ్యాపార లాభాల కోసం ఈ సంస్థలు పోటీని ప్రోత్సహిస్తున్నాయి. విద్యా సంస్థలు వేర్వేరుగా ఉండే అవకాశం, దాని ద్వారా జరిగే విద్యా వ్యాపారం (కమర్షియలైజేషన్) లాభాల కోసం ప్రోత్సహించబడే పోటీ ఈ మూడు అంశాల మధ్య అంతఃసంబంధాలను గుర్తించినప్పుడే విద్యలో సరైన నాణ్యతపై అవగాహన కలుగుతుంది. అన్ని సామాజిక వర్గాలు సమ భాగస్వామ్యంతో, కనీస సగటు సాధనను సాధించినప్పుడే అది సరైన నాణ్యత అవుతుంది. విద్యా సంస్థలు వేర్వేరు రకాలుగా గాక ఉమ్మడిగా ఉన్నప్పుడే విద్యా వ్యాపారం తగ్గిపోతుంది. విద్యార్థుల మధ్య, ఉపాధ్యాయుల మధ్య, విద్యా సంస్థల మధ్య పోటీ నివారించబడి సహకార భావన నెలకొంటుంది. ఈ రకమైన వాతావరణంలో మాత్రమే విద్యా సంస్థలు అన్నిరకాల సమస్యలకు సరైన, సృజనాత్మకమైన పరిష్కారాలను కనుకునే సామర్థ్యాలను పొందగలుగుతాయి.

లాభాపేక్ష లేకుండా జనరహిత స్వభావంతో నడిచే ప్రైవేట్ విద్యా సంస్థలు తప్ప మిగతా ప్రైవేట్ విద్యా సంస్థలు కొనసాగినంత కాలం విద్యారంగంలో అపసవ్య ధోరణులు కొనసాగుతూనే ఉంటాయి. ఇప్పటికే అనేక రకాలుగా విభజింపబడి ఉన్న సమాజం ఇంకా తీవ్ర విభజనలకు గురికావల్సి వస్తుంది. సమాజంలోని అంతరాలను తొలగించడానికి ఉపయోగపడవలసిన విద్య వాటిని పెంచే సాధనమైనప్పుడు చూస్తూ ఊరుకుంటే భవిష్యత్ తరాలు క్షమించవు. ఈ అంశాన్ని బాగా అర్థం చేసుకున్న దేశాలన్నీ విద్యారంగాన్ని, కనీసం పాఠశాల విద్యనైనా ప్రభుత్వరంగంలోనే నిర్వహిస్తున్నాయి. మన పక్కనే ఉన్న మన కంటే చాల చిన్న దేశమైన శ్రీలంక 1960లోనే పాఠశాల విద్యలో ప్రైవేట్ రంగం లేకుండా చేసింది. జర్మనీ, జపాన్, చైనా, కెనడా, అమెరికా దేశాలన్నీ పాఠశాల విద్యను ప్రభుత్వరంగ అధీనంలోనే ఉంచాయి. ఫిన్లాండ్ అయితే ప్రీ ప్రైమరీ నుండి యూనివర్సిటీ విద్య వరకు అంతా ప్రభుత్వ రంగంలోనే నిర్వహిస్తున్నది. అందుకనే ఈ దేశాలన్నీ మానవాభివృద్ధి సూచికలలో ముందున్నాయి.

తెలంగాణ విద్యారంగం వివరాలు

| విద్యా విభాగం | ప్రభుత్వ విద్యాసంస్థల సంఖ్య (శాతం) | ప్రైవేట్ విద్యాసంస్థల సంఖ్య (శాతం) |
|---|---|---|
| సెకండరీ విద్య | 30041 (54.83) | 24706 (45.16) |
| హయ్యర్ సెకండరీ (+2) విద్యా | 904 (38.8) | 1424 (61.02) |
| వైద్య విద్య | 4 (23.52) | 13 (76.47) |
| ఇంజనీరింగ్ విద్య | 17 (5.05) | 336 (94.94) |
| బి. ఫార్మసీ విద్యా | 4 (2.38) | 164 (97.6) |
| ఎంసిఎ | 17 (8.62) | 180 (91.37) |
| ఎంబిఎ | 18 (3.62) | 478 (96.37) |
| ఎల్ఎల్బి | 4 (22.22) | 14 (77.77) |
| బిఇడి. | 7 (3.34) | 202 (96.06) |
| డిఇడి | 10 (3.24) | 298 (96.76) |
| సాధారణ డిగ్రీ | 119 (11.19) | 944 (88.8) |
| పాలిటెక్నిక్ కాలేజీలు | 55 (29.56) | 131 (70.43) |

విద్యార్థుల సంఖ్య పరంగా ఈ గణాంకాలను పరిశీలిస్తే ప్రైవేట్ భాగస్వామ్యంలోని సంఖ్యలు ఇంకా ఎక్కువగా ఉన్నాయి. మార్కెట్ చేత ప్రభావితమయ్యే ఉన్నత విద్య కోర్సులలో విపరీతమైన ప్రైవేటీకరణ జరిగినట్లు తెలుస్తున్నది. బహుళ జాతి సంస్థల, పెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనాలను నెరవేర్చడానికే ఈ రంగాలు ఇంతగా ప్రభావితం అయినాయి. మిగతా విద్యారంగాలను కూడా ప్రభావితం చేస్తున్నాయి. వీటన్నింటి ఫలితంగా ప్రాంతీయ సమస్యలతో, ప్రతిభతో సంబంధం లేని యాంత్రికమైన అమానవీకరించే విద్య కొనసాగుతున్నది. పర్యావరణ, నైతిక, ఆర్థిక సంక్షోభాలకు దారి తీస్తున్నది. ఈ విషయాల లోతుల్లోకి పోకుండా మండలానికొకటి లేదా నియోజక వర్గానికొకటి చొప్పున మరొక కొత్త రకం విద్యాసంస్థల దొంతరను ఏర్పాటు చేయడం వలన ప్రయోజనమేమీ ఉండబోదు. దీని వలన ప్రస్తుతమున్న ప్రభుత్వ జిల్లా పరిషత్, ఎయిడెడ్ పాఠశాలల్లోని విద్యార్థులే ఈ కొత్త రకం పాఠశాలల్లోకి బదిలీ అవుతారు. దీనితో ఈ పాత పాఠశాలల్లోని పిల్లల సంఖ్య క్రమంగా తగ్గి ఇవి మూతపడి పోతాయి. మిగిలిపోయిన పిల్లలెవరైన ఉంటే ప్రైవేట్ పాఠశాలల్లోనైనా చేరాలి లేదా విద్యకు దూరం కావాలి. ప్రైవేట్ పాఠశాలల్లో చేరడం పేదలకు భారం అవుతుంది. ఇదివరకే ప్రైవేట్ పాఠశాలల్లో ఉన్న పిల్లలు ఆ పాఠశాలలను వీడి కొత్తగా ఏర్పాటు చేసే ప్రభుత్వ పాఠశాలల్లోకి రారు, దీనితో, ప్రైవేట్ చదువుల భారం సామాన్యుడిపై కొనసాగుతూనే ఉంటుంది. అప్పులపాలవుతూనే ఉంటారు. కాబట్టి ఇది చెడు నుండి అతి చెడుకు మారే ప్రమాదకర పరిమాణం. ప్రైవేట్ విద్యను కొనసాగిస్తూ బహుళజాతి సంస్థల, పెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనం కోసం విద్యారంగం ప్రభావితం అయినంత కాలం విద్య నాణ్యత భ్రమలు కొనసాగుతూనే ఉంటాయి. మధ్యతరగతి వర్గాలు ప్రైవేట్ విద్యను ఆశ్రయిస్తూనే ఉంటారు. విద్యను ప్రభుత్వరంగానికే పరిమితం చేస్తే ఎక్కువ శాతంలో ఉండే మధ్యతరగతి వర్గాల భాగస్వామ్యం పెరిగి వాటి బాగోగులపై ఒత్తిడి పెరుగుతుంది. మధ్యతరగతి వర్గాలు ప్రభుత్వ విద్యా సంస్థలకు దూరం కావడమే ప్రస్తుత ప్రభుత్వ విద్యా సంస్థల సంక్షోభానికి ఒక ప్రధాన కారణం. కాబట్టి కొత్తగా ప్రారంభించబడే పాఠశాలలు కూడా పాత ప్రభుత్వ పాఠశాలల మాదిరిగానే సంక్షుభితమవడం తప్పదు. ప్రభుత్వ రంగంలో నడుస్తున్న కేంద్రీయ విద్యాలయాలు, నవోదయ విద్యాలయాలు, మనరాష్ట్రంలోని ఆశ్రమ పాఠశాలలు కూడా ఈ ప్రభావానికే లోనై పూర్వ ప్రాభవాన్ని కోల్పోతున్నాయి. నిజానికి ఈ పాఠశాలలు కూడా పూర్వంలో ప్రాభవాన్ని కలిగి ఉండడానికి కారణం ప్రతిభ కలిగిన పిల్లలను ఎంపిక చేసుకోవడం వల్లనే.. ప్రస్తుతం ప్రైవేటీకరణ హెచ్చరిల్లిన కారణంగా ప్రతిభ కలిగిన పిల్లలందరినీ ప్రైవేట్ సంస్థలే ముందుగా ఎంపిక చేసుకుంటున్నాయి. దీనితో అన్ని హంగులతో ఉన్న ఈ పాఠశాలలు కూడా ప్రస్తుతం చలామణిలో ఉన్న నాణ్యతా ప్రమాణాల కొలమానాల్లో వెనుకబడుతున్నాయి. కాబట్టి విద్యాసంస్థలు ప్రతిభ కలిగిన విద్యార్థులను ఎంపిక చేసుకునే అవకాశం ఉన్నంత కాలం ఈ పరిణామాలన్నీ సంభవిస్తాయి. ప్రతిభ కలిగిన విద్యార్థులను ఎంపిక చేసుకోవడం ద్వారా ప్రతిభ కలిగిన విద్యా సంస్థలుగా చలామణి అవుతూ ఆయా సంస్థలనే అనేక మంది విద్యార్థులు ఎంచుకునేలా చేసి విద్యా వ్యాపారాన్ని విస్తృత పరుచుకుంటున్నారు. కాబట్టి విద్యార్థులను ఎంపిక చేసుకునే పరిస్థితులు, విద్యార్థులు విద్యా సంస్థలను ఎంపిక చేసుకునే అవకాశాలున్నంత కాలం విద్యలో ఈ అవాంఛనీయ ధోరణులు కొనసాగుతూనే ఉంటాయి. కాబట్టి వేర్వేరు రకాల పాఠశాలలు ఉండడం, అవి కలిగించే విశృంఖల పోటీ, వ్యాపారం ఇవి ప్రధాన సమస్యలు. వీటిని పరిష్కరించకుండా ఇంగ్లిషు మీడియా పాఠశాలలను, రెసిడెన్షియల్ పాఠశాలలను ప్రారంభించి విద్యా ప్రమాణాలను పెంచుదామనుకోవడం సరైంది కాదు. ఇవేమి సరైన ఫలితాలనివ్వవు.

ఇక ప్రైవేట్ విద్యాసంస్థలు బాగా పని చేస్తాయనే ప్రచారంలో కూడా నిజం లేదన్న విషయాన్ని అధ్యయనాలు తెలియచేస్తున్నాయి. ప్రైవేట్ సంస్థలు ప్రభుత్వ సంస్థల కంటే మెరుగైనవేమీ కావని తెలపే ఒక విస్తృత అధ్యయనం అజీమ్ ప్రేమ్‌జీ ఫౌండేషన్ ఆధ్వర్యంలో 2008 నుండి 2013 సంవత్సరం వరకు అవిభాజ్య ఆంధ్రప్రదేశ్‌లో జరిగింది. డి.డి. కారోపాడి నేతృత్వంలో విశాఖపట్నం, తూర్పుగోదావరి, మెదక్, నిజామాబాద్, కడప జిల్లాలకు చెందిన 180 గ్రామాల్లో పది వేల మంది విద్యార్థుల నమూనాతో జరిగిన ఈ పరిశోధనా నమూనాను కాలిఫోర్నియా యూనివర్సిటీకి చెందిన ప్రొ. కార్తీక్ మురళీధరన్ రూపొందించారు. వెనుకబడిన వర్గాల విద్యార్థులు తమకు నచ్చిన ప్రైవేట్ పాఠశాలల్లో చదవడానికి ప్రభుత్వం సదుపాయం కల్పిస్తున్నది. ఆ ఫీజులను ప్రభుత్వమే చెల్లిస్తుంది. ఈ పథకంలోని వెనుకబడిన వర్గాల పిల్లలు ప్రభుత్వ పాఠశాల నుండి ప్రైవేట్ పాఠశాలలకు మారినప్పుడు వారి విద్యా విషయాల సాధన ప్రభుత్వ పాఠశాలలోనే కొనసాగిన పిల్లల విద్యా విషయాల సాధన కంటే మెరుగ్గా ఉందా? అన్న అంశం ప్రధాన లక్ష్యంగా ఈ అధ్యయనం జరిగింది. ప్రైవేట్ పాఠశాలలకు మారిన పిల్లల విద్యా సాధన ప్రభుత్వ పాఠశాలల్లోని పిల్లల విద్యాసాధనలలో ఏమీ తేడా లేదని ఈ అధ్యయనం తేల్చింది. ఈ అధ్యయానికి సంబంధించిన వ్యాసం 'డస్ స్కూల్ చాయిస్ హెల్ప్స్ రూరల్ చిల్డ్రెన్ ఫ్రం డిస్‌అడ్వాంటేజ్‌డ్ సెక్షన్స్' అనే శీర్షికతో 2014 డిసెంబర్ 20న ఇపిడబ్ల్యులో ప్రచురించబడింది. ఇలాంటిదే మరొక అధ్యయనం 2012లో ఎకనామిక్స్ ఆఫ్ ఎడ్యుకేషన్ రివ్యు జర్నల్‌లో ప్రచురించారు. మిచిగన్ స్టేట్ యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ అమిత చూద్గర్ ఈ అధ్యయనం చేశారు. యూనివర్సిటీ ఆఫ్ మేరిల్యాండ్, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రిసెర్చ్‌లు సంయుక్తంగా మన దేశంలోని 41,000 కుటుంబాల నుండి సేకరించిన సమాచారాన్ని ఆధారం చేసుకుని సోషియో ఎకనామిక్ ఇండికేటర్స్ ని అమిత చూద్గర్ రూపొందించారు. సమాన సామాజిక ఆర్థిక సూచిక కలిగిన ప్రభుత్వ

# పేదల ఇళ్లకు యూనివర్సిటీ భూములా?

***రాబోయే హైదరాబాద్ మున్సిపల్ ఎన్నికలలో రాజకీయంగా లబ్ధి పొందడానికి పేదలకు ఇండ్లు కట్టిస్తానని ఎరచూపి ముఖ్యమంత్రి కె.సి.ఆర్. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులకు, పేదలకు మధ్య ఘర్షణ సృష్టిస్తున్నారని అంటున్నారు ఆజాద్***

ప్రపంచ దేశాల్లో సమాజం సంక్షోభాలు ఎదుర్కొంటున్నపుడు యూనివర్సిటీలు తమ వంతు బాధ్యతగా సమాజ గతిని మార్చడంలో క్రియాశీలక పాత్ర పోషించాయి. మనదేశంలోనూ నేటికి సామాజిక ఉద్యమాలకూ, విప్లవోద్యమాలకూ యూనివర్సిటీలు కేంద్రంగా ఉన్నాయి. ముఖ్యంగా నిజాం వంశపు చివరి రాజు మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1918లో ఉస్మానియా యూనివర్సిటీని నిర్మించారు. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు స్వాతంత్ర్యోద్యమ కాలంలో, 1952 ముల్కీ – నాన్ ముల్కీ ఉద్యమంలో, 1969 తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమంలో, 1970లో వెల్లువలా వచ్చిన నక్సల్బరీ ఉద్యమంలో, 1979 మండల్ కమిషన్ రిజర్వేషన్ అనుకూల ఉద్యమంలో, ఆ తర్వాత 1980ల నుంచి కొనసాగుతున్న సామాజిక అస్తిత్వ ఉద్యమాల్లో, 2009 నుంచి కొనసాగిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమంలో అనేక త్యాగాలు చేసి సమాజ దశ దిశను నిర్దేశిస్తూ తమ వంతు చారిత్రక బాధ్యతను నెరవేర్చారు.

అనేక మంది విద్యార్థులను మేధావులుగా తీర్చిదిద్ది ప్రపంచానికి అందించిన ఘనచరిత్ర కలిగిన ఉస్మానియా యూనివర్సిటీని, నేడు పాలకులు సామ్రాజ్యవాద అనుకూల విధానాల అమలు కోసం బలహీనం చేయడానికి కుట్రలు పన్నుతున్నారు. అందులో భాగంగా తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు రాబోయే జిహెచ్ఎంసి ఎన్నికల్లో గెలవడమే లక్ష్యంగా పెట్టుకుని స్వచ్ఛ హైదరాబాద్ కార్యక్రమంలో భాగంగా బౌద్ధనగర్ బస్తీల్లో పర్యటిస్తూ ఉస్మానియా యూనివర్సిటీలోని 11 ఎకరాల భూమిని పేదల ఇళ్ల స్థలాలకు కేటాయిస్తానని ప్రకటించడం జరిగింది.

తన రాజకీయ పార్టీ రాబోయే జిహెచ్ఎంసి ఎన్నికల్లో గెలవడం కోసం ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులకు, పేద ప్రజలకు మధ్య గొడవలు సృష్టించి విద్యార్థులను గుండాలు, రౌడీలుగా చిత్రీకరించే ప్రయత్నం చేస్తున్నారు. ఆ క్రమంలోనే 1200 మంది విద్యార్థి అమర వీరుల త్యాగాలను అవహేళన చేస్తూ, యూనివర్సిటీ పోరగాళ్లు మెచ్యూరిటీ లేనోళ్లు, యూనివర్సిటీలు ఏమైనా రాజదర్బార్లా, నేను మొండోన్ని, తమాషాలు చేస్తున్నారా అనుకున్నది చేసితీరుతా అని భూస్వామ్య అహంకారపూరిత భావజాలంతో నియంతవలె మాట్లాడుతున్నాడు. ఈ కుట్రలను వ్యతిరేకిస్తూ, ఉద్యమిస్తున్న, విద్యార్థి సంఘాల నాయకులను అక్రమంగా అరెస్టు చేసి కేసులు బనాయించి, జైళ్లో

---

పాఠశాలల్లో చదివే విద్యార్థుల, ప్రైవేట్ పాఠశాలల్లో చదివే విద్యార్థుల సాధనను పరిశీలించారు. ఈ అధ్యయనం ప్రైవేట్ పాఠశాలల్లో చదివే పిల్లల విద్యా సాధనకు ప్రభుత్వ పాఠశాలల్లో చదివే పిల్లల విద్యా సాధనకు తేడా ఏమీ లేదని తేల్చింది. 2006లో ఎడ్యుకేషన్ ఇనిషియేటివ్స్ – విప్రో సంస్థలు జరిపిన అధ్యయనాలు కూడా ఈ రకమైన ఫలితాలనే తేల్చాయి. కాబట్టి ఈ పరిణామాలన్నింటినీ లోతుగా విశ్లేషించి అర్థం చేసుకోనంత కాలం ప్రైవేట్ భాగస్వామ్యాన్ని నివారించలేమనే వాదనలు ఉంటాయి. వాటిని సంపూర్ణంగా అవగాహన చేసుకున్నప్పుడు ప్రైవేట్ భాగస్వామ్యాన్ని నివారించే అవసరం తెలుస్తుంది. కాబట్టి విద్యా లక్ష్యాలకు విఘాతం కలుగకుండా సమానత్వ ప్రాతిపదికగా ప్రజాస్వామిక విలువల కోసం, మానవీయ విలువల కోసం విద్యా వ్యవస్థను నిర్మించుకోవాలంటే విద్య ప్రభుత్వరంగంలోనే ఉండడం మినహాయించి ప్రత్యామ్నాయం లేదు. ఈ ముందు చూపుతో తెలంగాణ విద్యను పునాదుల నుండి ఇరవై లేదా ముప్పయి సంవత్సరాల దీర్ఘకాలిక ప్రణాళికతో దశలవారిగానైనా కొత్తగా నిర్మించుకోవల్సిన అవసరం ఉంది.

మొదటి దశలో ప్రభుత్వం నుండి సదుపాయాలు పొంది ఏర్పాటు కాబడిన ప్రైవేట్ సంస్థలను ప్రభుత్వ పరం చేయాలి. అన్ని స్థాయిల ప్రైవేట్ విద్యాసంస్థలు నియమ నిబంధనలను వందశాతం పాటించేటట్లు చర్యలు తీసుకోవాలి. ఈ క్రమంలో కొన్ని ప్రైవేట్ విద్యా సంస్థలు సహజంగా మూతపడిపోతాయి. రెండవ దశలో +2 విద్య వరకు ప్రైవేట్ విద్యనంతా ప్రభుత్వ అధీనంలోకి తీసుకురావాలి. మూడవ దశలో ఉన్నత విద్యను ప్రభుత్వ రంగంలోకి తీసుకురావాలి.

వీటితో పాటుగా సత్వరం అత్యంత ప్రాధాన్యతా అంశంగా ఉపాధ్యాయ విద్యను, ప్రీ ప్రైమరీ విద్యను సంస్కరించాలి. నిబంధనలు పాటించని ఉపాధ్యాయ విద్యా కళాశాలలను మూసివేయించాలి. పూర్వ ప్రాథమిక విద్యను ప్రత్యేక విభాగంగా అభివృద్ధి పర్చాలి. ప్రత్యేక అవసరాలు కలిగిన పిల్లల విద్యను ప్రధాన స్రవంతి విద్యతో అనుసంధానించాలి. ఉన్నత విద్యలో రీయింబర్స్‌మెంట్ నిధులతో కొత్త ప్రభుత్వ కళాశాలలను స్థాపించాలి. పాత కళాశాలలను బలోపేతం చేయాలి. కేవలం ఆర్థిక లక్ష్యాల కోసమే గాక సామాజిక, సాంస్కృతిక, వైయుక్తిక లక్ష్యాల సాధనలోనూ ఉపకరణంగా విద్య ఉండేటట్లుగా విద్యారంగాన్ని సమూలంగా సంస్కరించుకోవాలి.

విద్యా వ్యవస్థలను పటిష్ఠ పరుచుకోవడానికి పెట్టుబడిదారీ దేశాలలోని ప్రజలు కూడా విద్యా ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా పోరాటాలు చేస్తున్నారు. అమెరికాలో చార్టర్ స్కూళ్లకు వ్యతిరేకంగా ఉద్యమాలు జరుగుతున్నాయి. చిలీలో పినోచి హయాంలో ప్రైవేటీకరించబడిన విద్యా వ్యవస్థను సంస్కరించే చర్యలకై పోరాటాలు జరుగుతున్నాయి. వోచర్ విధానం వలన కలిగిన నష్టాలను పూరించే ప్రయత్నాలను స్వీడన్ ప్రారంభించింది. దక్షిణ కొరియా, చైనా, జపాన్‌లు ప్రైవేట్ విద్యను నివారించే పటిష్ఠమైన చట్టాలను రూపొందించుకున్నాయి. ఈ అనుభవాల నుండి నేర్చుకుని విద్యనంతా ప్రభుత్వరంగంలోకి తెచ్చినప్పుడే అన్నివర్గాల ప్రజల భాగస్వామ్యం పెరిగి విద్యా సంస్థలు సవ్యంగా నిర్వహించబడుతాయి. అప్పుడే తెలంగాణ సంపూర్ణ అభివృద్ధి సాధ్యమవుతుంది. దీని కోసం పునాది రాళ్లను ఎత్తవలసిన సమయం అందరికీ వచ్చింది.

(రచయితలు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులు) వీ

నిర్బంధించారు. యూనివర్సిటీ విద్యార్థులపై తెలంగాణ ప్రజలకున్న అభిమానాన్ని పోగొట్టి, విద్యార్థులను విలన్లుగా చూపిస్తూ, రాజకీయ కేంద్రాలుగా ఉన్న యూనివర్సిటీలను బలహీనం చేయాలని కెసిఆర్ కుట్రల వెనుక ఉన్న రాజకీయ కారణాలను, విద్యార్థి లోకం, ప్రజానీకం అర్థం చేసుకోవాల్సిన అవసరం ఎంతో ఉన్నది.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన కొరకు జరిగిన ఉద్యమంలో నవంబర్ 29న అధికార కాంగ్రెస్ పార్టీ డైరెక్షన్‌లో కెసిఆర్ నిమ్మరసం తాగి దీక్ష విరమించిన సందర్భంలో ఉస్మానియా, కాకతీయ, ఇతర యూనివర్సిటీల విద్యార్థులు ఉద్యమానికి నాయకత్వం వహించి, తెలంగాణ ప్రజలకు కెసిఆర్ దీక్ష విరమించి చేస్తున్న ద్రోహాన్ని ఎండగట్టారు. యూనివర్సిటీ లలో టిఆర్ఎస్ పార్టీ జెండాలను తగుల బెట్టారు. లాబీయింగ్‌ల ద్వారా ఎన్నికల ద్వారా తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కాదని, ఉద్యమాల ద్వారానే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తథ్యమని పాలకుల ఎత్తుగడలను చిత్తు చేస్తూ, ప్రజలు, విద్యార్థుల పిలుపునూ అమలు చేసేలా మిలిటెంట్ పోరాటాలు చేస్తూ, తెలంగాణ సమాజాన్ని ఏకతాటిపై తీసుకొచ్చారు. లాబీయింగ్, ఎన్నికలతో అధికారంలోకి రావడమే లక్ష్యంగా పెట్టుకున్న టిఆర్ఎస్ పార్టీ యూనివర్సిటీ విద్యార్థుల చేతిలో నాయకత్వం ఉంటే తమ లక్ష్యం నెరవేరదని పదవుల ఆశ చూపి విద్యార్థి నాయకత్వాన్ని చీల్చే కుట్రలు చేసింది. అయినప్పటికీ పాలకులు ఉద్యమాన్ని నీరుగారుస్తున్న ప్రతి సందర్భంలో విద్యార్థులు తమ ఆత్మ బలిదానాలతో ఉద్యమాన్ని ముందుకు కొనసాగించారు.

జూన్ 2న కేంద్ర ప్రభుత్వం తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేస్తున్నామని ప్రకటిస్తున్న సందర్భంలో టిఆర్ఎస్‌తో సహా ఇతర పాలకవర్గ పార్టీలు ఢిల్లీలో చేరి సోనియాగాంధీ పాదాలకు దండాలు పెడుతుంటే, విద్యార్థులు మాత్రం కేంద్ర ప్రభుత్వం తెలంగాణకు చేస్తున్న అన్యాయాలను ప్రశ్నిస్తూ ఆదివాసులను జల సమాధి చేస్తున్న పోలవరం ప్రాజెక్టును రద్దు చేయాలని, హైదరాబాద్ ఉమ్మడి రాజధాని వద్దని, గవర్నర్ పాలనను రద్దు చేయాలని, పీడిత ప్రజల పక్షాన ఆంక్షలు లేని తెలంగాణ కావాలని పోరాటాన్ని కొనసాగించారు.

సమైక్య రాష్ట్రంలో వలసవాద పాలనలో వివక్షకు గురైన పది జిల్లాల పీడిత ప్రజల ముద్దుబిడ్డలుగా నూతన రాష్ట్రంలో కెసిఆర్ ప్రభుత్వానికి ప్రజా ప్రతిపక్షంగా ఉంటూ ప్రజాస్వామ్య తెలంగాణ నినాదాన్ని యూనివర్సిటీ విద్యార్థులు తమ భుజాలపై ఎత్తుకొన్నారు. సమైక్య రాష్ట్రంలో చంద్రబాబు పాలనలో విజన్ 20-20 రూపకర్తలో ఒకడిగా ఉన్న కెసిఆర్ తమ సామ్రాజ్యవాద విధానాల అమలుకు అడ్డుగా ఉండి, స్వయంపాలనను కోరుకునే తెలంగాణ ప్రజల తరపున కెసిఆర్ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను ఎప్పటికప్పుడు ప్రశ్నిస్తున్న విద్యార్థులను, పథకం ప్రకారమే రాజకీయశక్తిగా ఉన్న యూనివర్సిటీలను బలహీనం చేయాలని పేద ప్రజలకు ఇండ్లు కట్టిస్తామంటే విద్యార్థులు అడ్డుకుంటున్నారని విద్యార్థులను ప్రజా వ్యతిరేకులుగా చిత్రీకరించే కుట్ర పన్ను తున్నాడు. అందులో భాగంగానే విద్యార్థి ఉద్యమాలకు అండగా ఉన్న కళాకారులను, కవులను, మేధావులను, రచయితలను తన వైపు తిప్పుకుంటూ వారికి ఉద్యోగాలు, పదవులు ఆశ చూపు తున్నాడు.

కాని రాజీలేని పోరాటాన్ని కొనసాగిస్తున్న విద్యార్థులు కెసిఆర్ కుట్రలను గ్రహించి ఉస్మానియా యూనివర్సిటీలో ఉన్న 18 హాస్టళ్లో సమస్యలు ఉన్నాయని, పరిశోధన కొరకు, భావితరాలకు మేధో సంపత్తి అందించడం కొరకు ఉస్మానియా యూనివర్సిటీ భూములను ప్రభుత్వం తీసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్నారు. మొదట ఉస్మానియా యూనివర్సిటీలో 25,00ల ఎకరాల్లోని , కబ్జాకు గురైన భూమిపై హైకోర్టు సిట్టింగ్ జడ్జిచే విచారణ జరిపించాలని, అక్రమంగా కబ్జాకు గురైన భూములను తిరిగి యూనివర్సిటీకి స్వాధీనపరచాలని, యూనివర్సిటీని పరిరక్షించాలని ఉద్యమాన్ని కొనసాగించడం జరిగింది.

ఈ క్రమంలో యూనివర్సిటీ భూముల్లోని హబ్సిగూడ ప్రాంతంలో అధికార టిఆర్ఎస్ పార్టీ ఎంఎల్ఎ ముత్తిరెడ్డి యాదగిరిరెడ్డి అక్రమంగా కబ్జా చేసి స్వాగత్ గ్రాండ్ హోటల్ నిర్మించడం జరిగిందని, తిరిగి ఆ భూమిని యూనివర్సిటీకి అప్పజెప్పాలని హోటల్ ముందు ధర్నా నిర్వహించిన తెలంగాణ విద్యార్థి వేదిక నాయకులను తొమ్మిది మందిని అరెస్టు చేసి, కేసులు పెట్టి చంచల్‌గూడ జైలుకు తరలించారు. అన్ని విద్యార్థి సంఘాలు, ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తుంటే అరెస్టులతో, లాఠీ చార్జిలతో ఉద్యమాన్ని అణచివేసే ప్రయత్నం జరుగుతుంది.

ఇంత జరుగుతున్న తెలంగాణ ఉద్యమంలో బహిరంగసభల్లో అనేక వేదికల్లో యూనివర్సిటీ విద్యార్థుల పోరాటాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన మేధావులు కెసిఆర్ మోచేతి నీళ్లకు ఆశపడి నోరుమెదపకపోవడం శోచనీయం. కొంత మంది మేధావులు మౌనం వహిస్తున్నప్పటికీ కెసిఆర్ కబ్జాకోరు రాజకీయాలకు చరమగీతం పాడుదామని, ఒక్క సెంటుభూమిని కూడా యూనివర్సిటీ వదులుకోదని పోరాటం కొనసాగిస్తున్నారు.

నిజంగా ప్రజలపై ప్రేముంటే సీమాంధ్ర వలసవాదుల పాలనలో హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల్లో అక్రమంగా బహుళజాతి కంపెనీల కోసం, విందులు, వినోదాల కోసం ఫ్యాషన్‌హబ్‌లు, పార్కుల పేరిట కబ్జాకు గురైన భూములపై సర్వే చేయించి, పేద ప్రజలకు పంచాలని డిమాండ్ చేయడం జరిగింది. అవసరమనుకుంటే ల్యాండ్ సీలింగ్ యాక్టుని ఉపయోగించి ప్రభుత్వం పేదలకు భూములను కేటాయించే అవసరాన్ని సద్వినియోగం చేయాలి. కానీ తెలంగాణ కోసం పోరాడి పోలవరం ప్రాజెక్టు నిర్మాణం పేరిట ఆదివాసులు జల సమాధి అవుతుంటే కళ్లుండి చూడలేని గుడ్డి ప్రభుత్వం, రైతాంగ ఆత్మహత్యలపై నోరుమెదపని ప్రభత్వం పేదలకు ఇళ్లు కట్టిస్తామనడం వెనుక ఉన్న కపట ప్రేమ జిహెచ్ఎంసి ఎన్నికల్లో గెలవడం కోసమేనని అర్థం చేసుకోవాలి. నూతన పారిశ్రామిక విధానం పేర లక్షల ఎకరాల భూమిని పరిశ్రమలకు సింగిల్‌విండో పద్ధతిన కట్టబెడుతామని చెప్పి, కెసిఆర్ కుటుంబ సభ్యులకు, తన దళారులకు అక్రమంగా భూములు కట్టబెడుతూ పేద ప్రజలకు ఇళ్లు కట్టివ్వాలంటే మాత్రం యూనివర్సిటీ భూములు మాత్రమే ఉన్నాయని చెప్పడం వెనుక పేదల పట్ల ప్రభుత్వానికి ఏ మాత్రం ప్రేమ లేదని అర్థం చేసుకోవాలి. యూనివర్సిటీ విద్యార్థులు పేదలకు ఇళ్లు కట్టించడానికి వ్యతిరేకం కాదని, ప్రతి ఒక్కరికి ఇళ్లు దక్కాలని, తెలంగాణలో భూసంస్కరణల అమలు జరగాలని, వనరుల విధ్వంసం కాకుండా పోరాటాన్ని కొనసాగిస్తున్నారు.

విద్యార్థులు చేస్తున్న పోరాటం కెసిఆర్ సామ్రాజ్యవాద అనుకూల పాలన విధానానికి అడ్డుగా ఉందని భావించి యూనివర్సిటీని ఒక కల్లోల ప్రాంతంగా చిత్రీకరిస్తూ, విద్యార్థి సంఘాల నాయకులను రౌడీలుగా, గుండాలుగా, అసాంఘిక శక్తులుగా ప్రచారం చేస్తూ నియంత వలె అక్రమ అరెస్టులతో, కేసులు బనాయించి, జైళ్లలో నిర్బంధిస్తున్నారు. ఈ హింస భవిష్యత్‌లో మరింత పెరిగే ప్రమాదం ఉంది. హింస ఉన్న చోటనే ప్రతిహింస తప్పదు అన్నట్లుగా పిడికెడు మంది యూనివర్సిటీ విద్యార్థులు ఆర్ట్ కాలేజీ ముందు చేరి గట్టిగా నినదిస్తే వణికిపోయే కెసిఆర్ ప్రభుత్వాన్ని తప్పకుండా గద్దెదింపడం జరుగుతుంది. తెలంగాణలో యూనివర్సిటీల అభివృద్ధి కొరకు, ప్రజలు స్వేచ్ఛగా జీవించడం కొరకు ప్రజాస్వామ్య తెలంగాణ సాధనకై కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, మేధావులు, కళాకారులు, ఉద్యోగులు, అధ్యాపకులు భుజం భుజం కలిపి మిలిటెంట్‌గా పోరాడాల్సిన అవసరం ఎంతో ఉంది. అప్పుడు మాత్రమే అమరుల ఆశయం నెరవేరుతుంది.

*(రచయిత తెలంగాణ విద్యార్థి వేదిక రాష్ట్ర జనరల్ సెక్రెటరీ)* వీ

# నోటుకు వోటే పార్లమెంటరీ రాజకీయం

***రాజకీయ పార్టీలు అధికారంలో ఉండడానికి ఎంతటి దిగజారుడు విధానాలకైనా వెనుకాడరని నోటుకు వోటు వ్యవహారం బట్టబయలు చేసిందనీ, ఇది కొత్తగా జరిగింది కాదనీ, పార్లమెంటరీ రాజకీయాలే అవినీతిమయమనీ అంటున్నారు* వరవరరావు**

*దొంగ వోట్ల దొంగ నోట్ల రాజ్యం ఒక రాజ్యమా*
*లంచగొండి సాక్షులిచ్చు సాక్ష్యం ఒక సాక్ష్యమా*

అని విప్లవకారులు, విప్లవ రచయితలు, సానుభూతిపరులతో కలిపి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1974 మేలో సికిందరాబాదు కుట్రకేసు పెట్టినపుడు శ్రీశ్రీ 1975లో జైల్లో విరసం సభ్యులను కలిసినాక రాశాడు.

నలభై ఏళ్లు గడచిపోయినవి. శత్రువు తెలివితేటలు, ప్రజల చైతన్యమూ పెరిగినవి. ఎవరు దొంగ, ఎవరు దొర – ఎవరే విలువలను, ప్రమాణాలను నిర్ణయిస్తారు అనే విషయంలో కూడ అవగాహన చాలా పెరిగింది. ముఖ్యంగా దళిత, ఆదివాసి బడుగువర్గాల్లో స్వీయగౌరవ, అస్తిత్వ స్పృహ పదునెక్కిన కొద్దీ ఈ ముద్రలు వేసే పాలకవర్గాల ఆరోపణలను ప్రజలు యథాతథంగా స్వీకరించడానికి సిద్ధంగా లేరు. అయితే ఎన్నికల రాజకీయాల వల్ల మొత్తంగా రాజకీయ వ్యవస్థయే అవినీతిమయమైపోయిన వాతావరణంలో ఈ పరస్పరారోపణలు ఇరవై నాలుగు గంటల మీడియాకు ఒక రేటు పెరిగే సంచలనాలుగా మాత్రమే ప్రజలు చూస్తున్నారు. అంత మాత్రమే కాదు ప్రజల మౌలిక సమస్యల నుంచి ప్రజల దృష్టిని మళ్లించే అంశాలుగా కూడ చూస్తున్నారు. ప్రేక్షకులకు, పాఠకులకు, శ్రోతలకు ఇది ఒక రాజకీయ నాటకంగానూ, అనుచర వర్గానికొక కత్తులు దూసుకొనే క్రీడగానే మారిపోయింది.

దొరగారు అధికారంలోకి రాగానే అంతర్జాతీయ విమానాశ్రయం దగ్గర ఒక గొలుసు దొంగను నాటకీయంగా అరెస్టు చేసి ఎన్‌కౌంటర్ చేశారు. అతడు హస్తలాఘవానికి స్త్రీల మెడలలో పుస్తెల తాళ్లు దొంగిలించడంతో ప్రారంభించి విలాస జీవితానికి అలవాటు పడి అది వృత్తిగా మార్చుకున్నాడని, అతని ఇల్లు, ఇంట్లో సోఫాలు, విలువయిన వస్తువులతో కూడిన విలాస జీవితాన్ని చూపి, తమ 'సంపాదన'తో అటువంటి జీవితాన్ని అనుభవిస్తూ, గొలుసులు పోగొట్టుకుంటున్న వాళ్లు, పోతాయేమోనని భయపడే వాళ్లు అయినా భద్రలోకానికి పోలీసు వ్యవస్థ, ప్రభుత్వం చాలా భరోసా ఇస్తుంది. భద్రలోకంలో ఒక ఆమోదాన్ని కూడ పొందుతుంది. మరొకవైపు రాజకీయ నాయకుడైనా, పోలీసు అయినా నీతిగా ఉంటారని నమ్మే నరమానవులు ఒక్కరూ ఉండరు.

అక్కడ ప్రారంభించి ఆదివాసులను, వాళ్ల మధ్యన ఉండి వాళ్ల భూములను, వనర్లను కాపాడడానికి పోరాడుతున్న మావోయిస్టుల కోసం వేల సంఖ్యలో గ్రేహౌండ్స్‌ను, అర్ధసైనిక బలగాలను దించి గాలింపు చర్యలు జరుపుతూ కాల్పులు జరిపే ప్రక్రియ ప్రాణాలు తీసే వరకు పోయింది. ఆదిలాబాద్ జిల్లా, ఖమ్మం జిల్లాలో ఇటువంటి కాల్పులు ఎన్నిమార్లు జరిగాయో. ఖమ్మం జిల్లా చర్ల మండలంలో మోటారు సైకిల్‌పై ముగ్గురు పోతుంటే కాల్పులు జరిపి ఒక ఆదివాసిని చంపి మావోయిస్టు ఎన్‌కౌంటర్ అని ప్రకటించారు. ఆదివాసులను దోచి కార్పొరేట్ శక్తులకు పెట్టే ఈ ప్రక్రియ ఏడాది తిరిగే వరకు వేగవంతమై తెలంగాణ సరిహద్దులు దాటి బీజాపూర్ జిల్లాలో లంకపెల్లి అడవుల్లో వివేక్ అనే ముక్కుపచ్చలారని పిల్లవానితో పాటు ఇద్దరు ఆదివాసి మహిళలు కమల, సోనులను చంపే దాకా విజృంభించింది.

ఈ దళారీ దొరతనానికి జేబుదొంగలు, ఆదివాసులు, మావోయిస్టులే కాదు ముస్లిం మైనారిటీలు కూడా అభద్రతా భావానికి కారణమయ్యారు. అందుకే తెలుగు సమాజానికి 'ఎన్‌కౌంటర్లు' అనేవి నలభై సంవత్సరాలుగా తెలిసినవే అయినా న్యాయస్థానంలో రక్షణలో ఉన్న వాళ్లను చంపడమనే అరుదైన దుర్మార్గానికి కూడ తెలంగాణ ప్రభుత్వం పూనుకున్నది.

కనుక ఆస్తి, సంచయం చర్చ దొంగతనం, దోపిడీ దగ్గర ముగిసేది కాదు. అది రాజ్యహంతక స్వభావ చర్యగా మనం మాట్లాడుకోవాల్సి ఉంటుంది.

తెలంగాణలో దొర పాలన ఇట్లా ఉంటే నవ్యాంధ్రలో బాబు పాలన జాన్ బాబురావును, ఆయనతో పాటు నల్లమలలో చెంచుల మధ్యన వ్యవసాయ చైతన్యాన్ని ప్రోది చేస్తూ అంటిపెట్టుకొని ఉన్న ఇద్దరు తెలంగాణ మహిళలను శాసనసభ సమావేశం ప్రారంభమైనపుడు ఎన్‌కౌంటర్ పేరుతో చంపడంతోనే ప్రారంభమైంది. శేషాచలం అడవుల్లో ఇరవై మంది తమిళ ఆదివాసి, కూలీలను ఎన్‌కౌంటర్ పేరుతో చంపి ఎర్రచందనం స్మగ్లర్లుగా చిత్రించడంతో పరాకాష్టకు చేరింది. ఇవాల్టికీ ఈ కూలీలను ఎర్రచందనం స్మగ్లర్లుగా పరిశోధనాత్మకంగా నిరూపించి స్థాపించే పథకాలు రచిస్తున్న మీడియాలో ఒక సెక్షన్ ప్రయత్నం ఆరంభంలో చెప్పిన విలువల ప్రమాణానికి నికృష్ట దాఖలా.

రాజధానీ నగరం కొరకు రైతుల గోళ్లూడకొట్టి, కడుపుకొట్టి బలవంతంగా వేల ఎకరాలు ఆక్రమించుకుంటున్న పాలకులు బాబులు, నాయుడు బాబులు, కొందరు మేధావుల దృష్టిలో ఫ్యూడల్ భూస్వాముల కన్నా మెరుగైన ప్రజాస్వామ్య సంస్కృతి గల పెట్టుబడిదారీ వర్గాలు.

కనుక ఇవాళ దొరబాబుకు, బాబుదొరలకు మధ్యన ఒక రసకందాయమైన 'నోటుకు వోటు, ఫోన్ ట్యాపింగ్' అనే నాటకం నడుస్తున్నది. ప్రభుత్వాలు కూలిపోతాయని, ముఖ్యమంత్రులు జైలుకు పోతారని, రాజ్యాంగ సంక్షోభం ఏర్పడుతుందని ఛానెల్స్ ముందర, పత్రికలు ముందేసుకొని ఇరువైపులా బుద్ధిజీవులు చర్చించుకుంటున్నారు. ఇటీవలె మరణించిన సుప్రసిద్ధ లాటిన్ అమెరికా మేధావి, రచయిత ఎడ్వర్డ్ గెలియానో 'శబ్దం' అనే వ్యాసంలో చెప్పినట్లు ఈ పాలకవర్గ స్వార్థ ప్రయోజనాల చైతన్యానికి ఎవరయిన ప్రజలు కూడ తమ తాగే నీటి దాహాన్ని, ఆహారపు ఆకలిని మరచిపోయి రంగుల దోపిడీ ప్రపంచం చర్చల్లో మైమరచిపోతున్నారు.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరిట అరవై ఏళ్ల కింద ఎన్నికలు ప్రారంభమైన నాటి నుంచి నోటుకు వోటు ఇచ్చి కొనుక్కోని ప్రజా ప్రతినిధి ఎవరైనా ఉన్నారా? రామ్‌మనోహర్ లోహియా దరిద్ర రేఖకు దిగువన నలభై శాతం ప్రజలున్న చోట ఎన్నికల్లో నిలబడే అభ్యర్థికి

ధరావతు రుసుము నిర్ణయించడమే అవినీతికి ప్రాతిపదిక అన్నాడు. అక్కడి నుంచి ఎన్నికల కమీషన్ నిర్ధారించే ఎన్నికల ఖర్చు పరిమితి, అసలు ఖర్చు, ఇవన్నీ రాబట్టుకోవడమంటే నిజాయితీయే అనిపించు కోవచ్చు. ఇంతకు ఇమ్మడి ముమ్మడి తరతరాల కోసం, రాజకీయ వారసత్వం కోసం సంపాదించుకోవడం కోసం డబ్బు, సారా, కులం, మతం, ప్రాంతం, కండ బలం – ఎన్నని ఎన్నికల్లో అభ్యర్థులు అమలు చేసే అక్రమాలు. ఏ ఒక్కటీ మానవీయ ప్రమాణాలను కాదు, రాజ్యాంగ నియమాలను కూడ గౌరవించేవి కావు. అమలు చేసేవి కావు. మెజారిటీ సాధించారని చెప్పుకునే ఏ ఒక్క అభ్యర్థీ పోలయిన వోట్లలో మిగతా వారికన్న ఎక్కువ వోట్లు సంపాదించిన వాడే తప్ప మెజారిటీ ప్రజలకు ప్రాతినిధ్యం వహించేవాడు కాదు. మొదటి సాధారణ ఎన్నికల్లో రావినారాయణ రెడ్డి మొదలు ఇవాళ ప్రత్యర్థుల అందరి డిపాజిట్లు గల్లంతు చేసి అత్యధిక మెజారిటీ సాధించుకున్నాడు అనే అభ్యర్థి వరకు ఇది యథార్థం. మన ప్రజా ప్రతినిధులంతా ఓటేసి, చెల్లిన వోట్లలో మెజారిటీ పొందిన వాళ్లే తప్ప ప్రజలందరిలో మెజారిటీ ఆమోదం పొందిన వాళ్లు కాదు.

ఇంతకూ ఈ నోటుకు వోటు – సార్వజనీన ఎన్నికల్లో వయోజన వోటరు వోటు గురించి కాదు. ప్రజా ప్రతినిధులు వోటు అమ్ముకోవడం గురించి లేదా ప్రజా ప్రతినిధులను వోటు అమ్ముకొమ్మని స్వయంగా ముఖ్యమంత్రి ప్రలోభ పెట్టడం గురించి. ఇదేదో సారా పొట్లాలు, స్త్రీలకు చీర కుంకుమలు, వోటుకు వందల రూపాయల వ్యవహారం కాదు. కోట్ల కోట్ల రూపాయల వ్యవహారం. సుజనా చౌదరీలు, కార్పొరేట్ విద్యా నారాయణలు, రమేశ్‌లు తప్ప భరించలేనంత. ఇది ఫోన్ ట్యాపింగ్ చేసి, సిసి కెమెరాలు పెట్టి, వీడియోలు తీసి – అండర్ వరల్డ్ ముఠాలను, దావూద్ ఇబ్రహీం మనుషులను పట్టుకున్నంత పకడ్బందీ పథకంతో పట్టుకోవడం.

ఇదంతా ఎదుటి ఏ పక్షానికి ఎంఎల్‌ఎలు లేకుండా కలుపుకుంటూ, మంత్రి పదవులు ఇస్తూ, ఎన్నో ప్రలోభాలు, ప్రయోజనాలు సమకూర్చు కుంటూ ఏకపక్ష, ఏక కుటుంబ, ఏక వ్యక్తి పాలన కోసం ఇరువైపులా ఆడుతున్న ఒక ప్రజాస్వామ్య ప్రహసన నాటకంలో కొయ్య గుర్రాల పందాల ఆట, చూసేవారికి నరాలు చిట్లిపోయే ఉత్కంఠ.

నెహ్రూ ముంద్రాల కుంభకోణానికి, ఇందిరా గాంధీ నగర్‌వాలాల గొంతు పోల్చుకునే తతంగాలకు, అద్వానీ కాలపు హవాలాలకు వెళ్లనక్కర్లేకుండా ప్రపంచీకరణను అమలు చేసే కాలం నుంచి క్రమం తప్పకుండా అమలవుతున్న ప్రజాస్వామ్యం. శిబూసోరేన్‌ను కొనడానికి పివి నరసింహారావు చేసిన ప్రయత్నం ఇవాళ చంద్రబాబు ప్రయత్నం వలెనే బయట పడిపోయింది. ఎవరికీ ఏమీ కాలేదు.

పివి ఇటు కెసిఆర్‌కు, అటు చంద్రబాబుకు ఇవాళ ఎన్‌టిఆర్ వలెనే ఆదర్శ నాయకుడు. శిబూసోరేన్ రాజనీతియే కెసిఆర్ ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో మొదటి నుంచీ పాటిస్తున్న రాజనీతి.

ఇందులో ఇంకో విచిత్రమైన విషయం – ఉద్దేశాల గురించి చర్చ కాదు. పద్ధతుల గురించి చర్చ. ఎట్లా తెలిసింది? ఎవరు చెప్పారు? కెమెరాలు ఎసిబి పెట్టిందా? ఒక మీడియా చానెల్ పెట్టిందా? ఎట్లా వల పన్నారు? ముఖ్యమంత్రి ఫోన్ ట్యాప్ చేయవచ్చునా? మావోయిస్టుల సంభాషణలు రికార్డు చేయడానికి కోట్ల రూపాయలతో కొనుగోలు చేసిన అత్యంత ఆధునిక సాంకేతిక జ్ఞానమంతా ఏ రాష్ట్ర పోలీసుశాఖ చేతుల్లో ఉండిపోయింది. దానిని స్వయంగా చంద్రబాబు స్వరాన్ని రికార్డు చేయడానికి ఎంత తెలివిగా దుర్వినియోగం చేశారన్నది చర్చ.

తెలుగుదేశం, కాంగ్రెస్, వైఎస్ఆర్‌సిపి ఎంఎల్‌ఎలను డబ్బు ఒక్కటే కాదు, ఆదాయ వనరు్లు చూపుతూ, ఎన్నో అవకాశాలు చూపుతూ అధికార పార్టీ కలుపుకుంటున్నదా లేదా అనేది చర్చ కాదు, నామినేటెడ్ ఎంఎల్‌ఎనైనా సరే కొని తెరాస పాచికలు పారనివ్వవద్దన్నంత దిగజారిన రాజకీయాలు చంద్రబాబు స్వయంగా ముఖ్యమంత్రిగా చేస్తున్నాడన్నది చర్చ కాదు, అంతకన్న ముఖ్యం జయలలిత మొదలు రాజకీయాల్లో అధికారం నిలుపుకునే ఏ పాలకవర్గ నాయకుడైనా ఎన్నికల ప్రజాస్వామ్యంలో పారదర్శక ఆదాయాలతో పరిపాలన చేయడం సాధ్యం కాదు అనే మౌలిక అవగాహనతో చర్చ చేయకపోవడం మన చైతన్యం మొద్దుబారుతున్నదనడానికి నిదర్శనం.

అసమ వ్యవస్థ ఒక అవినీతి, ఆస్తి సంచయం ఒక అవినీతి. ఆస్తి పోగుపడడం ఇవాళ్టి ఎన్నికల రాజకీయాల సంస్కృతి. దీనికి మినహాయింపులు లేదు. వ్యక్తులుగా చూపవచ్చు గానీ వ్యవస్థలుగా, పార్టీలుగా మినహాయింపు లేదు. అందులోనూ ముఖ్యంగా భూస్వామ్య వర్గాలు, పెట్టుబడిదారీ వర్గాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దళారీలుగా మారి, అన్ని ఎన్నికల పార్టీలు కార్పొరేట్ కంపెనీల సేవయే ప్రభుత్వ కర్తవ్యమని భావిస్తున్న కాలంలో ఎన్నికల రాజకీయాల్లో నీతి కోసం వెతకడం ఇసుకలో చమురు కోసం వెతకడం అనవచ్చును గానీ ఈ దళారీలు ఇసుకలో చమురు తీయడంలో కూడ సిద్ధహస్తులయ్యారు. ఎందుకంటే రాజకీయ అవినీతికి ఇవాళ కొలమానం రూపాయి కాదు డాలర్. రాజకీయాలు ఇవాళ కమీషన్ వ్యాపారం అయిపోయాయి.

ఇంక ఇందులో రామాయణంలో పిడికల వేట వలె రాష్ట్ర విభజన సందర్భంగా హైదరాబాద్ నగరంపై గవర్నర్‌కిచ్చిన అధికారాల చర్చ. పదేళ్లపాటు రెండు రాష్ట్రాలకు హైదరాబాద్‌ను రాజధానిగా అంగీకరించి, శాంతిభద్రతలు, భూముల, అమ్మకాలు, కొనటాలు, ఉన్నత విద్యపై గవర్నర్ జోక్యాన్ని అంగీకరించి ఉష్ణ పక్షివలె ఇవాళ సెక్షన్ 8ని ఉపయోగిస్తే పోరాటమే అనడం పోలవరం ప్రాజెక్టు నిర్మాణమయితే నీళ్లు కాదు నెత్తుర్లు పారుతాయి అని ప్రగల్భాలు పలికినట్లే ఉంటుంది. భౌగోళిక తెలంగాణ కాదు గదా, ఏడు మండలాలను కోల్పోయిన తెలంగాణ పాలకులు ఇప్పుడే మేల్కొన్నట్లు నటించడం ఎవరిని మభ్య పుచ్చడానికి? ఇద్దరు ముఖ్యమంత్రులను జలవివాదం ఇతర వివాదాల విషయంలో గవర్నర్ కూర్చోబెట్టినప్పుడు, ఇద్దరు విద్యామంత్రులను ఉన్నత విద్య మండలి గురించి చర్చించడానికి కూర్చోబెట్టినపుడు, ఇద్దరు హోం మంత్రులను కాదు గదా, ఇద్దరు హోం సెక్రెటరీలను కాదు గదా, ఇద్దరు డిజిపిలను రాజభవన్‌కు పిలిపించి పోలీసు గవర్నర్ హైదరాబాద్ నగరంలో శాంతిభద్రతల గురించి చర్చించినపుడు హైదరాబాద్‌పై తెలంగాణ ప్రభుత్వానికి ఉన్న సంపూర్ణ అధికారం గురించిన సోయి ఎక్కడికి పోయింది? మేకిన్ ఇండియా వలె, మేకిన్ తెలంగాణ కోసం జిఎంఆర్, జివికె, అపోలో, ల్యాంకో వంటి ఆంధ్రా బడా పెట్టుబడిదారులకు ఎర్రతివాచీలు పరచి ఆహ్వానం పలికిన తెలంగాణ ప్రభుత్వానికి ఇప్పుడింత ఉలుకెందుకు? ఎవరిని మభ్యపుచ్చడానికి ఈ ప్రగల్భాలు? ప్రజల సార్వభౌమత్వాన్ని తాకట్టు పెడుతున్న ఈ ప్రభుత్వాలు స్వీయ గౌరవం, స్వపరిపాలన గురించి మాట్లాడడం సిగ్గుచేటైన విషయం.

మొత్తంగా ఈ అధికార రక్తదాహ యజ్ఞంలో స్టీఫెన్‌సన్‌లు, మత్తయ్యల వంటి బక్రాలు బలి అవుతారు. దొరల వోట్ల, బాబు నోట్ల రాజ్యం ఒక రాజ్యమా? అని మనం నిలదీయగలిగేంత కాలం ఈ నాటకం రక్తి కడుతూనే ఉంటుంది.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

# ఎన్‌కౌంటర్ నుండి ఎన్‌కౌంటర్ దాకా

*ఏడాది పాలనలోనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు స్వరూపం బయటపడిందనీ, ప్రజా వ్యతిరేక విధానాలకు పాల్పడుతూ తన ఎజెండా ఏమిటో మరోసారి నిరూపించుకున్నారనీ అంటున్నారు* **పి. వరలక్ష్మి**

కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రిగా చంద్రబాబు నాయుడు 2014 జూన్ 6న ప్రమాణ స్వీకారం చేశాడు. ఆయన మొదటి సంతకం తుపాకితో నల్లమల మీద నెత్తురద్ది పెట్టాడు. మొదటి అసెంబ్లీ కొలువుతీరిన రోజే తొలి ఎన్‌కౌంటర్ నమోదైంది. గుంటూరు జిల్లాలో ఎన్‌కౌంటర్ పేరుతో చిత్రహింసలకు గురిచేసి చంపబడిన ముగ్గురిలో ఇద్దరు చెంచులు. ఆ జిల్లాలోనే ఇప్పుడు రాజధాని నిర్మాణం జరుగుతున్నది. మారిన మనిషిగా ఎన్నికల్లో నిలబడిన చంద్రబాబు తన పాత ముఖాన్ని కొద్దిసేపు కూడా దాచుకోదలచుకోలేదు. రాజధాని నిర్మాణమే ఏకైక కార్యక్రమంగా రూపొందించుకుని సాగిన ఆయన పాలన శేషాచలం వద్ద ఇరవై మంది ఎర్రచందనం కూలీల ఎన్‌కౌంటర్ తర్వాత అమరావతి శంకుస్థాపనతో ఏడాది పూర్తిచేసుకుంది. రాష్ట్రం విడిపోయి కష్టాల్లో ఉన్నాం, హైదరాబాదు పోయి అనాథలమైపోయాం, రు. 16 వేల కోట్ల రెవెన్యూ లోటు ఉంది అంటూ అనుక్షణం విభజన ముందరి భావోద్వేగాలు చల్లారకుండా తనను తాను కాపాడుకుంటూ తన పెట్టుబడుల ఎజెండాతో పాలకపక్షం ముందుకుపోతోంది.

**ఆదివాసుల, రైతుల సమాధుల మీద నవ్యాంధ్ర**

హైదరాబాదు కోసం పట్టుబట్టి సమైక్యాంధ్ర ఆందోళనలు చేసి చివరికి పోలవరం దగ్గర సర్దుబాటు చేసుకుని ఏడు మండలాలను విలీనం చేసుకుని కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. తెలంగాణ రాష్ట్రాన్ని ప్రకటించే సందర్భంలో ఆదివాసి రక్షణ చట్టాలను, పర్యావరణ, అటవీ చట్టాలనన్నిటినీ ఉల్లంఘించి ఆంధ్రకు పరిహారంగా పోలవరం ప్రాజెక్టును జాతీయ ప్రాజెక్టుగా తీసుకుని పూర్తి చేస్తామని యుపిఎ ప్రభుత్వం హామీ ఇచ్చింది. ఎన్‌డిఎ ఇంకా ముందుకు పోయి ఆ ప్రాంత ప్రజా ప్రతిఘటనను ఎదుర్కోవడానికి ఏడు మండలాలను ఆంధ్రప్రదేశ్‌లో కలిపేసింది. ప్రాణం పోయినా హైదరాబాదుపై హక్కును వదులుకోమని తెలంగాణంతా ఏకమైనట్టుగా ఆదివాసుల విషయంలో కాలేకపోయింది. అటు ప్రభుత్వానికి అసలు నొప్పిలేదు. అట్లా రెండు వందల గ్రామాలను, నాలుగు లక్షల మంది ప్రజలను జలసమాధి చేసి కొత్త రాష్ట్రాలు అవతరించాయి. కొత్త ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావమే కార్పొరేట్ కంపెనీలకు తీర ప్రాంతమంతా అప్పగించడానికి, వారి భవిష్యత్ అవసరాల కోసం పోలవరం వంటి ప్రమాదకరమైన ప్రాజెక్టును ప్రజల తలల మీద నిర్మిస్తున్నారు. ఇప్పుడు అన్ని నిబంధనలు, ప్రభుత్వమే నియమించిన నిపుణుల సూచనలు పక్కన పెట్టి ఇరవై తొమ్మిది గ్రామాల పచ్చని పంట భూముల్ని సమాధి చేసి ఆ పునాది మీద దాని రాజధాని నిర్మాణం అవుతోంది. ఈ ఏడాదంతా ప్రభుత్వం తన శక్తియుక్తులన్నిటినీ రాజధాని నిర్మాణం పేరుతో 33 వేల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకోడానికే వెచ్చించింది. రెండో దశలో మరింత భూమి సేకరించి మొత్తం 52 వేల ఎకరాల విస్తీర్ణంలో నూతన రాజధాని అమరావతిని నిర్మించాలని, తదుపరి దశల్లో మరింత భూమి సేకరించి మొత్తం లక్ష ఎకరాల్లో అభివృద్ధి చేయబోతున్నామని ప్రభుత్వం ప్రకటించింది. ఇప్పటికే నయాన భయాన స్వాధీనం చేసుకున్న భూమి ప్రపంచ రికార్డని మంత్రి నారాయణ ప్రకటించి తమ సమర్థతను గొప్పగా చాటుకున్నారు. ఉత్తరాంధ్రలో విధ్వంసక థర్మల్, అణు విద్యుత్ ప్రాజెక్టులు, బాక్సైట్ గనుల ప్రయత్నాలు ప్రజా ప్రతిఘటనలు మామూలే. బూర్జువా రాజకీయ పక్షాలు అటు, ఇటు మారాయి.

**పాత రాష్ట్రం, పాత ముఖ్యమంత్రి, అవే వినాశకర విధానాలు**

ఆంధ్రప్రదేశ్ కొత్త రాష్ట్రం కానట్టే, ముఖ్యమంత్రీ కొత్తవాడేమీ కాదు. ఆయన గురించి ఇప్పుడు కొత్తగా చెప్పడానికేమీ లేదు. గత హయాంలో ఆయన ఆంధ్రప్రదేశ్‌ను కార్పొరేట్ కంపెనీగా ప్రకటించి దానికి తాను సిఇఒ అన్నాడు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అనుకూల ఆర్థిక విధానం వల్ల ప్రభుత్వ రంగ పరిశ్రమలు మూతపడి కార్మికులు రోడ్డున పడ్డారు. వ్యవసాయం కుదేలై రైతులు వేలాదిగా ఆత్మహత్యలు చేసుకున్నారు. మహిళలు పోరాడి సాధించుకున్న మద్య నిషేధాన్ని ఎత్తేసి మద్యం ఏరును రాష్ట్రం మూలమూలలా పారించాడు. యువత మత్తులో ఊగిపోతోంది. అరాచకాలు పేట్రేగిపోయాయి. రాజ్యహింస నెత్తుటి వరదలా పారింది. చంద్రబాబును అన్ని వర్గాల ప్రజలు తిరస్కరించారు. అయితే ఎన్నికల్లో తిరస్కారానికి గురైన పాలకులు మళ్లీ గద్దెనెక్కడానికి ఎక్కువ సమయం పట్టదు. మన ఎన్నికలు పాలకుల విధానాల్నే కాదు, పాలకుల్ని కూడా మార్చలేవు. పదేళ్లు తిరిగేసరికి అదే బాబుకు అవే విధానాలు అమలు చేయడం నల్లేరు మీద నడకయింది. ఇప్పుడు మరింత స్పష్టంగా విద్య, వైద్యాన్ని వ్యాపారం చేసి అమ్ముకుంటున్న నారాయణ, కామినేని వంటి లంపెన్ వ్యాపార వర్గం క్యాబినెట్‌లోకి వచ్చింది.

అధికారంలోకి వచ్చే ముందు ఇచ్చే ఎన్నికల హామీలు ఆ తర్వాత ఎంత సులువుగా ఎగరగొట్టగలరంటే తేదీ మారేసరికి టాపిక్ మారుతుంది. రైతు రుణ మాఫీ, డ్వాక్రా రుణాల మాఫీ, నిరుద్యోగ భృతి, వృద్ధాప్య పెన్షన్ పెంపు, పేదలకు చవకగా ఆహారాన్నందించే అన్న క్యాంటీన్లు, చవకగా మినరల్ వాటర్, మద్య నియంత్రణ (నిషేధం కాదు) వంటివి ఏవీ ప్రభుత్వ విధానాలను ప్రభావితం చేసేవి కావు. నిజానికి వీటిని సంక్షేమ పథకాలని కూడా అనలేం. జనాన్ని తాత్కాలికంగా మభ్యపెట్టే తాయిలాల వల్ల పాలకపక్ష ఆర్థికవేత్తలు

చెపుతున్నట్టు ఖజానా మీద పెను భారం పడదు. ఇప్పుడు అమలవుతున్న సంక్షేమమంతా కార్పొరేట్ పెట్టుబడులకే. అన్ని సేవలూ వారికి ఉచితం. ఈ ఏడాది పాలన నుండే చిన్న ఉదాహరణ తీసుకుంటే 2013, 2014 ఖరీఫ్‌లలో పంట నష్టపోయిన రైతులకు ఇన్‌పుట్ సబ్సిడీ చెల్లించడానికి ప్రభుత్వం డబ్బుల్లేవని చెప్పింది. మార్చ్‌లో ఓవర్ డ్రాఫ్ట్‌కు పోయి మరీ 2,067 కోట్లు పారిశ్రామిక రాయితీల రూపంలో చెల్లిస్తే (అకౌంటులో ఉన్న డబ్బు కన్నా ఎక్కువ డ్రా చేస్తే వచ్చే లోటును ఓవర్ డ్రాఫ్ట్ అంటారు) ఆర్‌బిఐ 8వేల కోట్లు అపరాధ రుసుం వసూలు చేసింది. ఇందులో కమిషన్లు, వాటాలు మనం ఊహించుకోవచ్చు. అదే రైతుకిస్తే ఏమొస్తది? అందువల్ల రైతుల రుణాలు వాయిదాల్లో చెల్లిస్తామని చెప్పారు. ఇది వచ్చే ఎన్నికల వరకు విడతలుగా ఇవ్వొచ్చు. రైతుల వాస్తవ స్థితి మాత్రం దయనీయంగా ఉంది. పోయినేడాది 36 శాతం తక్కువ వర్షపాతంతో 560 మండలాల్లో కరువొచ్చింది. అనంతపురం నుండి తూ.గో.జిల్లా దాకా రైతుల ఆత్మహత్యలు నమోదయ్యాయి. రుణమాఫీ జరక్కపోవడం మరింతగా రైతుల్ని సంక్షోభంలోకి నెట్టింది. ఇక డ్వాక్రా రుణాల సంగతి ఎటూ కదలల్లేదు.

అయితే వృద్ధాప్య పెన్షన్ పెంచినట్లుగా నిరుద్యోగ భృతి, రుణాల మాఫీ కూడా ప్రభుత్వాలకు పెద్ద కష్టం కాదు. ఏదో ఒక పథకానికి లబ్ధిదారుల్ని చేసి జనాన్ని జోకొట్టడమే ప్రభుత్వాలకు కావల్సింది. కాని అది అత్యవసరమనిపిస్తేనే చేస్తారు. అప్పుడు కూడా చంద్రన్న కానుకల్లాంటివి పడేస్తారు. ఇప్పుడు ప్రభుత్వంపై అంతకన్నా పెద్ద ఒత్తిడి పదేళ్లుగా అధికారానికి దూరమై, పార్టీ కోసం డబ్బులు ఖర్చుపెట్టిన తమ వారికి లబ్ధి చేకూర్చడం. వందల కోట్ల సాయం చేసిన కంపెనీలకూ ఇచ్చుకోవలసినవి తక్షణం ఉంటాయి. కాంట్రాక్టర్లకు వేల కోట్లు ధారపోస్తున్న పోలవరం, పట్టిసీమ దగ్గరి నుండి బైరైటీస్ టెండర్లు, ఇసుక రీచ్‌లు, బొగ్గు, గ్యాస్ కొనుగోలు, గోదావరి పుష్కరాల దాకా అవినీతి గురించి మాట్లాడడానికి ప్రతిపక్షానికి కావల్సినంత ఉంది. ఇసుక అక్రమ రవాణాకు అడ్డుకట్ట వేయడానికి ఇసుక రీచ్‌లను డ్వాక్రా సంఘాలకు ఇస్తున్నట్లు ప్రకటించారు. చాలా సహజంగా జరిగిందేమిటంటే మహిళా సంఘాల మాటున తెలుగుదేశం పార్టీ నేతలు వాటిని చేజిక్కించుకున్నారు. అన్నీ మామూలుగా జరిగిపోతూ ఓటుకు ఐదు కోట్ల చుట్టూ వివాదాల వినోద కార్యక్రమం నడుస్తున్నది.

**రక్తచందనం నుండి రాజధాని దాకా**

కొత్త రాష్ట్రం కోసం కట్టుకోవలసినవి ఎన్నో. అందులో నుండి పిండుకోడానికి, పంచుకోడానికి కావల్సినంత. ఈ అరుదైన అవకాశం చంద్రబాబు ప్రభుత్వానికే దక్కింది. అనుకోకుండా ఈ ప్రభుత్వానికి ఎర్రచందనం అమ్ముకునే అవకాశం కూడా వచ్చింది. ఈ అరుదైన వన సంపద కోసం ఇప్పటిదాకా జరిగిన హింస ఒక ఎత్తయితే, ఎన్‌కౌంటర్ స్పెషలిస్టు చంద్రబాబు రాజ్యంలో మొదలైన హింస అంతా ఇంతా కాదు. శేషాచలంలో ఇరవై మంది కూలీల కాల్చివేత ఈ హింస మొత్తానికి ఒక వ్యక్తీకరణ. అరెస్టులు, పిడి యాక్టు కింద కేసులు కొనసాగుతూనే ఉన్నాయి. జైల్లు కిక్కిరిసి పోతున్నాయి. వనరుల దోపిడికి, సంపద కేంద్రీకరణకు నల్లమల, శేషాచలం వంటి అడవులే కాదు, అమరావతి కింద 120 రకాల పంటలు పండే లక్ష ఎకరాల భూమి, ఇండస్ట్రియల్ కారిడార్‌ల కోసం ఏకంగా లక్షలాది ఎకరాల ల్యాండ్ బ్యాంక్, 947 కిలోమీటర్ల సముద్రతీర ప్రాంతం అంచెలంచలుగా రాసివ్వడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉంది.

రాజధాని నిర్మాణానికి మంత్రి నారాయణ వంటి వ్యాపారవేత్తలతో సిఆర్‌డిఎను ఏర్పాటు చేసింది. భూసేకరణకు ల్యాండ్ పూలింగ్ చట్టం తీసుకొచ్చింది. ప్రభుత్వం ఫక్తు రియలెస్టేట్ వ్యాపారిలాగా వ్యవహరించే అధికారం ఈ చట్టం ద్వారా వచ్చింది. ఎకరం భూమికి పదేళ్ల తర్వాత 1200 గజాలు అభివృద్ధి చేసిన భూమి ఇస్తానని హామీ ఇచ్చి రైతుల నుండి అంగీకార పత్రాలు తీసుకుంది. అంత వరకు సంవత్సరానికి 50 వేల చొప్పున పరిహారం ఇస్తానంది. పదేళ్ల తర్వాత పరిస్థితి ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు? ప్రభుత్వం వైపు నుండి దీనికి గ్యారెంటీ ఏమీ లేదు. బోర్డు తిప్పేసే చిట్‌ఫండ్ కంపెనీ వ్యవహారంలా ఉందని రైతులంటున్నారు. అయితే అగ్రిమెంటు కూడా అమ్ముకోవచ్చు గనక మూడో పార్టీకి చాలా మంది రైతులు భూములమ్మేసుకున్నారు. ఇట్లా రైతుల నుండి కొనుగోలు చేసేవాళ్లంతా చాలా మటుకు మంత్రుల బినామీలే అన్నది బహిరంగ రహస్యమే. తుళ్లూరు, తాడేపల్లి, మంగళగిరి మండలాల్లో 29 గ్రామాల్లో ఈ పద్ధతిలో సేకరించిన 33వేల ఎకరాలు రైతుల్ని మభ్యపెట్టి, అంగీకార పత్రాలు ఇవ్వకపోతే (ల్యాండ్ పూలింగ్‌కు ఒప్పుకోకపోతే) భూసేకరణ చేపడతామని, అప్పుడు మీకు వచ్చేది కూడా రాదని బెదిరించి తీసుకున్నారు. గ్రామాల్లో పోలీసు క్యాంపులు వెలిశాయి. రైతుల్ని పిలిపించి పోలీసులు బెదిరించడం మొదలైంది. ఆరు గ్రామాల్లో పంటపొలాల్లో అరటి మొక్కలను నిలబెట్టడానికి పాతిన వెదురు బొంగుల్ని, వ్యవసాయ పనిముట్లను కాల్చిబూడిద చేశారు. చాలా మందిని భయపెట్టి లొంగదీసుకున్నారు. అయితే ఇప్పటికీ కోర్టుల చుట్టూ ఒంటరి పోరాటం చేసే రైతులున్నారు. ఇక కౌలుదార్లు, వ్యవసాయ కూలీలు పరిహారం అడిగితే కుటుంబానికి నెలకు 2,500 చొప్పున ఇస్తామని సిఆర్‌డిఎ అధికారులు చెప్పారు.

ఇక రాజధాని ఆర్భాటాలకు, మీడియా హడావుడికి అంతు లేదు. సంవత్సరం పొడవునా ఇదే ప్రహసనం. హైదరాబాదును మించి కనీవినీ ఎరుగని రీతిలో రాజధానిని నిర్మిస్తానని మంత్రుల కమిటీనే కాదు తాను కూడా వివిధ రాజధానులు చూడడానికి దేశాలు తిరిగారు చంద్రబాబు. సింగపూర్ స్థాయి రాజధాని గురించి మీడియా మాట్లాడని రోజు లేదు. దానిని సింగపూర్ సాంకేతిక నిపుణులు డిజైన్ చేస్తారట. హాస్యాస్పదమైన విషయమేమిటంటే ఈయన చెప్పే అమరావతి విస్తీర్ణం సింగపూర్‌కు పది రెట్లు ఎక్కువగా ఉంటుంది. జపాన్ పోయి జపాన్ పెట్టుబడులు వస్తాయని మన విద్యార్థులు జపనీస్ భాష నేర్చుకునేందుకు యూనివర్సిటీల్లో కోర్సులు పెడతానంటాడు. ఇలాంటి పిచ్చి మాటలు చాలానే ఉన్నాయి కాని అవన్నీ అమరావతి రాజధాని చుట్టూ ఉన్న వివాదాలను పక్కకు తోసేయడానికే. హైదరాబాదుతో పోటీ పెట్టి కోల్పోయిన దాన్ని కట్టుకోవాలని, హైదరాబాదును తానే అభివృద్ధి చేశానని, అంతకు మించిన రాజధాని నిర్మించడం పెద్ద లెక్క కాదని చెప్తాడు. రాజధాని ఆయన నిర్మించడమేముంది? భూములు లాక్కోడమే ప్రభుత్వం చేసే పని. తర్వాతంతా నడిపించేది రియల్ ఎస్టేట్ వ్యాపారులు, కార్పొరేట్ కంపనీలే.

**చంద్రబాబు అమరావతి చరిత్రలో అతిపెద్ద పాపం**

నిజానికి ఆంధ్రప్రదేశ్ రాజధాని కోసం కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన శివరామకృష్ణన్ కమిటీ ఎట్టి పరిస్థితుల్లోనూ గుంటూరు, విజయవాడ మధ్య రాజధాని నిర్మాణం చేయరాదని తేల్చిచెప్పింది. అది ఆర్థికంగా భారమవ్వడమే కాదు తీవ్రస్థాయిలో పర్యావరణాన్ని నాశనం చేస్తుందని హెచ్చరించింది. రాష్ట్రంలో ఎక్కడా అవకాశం లేనన్ని బహుళ పంటలు పండే భూముల్ని మాయం చేయడమే కాదు, కృష్ణా నది మీద ఈ విధ్వంసక ఒత్తిడి విపరీత పరిణామాలకు దారితీస్తుందని కమిటీ స్పష్టంగా చెప్పింది. జియాలాజికల్ సర్వే ఒకటి ఈ ప్రాంతం చాలా సున్నితమైన భౌగోళిక ప్రదేశమని, వరదలే కాదు భూకంపాలు వచ్చే అవకాశం కూడా ఉందని రిపోర్టు చేసింది. ఆంధ్రప్రదేశ్ రాజధాని నిర్మాణం చరిత్రలో అతి పెద్ద పాపమని ఒక రిటైర్డ్ ఐఎఎస్ వ్యాఖ్యానించాడు.

భూసమీకరణకు పర్యావరణ ప్రభావ అంచనా, సామాజిక ప్రభావ అంచనా ఏవీ అవసరం లేవని మోడీ బాటలో చంద్రబాబు నడుస్తున్నాడు. ఆయన చట్టాలను మించిన చట్టాలు తీసుకొస్తున్నాడు. శివరామకృష్ణన్ కమిటీ ప్రభుత్వ సంస్థల వికేంద్రీకరణకు కూడా సూచనలిచ్చింది. రాష్ట్రాన్ని నాలుగు జోన్లుగా చేసి అభివృద్ధి వికేంద్రీకరణ చేయాలని చెప్పింది. ఈ కమిటీ చేసిన సూచనలు ఒక్కటి కూడా చంద్రబాబు ప్రభుత్వం పరిగణలోకి తీసుకోలేదు. రాజధాని విషయంలో పుకార్లు వ్యాపింపజేసి పెద్ద ఎత్తున రియల్ ఎస్టేట్ వ్యాపారాన్ని ప్రోత్సహించింది. స్థానిక నాయకులు, మంత్రుల నుండి సింగపూరు పెద్దల దాకా అమరావతి భూకుంభకోణంలో భాగస్వాములై ఉన్నారని అనుమానాలున్నాయి. అట్లాగే అధికార పార్టీ కులాధిపత్య స్వభావాన్నీ రాజధాని చూపించిందని, రెండు జిల్లాల కమ్మ భూస్వాముల, పెట్టుబడిదారుల తిరుగులేని ఆధిపత్యాన్ని స్థాపించబోతోందనే విశ్లేషణల్నీ కొట్టివేయలేము.

**మరింతగా ప్రాంతీయ అసమానతలు**

రాష్ట్ర విభజన పాఠం పాలకులకు ఎక్కలేదు. తొలి రోజుల్లో చెప్పిన అభివృద్ధి వికేంద్రీకరణ మాటలకే పరిమితమయ్యాయి. ప్రాంతీయ అసమానతల్ని కొత్త ఆంధ్రప్రదేశ్ మరింతగా పెంచే సూచనలు తొలి ఏడాదే స్పష్టంగా కనిపించాయి. ఒక్క సాగునీటి ప్రాజెక్టుల విషయమే తీసుకుంటే పట్టిసీమకు 1,300 కోట్లు కేటాయించిన ప్రభుత్వం రాయలసీమ ప్రాజెక్టులన్నీ కలిపి అందులో సగం కూడా బడ్జెట్‌లో కేటాయింపులు చేయలేదు. పైగా పట్టిసీమ రాయలసీమను సస్యశ్యామలం చేస్తుందని చెప్పడం మించిన దగాకోరుతనం ఎక్కడా ఉండదు. రాయలసీమ నుండి ప్రాంతీయ స్వరం కొంత వినపడుతున్నట్లు ప్రభుత్వం గమనిస్తున్నది. అయినా మాయమాటలే కాదు ఆ అసంతృప్తినంతా విభజన మీదకి, తెలంగాణ మీదకి తోసేయడానికి చేయవలసినదంతా చేస్తున్నది. నీళ్ల విషయంగా ఈ తగవు పెట్టే ప్రయత్నాలు కృష్ణా ట్రిబ్యునల్ తీర్పుతో ఇప్పటికే పూర్తయ్యాయి. రాజధాని, పెట్టుబడుల కేంద్రీకరణ ప్రణాళికల వల్ల కూడా రాయలసీమ, కళింగాంధ్ర ఎప్పటికన్నా ఎక్కువగా వివక్షకు గురయ్యే అవకాశం ఉంది.

**ప్రభుత్వ ఉద్యోగులను గెలుచుకోవడం**

సాపేక్షికంగా కాస్త ఎక్కువ సౌకర్యాలు పొందే ప్రభుత్వ ఉద్యోగులను మరింత ప్రసన్నం చేసుకుని ఆ వర్గాన్ని పూర్తిగా లోబరచుకుంది ప్రభుత్వం. ఇప్పటికే ప్రభుత్వ ఉద్యోగులకు, సామాన్య ప్రజలకు మధ్య ఉన్న ఎడం మరింత పెరిగింది. ఈ వర్గం ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా మాట్లాడే అవసరం లేదనుకుంటుంది. ప్రభుత్వంపై ఒత్తిడి పెట్టగల సంఘటిత నిర్మాణాలు ఇక ఆర్థిక పోరాటాలు కూడా చేయనవసరం లేదు. (సమైక్యాంధ్ర ఆందోళనల్లోలాగా, ఇప్పుడైనా ఏదో ఒక విషయాన్ని వివాదం చేయదలచినా ప్రభుత్వోద్యోగుల్ని ముందుకు పెట్టగలరు పాలకులు.) బహుశా ప్రభుత్వ ఉద్యోగాలు చేసి రిటైర్మెంటు బెనిఫిట్లు పొందే చివరి తరం ఇదే కావచ్చు. ఇక అన్నీ నిత్య అభద్రతతో, ఎటువంటి రక్షణ చట్టాలు లేని కాంట్రాక్టు, ఔట్ సోర్సింగ్ ఉద్యోగాలే. ఇప్పుడున్న ట్రేడ్ యూనియన్ల స్థానంలో ప్రత్యామ్నాయ ఉద్యమ నిర్మాణాలు ఏర్పడేవరకు ప్రభుత్వాలకు నిశ్చింత. ఆర్టీసీ కార్మికుల విషయంలోనూ గతంలో ఎన్నడూ లేని విధంగా జీతాల పెంపు డిమాండును అంగీకరించడానికి వెనక కూడా ఇదే పనిచేసిందా? ప్రైవేటీకరణ గురించి ప్రశ్నించకుండా చేయడానికి కార్మికులను, ఉద్యోగులను ఇట్లా మంచి చేసుకున్నారా? తెలంగాణ ప్రభుత్వంతో పోటీపడక తప్పని స్థితి కూడా ఇక్కడ పనిచేసి ఉండొచ్చు. పక్క రాష్ట్రంతో పోల్చి ప్రభుత్వంపై ఒత్తిడి పెంచడం సహజం. రెండు రాష్ట్రాలు పోటీ పడడం వల్ల ఎంత కాలం, ఎంత మంది ప్రయోజనాలు నెరవేరతాయో కాని తెలంగాణలోనైనా ప్రైవేటు పెట్టుబడులకు అనుకూల విధానాలే అమలు కానున్నాయి.

**రాష్ట్రాలు వేరైనా వర్గ ప్రయోజనాలు ఒక్కటే**

ఇబ్బందికర పరిస్థితి ఎదురైనప్పుడల్లా రాష్ట్రాల మధ్య భావోద్వేగాలు రెచ్చగొట్టి బతికేయడానికి తగిన వాతావరణం ఇంకా ఉంది. పదే పదే విభజన వల్ల కష్టాల్లో ఉన్నాం అని ఆంధ్రప్రదేశ్ పాలకులు గుర్తుచేస్తూనే ఉంటారు. నీటి పంపకాల గురించి రాయలసీమ వాళ్లు గట్టిగా అడక్కముందే తెలంగాణ వల్లే రాయలసీమ నష్టపోతోందని ఇంతెత్తున పక్క రాష్ట్రంపై అరుస్తారు. కోస్తా సంపన్న వర్గాలకు, కార్పొరేట్ కంపెనీలకు ప్రయోజనం చేకూర్చే పోలవరంతో పేచీ ఎవరికీ ఉండదు. చారెడు నీళ్ల దగ్గర రాయలసీమకు, పాలమూరుకు కొట్లాట నడుస్తూ ఉంటుంది. ఈ చర్చ ఇంకెక్కడైనా చేయవచ్చుగాని మొత్తం మీద పాలకవర్గాలు తమ వర్గప్రయోజనాల విషయంలో బ్రహ్మాండమైన ఐక్యత ప్రదర్శిస్తారు. ప్రజా ఉద్యమాలను అణిచేయడంలో ఇది మరింత స్పష్టంగా కనపడుతుంది. గత సెప్టెంబరులో ప్రత్యామ్నాయ రాజకీయ వేదిక సభను హైదరాబాదులో భగ్నం చేసిన సందర్భంలో అటు, ఇటు రెండు ప్రభుత్వాల పోలీసులు ఎక్కడికక్కడ సమన్వయంతో వందలాది అరెస్టులు చేశారు. ఆ తర్వాత నవంబరులో వరవరరావు ఇంటి వద్దకు విశాఖ ఏజెన్సీ నుండి మనుషుల్ని పంపి దాడి వంటి ధర్నాను జరిపించడంలో కూడా రెండు ప్రభుత్వాలు గొప్ప సమన్వయంతో పనిచేశాయి. ఇక చంద్రబాబు మార్కు ప్రజాస్వామ్యంలో ఈ నిర్బంధం కొనసాగుతూ వచ్చి వివిధ హక్కుల సంఘాల గ్రీన్ హంట్ వ్యతిరేక వేదిక మీటింగ్‌ను

# రాజధాని పేరుతో జీవన విధ్వంసం

*నిపుణుల అభిప్రాయాలను, హెచ్చరికలను కూడా తుంగలో తొక్కి, కేవలం కొందరి స్వార్థ ప్రయోజనాల కోసం రాజధాని నగర నిర్మాణం జరుగుతోందనీ, ఈ వినాశనాన్ని ప్రజలు సంఘటితంగా ప్రతిఘటించాలనీ అంటున్నారు* **షేక్ కరిముల్లా**

నవ్యాంధ్రప్రదేశ్‌కు రాజధాని నిర్మాణం అవసరమే. దానిని ఎవరు వ్యతిరేకించడం లేదు. అయితే రాజధాని ఎక్కడ నిర్మించాలనేదే అసలు సమస్య. ఈ సమస్యను అన్ని కోణాల నుండి అధ్యయనం చేయడానికి శివరామకృష్ణన్ కమిటీ వేశారు. ఈ కమిటీ వివిధ వర్గాల ప్రజలను సంప్రదించి అభిప్రాయ సేకరణ జరిపింది. దీని ఆధారంగా రాజధాని నిర్మాణానికి బహుళ పంటలు పండే సారవంతమైన వ్యవసాయ భూముల్ని సేకరిస్తే అది ఆహార భద్రతకు, పర్యావరణానికి హానికరంగా మారి, రైతులు, వ్యవసాయ కూలీలతో పాటు బలహీన వర్గాలు, పేద ప్రజలు జీవనం కోల్పోయి భిక్షగాళ్లుగా మారిపోతారని కమిటీ అభిప్రాయ పడింది. దీనికి ప్రతిగా కొన్ని ప్రత్యామ్నాయ మార్గాలు ప్రభుత్వం ముందు ఉంచింది. కమిటీ చాలా స్పష్టంగా గుంటూరు – విజయవాడ మధ్య రాజధాని ఏర్పాటు చేయడం మంచిది కాదని చెప్పింది. అక్కడి భూమి స్వభావం భారీ కట్టడాలకు అనుకూలం కాదని, ఈ ప్రాంతంలో భూకంపాలు వచ్చే అవకాశం ఉందని తేల్చి చెప్పింది. ప్రభుత్వ భూముల్లోనే రాజధాని నిర్మాణం చేయడం మంచిదని చెపుతూ, ప్రకాశం జిల్లాలోని 'దొనకొండ' ప్రాంతంలో విస్తారంగా అటవీ భూములు ఉండడంతో ఈ ప్రాంతం అనువైనదని చెప్పింది. కొన్ని ప్రపంచ అనుభవాలను, అధ్యయనాలను కూడా ఉటంకిస్తూ రాజధానిపై విలువైన సిఫార్సులు చేసింది. ఇప్పటివరకు పూలింగ్ ద్వారా ఇంత భారీ భూభాగాన్ని ఎక్కడా సమీకరించలేదని సాంకేతిక అనుబంధం ఆరు (పేజీ – 20) స్పష్టం చేసింది. చంద్రబాబు కమిటీ సిఫార్సులను తుంగలో తొక్కి, కనీసం కమిటీ నివేదికపై ఎలాంటి చర్చ జరపలేదు. బహుళ పంటలు పండే జరీబు భూములున్న ప్రాంతాన్ని ఏ ప్రాతిపదిక మీద రాజధాని కోసం సమీకరించాలనుకున్నారో ఎక్కడ తెలియపరచ లేదు. స్వచ్ఛందంగా భూములివ్వడానికి రైతులు ముందుకు రాకపోతే బలవంతంగానైనా సేకరిస్తాం అని బెదిరింపులకు పాల్పడుతూ, ప్రభుత్వం అప్రజాస్వామికంగా ఏకపక్షంగా భూ సమీకరణ ప్రక్రియను చేపట్టింది. వందల సంఖ్యలో రైతులు హైకోర్టును ఆశ్రయిస్తున్నా, కోర్టు బ్రేకులు వేస్తున్నా ప్రభుత్వం మొండిగా వ్యవహరిస్తున్నది. ఈ తంతు ఎవరి ప్రయోజనాల కోసం అనేది మౌలిక ప్రశ్న? ప్రభుత్వ తీరు తెన్నులను పరిశీలిస్తే సామాన్యునికి కూడా అర్థమయ్యేది, రాజధాని ప్రజల కోసం కాదని కార్పొరేట్లకు నిర్మిస్తున్నారని తెలిపోతుంది. ఈ మేరకు మే నెలలో విడుదల చేసిన సర్కారు జీవోలు (109, 110, 116) కుండ బద్దలు కొట్టాయి. సిసిడి సిఎంకు విధులు, అధికారాలు అప్పగించారు. పేదోడు గుడిసే వేసుకోవడానికి జానెడు జాగా ఇవ్వమంటే కనికరించని ప్రభుత్వం రైతుల నుంచి లాక్కున్న భూములను కార్పొరేట్లకు, విదేశీ బహుళజాతి సంస్థలకు 99 సంవత్సరాలు లీజుపై కట్టబెడుతుంది.

పర్యావరణ, కాలుష్య నియంత్రణ తదితర శాఖల అనుమతులు, కనీసం మాస్టర్ ప్లాన్ కూడా లేకుండా జూన్ 6న రాజధాని నిర్మాణ పనులకు భూమి పూజకు ముహూర్తం నిర్ణయించింది. చంద్రబాబు అధికారంలోకి వచ్చినప్పటి నుండి రాష్ట్ర విభజన వలన ఏర్పడిన సమస్యల పరిష్కారం కోసం కృషి చేయకుండా రోజుకో దేశం తిరుగుతూ ఒకరోజు సింగాపూర్, మరో రోజు జపాన్, మరో రోజు చైనాను నిర్మిస్తానంటూ పులినిచూసి నక్క వాతలుపెట్టుకున్న చందంగా వ్యవహరిస్తున్నాడు. 'మా రాష్ట్రానికి రండి కావలసినంత భూమి ఇస్తాం' అంటూ బహుళజాతి కార్పొరేట్ శక్తులను ఆకర్షిస్తూ, ఆహ్వానిస్తూ అదే పనిలో ఉన్నాడు. రాజధాని ప్రతిపాదిత ప్రాంత మండలాలలో దాదాపు 29 గ్రామాల పరిధిలో 50 వేల ఎకరాల పంట భూములు, ప్రధానంగా ఆయా గ్రామాల్లో ఏడాదికి మూడు పంటలు అందున దేశంలోనే ఎక్కడా లేనివిధంగా పసుపుకాండ, నిమ్మ, బత్తాయి, సపోట, జామ,

తిరుపతిలో అడ్డుకున్నారు. ప్రజాసంఘాల నాయకుల్ని ఎక్కడికక్కడ నిర్బంధించారు. విశాఖలో ప్రెస్‌మీట్‌ను కూడా అడ్డుకుని అరెస్టులు చేశారు. ఇదంతా ప్రజలపై యుద్ధం ఆపరేషన్ గ్రీన్‌హంట్ గురించి మాట్లాడేవాళ్లను కూడా అడ్డుకుని, అక్రమ అరెస్టులు చేయడంలో దేశవ్యాప్తంగా అమలవుతున్న విధానాల్లో భాగం.

**అభివృద్ధి – మోడిత్వ**

చంద్రబాబు మార్కు ఆర్థిక ఎజెండాతో పాటు ఈసారి ఆయన మోడీని జత కలుపుకుని వచ్చారు. ఆయన సహకారంతో ఏడు మండలాలు విలీనం చేసుకుని ఇక భక్తిని చాటుకునే పనిలో ఉన్నారు. మోడీ హిందుత్వ ప్రచారానికి వెంకయ్యానాయుడితో కలిసి ఆయన పూర్తి సహకారం ఇస్తున్నారు. ప్రభుత్వ మీడియా సలహాదారు పరకాల ప్రభాకర్‌లు ఉండనే ఉంటారు. అక్కడ స్వచ్ఛ భారత్ అంటే ఇక్కడ స్వచ్ఛ ఆంధ్రప్రదేశ్, మేకిన్ ఇండియా అని ఆయనంటే ఈయన మేకిన్ ఆంధ్ర అంటాడు. యోగాసనాల నుండి పుష్కరాల దాకా ఆర్ఎస్ఎస్ మిత్రులతో ఆడిపాడుతున్నాడు. ఈసారి గోసంరక్షణ పేరుతో ఎప్పుడూ లేనంతగా బక్రీద్ పండుగ ముందు ఆర్ఎస్ఎస్ పలుచోట్ల వీరంగం చేసింది. ఇది మొదలు మాత్రమే. ఏడాది పాలన సామ్రాజ్యవాదం, మతం జమిలిగా విస్తరించే ప్రమాదాన్ని బలంగా సూచించింది.

*(రచయిత విప్లవ రచయితల సంఘం కార్యదర్శి)* వీ

కనకాంబరాలు, మల్లెలు, జాజిపూలు ఇలా 130 రకాల వైవిధ్యభరితమైన పంటలు పండుతున్న భూములు రాజధాని పేరుతో అమానుషంగా సేకరించాలనుకోవడం ఎవరి ప్రయోజనాలకోసమని ప్రజలు చర్చించుకుంటున్నారు. తన సొంత సామాజిక వర్గం, రియల్ ఎస్టేట్ వ్యాపారం, దేశ, విదేశీ కార్పొరేట్ శక్తులకోసమనేది బహిరంగ రహస్యమే. అసలు భూమి ఎవరబ్బ సొత్తు? అందుకే ప్రజాకవి వేమన ఇలా అన్నారు.

'భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు
కదన భీతు జూచి కాలుడు నవ్వు
విశ్వదాభిరామ వినురవేమ'...!

భూమి, గాలి, నీరు ఒకరు సృష్టించినవి కావు. అది ప్రకృతి సంపద. ప్రకృతిలో జీవనం సాగించే జీవరాసులన్నింటిది. అందుకే వందనాశివ ఇలా అన్నాడు.

'ప్రకృతి ఆర్థిక వ్యవస్థలో కరెన్సీగా చలామణిలో ఉన్నది డబ్బుకాదు జీవం'

భూమిని సరుకుగా మార్చిన ప్రపంచీకరణ భూమి పరంగా ఎన్ని అక్రమాలు, దౌర్జన్యాలు చేయగలదో అంతా చేసింది. 2000 సంవత్సరం నుంచి జడలు విప్పిన రియల్ ఎస్టేట్ భూతం సమస్త జీవులకు చెందిన భూమిని మింగి జీర్ణం చేసుకోవడం ప్రారంభించింది. కొండల్ని తొలచి, చెరువులను మింగి, గుట్టల్ని చదునుచేసి జీవులకు, మనుషులకు నిలువ నీడ లేకుండా చేసింది. బుల్డోజర్ల కింద సామాన్యుని పూరిపాకలను నుజ్జు చేసింది. ప్రపంచీకరణ సృష్టించిన ఎల్లలులేని మార్కెట్ శక్తులు, అవి అన్నింటిని సరుకుల్ని చేసి కింద నుండి పైదాకా దోపిడికి అన్ని ఎల్లల్ని చెరిపేసింది. లుంపెన్ వ్యాపార రాజకీయ శక్తులను తయారు చేసి అవసరాలతో నిమిత్తం లేకుండా లాభాపేక్షతో వస్తూత్పత్తిని సృష్టించి డిమాండ్ సప్లయ్‌ల అసమతుల్యంతో మార్కెట్ మాయజాల సంక్షోభంలో కూరుకుపోయి యావత్ ప్రపంచాన్ని ఈ ప్రపంచీకరణ నేడు సంక్షోభం లోకి నెట్టింది. ఈ ప్రపంచీకరణ దుష్టశక్తే నేడు నవ్యాంధ్ర రాజధానిని కూడా ఆవహించింది. ప్రపంచ స్థాయి రాజధాని నిర్మాణం ద్వారా చంద్రబాబు సృష్టించదలచుకున్న సంపద కార్పొరేట్ బహుళజాతి సంస్థలకు మాత్రమే చెందుతుంది.

భూములు కోల్పోయేది అగ్రకులాల వాళ్లయితే జీవనం కోల్పోయేది మాత్రం అన్ని వర్గాలకు చెందిన పేదలు. వ్యవసాయ పనులు తప్ప మరోపని తెలియని వీళ్లు ఎలా బతకాలి? భూములు కోల్పోయిన వాళ్లకు ఇళ్ల స్థలాలు, వాణిజ్య స్థలాలు కేటాయిస్తారు. కాబట్టి వాళ్లకు ఎంతో కొంత ఆర్థిక పరమైన ఆసరా ఉంటుంది. కౌలు దారులు, పేదల పరిస్థితి ఏ రోజు పనులు ఆరోజు వెతుక్కునే అడ్డా కూలీల స్థితికి నెట్టబడతారు. నూతన రాజధానిలో జీవన వ్యయం అనేక రెట్లు పెరుగుతుంది. దాని మూలంగా వాళ్ల జీవన ప్రమాణాలు ఇప్పుడున్న వాటికంటే దారుణంగా పడిపోతాయి. నగరీకరణ మూలంగా సామాజిక జీవనం కోల్పోయి తీవ్రమై అభద్రతా, అశాంతికి గురవుతారు. వారి జీవితాలు ధ్వంసం అవుతాయి. ఒక నిర్మాణం కోసం సామూహిక జీవన సూత్రం ధ్వంసం కావడం వ్యవస్థీకృత విషాదం. ఇది రాజ్యాంగ విలువలకు విరుద్ధం. పంట భూములను వ్యవసాయేతర అవసరాలకు మళ్లించడం 2013 భూసేకరణ చట్టానికి విరుద్ధం. అసలు ల్యాండ్ పూలింగ్ విధానమే రాజ్యాంగంలోని 300–ఎ–అధికరణకు విరుద్ధం. ఆహార భద్రతకు పెను ప్రమాదం. స్వాతంత్ర్యానంతరం దేశంలో నిర్మించిన ఛండీగడ్ 12000 ఎకరాల విస్తీర్ణంలో కోర్ క్యాపిటల్‌ను 750 ఎకరాలలోనే నిర్మించారు. అలాగే గాంధీనగర్, భువనేశ్వర్‌లు ఇప్పటికి ఇంకా అభివృద్ధి చెందే దిశలోనే ఉన్నాయి. చంద్రబాబు చెపుతున్న విధంగా రాజధాని నిర్మించాలంటే లక్ష కోట్ల రూపాయలకు పైగా నిధులు కావాల్సి ఉంటుంది. చంద్రబాబు తలకిందులుగా తపస్సు చేసినా లక్షల కోట్ల రూపాయలు సమీకరించబడవు. ఈ పగటి కలలు కల్లలు కాక మానవు.

రాయలసీమ, ఉత్తరాంధ్ర లాంటి వెనుకబడ్డ ప్రాంతాల అభివృద్ధికి ఇవ్వాల్సినంత ప్రాధాన్యత ఇవ్వకుండా ఇప్పటికే అభివృద్ధి చెందిన కృష్ణా, గుంటూరు జిల్లాలలో రాజధాని ప్రాంతం కేంద్రీకృతమైతే, దీని మూలంగా ప్రాంతీయ అసమానతలు మరింత పెరుగుతాయి. అలా కాకుండా అన్ని ప్రాంతాలకు ప్రయోజనం కలిగే విధంగా అక్కడి వనరుల ఆధారంగా పాలక కేంద్రాలు, పరిశ్రమలు వికేంద్రీకరణ జరగాలి. శాసనసభ, సెక్రటేరియట్, రాజ్‌భవన్, హైకోర్టు, విద్య, వైద్యం, రక్షణ, పరిశోధన పరిపాలన సంబంధించిన కార్యాలయాలు ఉత్తరాంధ్ర, రాయలసీమ, కోస్తాంధ్రలలోని మూడు ప్రాంతాలలో నిర్మించి అభివృద్ధి చేస్తే ఈ మూడు ప్రాంతాలు సమపాళ్లలో అభివృద్ధి చెందుతాయి. ఆర్థిక అసమానతలకు తావు ఉండదు. ఈ దిశగా రాజధాని నిర్మాణం జరగాలి. ఇందుకు ఆంధ్ర ప్రాంత పౌర సమాజం మేధావులు, కవులు, కళాకారులు ముందుండి ప్రజలకు వాస్తవాలు చెప్పాలి. ఇకనైనా ఉదాసీనతను, మౌనాన్ని విడిచి రాజధాని పేరుతో జరగబోయే విధ్వంసాన్ని అడ్డుకోవాలి. సుందర నవ్యాంధ్ర నిర్మాణానికి పూనుకోవాలి. ఇది మట్టిదేశం ఇక్కడ మట్టి బతికితే చాలు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాలు - రవిచందన్**
- **రాజ్యాంగ విలువలు - హక్కులు - సంక్షేమం - షేక్ కరిముల్లా**
- **ప్రాథమిక హక్కుల్లో విద్య మిథ్యేనా? - దుర్గం సారయ్య**
- **రైతుల ఆత్మహత్యలు - వందనా శివ**

*(ప్రచార సాధనాల మీద టంకశాల అశోక్ ప్రతి నెలా రాస్తున్న కాలమ్ స్థలాభావం వల్ల ఈ సంచికలో వేయలేక పోయినందుకు చింతిస్తున్నాం. – సం.)*

# వ్యవసాయాన్ని సంక్షోభంలోకి నెట్టే ఆర్డినెన్స్‌లు

***అభివృద్ధి పేరుతో పంట భూములను కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడానికి తెస్తున్న భూ ఆర్డినెన్స్‌లను అడ్డుకొని, ఆహార భద్రతను కాపాడాల్సిన బాధ్యత ప్రజాస్వామిక వాదులపై ఉందని అంటున్నారు ముప్పాళ్ల భార్గవ శ్రీ***

కేంద్ర, రాష్ట్ర పాలకులు అనుసరిస్తున్న సరళీకరణ ప్రైవేటీకరణ ప్రపంచీకరణ విధానాల ఫలితంగా ఇతర ముఖ్యమైన రంగాలతో పాటు వ్యవసాయరంగం నానాటికీ సంక్షోభంలో కూరుకుపోతూ ఉంది. ఇటీవలనే కేంద్రంలో అధికారంలోకి వచ్చిన మోడీ ప్రభుత్వం ఆఖరికి ఎల్‌ఐసి రంగంలోకి కూడా విదేశీ పెట్టుబడులకు ఎర్రతివాచీ పరిచి తదుపరి కార్యక్రమంగా వ్యవసాయాన్ని దెబ్బతీసే విధంగా భూసేకరణ బిల్లు 2013కు కీలకమైన సవరణలు తెస్తూ ఏకంగా ఆర్డినెన్స్‌నే మోడీ ప్రభుత్వం తెచ్చింది. ఈ విధంగా పాలకులు అభివృద్ధి పేరుతో చేస్తున్న భూసేకరణ చట్టాలు రైతుల పాలిట ఉరి తాళ్లుగా మారుతున్నాయి. ఈ పరిణామం వ్యవసాయరంగ సంక్షోభానికి దారి తీస్తుంది.

మోడీ ప్రభుత్వం చేసిన సవరణలను ఇటీవల జరిగిన లోక్‌సభ సమావేశాల్లో ప్రతిపక్షాలు అంగీకరించకపోవడంతో చట్టానికి చిరు సవరణలు చేసి మోడీ ప్రభుత్వం తిరిగి ఆర్డినెన్స్ చేసి తీవ్ర ప్రజాస్వామ్య ఉల్లంఘనకు పాల్పడింది. మోడీ ప్రభుత్వం భూసేకరణ చట్టం 2013కు స్వదేశీ, విదేశీ బడా పారిశ్రామిక వేత్తలకు ప్రయోజనం చేకూర్చే కీలకమైన సవరణలు చేసి లోక్‌సభలో ఆమోదించినప్పటికీ రాజ్యసభలో మెజారిటీలేని కారణంగా ఆమోదింప చేసుకోలేని స్థితిలో 2014 డిసెంబర్ 29న మొదటిసారి ఆర్డినెన్స్‌ను జారీచేసింది. బడ్జెట్ తొలిదశ సమావేశాలు ముగిసిన తరువాత రెండవ సారి ఆర్డినెన్స్‌ను జారీచేసింది. మలిదశ పార్లమెంట్ సమావేశాలలోను బిల్లుకు ఆమోదం లభించక పోవడంతో 30 మంది సభ్యులతో సంయుక్త పార్లమెంటరీ కమిటీని ఏర్పాటు చేయక తప్పలేదు. ఈ కమిటీకి అధ్యక్షుడిగా బిజెపి ముఖ్య నాయకుడిగా ఉన్న ఎస్‌ఎస్ అహ్లువాలియాను నియమించి, కమిటీ సభ్యులుగా కాంగ్రెస్, బిజెడి, టిఎంసి, వామపక్ష పార్టీల నాయకులను ప్రకటించింది.

అయితే రెండోసారి మార్చ్‌లో తీసుకువచ్చిన ఆర్డినెన్స్‌కు జూన్ 4 నాటికి గడువు ముగియనుండడంతో, అంటే ఆర్డినెన్స్ కాలపరిమితి ఆరు నెలలు ఉన్నా పార్లమెంట్ ప్రారంభ సమావేశంలోనే ఆరు వారాలలోపు ఆమోదించాలి. కాబట్టి మే 30న సమావేశమైన కేంద్రమంత్రి వర్గం చేసిన సిఫార్స్‌కు రాష్ట్రపతి ఆమోద ముద్రవేసి మూడవసారి ఆర్డినెన్స్‌ను జారీ చేసింది. భూసేకరణ 2015 బిల్లు పరిశీలన కోసం జాయింట్ పార్లమెంటరీ కమిటీ చేతిలో ఉండగా ఆర్డినెన్స్‌ను చేయాల్సిన అవసరం ఏముందని, ఈ చర్య తామే నియమించిన పార్లమెంటరీ కమిటీని అవమాన పరచడమేనని స్వయంగా కమిటీ సభ్యులే కేంద్ర ప్రభుత్వ చర్యను విమర్శిస్తూ ఉండగా, దేశవ్యాప్తంగా వామపక్ష పార్టీలు, రైతుసంఘాలు పార్లమెంటరీ కమిటీ విచారణ పూర్తి అయ్యే వరకు ఆర్డినెన్స్ అమలులో ఉండకూడదని డిమాండ్ చేస్తున్నాయి. మూడవసారి ఆర్డినెన్స్ జారీ చేయకపోతే 'అభివృద్ధి' కుంటుపడిపో తుందని, భూమి సేకరించకపోతే కేంద్ర, రాష్ట్రాల పరిధిలో పెండింగ్‌లో ఉన్న అనేక ప్రాజెక్టులు ఆగిపోతాయని మోడీ ప్రభుత్వం బాహాటంగా సమర్థించుకొనే స్థితికి వెళ్లింది. ఆఖరికి కేంద్రమంత్రి నితిన్‌గడ్కరీ కేంద్ర ప్రభుత్వం మూడవసారి జారీచేసిన ఆర్డినెన్స్‌ను సమర్థించు కోవడానికి 'భూసేకరణ చట్టం రైతుల పాలిట అదృశ్యవరం' అని వ్యాఖ్యానించి రైతులను మరింతగా వంచించడానికి పూనుకున్నారు. ఆ విధంగా మోడీ ప్రభుత్వం ఆర్డినెన్స్‌లపై ఆధారపడుతూ ప్రజాస్వామ్య విలువలను అపహాస్యం చేసే స్థితికి దిగజారింది.

మోడీ ప్రభుత్వం చేసిన ఆర్డినెన్స్‌ను అవకాశంగా తీసుకొని చంద్రబాబు ప్రభుత్వం నూతన రాజధాని నిర్మాణం కోసం భూసమీకరణ కింద భూములు ఇవ్వడానికి నిరాకరించిన రైతుల నుండి ఆర్డినెన్స్ రూపంలో ఉన్న 'భూసేకరణ చట్టం -2015'ను ప్రయోగించి భూములను గుంజుకోవడానికి తాజాగా 166 జిఒ పేరుతో భూసేకరణ నోటిఫికేషన్లను విడుదల చేసి రైతుల్లో తీవ్ర భయాందోళనలను కల్పించింది. కేంద్రం చేసిన ఆర్డినెన్స్‌ను రాష్ట్రాలు తమకు అనుకూలంగా సవరణలు చేసి అమలు చేసుకునే అధికారాన్ని రాష్ట్రాలు ఏ విధంగా దుర్వినియోగం చేస్తాయనడానికి చంద్రబాబు ప్రభుత్వం విడుదల చేసిన 166 జిఒ తాజా సాక్ష్యంగా నిలుస్తుంది. అలానే పోలవరం కుడి కాలువ నిర్మాణంకోసం 2015 నూతన భూసేకరణ చట్టం ప్రకారం భూసేకరణకు మే 25న రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన ప్రాథమిక ప్రకటనను సవాలు చేస్తూ జూన్ 17న కృష్ణా జిల్లా గ్రామాలకు చెందిన 17 మంది రైతులు హైకోర్టులో వ్యాజ్యాన్ని దాఖలు చేశారు. రైతుల అంగీకారంతోనే భూములు తీసుకుంటామన్న ప్రభుత్వం ఇప్పుడు భూసేకరణ నోటిఫికేషన్‌లు ఇవ్వడం ద్వారా తన రైతాంగ వ్యతిరేక వైఖరిని బట్ట బయలు చేసుకుంది.

బ్రిటిష్ వలస పాలకులు 1894లో చేసిన భూసేకరణ చట్టం ఆధారంగా ప్రజా ప్రయోజనం అన్న సాకుతో రైతాంగాన్ని భూముల నుండి తరిమి వేసే విధంగా, 'స్వాతంత్ర్యం' ప్రకటించుకొన్న తర్వాత భారత పాలకులు నేటికి 68 ఏళ్ల పాటు అదే భూసంస్కరణల చట్టాన్ని అమలు జరిపారు. అంటే తెల్లదొరలు వైదొలగి వెళ్లినా, నల్ల దొరలు ఆ చట్టాన్నే ప్రభు భక్తితో అమలు జరిపి రైతాంగ వ్యతిరేక విధానాలను అమలు జరిపారు. 1980ల వరకు ప్రజలకు పునరావాసం సంగతలా

ఉంచి బాధిత ప్రజలకు నష్ట పరిహారం కూడా చెల్లించకుండా భూములను గుంజుకొన్నారు. 1894 భూసేకరణ చట్టాన్ని 1984లో మొదటిసారి సవరించారు. ఈసవరణ వలన నష్టపోయే రైతులకు ఫిర్యాదు చేసుకొనేందుకు తగిన సమయం ఇవ్వడానికే ఈ సవరణ పరిమితమైంది. కాని తగిన నష్టపరిహారం చెల్లింపు, నిర్వాసితులందరికి పునరావాసకల్పన ఇందులో చేర్చలేదు.

ప్రజా ప్రయోజనం పేరుతో భూముల నుండి నష్టపరిహారం ఇవ్వకుండానే బలవంతపు తొలగింపుకు వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా రైతులు వివిధ రూపాలలో పోరాటాలు సాగిస్తూనే ఉన్నారు. ఒడిషాలోని సముద్ర తీరప్రాంతమైన బలియాపాల్‌లోని సారవంత భూములను క్షిపణి కేంద్ర ఏర్పాటుకు ప్రభుత్వం సేకరించబూనుకొంటే బలియాపాల్ ప్రాంత ప్రజలు మూడు ఏళ్ల పాటు ప్రతిరోధ్ కమిటీ నాయకత్వాన సామూహికంగా ప్రతిఘటించిన ఫలితంగా క్షిపణి కేంద్రాన్ని శ్రీహరి కోటకు ప్రభుత్వం తరలించక తప్పలేదు. అలాగే మన రాష్ట్రంలో తెలుగుగంగ ప్రాజెక్టు కొరకు భూసేకరణకు పూనుకొన్నప్పుడు వెలుగోడు గ్రామ రైతాంగం రైతుకూలీ సంఘం సీనియర్ నాయకుడు అమరుడు మండ్ల సుబ్బారెడ్డి నాయకత్వాన రైతాంగానికి నష్టపరిహారం చెల్లించిన తర్వాతనే భూములను స్వాధీనం చేసుకోవాలని రాజీలేని పోరాటం సాగించారు. భారతదేశ చరిత్రలో మొదటిసారిగా నష్టపరిహారం చెల్లించిన తర్వాత మాత్రమే ప్రభుత్వం భూములను స్వాధీనం చేసుకొన్న ఘటనగా పేర్కొంది.

2005లో యుపిఎ ప్రభుత్వం ప్రత్యేక ఆర్థిక మండళ్ల చట్టాన్ని పార్లమెంట్ సాక్షిగా చేసిన తర్వాత బలవంతపు భూసేకరణలకు ముఖ్యంగా పంట భూముల సేకరణకు వ్యతిరేకంగా ప్రజల్లో చైతన్యం పెరగడంతో పాటు పోరాటాలు చేసే స్థితి కూడా పెరిగింది. వివిధ రకాల సెజ్‌లకు, రోడ్డు, విమానాశ్రయాలు, ఓడరేవులు, అణు, థర్మల్ విద్యుత్ కేంద్రాల నిర్మాణం కోసం లక్షలాది ఎకరాల భూములను గుంజుకోవడానికి వ్యతిరేకంగా పోరాటాలు నానాటికీ పెరుగుతూ వచ్చాయి. ప్రజలు తీసుకొన్న భూములకు నష్టపరిహారాన్నే కాకుండా నిర్వాసిత ప్రజలందరికి పునరావాస కల్పన చేయాలన్న డిమాండ్‌ను ముందుకు తెచ్చారు. కొన్ని ప్రాజెక్టుల అవసరాన్ని ప్రశ్నించి ఆయా ప్రాజెక్టులను ఆపివేయాలని డిమాండ్ పెరిగింది. ప్రాజెక్టువలన లాభనష్టాలను ప్రజలకు పూర్తిగా తెలియజేసిన తర్వాతనే దాని నిర్మాణానికి ముందస్తు అనుమతి పొందాలని డిమాండ్ చేశారు. బహుళ పంటలు పండే సారవంతమైన భూములను ప్రజాప్రయోజనాల పేరుతో వివిధరకాల ప్రాజెక్టులకు తీసుకోరాదని సెజ్ చట్టంలో ఉన్నా, దీనిపై సుప్రీంకోర్టు తీర్పులున్నా వాటిని అతిక్రమించి తీసుకోరాదని వివిధ ప్రాంతాల్లో ప్రజలు ఆందోళనలు చేస్తున్నారు. అలానే ప్రైవేట్ కంపెనీల నిర్మాణం కోసం భూములను సేకరించడం అంటే రైతులను బికారులుగా చేసి బడా పరిశ్రమాధిపతులకు కొంగుకాయడం సరికాదన్న ఆందోళనలు ఊపందుకుంటున్నాయి. నర్మదా బచావో అందోళన, అణు విద్యుత్ ప్రాజెక్టుల స్థాపనకు వ్యతిరేకంగా కూడంకుళం, జైతాపూర్ అందోళనలు, ఆంధ్రప్రదేశ్‌లో అణు, థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా వివిధ రూపాల్లో ఆందోళనలు జరుగుతున్నాయి.

దేశ వ్యాప్తంగా ప్రజలు సాగిస్తున్న పోరాటాలకు మద్దతుగా వివిధ రాజకీయ పక్షాలు, రైతు సంఘాలు, పౌరహక్కుల సంఘాలు, పర్యావరణ వేత్తలు సాగిస్తున్న ఆందోళనల ఫలితంగా భూసేకరణ చట్టం 1984 స్థానంలో యుపిఎ ప్రభుత్వం కొన్ని ప్రజానుకూల అంశాలతో 2013 చట్టాన్ని తీసుకురాక తప్పలేదు. వాటిలో ముఖ్యమైనది ప్రైవేట్ ప్రాజెక్టుల కోసం భూమిని సేకరించడానికి 80 శాతం మంది, ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్య ప్రాజెక్టులకు 70 శాతం మంది రైతుల అంగీకారం అవసరమని స్పష్టంగా పాతచట్టంలో ఉంది. భూ సేకరణవల్ల బాధితులైన వారందరికీ నష్ట పరిహారాన్ని, పునరావాస కల్పనల అవసరాన్ని 2013 చట్టంలో గుర్తించక తప్పలేదు. ఈ చట్టం ప్రకారం భూమిని కోల్పోయే యజమానులకు, ప్రభావితమయ్యే కుటుంబాలకు కూడా హేతుబద్ధమైన, న్యాయబద్ధమైన నష్టపరిహారం చెల్లించాలనే పేరుతో చివరికి చట్టం పేరును 'భూసేకరణ, పునరావాస, పునరుపాధి కల్పనలో పారదర్శకతతో, హేతుబద్ధమైన నష్టపరిహారం పొందే హక్కు చట్టం'గా పేరును కూడా పెట్టారు. సెక్షన్ 31 కింద బాధితులకు వచ్చే మొత్తాన్ని సెక్షన్ 23 కింద కలెక్టర్ అవార్డ్ ప్రకటించిన మూడు నెలల్లోపు నష్ట పరిహారాన్ని చెల్లించిన తరువాతనే భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి కాని ఆచరణలో చట్టంలోని నిబంధనలకు నిలువెత్తు పాతర వేసి భూములు కోల్పోయిన రైతు కుటుంబాలను వీధుల పాలు చేస్తున్నారు. అలానే బాధితులను గుర్తించడానికి సామాజిక ప్రభావ అంచనా వేయడానికి కూడా చట్టంలో చేర్చింది.

ఇలాంటి ముఖ్యమైన మార్పులతో ప్రతిపాదించిన 2013 బిల్లును చర్చల పేరిట ఐదేళ్లు సాగ దీసి ఎన్నికలకు ముందు 2013లో యుపిఎ ప్రభుత్వం పార్లమెంట్ ఆమోద ముద్ర వేయించుకుంది. ఆ తర్వాత ఏడాదికాలం పాటు ఈ చట్టం అమలు కాకుండానే బడా బూర్జువా వర్గాల అనుకూల శక్తులు చట్టాన్ని సవరించకపోతే అభివృద్ధి ఆగిపోతుందని నానాయాగి చేస్తున్నారు.

భూసేకరణ చట్టం 2013 ప్రకారం రైతు నుంచి తీసుకొన్న భూమికి చెల్లించే పరిహారం నిర్ణయించడంలో 'మార్కెట్ ధర' అన్నది ఆచరణలో రైతుని అన్నివిధాల మోసగించే మాయాజాలంగా మారింది. ఈచట్టంలోని క్లాజ్ ప్రకారం మార్కెట్ ధరను నిర్ణయించే అధికారాన్ని జిల్లా కలెక్టర్‌కు కట్టబెట్టింది. దాని ప్రకారం సేకరించిన భూమి ఉన్న గ్రామంలోని భూములకు రిజిస్టర్ ఆఫీస్‌లో నమోదైన సగటు ధరతో పాటు పొరుగు గ్రామాల్లో భూములకు రిజిస్టర్ ఆఫీస్‌లో నమోదైన సగటు ధరను పరిగణనలోకి తీసుకొని మార్కెట్ ధరను నిర్ణయిస్తారు. అంటే చివరికి రిజిస్టర్ ఆఫీసులో నమోదైన ధరకు రెట్టింపు ధరను మాత్రమే చెల్లిస్తారు. దీనికి తోడు భూసేకరణ వలన జరిగిన నష్టానికి ఇచ్చే కారుణ్య పరిహారం (సొలేషియం) ను గతంలో భూమి విలువలో 30 శాతం ఉంటే 2013 చట్టం వంద శాతం పెంచింది. దీనిని కలుపుకున్నా రిజిస్టర్ ధర కంటే మూడు రెట్లు మాత్రమే బాధితులకు అందుతుంది. అంటే రిజిస్టర్ ధర ఎకరం రు.10 లక్షలు ఉంటే చట్ట ప్రకారం రు.30 లక్షలు మాత్రమే చెల్లిస్తారు. ఆ భూమికి అసలు మార్కెట్ రేట్ రు. కోటి ఉంటే రు. 70 లక్షలు రైతు నష్టపోతాడు. కావున మార్కెట్ ధర మాయాజాలం వలన బాధితులు తీవ్రంగా నష్టపోయి రోడ్డు పాలవుతారు.

ఈ మార్కెట్ రేట్ మాయజాలాన్ని చంద్రబాబు ప్రభుత్వం బూచీగా చూపెట్టి భూ సమీకరణ పథకం వల్ల రైతాంగం కోటీశ్వరులవుతారని ఆశపెట్టి నూతన రాజధాని నిర్మాణానికి మొదటి దశగా రూపాయి ఖర్చు పెట్టకుండా 33 వేల ఎకరాలను సేకరించింది.

ఇప్పుడు కొత్తగా అధికారంలోకి వచ్చిన మోడీ ప్రభుత్వం అభివృద్ధి ఆగిపోతుందనే వాదనను భుజాన వేసుకొని భూసేకరణ చట్టం 2015ను ఆర్డినెన్స్ రూపంలో తీసుకొచ్చింది. వాస్తవంగా ఏదైనా చట్టానికి మార్పులు చేసేటప్పుడు ఈచట్టం అమలు కాలంలో ఎదురైన ఇబ్బందులను తొలగించేందుకు సవరణలు ప్రతిపాదిస్తారు. అసలు చట్టాన్ని అమలు చేయకుండానే సవరణల గురించి ప్రతిపాదించడం వెనకాల మోడీ ప్రభుత్వానికి గల ప్రపంచీకరణ విధానాలపై మోజు స్పష్టంగా బయట పడింది. 2015 ఆర్డినెన్స్‌తో మోడీ ప్రభుత్వం దేశ పారిశ్రామిక అభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయనే మిషతో పాత చట్టంలో ఉన్న ప్రజల నుండి ముందస్తు సమ్మతి, సామాజిక ప్రభావ అంచనాలైన ముఖ్యాంశాల తొలగింపుకు తెగబడింది. అంటే అభివృద్ధి పేరుతో రైతుల నుండి భూములను నిర్బంధంగా తీసుకొనే విధంగా 2015 చట్టానికి పదునుపెట్టి ఆచరణలో రైతుల నెత్తిన శఠగోపం పెట్టే వినాశకర విధానానికి పాల్పడింది. పాతచట్టం ప్రకారం రైతుల నుంచి సేకరించిన భూమిని ఐదేళ్ల లోపల ఉపయోగించకుండా ఉంటే ఆ భూమిని తిరిగి రైతులకు చెందే వీలును కల్పించింది. ఇప్పుడు కొత్త చట్టంలో చేసిన సవరణల ప్రకారం ఐదేళ్లు కానీ లేక మొదట్లో ఎన్ని సంవత్సరాలు అవసరం అని రాసుకొన్నామో అన్ని సంవత్సరాలు, రెండిట్లో ఏది ఎక్కువ అయితే అన్ని ఏళ్ల తర్వాతనే రైతులకు తిరిగి ఇచ్చే విధానాన్ని మార్చడం స్వదేశీ, విదేశీ బడా పారిశ్రామిక వర్గాల ప్రయోజనాలను కాపాడడానికేనని వేరే చెప్పనక్కరలేదు.

మోడీ ప్రభుత్వం చేసిన కొత్త చట్టంలో కీలకమైన మార్పుల్లో భూ సేకరణ చట్టం నుండి రక్షణ రంగం, గ్రామీణ మౌలిక సదుపాయాలు, పారిశ్రామిక కారిడార్ల లాంటి ప్రాజెక్టులను మినహాయించడం అంటే దాదాపు అన్ని ప్రాజెక్టులకు రైతుల ముందస్తు అనుమతి నుండి మినహాయింపును కోరడమేనని వేరే వివరించనవసరం లేదు. వివిధ రంగాల సెజ్‌లు, విమానాశ్రయాలు, రోడ్లు, ఓడరేవులు, పర్యాటక కేంద్రాలు తదితర ప్రాజెక్టులను సామాజిక ప్రభావ అంచనా నుండి మినహాయించడం ద్వారా ఆయా ప్రాజెక్టుల ప్రాంతాల్లో మెజారిటీగా ఉండే వ్యవసాయ కూలీలు, కౌలు రైతులు, కమ్మరి, కుమ్మరి, గీత, నేత తదితర గ్రామీణ వృత్తుల వారితో పాటు చిరు వ్యాపారుల సాంఘిక జీవనాన్ని విధ్వంసం చేయడానికి మోడీ ప్రభుత్వం పూనుకోవడం అమానుషం. వీరందరినీ దిక్కులేని వారిగా, ఉపాధి లేని వారిగా దిగజార్చి దుర్భర జీవన పరిస్థితుల్లో నికృష్ట జీవనాలు గడిపేందుకు నగరాలకు తరిమి వేయబడడం దారుణం.

నష్టపరిహారం విషయానికి వస్తే, 2013 చట్టంలోని నష్టపరిహార క్లాజుకు ఆర్డినెన్స్ ప్రత్యక్షంగా ఎలాంటి సవరణ చేయకపోయినా పరోక్షంగా ముందస్తు సమ్మతి క్లాజును తొలగించడం ద్వారా రైతులకు ప్రభుత్వంతో భూమి ధర విషయంలో బేరసారమాడగల శక్తిని బాగా తగ్గించి వేసింది. గన్నవరం విమానాశ్రయాన్ని విస్తరించే దానిలో భాగంగా భూముల సేకరణకు ప్రభుత్వం పూనుకొంటే ఆప్రాంతంలో ఉన్న రిజిష్టర్ ధర కంటే దాదాపు మార్కెట్ ధరను రైతులు సమిష్టి ఆందోళన ద్వారా రాబట్టుకోగల స్థితిలో ఉండడం ఇందుకు ఒక ఉదాహరణగా నిలుస్తుంది. కొత్త ఆర్డినెన్స్ ప్రకారం వాస్తవ నష్టపరిహార మొత్తాన్ని నిర్ణయించే అధికారాన్ని రాష్ట్రాలకు వదిలిపెట్టింది. 2013 చట్టం చేసి ఏడాదైనా నియమ నిబంధనలను రూపొందించని రాష్ట్రాలు కొత్త ఆర్డినెన్స్‌కు అనుగుణంగా నియమ నిబంధనలను రూపొందించడం ప్రారంభించాయి. 2013 చట్టం పేర్కొన్న నష్టపరిహారాన్ని సగానికి పైగా తగ్గిస్తూ హర్యానా ప్రభుత్వం చట్టం అమలుకు చర్యలు ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు ప్రభుత్వం ఇంకొక అడుగు ముందుకు వెళ్లి నూతన రాజధానికి భూసమీకరణ విధానం ప్రకారం భూములు ఇవ్వని రైతాంగం నుండి 2015 భూసేకరణ చట్టం ద్వారా సేకరిస్తానని భూసేకరణకు నోటిఫికేషన్ ఇచ్చే వరకు వెళ్లింది.

మోడీ ప్రభుత్వం పాత చట్టానికి మౌలిక మార్పులు చేసి ఆర్డినెన్స్‌లను తేవడంపై పార్లమెంట్ లోపల బయట కాంగ్రెస్‌తో సహా ప్రతిపక్ష పార్టీలు మోడీ ప్రభుత్వంపై విమర్శలు సాగించడానికి ఇదే అదనుగా భావించి ఆందోళనలు సాగిస్తున్నాయి. వామపక్ష, విప్లవ పార్టీలు, రైతుకూలీ సంఘాలు ఆర్డినెన్స్ రద్దు కోసం వివిధ రూపాలలో ఆందోళనలను తీవ్రతరం చేశాయి. మోడీ ప్రభుత్వం నియమించిన పార్లమెంటరీ కమిటీలోని ప్రతిపక్ష, వామపక్ష సభ్యులే స్వయంగా తీవ్ర అభ్యంతరాలు లేవనెత్తుతున్నారు. ఈ స్థితిలో రైతుల ముందస్తూ అనుమతిని 80,70 శాతం నుండి 51 శాతానికి తగ్గించేటట్లుగా, సామాజిక ప్రభావ అంచనా నిబంధనలను ఒక మేరకు సవరించడానికి, రైతుల నుండి సేకరించిన భూమిని ఐదేళ్ల వరకు వినియోగించుకోకపోతే దాన్ని తిరిగి ఇచ్చి వేయాలనే నిబంధనను సైతం మోడీ ప్రభుత్వం సవరించడానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రచారం జరుగుతున్నది.

కేంద్ర ప్రభుత్వం చట్టం చేసినా ఆ చట్టం మార్గదర్శకాలను రూపొందించుకొనేది రాష్ట్ర ప్రభుత్వాలేనని, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో భూసేకరణ సమస్యతో రు. 62 వేల కోట్ల ఖర్చుతో చేపట్టిన ప్రాజెక్టులు నిలిచిపోతాయని, రైతుల అభివృద్ధి కోసమే చట్టం తెస్తున్నామని, అంబాని, ఆధానిలకు భూసేకరణ ఈ చట్టం ద్వారా జరగదని కేంద్రమంత్రి నితిన్ గడ్కరీ జూన్ ఒకటిన హైదరాబాద్ వచ్చిన సందర్భంగా ప్రకటించడం అంటే దెయ్యాలు వేదాలు వల్లించడం అక్షరాల నిజమని తేలుతుంది. రైతుల ముందస్తు సమ్మతిలాంటి అంశాలపై కొంత వెనక్కి తగ్గినట్లు తగ్గి మిగతా ముఖ్యమైన అంశాలపై తిమ్మిని బమ్మిని చేసి కొత్త భూసేకరణ బిల్లును ఆమోదింపచేసుకొనే ప్రయత్నంలోనే మోడీ ప్రభుత్వం ఉంది.

అభివృద్ధి ముసుగులో దేశ ఆహార భద్రతను పణంగా పెట్టి అయినా రైతాంగం నుండి భూములను భూసేకరణ చట్టం పేరుతో 2007-11 సంవత్సరాలలో 20 లక్షల ఎకరాల వ్యవసాయ భూములను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు కబ్జా చేశాయి. స్వదేశీ విదేశీ బడా పెట్టుబడిదారులకు కట్టబెట్టడానికి మోడీ ప్రభుత్వం 2015 భూసేకరణ చట్టం మాటున పథకాలు రూపొందిస్తున్నది. రైతులను దివాళా తీయించే, వ్యవసాయ రంగాన్ని సంక్షోభంలోకి నెట్టే, అంతిమంగా దేశ ఆహార భద్రతకు ముప్పు కలిగించే కొత్త భూసేకరణ చట్టాన్ని తిప్పి కొట్టేందుకు యావత్ ప్రజానీకం

# ఎర్రచందనం అక్రమ రవాణా - పెద్దల పాత్ర

***సామాన్య కూలీలను హతమార్చిన ప్రభుత్వ యంత్రాంగం అసలు దొంగలను కాపాడుతోందనీ, ఎర్రచందనం అక్రమ రవాణా వెనుక రాజకీయ నాయకుల, ప్రభుత్వ అధికారుల పాత్ర చాలా ఉందనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**2015** ఏప్రిల్ 7న జరిగిన శేషాచలం ఎన్‌కౌంటర్‌లో 20 మంది తమిళ కూలీల మరణం తర్వాత ఎర్రచందన అక్రమ రవాణా గురించి ప్రపంచ వ్యాప్తంగా చర్చ ప్రారంభమైంది. ఎర్రచందనానికి అంతర్జాతీయ మార్కెట్‌లో ఉన్న విలువ దృష్ట్యా, తమిళ కూలీలు, వారిని తరలిస్తున్న వ్యాపార దళారీలూ, రాజకీయ అండ, అధికార యంత్రాంగ బలం అన్నీ కలగలిసి జరుగుతున్న ఒక పెద్ద వ్యాపార సామ్రాజ్య. ఇందులో ముఖ్యంగా మనం చూడవలసినది ఏమిటంటే, ఇంతపెద్ద వ్యాపార సామ్రాజ్యంలో తమిళ కూలీలు లేదా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన కూలీలు మాత్రమే ఎందుకు బలి అవుతున్నారు? ఇన్నాళ్లూ జరిగిన వ్యాపారంలో, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలను ఏలిన (ఏలుతున్న) పాలకులు లేదా వారికి సహకరిస్తున్న పార్టీల నాయకుల ప్రమేయం ఏమీలేకుండానే, ఇంత వ్యాపార విస్తరణ జరిగి ఉంటుందా?

ఇందులో పోలీసు అధికారుల లేదా ఫారెస్టు అధికారుల లేదా ఐఎఎస్, ఐపిఎస్ అధికారుల ప్రమేయం ఏమీ లేకుండానే ఈ ఎర్రచందనం సామ్రాజ్య విస్తరణ జరిగి ఉంటుందా అనే అన్ని కోణాల నుంచి ఈ సమస్యను లోతుగా అధ్యయనం చేయవలసి ఉంది. ఎందుకంటే భవిష్యత్తులో మరెంత మందిని కూలీల పేరు మీద ఈ పాలకులు ఎన్‌కౌంటర్ పేరు మీద చంపుతారో అనుమానించవలసి వస్తున్నది. కావున ఎర్రచందనం అక్రమ రవాణాలో ఉన్న ప్రభుత్వ (పాలక వర్గాల) పెద్దల హస్తాన్ని అధ్యయనం చేస్తే మరికొన్ని వాస్తవాలను గ్రహించవచ్చు.

దేశంలో మరెక్కడాలేని విధంగా, చిత్తూరు, కడప – నెల్లూరు జిల్లాల సరిహద్దులలోనూ, ముఖ్యంగా, తిరుమల – తిరుపతి దేవస్థానం (టిటిడి) పరిధిలోని శేషాచలం దట్టమైన అడవులలో ఎర్రచందనం చెట్లు ఎక్కువగా ఉన్నాయనేది, జగమెరిగిన సత్యం. ఈ ఎర్రచందనం కలపకు ప్రపంచ మార్కెట్‌లో వివిధ రకాలైన ఔషధాలు తయారు చేయడానికి, చైనా, జపాన్, మలేషియా, సింగపూర్ లాంటి దేశాలలో దీనికి ఎక్కువ డిమాండ్ ఉన్నదనేది ప్రభుత్వమే చెపుతున్న మాట. చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి అయిన తర్వాత ప్రభుత్వ వేలం ద్వారా ఎర్రచందనం దుంగలను విక్రయించడం వలన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి 900 కోట్ల రూపాయలు ఆదాయం వచ్చినట్లు రాష్ట్ర అటవీ శాఖా మంత్రి బొజ్జల గోపాలకృష్ణారెడ్డి స్వయంగా ప్రకటించారు.

గత ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి సోదరులు, నల్లారి కిశోర్‌కుమార్‌రెడ్డి (చిత్తూరు జిల్లా యూత్‌కాంగ్రెస్ అధ్యక్షుడు) బహిరంగంగానే ఎర్రచందనం అక్రమ రవాణా సాగిస్తున్నాడనీ, చిత్తూరు నుంచి హైదరాబాద్‌లోని జూబ్లీహిల్స్ వరకూ అది యథేచ్ఛగా సాగిపోతున్నదనీ, మధ్యలో అటవీ, రవాణా అధికారుల చెక్‌పోస్టులలో ఏమాత్రమూ చెకింగ్ జరగకుండా అక్రమ రవాణా జరిగిపోతున్నదనీ, శాసనసభలోనే, లిఖితపూర్వకంంగా కంటోన్మెంట్ మాజీ శాసనసభ సభ్యులు పి. శంకరరావు ప్రకటించారు. లిఖితపూర్వకంగా స్పీకర్‌కూ, రాష్ట్ర పోలీసు ఉన్నతాధికారులకూ ఫిర్యాదు చేశారు. అయితే శంకర్‌రావు చేసిన విజ్ఞప్తి, ఫిర్యాదు అరణ్యరోదన అయింది. అయితే శేషాచలం ఎన్‌కౌంటర్ తర్వాత గతంలో జరిగిన విషయాలన్నీ మరోసారి చర్చనీయ అంశాలయ్యాయి. వాస్తవానికి అప్పటి డిజిపి దినేశ్‌రెడ్డికీ కూడా ఈ అక్రమ రవాణాతో సంబంధాలు ఉన్నాయనీ, ఆయన సహకరించడం వల్లనే ముఖ్యమంత్రి సోదరులు ఎర్రచందనం అక్రమ రవాణా సాగించగలిగారనేది మొత్తం రాష్ట్రమంతటా జరిగిన విస్తృత చర్చ. ఇది బహిరంగ రహస్యమే. చిత్తూరు జిల్లా గురించి తెలిసిన ప్రతి వ్యక్తికీ అప్పట్లోనే (2012–2013లలో) వేల కోట్ల రూపాయలు నల్లారి సోదరులు దీని నుంచి సంపాదించారనేది నిర్వివాదాంశం. శేషాచలం

---

సమరశంఖం పూరించడానికి సమాయత్తం కావాలి.

ఇదే సమయంలో దీర్ఘకాలిక దృష్టితో వ్యవసాయరంగాన్ని సంక్షోభం లోనికి నెట్టే భూసేకరణ చట్టాలను రద్దు చేయాలని, ప్రభుత్వపు ముఖ్యమైన అవసరాలకు రైతాంగంతో చర్చించి పరస్పరం అంగీకరించిన ధరలకు కొనుగోలు చేయాలని, ప్రైవేట్ పరిశ్రమల ప్రాజెక్టులకు ఎట్టి పరిస్థితుల్లోనూ భూసేకరణకు పూనుకోరాదని, ప్రతిపాదిత ప్రాజెక్టులకు పర్యావరణ, సామాజిక ప్రభావాన్ని అంచనా వేసిన తర్వాతనే అనుమతులు ఇవ్వాలని, నిజమైన సంక్షేమ పథకాలకు భూసేకరణ అవసరమైతే బాధితులకు న్యాయమైన నష్టపరిహారం, పూర్తి స్థాయిలో పునరావాసం కల్పించిన తర్వాతనే భూమిని స్వాధీనం చేసుకోవాలని, ఎట్టి పరిస్థితుల్లోను దేశంలో అపారంగా ఉన్న భూమితో సహా సహజ వనరులను స్వదేశీ, విదేశీ బహుళజాతి కంపెనీల పరం కాకుండా ప్రజా ప్రయోజనాలకు వినియోగించే విధంగా వివిధ రంగాల ప్రజలు కార్మిక, కర్షక మైత్రి పునాదిగా రాజీలేని పోరాటాలు సాగించాలని, ఇందుకు వివిధ రాజకీయ పక్షాలు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామ్య వాదులు, సామాజిక పర్యావరణ వేత్తలు పూర్తి స్థాయిలో అండదండలు అందించడం ఎంతో అవసరం.

*(రచయిత సిపిఐ (ఎంఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ఎన్‌కౌంటర్ గురించి బుకాయిస్తున్న పోలీసు ఉన్నతాధికారులు, అటవీ అధికారులు, ఈ విషయాలన్నింటినీ ఎందుకు దాస్తున్నారు. అప్పుడు చిత్తూరు జిల్లాలో పని చేసిన అటవీ, రవాణా పోలీస్ అధికారులనందరినీ, ప్రశ్నించాలి. శిక్షించాలి. వారిపై కేసులు నమోదు చేయాలి. వీరిలో ఎవరెవరు, ఎంతెంత వాటాను తీసుకున్నారో చిత్తూరు జిల్లా ప్రజలందరికీ సుపరిచితమే.

దీనిపై లోతనై దర్యాప్తు జరిపితే అసలు విషయాలు బయటికి వస్తాయి. ఆ వైపుగా దర్యాప్తు జరుపకుండా, తమిళ కూలీల పైననో, లేదా ఆంధ్రా కూలీలపైనగానో, చర్యలు తీసుకుంటే ఏం ప్రయోజనం? వాస్తవానికి, ఈ దేశంలో చట్టాలు అనేవి సామాన్యులని పైన ప్రయోగించడానికి తప్ప, నిజమైన నిందితులపైన, ప్రభుత్వంలోని పెద్దలపైన ప్రయోగించడానికి ఏమాత్రమూ కాదు. అసలు దర్యాప్తు స్వరూప స్వభావాలే అసలైన నిందితులను తప్పించడానికి అన్నట్లుగా సాగిపోతూ ఉంటుంది. ఇది మరీ దారుణం. చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలో దాదాపు 300 మంది నేరారోపణ నిందితులు వివిధ కారాగారాలలో నిర్బంధించబడి ఉన్నారు. వారికి ఇప్పటికినీ బెయిల్ లేదు. అటు నేర విచారణ పూర్తి కాలేదు. ఎటూ కాకుండా జైళ్లలో మగ్గిపోతూ ఉన్నారు. ఇది ఈ దేశ న్యాయ వ్యవస్థ, నేర శిక్షా స్మృతి అపహాస్యతకు నిదర్శనం.

తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చాక, సుమారు 65 మందిని ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం కింద అరెస్టు అయ్యారు. వారిలో కొంతమంది ప్రతిపక్ష పార్టీల వారు ఉన్నారు. మరికొంత మంది అధికార పార్టీ మద్దతుదారులు ఉన్నారు. వాస్తవానికి 2014 అసెంబ్లీ ఎన్నికల సమయంలో ఎర్రచందనం అక్రమ రవాణా ద్వారా సంపాదించిన సొమ్ముతో ఎక్కువ మంది రాయలసీమ జిల్లాలలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున పోటీ చేసిన అభ్యర్థులు ఉన్నారు. చిత్తూరు జిల్లాలో కొంతమంది తెలుగుదేశం మద్దతుదారులు స్థానిక సంస్థల ఎన్నికలలో పోటీ చేసినట్లు అనధికార వార్తలు ఉన్నాయి. ఏది ఏమైనప్పటికినీ, ఎర్రచందనం అక్రమ రవాణా సాగించడం ద్వారా ధనాన్ని సంపాదించడ మనేది రాజకీయ నాయకులే అధికార వర్గాలందరికీ అలవాటు చేశారు. ఇది శోచనీయం, దుర్మార్గం.

ప్రభుత్వంలోని పెద్దలూ, అటవీశాఖా, రవాణాశాఖా, పోలీసుశాఖల అంతరంగిక అండదండలు లేకుండా, ఎర్రచందనం విదేశాలకు తరలుతుండడం సాధ్యమయ్యే పని కాదు. కావున ప్రభుత్వంలోని ఉన్నతాధికారుల అండదండలు ఉన్నాయనేది సుస్పష్టం. దీనికి ఆయా వర్గాల అధికారులందరూ బాధ్యత వహించవలసిందే.

అంతర్జాతీయ ఎర్రచందనం అమ్మకం దారులైన ముఖేశ్ బదానీ (హర్యానా) చైనీషియాన్ (చైనా) విక్రమ్ మెహదీ (మయాన్మర్), యాంగ్‌పాంగ్ (చైనా), లక్ష్మణన్ (మణిపూర్), రియాబ్ హమీద్ (కర్ణాటక), ఆర్. సెల్వరాజ్, శరణన్ (చైన్నై), మస్తాన్‌వలీ (ఆంధ్రప్రదేశ్) ప్రస్తుతం ఆళ్లగడ్డ నియోజక వర్గపరిధిలోని చాగలమర్రి మండల అధ్యక్షులు (ఎంపిపి) వీరంతా ఒకేరోజు తయారైన వారు కాదు. వివిధ అధికార వర్గ యంత్రాంగ మద్దతుతో తయారు కాబడ్డారు. వీరు కాకుండా దుబాయ్‌లో తలదాచుకున్న షావుల హమీద్, మారిషస్ జైలులో ఉన్న కొల్లం గంగిరెడ్డి కూడా ఉన్నారు. కొల్లం గంగిరెడ్డి, కడప జిల్లాకు చెందిన వైకాపా శాసనసభ్యునికి దగ్గరి బంధువు.

ఎర్రచందనం కపడలోని నీటిని తీసివేసే సాంకేతిక ప్రక్రియను చైనా కనిపెట్టిన తర్వాత, ఏ కలపనైనా కలపకున్న ఔషధ గుణం, ఎర్రచందనం కలపను వినియోగించడం, ధనవంతుడని తెలియజెప్పే విధంగా (సంపన్నుడనే స్థాయి) చిహ్నమనే భావం కూడా అటవీశాఖ అధికారులే కలిగించి ప్రచారం చేశారు. ఇదే దొంగ రవాణాకు నిదర్శనమైంది. చైనాలో సంపన్నుల సంఖ్య మిగిలిన దేశాలలో కంటే ఎక్కువగా పెరుగుతుండడం, సామ్యవాద వ్యవస్థ స్వేచ్ఛా విఫణిగా రూపొందడం వలన జరిగిన పరిణామ క్రమంగా కూడా దీనిని భావించవచ్చును. చైనాలో ఎర్రచందనం దొంగ రవాణా పెరగడానికి ఇదొక కారణం.

ఢిల్లీలో ఇటీవల అరెస్టు అయి, మన రాష్ట్రానికి తీసుకుని రాబడిన చెన్ యీ ఫియాన్, ఫరీదాబాద్‌లోని తన గిడ్డంగిలో దాదాపు 50 కోట్ల విలువైన టన్నుల కొద్ది ఎర్రచందనం దుంగలను దాచినట్లు ఒప్పుకున్నాడు. అతని వద్ద లభించిన ఎర్రచందనం బద్ధుని బొమ్మ, ఇతర కళా ఖండాలు విలువ ప్రపంచ మార్కెట్లో చాలా ఉందని సమాచారం. ఇదంతా ఎంత మంది సహకారంతో జరిగి ఉంటుందో ఊహించుకోవచ్చు.

భారత్‌కూ, టిబెట్‌కూ ఉన్న సరిహద్దు గుండా, హిమాలయ పర్వత శ్రేణులలోని 'నాథులా కనుమ' మార్గం గుండా వాణిజ్యం పునః ప్రారంభమైన తర్వాత, దాదాపు పదేళ్లలో మన అమూల్య వన సంపద ఇతర దేశాలకు తరలిపోయింది. ఒక్క ఎర్రచందనం మాత్రమే కాదు. పులి చర్మాలూ, పులి గోళ్లూ, పులిదంతాలూ, ఏనుగు దంతాలూ, మరికొన్ని విలువైన ఔషధ మూలికలూ ఉన్నాయి. ఈ అక్రమ వ్యాపారాలన్నీ అధికారంలో ఉన్న రాజకీయ నాయకుల అండదండతోనే జరుగుతూ ఉంటుంది. దీనికి పోలీసు, అటవీ రవాణా శాఖల ఉన్నతాధికారుల ప్రత్యక్ష అండదండలు పుష్కలంగా ఉంటాయి. ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు కూడా ఉంటారు. కేవలం అమాయక కూలీలనూ, సామాన్య ప్రజలను అరెస్టు చేసి, వేధించడం వలన వచ్చే ప్రయోజనం శూన్యం. దాని వలన సమస్య ప్రక్కదారి పట్టే అవకాశం ఉంది. ఇక్కడ పౌరహక్కుల సమస్య కూడా వస్తుంది.

సామాన్య ప్రజల పౌర, ప్రజాస్వామిక హక్కులను కాపాడవలసిన రాజ్యాంగ యంత్రాంగం, అమాయక ప్రజలను ఎన్‌కౌంటర్ల పేరు మీద చంపడం, వాటికి ఎర్రచందనం అక్రమ రవాణా జోడించడం పాలకుల నిరంకుశ విధానాలకు నిదర్శనం. పేరుకు శేషాచలం అడవులూ, జరుగు తున్నదంతా రాజ్యాంగ అపహాస్యం తప్ప మరొకటి కాదు. ఎన్‌కౌంటర్‌లో చనిపోయిన వారు తమిళులు కావడంతో అటు అంత రాష్ట్ర వివాదంగా, రెండు రాష్ట్రాల సామాన్య ప్రజల జీవన్మరణ సమస్యగా మారే అవకాశం లేక పోలేదు.

ఇప్పటికైనా పాలకులు వాస్తవాలు గ్రహించి, సామాన్య ప్రజల హక్కులను కాపాడాలి. సమస్యకు మూలమైన అసలైన పరిష్కారాన్ని కాపాడాలి. సమస్యకు మూలమైన అసలైన పరిష్కారాన్ని కనుగొనాలి.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర ఆర్గనైజింగ్ కార్యదర్శి)* వీ

# రెండు రాష్ట్రాల్లో విభజనానంతర పరిణామాలు

***ఆంధ్రప్రదేశ్ విభజన జరిగి, రెండు రాష్ట్రాలు ఏర్పడి ఒక సంవత్సరం పూర్తయిన సందర్భంగా విభజనానంతర పరిణామాలనూ, తలెత్తిన సమస్యలనూ చర్చిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

ఆంధ్రప్రదేశ్ విభజన జరిగి రెండు రాష్ట్రాలు ఏర్పడి ఒక సంవత్సరం గడిచిపోయింది. విభజనకు ముందూ, విభజన సమయంలోనూ రెండు ప్రాంతాల్లో ఏ ఆందోళనలు, ఆవేశాలు వ్యక్తమైనా, అవన్నీ పక్కన పెట్టి రెండు రాష్ట్రాల్లోనూ ప్రజా జీవనం మెరుగుపడే పాలనా పద్ధతుల గురించి ఆలోచించవలసిన సమయం ఇది. గత ఏడాదికి పైగా రెండు రాష్ట్రాల్లోనూ పాలనాపరమైన పరిణామాలు ఎలా ఉన్నాయో, ఆ పరిణామాల వల్ల ప్రజాజీవనానికి ఏమి జరుగుతున్నదో ప్రగతిశీల, ప్రజాస్వామిక శక్తులైనా ఆలోచించవలసి ఉంది. మరీ ముఖ్యంగా రెండు రాష్ట్రాలలోను పాలకపక్షాలు ప్రజావ్యతిరేక విధానాలవైపే మళ్లుతున్నప్పుడు, వేరువేరు కారణాల వల్ల ఆ పాలకపక్షాలను గుడ్డిగా సమర్థించే మీడియా, భజన బృందాలు ఏర్పడి ఉన్నప్పుడు ప్రగతిశీల, ప్రజాస్వామిక శక్తుల మీద బాధ్యత మరింతగా పెరుగుతున్నది.

విభజనానంతర పరిణామాలను పరిశీలిస్తే, చరిత్ర వల్ల తలెత్తిన సమస్యలు, పునర్వ్యవస్థీకరణ చట్టం వల్ల తలెత్తిన సమస్యలు, పాలన వల్ల తలెత్తిన సమస్యలు అనే మూడు రకాల సమస్యలు ఉన్నట్టు కనబడుతున్నది. వీటిలో చరిత్ర వల్ల, చట్టం వల్ల ఏర్పడిన సమస్యలు దీర్ఘకాలికమైనవి. వాటికి తక్షణ పరిష్కారాలో, ఒకటి రెండు సంవత్సరాలలో పరిష్కారాలో ఉండవు. కాని పాలన సక్రమంగా సాగితే ఆ సమస్యలకు పరిష్కారాలు వెతికే దిశగా ముందుకు సాగవచ్చు. ఆ పాలన పాత సమస్యలను పరిష్కరించే దిశలో కాకుండా ఆ సమస్యలను అలాగే ఉంచే దిశలోనో కొత్త సమస్యలను సృష్టించే దిశలోనో సాగడమే రెండు రాష్ట్రాలలోనూ ఎక్కువగా కనబడుతున్నది. అందువల్ల రెండు రాష్ట్రాల పాలకులు కూడ పాత సమస్యల పరిష్కారాలు జరగడం లేదనే వాస్తవం నుంచి ప్రజల దృష్టిని మళ్లించడానికి అన్ని రకాల ప్రయత్నాలు చేస్తున్నారు. నిజమైన ప్రజా సమస్యల మీద, పరిష్కారాల మీద చర్చ జరగకుండా ఇతరేతరమైన, అనవసరమైన విషయాల మీద చర్చలకు, రచ్చలకు విలువైన కాలాన్ని వృథా చేస్తున్నారు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఆరు దశాబ్దాల చరిత్ర, పాలనా విధానాలు, ఆ మాటకొస్తే అంతకు ముందరి చరిత్ర రెండు రాష్ట్రాల్లోనూ సృష్టించిన ప్రజాసమస్యలు ఎన్నో ఉన్నాయి. ఆ చరిత్ర ఆంధ్ర, రాయలసీమ, పల్నాడు ప్రాంతాల అట్టడుగు ప్రజానీకానికి కూడ ఒరగబెట్టిందేమీ లేదు గాని, తెలంగాణకు ఇచ్చిన హామీలను కూడ నెరవేర్చకుండా ప్రాంతీయ అసమానతలను సృష్టించింది, పెంచి పోషించింది. ఆ అసమానతల వల్ల తెలంగాణలోని ఉన్నతవర్గాలూ దెబ్బ తిన్నాయి, ప్రజల ప్రయోజనాలకు మరింత ఎక్కువ నష్టం జరిగింది. అందువల్ల తెలంగాణ ప్రభుత్వం ముందుకు వచ్చిన ఆ అసమానతలను తొలగించడం అనే కర్తవ్యం సుదీర్ఘకాలం పట్టే పని. అలాగే రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడులు కూడ ప్రాంతీయ అసమానతకు గురై ఉన్నాయి గనుక ఆ ప్రాంతాలలో వ్యవసాయాభివృద్ధి, పరిశ్రమల స్థాపన, మరిన్ని విద్యా, ఉద్యోగావకాశాల కల్పన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ముందున్న బాధ్యత. ఉమ్మడి రాష్ట్రంలో అసమానతల చరిత్ర వల్ల తెలంగాణలో ప్రత్యేకరాష్ట్రం కోసం ఉద్యమం జరిగి విభజనకు దారి తీసింది. రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడులలో అసంతృప్తి ఒక్కోసారి బలం గానూ, ఒక్కోసారి బలహీనంగానూ వినబడింది. రెండు రాష్ట్రాల్లోనూ ఆ అసంతృప్తిని చల్లార్చే చర్యలు చేపట్టడం రెండు రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యత.

ఆరు దశాబ్దాల పాటు ఒకే రాష్ట్రంలో బతికి ఇప్పుడు రెండు రాష్ట్రాలుగా విడిపోయిన ప్రజలమధ్య వైరుధ్యాలు, విద్వేషం ఉండనవసరం లేదు. కాని ఇటు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలోను, అటు సమైక్యాంధ్ర ఉద్యమంలోను తలెత్తిన కొని అవాంఛనీయ, అపసవ్య ధోరణుల వల్ల ప్రజల మధ్య అనవసర వైమనస్యాలు ఏర్పడ్డాయి. రెండు వైపులా రాజకీయ నాయకులు తమ స్వార్థ రాజకీయాల కోసం ఆ వైమనస్యాన్ని పెంచి పెద్దది చేశారు. ఇప్పుడు ప్రజల మనసుల్లోనుంచి ఆ వైమనస్యాన్ని తొలగించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. ఆ వైమనస్యాలే తమకు పెట్టుబడీ, తమ మనుగడకు హామీ గనుక రాజకీయ నాయకులు వాటికి తొలగించే పని చేయరు. ఆ పనికి పూనుకోవలసింది రెండు రాష్ట్రాలలోని ప్రగతిశీల, ప్రజాస్వామిక శక్తులే.

చరిత్ర సృష్టించిన, పెంచి పోషించిన సమస్యలే జటిలమైనవంటే, రాష్ట్ర విభజన కోసం కేంద్ర ప్రభుత్వం తయారు చేసిన ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 మరిన్ని కొత్త సమస్యలను సృష్టించి పెట్టింది. బిల్లు తయారు చేయడంలో జరిగిన ఆలస్యం, బిల్లు మీద చర్చకు తగినంత సమయం ఇవ్వకపోవడం, ఇచ్చిన సమయాన్నైనా రెండు ప్రాంతాల రాజకీయ నాయకులు, మేధావులు సరిగా వినియోగించుకోకపోవడం, బిల్లు మీద వచ్చిన కొద్దిపాటి సమగ్ర విమర్శలనైనా కేంద్ర ప్రభుత్వం పట్టించుకోకపోవడం వల్ల చట్టం అనేక లొసుగులతో తయారయింది. సాధారణంగానే చట్టాల తయారీలో పాలకులు ఉద్దేశపూర్వకంగానే లొసుగులు వదులుతారు, ఎటు వీలైతే అటు వ్యాఖ్యానించగల అస్పష్టత వదులుతారు. ఈ చట్టంలోనూ అటువంటి సమస్యలు, సందిగ్ధాలు ఉన్నాయి. మరీ ముఖ్యంగా ఉమ్మడిగా ఉన్న సంస్థల విభజన గురించి నిర్దేశించిన తొమ్మిదో, పదో షెడ్యూళ్లు, ఉద్యోగుల విభజన సమస్యలు చట్టం సృష్టించిన ఎప్పటికీ ఆరని చిచ్చులు.

రెండు ప్రభుత్వాల మధ్య సామరస్యం, ఇచ్చిపుచ్చుకునే ధోరణి, అవతలి వాళ్ల అభిప్రాయాన్ని గురించి సావధానంగా ఆలోచించే ప్రజాస్వామిక వైఖరి ఉంటే ఈ చట్టం సృష్టించిన సమస్యలను అధిగమించవచ్చు. కాని రెండు వైపుల పాలకులూ తమ ప్రాంత ప్రజల మనోభావాలను రెచ్చగొడుతూ, మేం చేసేదంతా ఒప్పు, అవతలి వాళ్లు చేసేదంతా తప్పు అని వాదిస్తున్నారు. చట్టం కల్పించిన సమస్యలకు అర్థవంతమైన పరిష్కారాలు వెతకడానికి ప్రయత్నించడం లేదు. ఉద్యమక్రమంలో గాని, 2014 ఎన్నికల ప్రణాళికలలో గాని తాము చేసిన వాగ్దానాలను నెరవేర్చకుండా, అలా నెరవేర్చకపోవడానికి చట్టం సృష్టించిన సమస్యలను సాకుగా చూపుతున్నారు.

నిజానికి ఈ ఏడాదిలో అసలు సమస్య ఈ పాలనా సమస్యే. చరిత్ర వల్ల, చట్టం వల్ల వచ్చిన సమస్యలను కూడ పరిష్కరించవలసి ఉండిన పాలన, వాటిని పరిష్కరించకపోగా, కొత్త సమస్యలు సృష్టించింది. పాత సమస్యల నుంచి, మౌలిక సమస్యల నుంచి ప్రజల దృష్టి మళ్లించడానికి కొత్త, అనవసరమైన సమస్యలనూ వివాదాలనూ సృష్టించి పబ్బం గడుపుకోవడం రెండు రాష్ట్ర ప్రభుత్వాలకూ నిత్యకృత్యంగా మారింది. రెండు రాష్ట్రాలలోనూ పాలకవర్గాలు, ప్రజల ఆకాంక్షలను తీర్చక, తీర్చలేక, తీర్చదలచుకోక భావోద్వేగాలు రెచ్చగొట్టి ప్రజలను తమ వెనుక నిలబెట్టుకునే ఎత్తుగడకు దిగాయి. ప్రచారసాధనాలు ఆ పాలకవర్గ ప్రయత్నాలకు పూర్తిగా సహకరిస్తూ అసలు సమస్యలను విస్మరించడానికీ, దాటవేయడానికీ తమవంతు కృషి చేస్తున్నాయి. ఈ నేపథ్యంలో రెండు రాష్ట్రాలలోను ఈ ఏడాదిలో పరిష్కారం జరిగి ఉండవలసిన, పరిష్కార ప్రయత్నాలైనా మొదలుకావలసి ఉండిన, వెలికివచ్చిన ప్రధాన సమస్యలేమిటో గుర్తించడం అవసరం.

ఆంధ్రప్రదేశ్ పాలకవర్గాలకు ఒక కొత్త రాష్ట్రమూ, కొత్త దోపిడీ అవకాశాలూ వచ్చాయి. వారికి జరిగిన నష్టమేమీ లేదు. కాని ఆంధ్రప్రదేశ్ సాధారణ ప్రజానీకానికి విభజన వల్ల కొంత నష్టం జరిగింది. అంతవరకూ ఉమ్మడి రాష్ట్రంలో హైదరాబాదు మీద అనుచిత కేంద్రీకరణ జరిగినందువల్ల ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ ప్రాంతంలో విద్యా, ఉద్యోగ అవకాశాలకు అవసరమైనన్ని వనరులు ఏర్పడలేదు. సమైక్య ఉద్యమం పేరుతో జరిగిన ఆందోళనలో ప్రజలు సమైక్య రాష్ట్రం ఉండాలన్న భావనతో కంటె ఎక్కువగా, ఈ విద్యా, ఉద్యోగ అవకాశాలు కోల్పోతామనే భయంతోనే పాల్గొన్నారు. ఆ కారణం వల్ల కొంత, తమ అవకాశవాద రాజకీయాల వల్ల కొంత, బిల్లు మీద చర్చ జరిగేటప్పుడు అటు కాంగ్రెస్, ఇటు భారతీయ జనతా పార్టీ కూడ ఈ ప్రజా ఆకాంక్షను నెరవేరుస్తామని హామీలమీద హామీలు ఇచ్చాయి. వాటిలో ఒకటి ఆంధ్ర ప్రదేశ్ కు ప్రత్యేక హోదా కల్పించడం. ఆ హోదాను ఐదు సంవత్సరాలకు కల్పిస్తామని కాంగ్రెస్ అంటే, పది సంవత్సరాలు కావాలని భాజపా పట్టుబట్టింది. తీరా భాజపా కూటమి అధికారంలోకి వచ్చాక రోజుకొక మాట మాట్లాడుతూ ప్రత్యేక హోదాను పక్కన పెట్టారు. నిజానికి గత ప్రభుత్వాలు అమలు చేసిన ప్రత్యేక హోదా మార్గదర్శకాల ప్రకారం చూస్తే, ఆంధ్ర ప్రదేశ్ కు ప్రత్యేక హోదా ఇచ్చే అవకాశం లేదు. అంటే ఆ వాగ్దానం తెలిసి తెలిసీ ఆడిన అబద్ధం అన్నమాట. గతంలో ఉన్నా లేకపోయినా, ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి, ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలైన రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడు ప్రాంతాలకు మరిన్ని విద్యా, ఉద్యోగ అవకాశాల వనరులను కల్పించవలసి ఉంది. ఏడాది పాలన గడిచినా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆ దిశగా గణనీయమైన ప్రయత్నాలేమీ చేయలేదు.

అలా అవసరమైన పనులు చేయకపోగా, రాష్ట్ర ప్రభుత్వాన్ని కార్పొరేట్ పాలనతో నింపివేశారు. విద్య, వైద్యం, రియల్ ఎస్టేట్, గనులు, ఇసుక, ట్రాన్స్‌పోర్ట్ వంటి రంగాలలో మాఫియా రాజ్యాలు నడుపుతున్న కార్పొరేట్ శక్తుల వల్ల, ఆ కార్పొరేట్ శక్తుల కొరకు, ఆ కార్పొరేట్ శక్తుల చేత ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నడుస్తున్నది. ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు చంద్రబాబు నాయుడుకు అలవాటైన అభివృద్ధి నమూనా ఇప్పుడు సంపూర్ణంగా అమలవుతున్నది. సరిగ్గా అప్పటిలాగనే ప్రపంచబ్యాంకు, సింగపూర్, జపాన్, బహుళ జాతి సంస్థల మంత్రజపం సాగుతున్నది. వనరుల, అవకాశాల, కార్యాలయాల, పెట్టుబడుల కేంద్రీకరణ వల్ల ఎటువంటి ప్రజా సమస్యలు, ఆందోళనలు తలెత్తాయో స్పష్టమైన అనుభవం కళ్ల ముందు కనబడుతున్నప్పటికీ మళ్లీ కృష్ణా – గుంటూరు ప్రాంత కేంద్రీకరణ పెరుగుతున్నది. ఇంతకాలమూ అవకాశాలు కోల్పోయిన రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడు ప్రాంతాల, ప్రజల అభివృద్ధికి ప్రాధాన్యత ఇవ్వాలనే కనీస ఆలోచన కూడ పాలకులకు రావడం లేదు.

అలా ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో అపసవ్య పాలన ఒకవైపు ఉండగా, ఈ పాలనను ప్రశ్నించడానికి ప్రజలకు అవకాశం ఇచ్చే రాజ్యాంగబద్ధమైన, ప్రజాస్వామిక పాలన ఎంత మాత్రం అమలు కావడం లేదు. పాలకవర్గ ముఠా తగాదాల్లో భాగంగానైనా కొన్ని ప్రజాసమస్యలు లేవనెత్తగల ప్రతిపక్షం లేకుండా పోయింది. ప్రచార సాధనాలు భజన సాధనాలుగా మారిపోయాయి. ఇక, అప్పటికీ పాలనను నిలదీయగల పార్లమెంటరీయేతర రాజకీయ పక్షాలను, ప్రజాసంఘాలను, మేధావులను బెదిరించి నోరు మూయించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఒకరకంగా చంద్రబాబు నాయుడు 2003లో తిరుపతిలో తనపై జరిగిన దాడికి వ్యక్తిగత ప్రతీకార వాంఛతో ఉన్నట్టు కనబడుతున్నది. ఆ ఘటన తర్వాత మధ్యంతర ఎన్నికలకు వెళ్లి, ఆ ఎన్నికలలో ఓడిపోయి, పది సంవత్సరాలు పదవికి దూరమై, మళ్లీ విభజిత రాష్ట్రంలో పదవి రాగానే, మొదటి రోజునే ఆయన ప్రతీకారం మొదలుపెట్టాడు. మంత్రివర్గ ప్రమాణస్వీకారం జరిగిన రోజునే బూటకపు ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు విప్లవకారులను కాల్చి చంపడంతో ప్రారంభించి, ప్రతిపక్షాల మీద కక్షను నిస్సహాయ కూలీల మీద తీర్చుకుంటూ ఇరవై మంది ఎర్రచందనం కూలీలను హత్య చేయించిన దాకా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అప్రజాస్వామిక పాలన విస్తరించింది. సభలకు అనుమతి నిరాకరించడం, పత్రికా సమావేశాలను కూడ అడ్డుకోవడం, ప్రశ్నించే గళాల మీద నిఘాలూ వేధింపులూ అమలు చేయడం వంటి ఎన్నో ఘటనలు ఈ ఏడాదిలో జరిగాయి.

ఇక తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ఏడాది పాలన ఆంధ్రప్రదేశ్ పాలన కన్న భిన్నంగా ఏమీ లేదు. కాకపోతే, దశాబ్దాల పాటు సాగిన ఆకాంక్ష వల్ల, ప్రస్తుత పాలకపక్షం పద్నాలుగు సంవత్సరాల పాటు ఉద్యమ నాయకత్వంలో ఉన్నందువల్ల, ఈ ఏడాదిలో తెలంగాణ సాంస్కృతిక

చిహ్నాలను సంతృప్తిపరిచే ప్రయత్నం కొంత జరిగినందువల్ల ఈ పాలన గురించి మిశ్రమ అభిప్రాయాలున్నాయి. ఇంకా వేచి చూడాలనే వారు కొందరు, మనవాళ్లు ఏమి చేసినా సరే అనేవారు కొందరు, నిరాశలో మునిగి మాట్లాడకుండా ఉన్నవారు కొందరు.

నాలుగు దశాబ్దాల ప్రజల ఆకాంక్షలతో, ఇరవై సంవత్సరాల పోరాటంతో ఏర్పడిన తెలంగాణ మొదటి సంవత్సరంలో ఆ ఆకాంక్షలు నెరవేరే దిశగా ప్రయాణం ప్రారంభం కాలేదు. గత పాలనలలో జరిగిన అక్రమాలను, అన్యాయాలను, హామీల ఉల్లంఘనలను, వంచనలను ఉద్యమ క్రమంలో ఎంత ఎక్కువగా వాడుకున్నారో, రాష్ట్రం ఏర్పడిన తర్వాత వాటిని సరిచేసే ప్రయత్నం అంత తక్కువగా జరుగుతున్నది. ఆ అక్రమాలకు, అన్యాయాలకు కారణమైన విధానాలు మాత్రమే కాదు, ఆ విధానాలను అమలుచేసిన వ్యక్తులు కూడ తెలంగాణ పాలనలో చక్రం తిప్పుతున్నారు. లేదా పాలకులకు సన్నిహితంగా ఉంటున్నారు. తెలంగాణ ప్రజలు కోరుకున్న అంశాలేవీ మౌలిక స్థాయిలో అమలులోకి రావడంలేదు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలోనూ, విప్లవోద్యమంలోనూ తెలంగాణ ప్రజలు వ్యక్తం చేసిన భూమి సమస్య పరిష్కారం దిశగా తొలి అడుగులైనా పడలేదు. వ్యవసాయ రంగ అభివృద్ధి గురించి మాటలు వినబడినంతగా చేతలు లేవు. చెరువుల పునరుద్ధరణ వంటి ఆదర్శవంత మైన, ఉపయోగకరమైన కార్యక్రమం కూడ ఆశ్రితుల, కాంట్రాక్టర్ల ప్రయోజనాలు తీర్చడానికే ఎక్కువగా జరుగుతున్నది. పారిశ్రామి కాభివృద్ధిలో కీలక అంశమైన ప్రభుత్వరంగం గురించి గాని, గత ప్రభుత్వాలు మూసివేసిన పరిశ్రమలను పునరుద్ధరించడం గురించి గాని ఎటువంటి ప్రణాళికలు లేవు. పాత పాలనలలో లాగనే బహుళజాతి సంస్థలకు, కార్పొరేట్ సంస్థలకు, దేశదేశాల సంపన్నులకు, చివరికి ఇంతకాలమూ విమర్శించిన ఆంధ్ర పెట్టుబడిదారులకు కూడ ఎర్రతివాచీ ఆహ్వానాలు సాగుతున్నాయి. ప్రపంచ బ్యాంకుతో గతంలోని ప్రాజెక్టుల అనుబంధం కొనసాగడం మాత్రమే కాదు, ఈ ఏడాదిలో మరొక ప్రాజెక్టు మీద సంతకాలు జరిగాయి. సేవారంగంలో, ప్రత్యేకించి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగంలో, గత ప్రభుత్వాల విధానాలు అదే విధంగా, మరి కాస్త ఎక్కువగా కూడ సాగుతున్నాయి. ప్రతి ఇంటికీ మంచినీరు అందించడానికనే సదుద్దేశంతో ప్రారంభించిన వాటర్‌గ్రిడ్ ఆలోచన కార్పొరేట్ కబంధ హస్తాల్లో చిక్కి రోజురోజుకూ ఖర్చు అంచనాలు పెరిగిపోతున్నాయి.

అధికారంలో ఉన్నవారి వ్యక్తిగత మత విశ్వాసాలు ప్రభుత్వ పాలనలోకి రాగూడదనే రాజ్యాంగబద్ధ లౌకిక భావనను తెలంగాణలో ఈ ఏడాదిలో పాలకులే ధ్వంసం చేశారు. దేవాలయాలకు, మెజారిటీ మత కర్మకాండలకు, వాస్తు వంటి మూఢవిశ్వాసాలకు పాలనాపరమైన ప్రాధాన్యత, నిధుల కేటాయింపు, బహిరంగ మతచిహ్నాల ప్రదర్శన సాగుతున్నాయి. ఇక్కడ కూడ ప్రతిపక్షం బలహీనంగా ఉన్నది. ప్రచార సాధనాలలో భజన సాగుతున్నది. అయితే, దశాబ్దాలుగా ప్రజల చైతన్యంలో సమరశీల స్ఫూర్తి ఉన్నందువల్ల, ప్రశ్నించే, ప్రజలకు నిజాలు చెప్పే ప్రజాసంఘాలను, మేధావులను అణచివేయడానికి ప్రయత్నాలు పెద్ద ఎత్తున సాగుతున్నాయి. తెలంగాణ ఉద్యమ క్రమంలో పెరిగిన భావోద్వేగాల సహాయంతో, పాలనా విధానాలను ప్రశ్నించడమంటే తెలంగాణకు ద్రోహం చేయడమేనని బట్ట కాల్చి మీద వేసే ఎత్తుగడలతో ప్రశ్నించేవారి నోరు మూస్తున్నారు. అది కూడ సాధ్యం కావడం లేదను కున్నప్పుడు సభలను, సమావేశాలను అనుమతించకపోవడం, అరెస్టులు, నిఘాలు, వేధింపులు సాగుతున్నాయి. జుడిషియల్ కస్టడీలో, చేతులకు గొలుసులతో ఉన్న ఖైదీలను కాల్చిచంపి, ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లడం, పాత పాలనలలో హంతక ముఠాలుగా పేరుపొందిన గ్రేహౌండ్స్ ఎస్ఐబిలను యథాతథంగా కొనసాగించడం మాత్రమే కాదు, వాళ్లు పొరుగు రాష్ట్రమైన చత్తీస్‌గఢ్‌లోకి వెళ్లి నిఘావేయడానికి, హత్యలు చేయడానికి కూడ తెలంగాణ ప్రభుత్వం అనుమతిస్తున్నది.

తెలంగాణ పాలకులు సమస్యలను పరిష్కరించే బదులు, అన్ని సమస్యలనూ పక్కదారి పట్టించేందుకు, విస్మరణకు గురి చేసేందుకు ఏకైక సర్వరోగ నివారిణిలా తెలంగాణ భావోద్వేగాలను రెచ్చగొట్టి కాలం గడుపుతున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే తెలంగాణ ప్రభుత్వ తొలి సంవత్సరం పాలన ఉద్యమ క్రమంలో తెలంగాణ ప్రజలు వ్యక్తం చేసిన ఆకాంక్షలకు మాత్రమే కాదు, స్వయంగా తెలంగాణ రాష్ట్ర సమితి ఆ పదమూడు సంవత్సరాలలో చేసిన ప్రకటనలకూ, 2014 ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలకూ కూడ భిన్నంగా సాగుతున్నది.

ఇటువంటి పాలనలకు జూన్ మొదటివారంలో ఏడాది నిండిన సందర్భంగా రెండు రాష్ట్రాలలోను ఈ పాలనారీతుల మీద పెద్ద ఎత్తున చర్చ జరగవలసి ఉండింది. ప్రచార సాధనాలు, మేధావులు, ప్రజా సంఘాలు, రాజకీయ పక్షాలు అటువంటి చర్చలకు పూనుకోవలసింది. ప్రభుత్వాలు కూడ అటువంటి చర్చను ప్రోత్సహించి, తమ విధానాలను సంస్కరించుకునే అవకాశం తీసుకోవలసింది. కాని సరిగ్గా ఆ సమయానికే వచ్చిన శాసనమండలి ఎన్నికలు, ఆ ఎన్నికలలో సాగిన బేరసారాలు, తెలుగుదేశం పార్టీ నాయకులు దొరికిపోవడం వంటి పరిణామాలతో ఏడాది పాలన మీద చర్చ జరగవలసిన సమయంలో అనవసరమైన, భావోద్వేగపూరితమైన రచ్చ ప్రారంభమై గత నాలుగు వారాలుగా సాగుతున్నది. అవినీతి నిరోధక శాఖ విచారణలు, టెలిఫోన్ ట్యాపింగ్, ఫోరెన్సిక్ నిర్ధారణలు, కోర్టు కేసులు, ఆరోపణలు, ప్రత్యారోపణలు, పునర్వ్యవస్థీకరణ చట్టంలోని సెక్షన్ 8... ఇలా రచ్చ చిలవలు పలవలుగా పెరిగిపోతూ రెండు రాష్ట్రాల పాలకులకు కావలసిన విధంగా సాగుతున్నది.

ఈ సమయంలో రెండు రాష్ట్రాలలో పాలకవర్గాలతో సంబంధంలేని ప్రజలందరికీ, సాధారణ ప్రజానీకానికీ, మధ్యతరగతికీ, ఆలోచనాపరు లకూ పౌరులుగా వారి హక్కుల స్పృహ కలిగించవలసి ఉంది. రెండు రాష్ట్రాల ప్రజాజీవనంలో సమస్యలను తగ్గించడానికి, కనీస అవసరాలు తీర్చడానికి, మానవ ఆకాంక్షలు నెరవేరడానికి ఎటువంటి పాలన అవసరమో, అందుకొరకు పాలకులను ఎలా నిలదీయవలసి ఉన్నదో ప్రచారం చేయవలసి ఉంది. రెండు రాష్ట్రాలలోను అట్టడుగు ప్రజల జీవితాలలో మెరుగుదల ప్రమాణంగా ఎటువంటి పాలన జరగాలో చర్చ, సంభాషణ జరపవలసి ఉంది. నిరంతర జాగరూకతే ప్రజాస్వామ్యా నికి మూల్యం అనే స్పృహతో ప్రజాస్వామిక, ప్రజానుకూల పాలన కోసం జరపవలసి పోరాటాలకు ప్రజలను సంసిద్ధం చేయవలసి ఉంది.

*(ఉద్యోగక్రాంతి వార్షిక సభలో మే 24న ఇచ్చిన ఉపన్యాసానికి మలి రూపం)*

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# సామాన్యుల సమస్యలు - ప్రభుత్వాల సంబరాలు

*నూతన ప్రభుత్వాలు ఏర్పడి ఏడాది గడిచిన తరువాత దేశంలో సామాన్యుల పరిస్థితి మరింత దిగజారిపోయిందనీ, పాలకులు ప్రజల సమస్యలను పట్టించుకోకుండా ప్రచార ఆర్భాటాలతోనే కాలం వెలిబుచ్చుతున్నారనీ అంటున్నారు* **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

క్షేత్రస్థాయిలో సామాన్యుని జీవన స్థితిగతులే దేశాభివృద్ధికి గీటురాయిగా నిలుస్తాయి. అట్టడుగు పౌరుని అభివృద్ధి మాత్రమే ఆయా వ్యవస్థల ఉన్నతీకరణకు సూచికలుగా చెప్పబడుతాయి. సామాన్యుడి నాలుగు వేళ్లు తన నోటి వద్దకు వెళ్లే స్థితే ఆ దేశ పురోగతిని నిర్ణయిస్తుంది. సంపన్నుల మేడలు, పాలకుల బుగ్గకార్లు, విమాన విహార యాత్రలు, విదేశీ పర్యటనలు, కార్పొరేట్ అధిపతుల విలాసాలు ఇవికావు దేశాభివృద్ధికి గణాంకాలు.

2014 ఎన్నికలు దాటుకుని అధికారంలోకి వచ్చిన కేంద్ర మోడీ ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు ప్రభుత్వం ఏడాది పాలనను పూర్తి చేసుకున్నాయి. ఈ సంవత్సర కాలంలో అద్భుతాలేన్నో జరిగి పోయినట్లు అటు మోడీ ప్రభుత్వం దేశ వ్యాప్తంగా సంబరాలకు శ్రీకారం చుట్టగా, ఎపిలో చంద్రబాబు ప్రభుత్వం నవ నిర్మాణం పేరిట ఉత్సవం జరిపింది. మోడీ ప్రభుత్వం అసేతు హిమాలయం 200 సభలు జరిపి వారి పాలనలో సాధించిన విజయాలను ఏకరువు పెడుతుంది. చంద్రబాబు ప్రభుత్వం ఎన్నికల సందర్భంలో ఇచ్చిన హామీలన్నీ నెరవేర్చినట్లు తాను చెప్పుకుంటూ ప్రజలను అదే భ్రమలోకి దించాలను కుంటుంది. ఒకవేళ ఎవరైనా అట్లా ఉండలేం, వాస్తవంలోనే ఉంటామంటే! వారిపై ఆయన ఒంటికాలిపై లేస్తున్నాడు.

ఇద్దరు ప్రభుత్వాధినేతలు సంబరాల అంబరాల్లో తేలిపోతుంటే సామాన్య మధ్యతరగతి జీవుల నిత్యవసరాల ధరలు ఆకాశం దిశగా పరుగులు తీస్తున్నాయి. సంవత్సరం క్రితం ధరలతో పోల్చి చూస్తే ఉప్పు, బియ్యం, నూనెల రేట్లు రెక్కలు విప్పుకుని మేఘాల వీధుల్లో విహరిస్తున్నాయి. బొగ్గు గనుల వేలంలో దేశ ఖజానాకు 4 లక్షల కోట్లు సమకూర్చామని ఘనంగా చెపుతున్న మోడీకి గుల్ల అవుతున్న సామాన్యుడి జేబు గురించి తెలిసిరావడం లేదు. సంవత్సర కాలంలో ఒక్క కుంభకోణం కూడా లేదని గొప్పలు పోతున్న మోడీ సంక్షోభంలో చిక్కుకుపోతున్న పౌర జీవితాల ఆటుపాట్లు అర్థమవుతున్న జాడ కనిపించడం లేదు.

ఇక చంద్రబాబు ఎపిలో చక్రవర్తి పోకడ ఎంచుకున్నాడు. రాష్ట్రంలో మరో రాజకీయ పార్టీ ఉందన్న స్పృహను ఆయన ఎప్పుడో కోల్పోయాడు. 67 మంది శాసన సభ్యులతో వైఎస్ఆర్ కాంగ్రెస్ అనే ప్రతిపక్ష పార్టీ ఉందన్న విషయాన్ని ఆయన ఆమోదించడం లేదు. అఖిలపక్ష పార్టీల అభిప్రాయం అనే విషయాన్ని తన రాజకీయ నిఘంటువు నుండి ఆయన తొలగించాడు. ఎవరి అభిప్రాయాలతోనూ ఎటువంటి అవసరం లేదనే ధోరణి ప్రదర్శిస్తున్నాడు. రాష్ట్రంలోని ఇతర రాజకీయ పార్టీలను ఆయన అసలు పార్టీలుగానే పరిగణించడం లేదు. తన పుర్రెకు తోచినదే గొప్ప విషయమంటూ దూసుకుపోతున్నాడు. సామాన్య మధ్యతరగతి ప్రజల జీవనం గురించి ఆలోచించడానికి ఆయనకు సమయం చిక్కడం లేదు.

గత మాసంలో 27 రూపాయలుగా ఉన్న కిలో బియ్యం ధర మే నెలలో 32కి చేరింది. అదే విధంగా మినపగుండ్లు రు. 100 నుండి రు. 120కి, కందిపప్పు రు. 90 నుండి 110కి, శనగపప్పు రు. 60 నుండి రు. 80కి, వేరు శనగ విత్తనాలు రు. 90 నుండి రు. 110కి, పచ్చిపప్పు రు. 45 నుండి రు. 75కి, వేరు శనగ నూనె రు. 93 నుండి రు. 110కి ఎగబాకాయి. ధరల ఎదుగుదలకు సమాంతరంగా ప్రజల రాబడి పెరగకపోవడం మూలంగా సామాన్య, మధ్యతరగతి రోజువారి అవసరాలు భారంగా మారాయి. కూరగాయల వైపు కన్నెత్తి చూసే సాహసమే లేదు. రాజధాని నిర్మాణానికి సింగపూర్ ప్రభుత్వంతో చేసుకున్న ఒప్పందాల ఒత్తిడిలో ఉన్న చంద్రబాబు ఈ సమస్యపై దృష్టిపెట్టడానికి కించిత్తు సమయం కూడా లేదంటున్నాడు. ఎన్నికలలో తనకు అన్ని విధాల సహకరించిన పారిశ్రామిక బృందాలను వెంటేసుకుని ప్రత్యేక విమానాల్లో ప్రభుత్వ ధనంతో విదేశాలు వెళ్లి ఇతర దేశాల పారిశ్రామిక వేత్తలతో పరిశ్రమల స్థాపనలో భాగస్వామ్యాల ఏర్పాటులో మధ్యవర్తిగా వ్యవహరించే పనిలో బిజీ బిజీగా గడుపుతున్న బాబుకు పెరిగిపోయిన ధరల గురించి ఆలోచించే వీలుచిక్కడం కష్టం అంటున్నాడు.

ధరల కోణంలోనే కేంద్ర ప్రభుత్వాన్ని దర్శిస్తే మోడీ ప్రభుత్వం పెట్రోల్, డీజిల్ అమ్మకాల విషయంలో వ్యాపార ధోరణిని మించి చెప్పేందుకు పదం దొరకని ఇంకేదో మార్గాన్ని అవలంభిస్తుంది. ఇతర దేశాలలో విక్రయం జరుగుతున్న ధరలకు మూడు రెట్లు రేటు భారత ప్రజలు చెల్లిస్తున్నారు. అంతర్జాతీయ విపణి వీధిలో ఇంధన ధరలు నేలచూపులు చూస్తుంటే మన దేశంలో ప్రభుత్వాలు మాత్రం ధరల సూచీలు ఏమాత్రం బలహీనపడకుండా అష్టకష్టాలు పడుతున్నాయి. క్రూడ్ ధర తగ్గుముఖం పట్టినప్పుడల్లా వ్యాట్ అంటూ, అమ్మకం పన్నంటూ అటు కేంద్రం, ఇటు రాష్ట్రం తగ్గిన మేరకు జతచేస్తూ జనాన్ని ఎడాపెడా బాదిపారేస్తున్నాయి. ప్రస్తుతం ఎపిలో పెట్రోలు లీటర్ రు. 76, డీజిల్ రు. 61 ఉంటే ఇదే క్రమంలో ఇతర దేశాలలో చాలా తక్కువ ధరలకు ఆయా దేశాల పౌరులు ఇంధనాన్ని పొందుతున్నారు. పాకిస్థాన్‌లో లీటర్ పెట్రోల్ ధర రు. 26 ఉంటే, బంగ్లాదేశ్‌లో రు. 22, క్యూబాలో రు. 19, ఇటలీలో రు. 14, నేపాల్‌లో రు. 34, బర్మాలో రు. 30, ఆఫ్ఘనిస్థాన్‌లో రు. 36, శ్రీలంకలో రు. 34లకు ఆయా దేశాల వినియోగదారులకు లభిస్తుండగా భారత్‌లో మాత్రం ప్రభుత్వాలు ప్రజలను పిండి పారేస్తున్నాయి. వాస్తవానికి భారత్‌లో కూడా పెట్రోల్ మూల ధర కేవలం లీటర్ 16.50లు అని తెలుసుకున్నప్పుడు

ప్రతి ఒక్కరు నోరు తెరిచి చకితులవడం ఖాయం. ఈ గిట్టుబాటు ధరపై అనేక రకాల పన్నులు జోడించి ప్రస్తుత అమిత ధరకు భారత పౌరులకు అందించడం ధారుణమైన సంగతే. పెరిగిన ఇంధన ధరలలో అన్ని రవాణా వ్యవస్థలతో పాటు ప్రభుత్వ రంగ రవాణా సంస్థలు కూడా కుదేలై కునారిల్లుతున్నాయి. కాగా రోడ్డు రవాణా సంస్థ ఉద్యోగులకు ఇటీవల పెంచిన జీతాల ఫిట్‌మెంట్ భారాన్ని చార్జీల రూపంలో ప్రజల వీపులపై మోత మోగించడానికి ఏపి రాష్ట్ర ప్రభుత్వం పావురాయి మీదకు బాణం ఎక్కుపెట్టిన వేటగానిలా సమయం కోసం ఎదురు చూస్తుంది.

ఈ ఏడాది కాలంలో తాము అనేక ప్రజోపయోగ పథకాలు ప్రజలకు చేరువచేసినట్లుగా మోడీ ప్రచారం గావిస్తున్నారు. ఇందులో ఒక్కటి స్వచ్ఛ భారత్. స్వచ్ఛ భారత్ సాగుతున్న తీరు గురించి వేరే చెప్పనక్కరలేదు. ఆర్భాటంగా మీడియాకు ఫోటోలు ఇవ్వడం మినహా మరే ఇతర ప్రణాళికా చేపట్టలేదు. చెత్తను వేరి పారేయడం మినహా చెత్త చేయకుండా ఉండేందుకు అవసరమై ప్రత్యామ్నాయ మార్గాల అన్వేషణ ఏదీ కనిపించడం లేదు. ఇప్పటి వరకూ దేశంలోని పలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తెచ్చి విడిచిన ఆకర్షణీయ పథకాల మాదిరిగానే స్వచ్ఛ భారత్ కూడా అమలు అవుతుంది.

మరొకటి జన్‌ధన్ బ్యాంక్ ఖాతాలు. ఈ ఖాతాలు ఇప్పటి వరకూ దేశవ్యాప్తంగా 15 కోట్లను దాటింది. ఈ ఖాతాలు తెరిచిన ఖాతా దారులకు ఈ నాటికీ వీటి ప్రయోజనాలు తెలియదంటే విడ్డూరమేమీ కాదు. ఖాతా తెరిచి కూర్చున్న ఖాతా దారులకే తమతమ ఖాతాలలో జమచేసుకోవడం మినహా ప్రభుత్వం వైపునుండి ఎలాంటి కదలికా లేదన్నది సత్య వాక్యమే.

ఇంకొకటి బాలికల సంక్షేమ పథకం 'సుకన్య సమృద్ధి ఖాతా' 10 సంవత్సరాల వయసు దాటని బాలికల పేరిట పోస్టాఫీసుల్లో ముదుపు చేసే ఈ ఖాతాలపై ప్రకటించిన చక్రవడ్డీ 9.1 శాతం. రానున్న సంవత్సరాల్లో ఈ వడ్డీ రేటు తగ్గవచ్చు లేదా పెరగవచ్చు. అంటే ఈ వడ్డీరేటు నిఖరం కాదని చెప్పాలి. మోడీ ప్రభుత్వం ఆర్భాటంగా చెప్పుకున్న ఈ వడ్డీరేటులో ఏమంత ఉదాసీనత లేదన్నది నిజం. ఎందుకంటే ప్రభుత్వ సహకార బ్యాంకులు దీర్ఘకాల మదుపులపై ఇప్పటికే 9.25 శాతం వడ్డీ ఇస్తుండగా, భారతీయ జీవిత భీమా సంస్థ ఇటీవల ప్రకటించిన 'వరిష్ట పెన్షన్ బీమా యోజన' పథకంపై 9.38 శాతం వడ్డీని ఇవ్వజూపుతుంది. పైగా ఈ వడ్డీని మదుపుదారునికి నెలనెలా పంపిణీ చేస్తుంది. ఈ లెక్కన గుణిస్తే వడ్డీరేటు మరింత అధికంగా ఉంటుంది. ప్రచారంలో గొప్పదనమే కానీ పథకంలో మోడీ పిడికిలి విచ్చుకున్న వైనం కనిపించడం లేదు.

ఇకపోతే రెండు భీమా పథకాలను బ్యాంకుల ద్వారా అందుబాటులోకి తెచ్చారు. ఇవి బ్యాంకులలో ఖాతాలున్న వారికి వర్తించేవి. వీటిలో ఒకటి ప్రధాన మంత్రి 'సురక్ష భీమా పథకం' ఇది 50 సంవత్సరాల వయసు పైబడి 70 సంవత్సరాల వరకూ అమలులో ఉండే ప్రమాద భీమా పథకం. రెండవది 18 సంవత్సరాల వయసు నుండి 50 సంవత్సరాల వరకూ వారికి ఇచ్చే ప్రధాన మంత్రి జీవన్ జ్యోతి భీమాయోజన పథకం. ఈ పథకంలో సహజ మరణానికి కూడా భీమా వర్తిస్తుంది. అయితే రెండు పథకాలు మరణానంతర ప్రయోజనాలు కలిగినవే. వారసులకో, అనుభవదారులకో లబ్ధి చేకూర్చేవే. ఈ కోవలో బతికి ఉన్న వారి జీవిత రక్షణ గురించే సామాన్యుడు ప్రశ్నిస్తున్నాడు. చిన్న తరహా వ్యాపారుల కోసం 20 వేల కోట్ల మూల పెట్టుబడితో ముద్ర బ్యాంకును ప్రారంభించినట్లు చెపుతున్నారు. ఇది ఇంకా పనిచేయడం మొదలవలేదు. విధి విధానాలేమిటో తెలియరాలేదు. అమలులో ఏ మేరకు ఫలితాలుంటాయో చెప్పడానికేమీ లేదు.

అవినీతి రహిత పాలన అందించామని గొప్పగా చెప్పుకుంటున్న మోడీ ఏపిలో చోటుచేసుకున్న కేంద్ర ప్రభుత్వ సంస్థ సిసిఐ కుంభకోణం గురించి సమాధానం ఇవ్వవలసిన అవసరం ఉంది. పత్తి కొనుగోలు మాటున కోట్లాది రూపాయల అక్రమాలు జరిగినట్లు చెపుతున్నారు. మార్కెట్ యార్డులకు రాకుండానే పత్తి సరాసరి సిసిఐ మిల్లు వద్దకు చేరింది. ఈ కుంభకోణంలో సిసిఐ అధికారులు, బయ్యర్లు, ఉద్యోగుల పాత్ర ప్రస్ఫుటంగా ఉందన్నది బహిరంగ రహస్యం. ఏపికి చెందిన ఒక మంత్రి పాత్ర గురించి బలమైన ప్రచారం నడిచింది. దీనిపై సిబిఐ విచారణ కూడా జరుగుతుంది. అనేక మార్కెట్ కమిటీల వద్దనున్న దస్త్రాలను స్వాధీన పరుచుకుని లోతైన దర్యాప్తును కోనసాగిస్తుంది. కేవలం ఒక్క గుంటూరు జిల్లా పిడుగురాళ్ల మార్కెట్ యార్డు ద్వారా కొనుగోలు చేశామని బుకాయిస్తున్న 3.5 లక్షల క్వింటాళ్ల పత్తికి అక్కడ పనిచేసే హమాలీలకు సిసిఐ రు. 87 లక్షల కూలీ చెల్లించవలసి ఉండగా రు. 30 లక్షలు మాత్రమే కూలీలకు ముట్టినట్లు ముఠా కార్మికులు వెల్లడిస్తున్నారు. అంటే రాష్ట్ర వ్యాప్తంగా ఎన్ని లక్షల క్వింటాళ్ల పత్తి మొత్తంగా మార్కెట్ యార్డు ప్రాంగణాలకు చేరకుండానే వ్యాపారుల నుండీ, దళారుల నుండీ సరాసరి సిసిఐ మిల్లుల ఆవరణలకు చేరి ఉంటుందో స్పష్టం చేయవచ్చు. అయితే ఈ కుంభకోణం దర్యాప్తు సాఫీగా నడిచి ఇందులో భాగస్వాములపై కఠిన చర్యలు తీసుకుని సిసిఐ నష్టపోయిన సొమ్మును రాబట్టి ఖజానాకు చేర్చితేనే మోడీ ప్రభుత్వ విశ్వసనీయతకు, నిజాయితీకి మద్దతు లభిస్తుంది. ఈ కుంభకోణంలోని సిసిఐ అధికారులు, బయ్యర్లు, ఉద్యోగుల ఉద్యోగాలు ఏమాత్రం ఊడతాయో, అక్రమాలకు పాల్పడిన వారిని ఎందరిని జైలుకు పంపి తన చిత్తశుద్ధిని నిరూపించుకుంటారో చూడాల్సి ఉంది.

అవినీతి లేని పాలనే ధ్యేయమంటూ గర్వంగా సాగుతున్న మోడీ ప్రభుత్వం వారి ప్రభుత్వ నేతృత్వంలో నడుస్తున్న కేంద్ర కార్యాలయాల్లోని అవినీతి గురించి కూడా సమాధానం చెప్పాలి. అవినీతి రహిత పాలన అంటే కేవలం కేంద్ర ప్రభుత్వ స్థాయిలో కాదు, ప్రభుత్వ ఆధీనంలో నడుస్తున్న కార్యాలయాలు, ఉద్యోగుల తీరులో కూడా కచ్చితంగా అమలు జరిగితేనే ఫలితాలు ప్రజలకు అందుతాయనేది మోడీకి, కేంద్ర పాలకులకు తెలియని విషయం కాదు. ఈ విషయంలో కేంద్ర పాలకులకు, ఇతర రాష్ట్రాల పాలకులకు ఢిల్లీ ఆమ్ ఆద్మీ పార్టీ ముఖ్యమంత్రి, ఆ పార్టీ పాలకులు ఆదర్శంగా ఉంటారు.

ఇది ఇలా ఉంటే యుపిఏ ద్వితీయ ప్రభుత్వం రైతుల ప్రయోజనాల సంవృద్ధి కోసం బ్రిటిష్ కాలం నాటి చట్టం స్థానంలో తీసుకువచ్చిన భూసేకరణ బిల్లుకు ఆనాటి పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్షంగా మద్దతు ఇచ్చిన బిజెపి ఇప్పుడు అధికారం చేపట్టి సవరణలు తీసుకువచ్చి తూట్లు పొడుస్తూ రైతుల కంట కన్నీరుకు కారణమైంది. దేశ వ్యాప్తంగా రాజకీయ పార్టీలు, రైతుల సంఘాలు, పౌర సమాజాలు, స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న విజ్ఞప్తులను, నిరసనలను, ఉద్యమాలను పెడచెవిన పెడుతూ భూమి పుత్రులకు ద్రోహమే తలపెట్టింది. అదే విధంగా కార్పొరేట్ సంస్థల పన్నును ఆరు శాతం నుండి ఐదుకు తగ్గించి ఆ సంస్థల తన అభిమానాన్ని

చాటుకున్న మోడీ ప్రభుత్వం ప్రజల నెత్తిన మాత్రం పన్నుల కత్తిని మరింత పదునుపెట్టి వేలాడదీసింది. విమాన యాత్రలు చేసే వారికి ఉదారంగా ప్రయాణ చార్జీలు ఉండే విధంగా విమానాల ఇందనంపై ఒక్క శాతం పన్నుతో ఆయా సంస్థలకు దన్నుగా నిలిచిన కేంద్రం సాధారణ ప్రజలు ప్రయాణించే రవాణా వ్యవస్థలు వినియోగించే పెట్రోల్, డీజిల్ ఇంధనాలపై పన్నులను ఎడాపెడా పెంచడం మోడీ ప్రజావ్యతిరేక, సంపన్నుల అనుకూల పాలనా వైఖరికి అద్దం పడుతుంది.

ఇక చంద్రబాబైతే అవినీతి అనేమాట తన చెవిన పడకూడదంటున్నాడు. దాని గురించి మాట్లాడేందుకు తనకు మాత్రమే పేటెంట్ ఉందంటున్నాడు. తానే నిజాయితీకి ప్రతీక అంటున్నాడు. తన పాలనంతా నీతివంతం, పారదర్శకం అంటూ వేదిక దొరికితే చాలు దంచేస్తున్నాడు. సమయం చిక్కితే చాలు నిజాయితీ మంత్రాన్ని వల్లె వేస్తున్నాడు. మీడియా మైకు కంటపడగానే నీతివంతమైన రాజకీయాలు తన పెరటిలో పుట్టి పెరిగాయని వాయిస్తున్నాడు. ఎపిలో ప్రభుత్వ కార్యాలయాలు అవినీతికి ఆస్థానాలన్న విషయం రాష్ట్ర ప్రజల్లో ఎవరిని కదిలించినా తడుముకోకుండా ఠక్కున చెపుతారు. తెహల్కా డాట్‌కామ్ ఈ దేశంలోనిదే కాదన్నట్లుగా నటిస్తూ నీతి, నిజాయితీ అనే కొత్తరాగం ఆలపిస్తున్నాడు. రేవంత్‌రెడ్డి ఎవరో తనకు తెలియదంటాడేమో! భూ సమీకరణ దశ నుండి ఎపి ప్రభుత్వం భూసేకరణ వైపు ప్రయాణం చేస్తుంది. 'నీవు ఆత్మహత్య చేసుకో! లేదా! నేనే నిన్ను హతమార్చుతాను' అన్నట్లుగా ఉంది రాజధాని భూముల విషయంలో రైతుల పట్ల చంద్రబాబు వైఖరి. భూ సమీకరణ సందర్భంలోనే రైతులు తీవ్ర ఆవేదనకు గురికాగా, సేకరణ ప్రకటన వెలువడిన పిదప బతకాలో! చావాలో! తెలియడం లేదంటున్నారు. పాలక టిడిపి పార్టీకి చెందిన ముఖ్యమంత్రి, మంత్రులు, ఎంఎల్ఎ, ఎంపిల భూములు ఈ రాజధాని ప్రాంతంలో ఉంటే తెలిసేది అక్కడి భూములు కోల్పోతున్న రైతుల మనోవేదన. తెలుగుదేశం నాయకులకు చెందిన భూమి ఒక్క ఎకరం పోతుందా? అంటూ ఆ ప్రాంత రైతులు ప్రశ్నిస్తున్నారు.

మరోవైపు రాజధాని నిర్మాణంలో సింగపూర్ పాత్ర మనదేశంలోని నిర్మాణ రంగ శాస్త్రజ్ఞులను, నిర్మాణ వేత్తలను, శంషాబాద్, ఢిల్లీ విమానాశ్రయాల్లాంటి గొప్ప నిర్మాణాలు పూర్తిగావించిన కాంట్రాక్టు కంపెనీలను గేలిచేస్తుంది. పునాదిరాయి వద్ద నుండి సింగపూరే శ్రేష్టమంటున్నాడు. మాస్టర్ ప్లాన్‌కే కోట్ల రూపాయల ఖర్చు. అసలు రాజధాని ప్లాన్ కోసం మన దేశంలో ఏ కన్సల్టీనైనా చంద్రబాబు సంప్రదించాడా అంటూ మేధావులు ప్రశ్నిస్తున్నారు. కొన్ని ప్లాన్‌లను ఆహ్వానించి వాటిలో శ్రేష్టమైన ప్లాన్‌ను ఎంపిక చేసుకోవడం శ్రేయస్కారంగా ఉండదా? అంటూ నిలదీస్తున్నారు. ఇటువంటి మేలైన అవకాశాన్ని మనదేశంలోని సంస్థలకు, ఇంజనీర్లకు ఇవ్వకుండా సింగపూర్ బాట పట్టడంలో వెనుక ఆంతర్యమేమిటంటూ అడుగుతున్నారు. సింగపూర్ నామతపం చేస్తున్న చంద్రబాబు రాజధాని మాస్టర్ ప్లాన్ పొందడం కంటే ముందు ఆ దేశం పాటిస్తున్న అనేక విషయాలను అధ్యయనం చేసి ఆయన పాటించి ఆపై ఆయన తమ్ముళ్ల సైన్యంతో ఆచరణలో పెట్టవలసిన అవసరముంది. అక్కడ పాలకులు బుగ్గకార్లు, కాన్వాయ్‌లు వాడుతున్నారో లేదో చంద్రబాబు తెలుసుకోవాలి. ఎన్నికల్లో డబ్బు పంపిణీ, ధన ప్రవాహం, మద్యం ప్రవాహం, దొంగ ఓట్లు వేయడం వంటి దుష్టాచారాలు ఉన్నాయో లేదో అధ్యయనం చేయాలి. సింగపూర్ నాయకుల నైతిక విలువలు, ఆదర్శనీయమైన నడవడిని చంద్రబాబు, ఆయన మంత్రులు, ఎంపిలు, ఎంఎల్ఎలు అలవర్చుకుని ఆచరణకు శ్రీకారం చుట్టాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఇది ఇల్లా ఉంటే రాజధాని నిర్మాణంలో చంద్రబాబుకూ ఆయన ప్రభుత్వానికి వాస్తుపిచ్చి బాగా పట్టుకుంది. కేవలం హిందూ మతానికి చెందిన వాస్తు విశ్వాసాన్ని ముఖ్యంగా మూడు ప్రముఖ మతాల ప్రజలపై ఆయన రుద్దతున్నారు. ఈ వాస్తు ప్రభావాన్ని ఆయన సొంత గృహం నుండే అనుసరిస్తున్నారు. రెండు పర్యాయాలు ముఖ్యమంత్రిగా నివాసం ఉన్న గృహాన్ని పూర్తిగా కూలగొట్టుకున్నారు. దానిని వాస్తు పద్ధతులకు అనుగుణంగా నిర్మించాలట. ఆయన ఇంటిని ఎట్లా కట్టుకుంటే ఎవరికీ అభ్యంతరం ఉండదు. మొత్తం రాష్ట్ర ప్రజలకు చెందిన కార్యక్రమాల్లో వాస్తు ఆలోచనలు అత్యంత విచారకరం. ఈ వాస్తు సవరణలకే ప్రజా ధనం కోట్లు గుల్లచేస్తున్నారు. వాస్తవానికి మనదేశానికే వాస్తు అనుకూలంగా లేదు. ఉత్తరాన బరువు, ఎత్తు ఉండకూడదని వాస్తు చెపుతుంది. అయితే మనదేశానికి ఉత్తరాన అత్యంత ఎత్తైన హిమాలయాలున్నాయి. దక్షిణా దిశన, పడమర దిశన పల్లు, గుంత ఉండకూడదని వాస్తు తెలుపుతుంది. కాగా మనదేశానికి దక్షిణాన, పడమర అగాధాలైన సముద్రాలున్నాయి. ఈ దోషాలన్నింటినీ ఏం చేయాలి. రాజధాని వాస్తు ఆలోచనకు ముందు చంద్రబాబు ఒక పలుగు, పార, తట్ట చేతపట్టాల్సి ఉంది. ఉత్తరానగల హిమాలయాల్ని ఆయన నేలమట్టం చేసి, పడమర దక్షిణ అగాధాలను పూడ్చివేస్తేగాని మనదేశానికి వాస్తుదోషం నివారణ కాదు. ఈ క్రమంలో ఇన్ని దోషాలతో దేశానికే అరిష్టంగా ఉన్న వాస్తును సరిచేయకపోతే! రాష్ట్ర రాజధానికి ఎన్ని వాస్తు జాగ్రత్తలు తీసుకున్నా ఏం లాభం? చంద్రబాబు ఆలోచించాలి.

ఎన్నికల వాగ్దానాలలో తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబుకు గిన్నీస్ అవార్డు ఇవ్వవచ్చు. 2014 ఎన్నికలలో తన పార్టీని అధికారంలోకి తెచ్చేందుకు చంద్రబాబు ప్రజలకు చేసిన వాగ్దానాలు 600 అంటూ కాంగ్రెస్ పార్టీ ఒక సిడిని విడుదల చేసింది. ఈ మొత్తం వాగ్దానాలలో అనేకం గాలికి వదిలివేసిన చంద్రబాబు ఏ ఒక్క దానిని పూర్తిగా అమలు చేయలేదని ఆ పార్టీ రాష్ట్ర ఎన్నికల సంఘానికి ఫిర్యాదు చేస్తూ, ఎన్నికల హామీల భంగానికి గాను ఆ పార్టీ గుర్తింపును రద్దు చేయాలని కోరింది. ఈ ఫిర్యాదును రాష్ట్ర ఎన్నికల సంఘమే కాదు, కేంద్ర ఎన్నికల సంఘం కూడా ఆహ్వానించదగినదే. ప్రజాస్వామ్య పాలనలో ఇలాంటి విషయాలపై చర్చ జరగాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్నికలలో నెగ్గడానికి అడ్డదిడ్డమైన హామీలు ఇస్తున్న రాజకీయ పార్టీలుకు, నాయకులకు ఇటువంటి ఫిర్యాదులపై చర్యలు చేపట్టినప్పుడు మాత్రమే అడ్డుకట్ట పడుతుంది. ఒక ఆరోగ్యకర సమాజానికి బాటలు వేయడానికి హామీల అమలుపై పర్యవేక్షణ, నిలదీత అత్యంత ఆవశ్యకం. అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రజలకు ఇచ్చిన హామీలను ఏ గాలికి వదిలేసిన తమను ప్రశ్నించేవారు ఎవరూ ఉండరు, తమ పదవులకు ఏవిధమైన ధోకా ఉండదని నోటికి వచ్చిన విధంగా హామీల సొల్లుగక్కి ప్రజలను వంచించే దశ నుండి ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి సర్వదా ప్రయోజనంగా ఉంటుంది. అయితే ఫిర్యాదు చేసిన కాంగ్రెస్ పార్టీతో పాటు దేశ వ్యాప్తంగా అన్ని రాజకీయ పార్టీలకు కూడా ఈ హామీల అమలు ఫిర్యాదు వర్తిస్తుందనేది విస్మరించలేని వాస్తవం.

*(రచయిత పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు)* వీ

# రైతులకు రిజర్వు బ్యాంకు శరగోపం

***చిన్న, సన్నకారు రైతాంగానికి ఇవ్వాల్సిన బ్యాంకు రుణాలు కార్పొరేట్ వ్యవసాయ రంగానికి మళ్లిస్తున్న ప్రభుత్వ విధానం వ్యవసాయ రంగం నుంచి చిన్న, సన్నకారు రైతులను దూరం చేస్తుందని అంటున్నారు వి. హనుమంతరావు***

ఎన్నికల ముందు తప్ప వ్యవసాయం అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మహా చెడ్డ చిరాకు. కార్పొరేట్ల రహదారిలో ముందుకు పోతుంటే కాళ్లకడ్డంపడతారు రైతాంగం. చిన్న, సన్నకారు రైతాంగం మరీనూ. నెత్తిన నోరుపెట్టుకుని బ్యాంకులు మాకు రుణాలివ్వడం లేదు మొర్రో అని ఒకటే రొద. వీళ్లను వెనకవేసుకొని వస్తాయి నెత్తిన వెంట్రుకలు కూడా లేని వామపక్షాలు. పెద్దపెద్ద రాజకీయ పార్టీల నాయకులు మీ రుణాలన్నీ మాఫీ చేస్తాం, మీ ఓటు మా పార్టీకి వేయండి అంటే పొలోమని వెళ్లి ఓటువేసి గెలిపిస్తే అధికార పీఠం ఎక్కి వెన్ను చూపించారు. ఇప్పుడు నెత్తీ నోరు కొట్టుకుంటున్నారు. ఇలా ముఖం చాటేయడం రాజకీయ నాయకులకు వెన్నతో పెట్టిన విద్య. కాని రిజర్వు బ్యాంకుకు ఏమిరోగం వచ్చింది? బ్యాంకులు 40 శాతం మేరకు ప్రాధాన్యత రంగాలకు రుణాలు ఇవ్వాలని, అందులో 18 శాతం వ్యవసాయానికి ఇవ్వాలని దేశంలో బ్యాంకులన్నింటికీ ఆదేశాలిచ్చి, ఇప్పుడు కార్పొరేట్ వ్యవసాయ సంస్థలకు, వ్యవసాయానికి సంబంధించిన అనేక ఇతర సంస్థలకు 18 శాతంలో చేర్చి వాళ్లకు కూడా ఆ శాతం నుంచే ఇవ్వాలని ఆదేశిస్తే, చిన్న, సన్నకారు రైతులకు దక్కేది అడుగూ బొడుగూ మాత్రమే. అంటే ఈ వర్గానికి చెందిన రైతాంగాన్ని వ్యవసాయం నుంచి నిష్క్రమించమని పరోక్షంగా చెప్పడమే. ఇది నిందారోపణ కాదనడానికి సాక్ష్యం రిజర్వు బ్యాంకు నిర్ణయాలే. ఈ 18 శాతంలో వ్యవసాయ రుణాలు, వ్యవసాయ మౌలిక సౌకర్యాలు, వ్యవసాయానికి మొదటి రకం రుణాలు అందరికీ తెలిసినవే. రెండవ రకం రుణాలు కార్పొరేట్ వ్యవసాయదారులు (ఉదాహరణకు కుర్‌కురే లాంటి తినుబండారాలు తయారు చేసే బహుళజాతి సంస్థలు, వ్యక్తిగత రైతులు  స్థాపించే కంపెనీలు, పార్ట్‌నర్‌షిప్ కంపెనీలు, రైతుల సహకార సంస్థలు, వ్యవసాయ సంబంధిత కార్యకలాపాలు నడిపే రైతులు (అంటే ఎరువులు, పురుగు మందులు అమ్మేవారు, వ్యవసాయ యంత్రాలు?) వీరందరికీ ఒక్కొక్కరికి రెండు కోట్ల వరకూ రుణాలు వ్వవచ్చు. మూడోతరగతి వ్యవసాయ మౌలిక సౌకర్యాలు అంటే గోదాములు, శీతలీకరణ గోదాములు, విత్తనాల ఉత్పత్తి నీటి రక్షణ సదుపాయాలు, పురుగు మందుల తయారీ వగైరా. వ్యవసాయానికి తోడ్పడే కార్యకలాపాలు, అగ్రీ క్లినిక్‌లకు వ్యవసాయావసరాల వ్యాపారస్తులు, ప్రాసెసింగ్‌కిచ్చే రుణాలు, ప్రాథమిక వ్యవసాయ రుణ సంస్థలు, వ్యవసాయ దారుల సేవా సంస్థలు ఈ రకాల పట్టీల్లో ఉన్న సేవ సంస్థల పేర్లన్నీ రాస్తూపోతే చాంతాడంత పొడవవుతుంది. ఈ సంస్థల కార్యకలాపాలన్నింటికీ ఈ 18 శాతం నుంచే రుణాలివ్వాలని రిజర్వు బ్యాంకు లైన్ క్లియర్ ఇచ్చింది. ఇంత మందికి, సంస్థలకు రుణాలిచ్చిన తర్వాత, చిన్న, సన్నకారు రైతులకు ఏమైనా మిగులుతుందా?

వాళ్లు చిన్న, సన్నకారు రైతులే గాని, వారి సంఖ్య, వారికున్న భూమి (కుటుంబ సభ్యుల సంఖ్య పెరిగేకొద్దీ ఉన్న చెక్కా, ముక్కా మరిన్ని ముక్కలవుతాయి) 2013 నాటికి అయిదు లక్షలు (50092771) చిన్న మొత్తాల బ్యాంకు అకౌంట్లుండగా, వారికి ఇచ్చిన రుణం రు. 2,81,120 కోట్లు. ఇన్నికోట్ల రుణాలు బ్యాంకులిచ్చాయి కదా. ఇంకేమిటంటున్నారా? బ్యాంకులిచ్చిన మొత్తం రుణంలో, ఈ చిన్న అకౌంట్లకిచ్చినది మొత్తం ఐదు శాతం మాత్రమే. మందెక్కువైతే మఠానికి చేటంటారు ఇదే దేశంలో మొత్తం 3.83 కోట్ల వ్యవసాయ కమతాలుంటే, అందులో చిన్న, సన్నకారు రైతుల కమతాల సంఖ్య మొత్తంలో 85.03 శాతం. వీరందరి కమతాల విస్తీర్ణం మొత్తం 15.96 కోట్ల హెక్టార్లలో 85.03 శాతం కాగా వారికిచ్చే రుణం ఆ మోతాదులో ఉండాలి కదా. ఉదా? మీరే లెక్కవేసుకోండి. పైనే చెప్పినట్లు 40 శాతం ప్రాధాన్యతా రంగాల వాటాలో 18 శాతం వ్యవసాయానికి ఇవ్వాలని నిర్దేశించగా, మార్చ్ 2013 నాటికి ఆ సంవత్సరంలో ఇచ్చింది 10.52 శాతం మాత్రమే. ఈ మొత్తంలో గ్రామీణ వ్యవసాయానికి ఇచ్చింది 4.49 శాతం మాత్రమే! మిగతాది పట్టణాల్లో, నగరాల్లో ఉండే వ్యవసాయ దారులకు, స్పష్టంగా చెప్పాలంటే కార్పొరేట్ వ్యవసాయ దారులకే.

*ఆధారం : బిజినెస్ స్టాండర్డ్ పత్రికలో పి.ఎస్.ఎం. రావు వ్యాసం.*

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)*

వీ

### విఎచ్ కాలమ్

- ధనికులకు దేశాన్ని అమ్మేసినది కాంగ్రెస్ – మోడీ
  తమరు అమెరికా వెళ్లి చేసింది అదేగా?
- సర్వసమభావమే మా మాట – మోడీ
  రైతులను వారి భూముల నుంచి పరిశ్రమలు కట్టబెట్టడం సర్వసమభావన అవుతుందా?
- జయలలితకు, మోడీ శుభకాంక్షలు రాజకీయ అవసరం మరి. ఇద్దరూ డిక్టేటర్లే
- కేంద్రం, రాష్ట్రాలు కలిసి పనిచేయాలి – మోడీ
  రాష్ట్రాలను హాంఫట్ చేయడానికా? దీని ముద్దుపేరే కో–ఆపరేటివ్ ఫెడరలిజం
- గాంధీ, నెహ్రూలపై గౌరవం, విశ్వాసం ఉన్నవారంతా ఐక్యం కావాలి – దిగ్విజయ్‌సింగ్
  ఆ నాయకులిద్దరూ ఇప్పుడు గుర్తుకువచ్చారా?
- కార్పొరేట్లు పన్నుల బాకీ రు. 3,11,080 కోట్లు – పార్లమెంట్. ఇది బ్యాంకులకు చెల్లించాల్సిన రెండున్నర లక్షల కోట్లు కాకుండానా?
- పేదలు, రైతులకు మా పార్టీ అనుకూలం–మోడీ
  కొన్ని రాష్ట్రాల్లో ఎన్నికలు రాబోతున్నాయి కదా!
- గత అరవై సంవత్సరాల మురికిని పోగొడతాం–విదేశాల్లో మోడీ ఉవాచ
  అందులో వాజ్‌పాయ్ పాలనలో మురికిని కూడానా?
- నల్లధనం దొరికితే 10 సంవత్సరాల జైలు–ప్రభుత్వం దొరకపుచ్చుకునే ప్రయత్నమే లేనప్పుడు, ఎన్ని సంవత్సరాలయితే నేమి? మొన్నటి జనరల్ ఎన్నికల్లో ఖర్చుపెట్టిందంతా నల్లధనమే కదా. దొరికిన నల్లధనం ప్రభుత్వ ట్రెజరీకి చేరిందా?
- ప్రభుత్వం చేసే ప్రతి పనికి అడ్డుతగలడం మానుకోవాలి – జైట్లీ తమరు ప్రతిపక్షంలో ఉన్నప్పుడు మీరు చేసింది అదేకదా.
- రేవంత్‌పై థర్డ్ డిగ్రీ ఉపయోగించవచ్చు – న్యాయమూర్తి అంటే ఇతర ఖైదీల మీద ఉపయోగించుకోవచ్చా?
- ఇందిరాగాంధీ డిక్టేటర్‌గా పాలించింది, ప్రజలు ఛీ కొట్టారు. మోడీజీ, చరిత్ర నుంచి నేర్చుకోండి.
- ఎన్‌డిఎ అంటే – నాన్–డెమోక్రటిక్ అలయన్స్

# బాలకార్మిక చట్టానికి సవరణలు

*బాలలు కార్మికులుగా మారడానికి గల రాజకీయార్థిక, సామాజిక కారణాలను పరిష్కరించకుండా ప్రభుత్వం చట్ట సవరణల ద్వారా మరోసారి మనుధర్మాన్ని పటిష్టపరిచే ప్రయత్నం చేస్తోందని అంటున్నారు* **సంతోష్**

**1986** నాటి బాల కార్మిక నిషేధ చట్టానికి సవరణలు తీసుకు రావడంతో పాటు దాన్ని 'బాలలు, కౌమార కార్మికుల నిషేధ చట్టం'గా మార్చాలని మూడేళ్లక్రితమే యుపిఎ ప్రభుత్వం సంకల్పించింది. సవరించిన బిల్లును డిసెంబర్ 2012లో రాజ్యసభలో ప్రవేశపెట్టింది. ఆనాటి ముసాయిదా బిల్లును పార్లమెంట్ స్థాయీ సంఘానికి పంపగా, ఆ సంఘం పరిశీలించి కొన్ని సవరణలు సూచించింది. మోడీ ప్రభుత్వం మరికొన్ని సవరణలు చేసింది. 2015 మే 13న సమావేశమైన కేంద్ర మంత్రి వర్గం బాలకార్మిక (నిషేధ – నియంత్రణ) చట్టం – 1986 కి సవరణలకు ఆమోదం తెలిపింది. 1986 నాటి చట్టం ప్రకారం ప్రమాదకరమైన 18 రంగాల్లో, 65 రకాల పనుల్లో మాత్రం 14–18 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్నవారికి ఉపాధి కల్పించకూడదు. అయితే బాలల హక్కుల కార్యకర్తలు బాలకార్మికత విషయంలో ఎటువంటి మినహాయింపులు లేకుండా బాలలను సంపూర్ణంగా శ్రమ నుంచి విముక్తి చేసే పూర్తిస్థాయి నిషేదం ఉండాలని దీర్ఘకాలంగా కోరుతున్నారు. యుఎన్ఓ 1990లో నిర్వహించిన బాలల హక్కుల కన్వెన్షన్‌లో బాలల హక్కుల్ని కాపాడతామని మన దేశం ఐక్యరాజ్యసమితి కి హామీ ఇచ్చింది. మరి ఆ మాట నిలుపుకున్నామా? నిలుపుకోకపోతే అందుకు బాధ్యులు ఎవరు?

జాతీయ నేర నమోదు సంస్థ బాలలపై దేశవ్యాప్తంగా 2011లో జరిగిన నేరాలకు సంబంధించిన నివేదికను జూలై 2012లో విడుదల చేసింది. ఈ నివేదికలో దేశ వ్యాప్తంగా 2011లో పిల్లలపై జరిగిన వివిధ దాడులకు సంబంధించి 33,098 కేసులు నమోదయ్యాయి. ఇందులో అత్యధికంగా మనదేశ రాజధాని ఢిల్లీలో 25.4 శాతం కేసులు నమోదయ్యాయి. భ్రూణహత్యలు, హత్యలకు సంబంధించి 1,514 కేసులు నమోదు కాగా, ఉత్తరప్రదేశ్‌లో అత్యధికంగా 326 నేరాలు జరిగాయి. చిన్నారులపై అత్యాచారాలకు సంబంధించి దేశంలో 7,112 కేసులు నమోదు కాగా వీటిలో మధ్యప్రదేశ్‌లో 1269, ఉత్తరప్రదేశ్‌లో 1088, మహారాష్ట్రలో 818 కేసులు నమోదయ్యాయి. ఆంధ్రప్రదేశ్‌లో లైంగిక వేధింపుల కేసులు 3,658, వరకట్నం కేసులు 1,899 నమోదయ్యాయి. బాలల హక్కుల చట్టం – 1986 ఉన్నప్పటికీ బాలలపై హింస కొనసాగడానికి కారణం చట్టంలోని లొసుగులేనని చెప్పవచ్చు. చట్టం అమలుకు అవసరమైన పర్యవేక్షక యంత్రాంగాన్ని పూర్తిస్థాయిలో నిర్దేశించకపోవడం, చట్టం ఉల్లంఘించినవారికి శిక్షలు తక్కువ స్థాయిలో నిర్దేశించడం. విముక్తి చేయబడిన బాల కార్మికులకు పునరావాసం, విద్య, ఆరోగ్యం, పౌష్టికాహారం వంటి సదుపాయాలను హక్కులుగా చట్టంలో నిర్దేశించ లేదు. బాలల హక్కుల పరిరక్షణ కార్యకర్తల్లో తీవ్ర అసంతృప్తి ఉంది. ఇండియాలో 47 శాతం అమ్మాయిలకు 18 ఏళ్లలోపు వివాహాలు జరుగుతున్నట్లు మరో సర్వే తెలిపింది. విద్యా సంస్థలలో సైతం ఉన్నత విద్యావంతులైన కొందరు గురువులు కూడా విద్యార్థులను రకరకాల చిత్రహింసలకు గురిచేసి లైంగిక నేరాలకు పాల్పడుతున్నారు.

బ్రిటిష్ వలస పాలనలో, నిరంకుశ ఏలుబడిలో బాల్యానికి తావులేని జీవితాన్ని 1947 వరకు మనవారు గడిపారు. అధికార మార్పిడి జరిగి ఆరున్నర దశాబ్దాలకు పైబడిన తర్వాత మళ్లీ బాల్యాన్ని శూన్యం చేసే ఈ దుర్మార్గపు చర్యకు ఈ మనుధర్మ సంతతి దిగజారింది. 'కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా' అంటూ పిల్లల్ని చదువులకు దూరంచేసి కులపరమైన వృత్తుల్లోకి దించండంటూ ప్రభువులు సెలవిస్తున్నారు. నిజమే వర్ణాశ్రమ వ్యవస్థను ప్రాణ ప్రతిష్టగా భావించే పాలకగణం ఇంతకన్నా మెరుగ్గా ఆలోచించగలుగుతుందా? 1986 నాటి బాల కార్మిక చట్టం 14 ఏళ్లలోపు బాలలతో పనిచేయించరాదని నిర్దేశిస్తేనే దేశంలో ఎక్కడ చూసినా ముక్కుపచ్చలారకుండానే రెక్కలమ్ముకొనే అభాగ్యులు కోకొల్లలుగా కనిపిస్తున్నారు. తాజా సవరణల ప్రకారం సర్కస్ మినహా టివి సీరియళ్లు, సినిమాలు, ప్రకటనలు ఇత్యాది వినోద రంగాల్లోనూ, క్రీడా రంగాల్లోనూ పిల్లలు పనిచేయవచ్చు. కానీ, పాఠశాల పనివేళలు ముగిసిన తరువాత, సెలవుల్లో మాత్రమే బాలలను పనిలో పెట్టుకోవాలనడం ఒక పరిహాసం మాత్రమే. గతంలో కూడ అనియత విద్య పేరుమీద పగటిపూట పనిచేసుకొని రాత్రిపూట చదువుకోవచ్చు అని వాదించాయి గత ప్రభుత్వాలు.

బాలల చేత ఎలాంటి పని చేయించడానికి వీల్లేదని రాజ్యాంగంలోని 24, 21–ఎ, 45 అధికరణలు తేటతెల్లం చేస్తున్నాయి. కర్మాగారాల చట్టం (1948), గనుల చట్టం (1952), బాల నేర న్యాయ (సంరక్షణ) చట్టం (2000), ఉచిత, నిర్బంధ విద్యాహక్కు చట్టం (2009) సైతం బాలకార్మిక వ్యవస్థను నిషేధిస్తున్నాయి. దేశంలో ఇలాంటి చట్టాలకు కొదవ లేదు. వాటిని సక్రమంగా అమలు చేయకపోవడం వల్లే బాలకార్మిక వ్యవస్థ నేటికీ నిరాటంకంగా కొనసాగుతోంది. బడి ఈడు పిల్లలను పనిలో పెట్టుకోవడాన్ని మన రాజ్యాంగం 24వ అధికరణం ద్వారా నిషేధించి దశాబ్దాలు గడుస్తున్నా, అందుకనుగుణంగా రకరకాల చట్టాలొచ్చినా... తదనంతర కాలంలో వాటికి సవరణలు తెచ్చినా అమలులో మాత్రం వరుస వైఫల్యాలే ఎదురవుతున్నాయి. పదేళ్లలో బాలకార్మిక వ్యవస్థను రూపుమాపాలని 1978లో తీర్మానించారు. 1988లో దాన్నే మరోసారి పునరుద్ఘాటించారు. ఇలా ఎప్పటికప్పుడు కొత్త గడువు విధించుకోవడం తప్ప సమస్య పరిష్కారం మాత్రం సాధ్యపడడం లేదు.

బాలకార్మికుల గురించి యునిసెఫ్ ఇచ్చిన నిర్వచనం ప్రకారం. '5–11 ఏళ్ల వయసు మధ్య ఉన్నవారు వారంలో కనీసం ఒక గంట ఆర్థిక కార్యకలాపంలో పాల్గొన్నా, లేదా 28 గంటల గృహకృత్యంలో పాలు పంచుకున్నా... 12–14 ఏళ్ల వయసు మధ్య ఉన్న బాలబాలికలు

వారానికి 14 గంటల పాటు ఆర్థిక కార్యకలాపంలో పాల్గొన్నా, 42 గంటల పాటు గృహకృత్యంలో పాల్గొన్నా.. అటువంటి వారిని బాల కార్మికులుగా పరిగణించాలి'. 1947 ఆగస్టు తర్వాత బాలకార్మిక వ్యవస్థకు వ్యతిరేకంగా భారత ప్రభుత్వం అనేక చట్టాలు చేసింది. భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలు 14 ఏళ్ల వయసు లోపు బాలబాలికలను పనిలో నియుక్తం చేయడాన్ని నిషేధించాయి. రాజ్యాంగంలోని 45 అధికరణ ప్రకారం 1960 నాటికల్లా దేశంలోని 6-14 ఏళ్లలోపు బాలబాలికలకు నిర్బంధ విద్యను అమల్లోకి తీసుకొని రావాలని నిర్దేశించింది. బాలకార్మిక వ్యవస్థను రూపుమాపకుండా సార్వత్రిక విద్య సాకారం కాదని సామాజిక కార్యకర్తలు ఉద్యమిస్తున్నారు. ఈ నేపథ్యంలోనే చట్టప్రకారం బాలలను పనిలో పెట్టుకోవచ్చు అని సవరణలు తీసుకరావడం పూర్తిగా తిరోగమన చర్య. అంతేకాక దివాళాకోరు ఆలోచనా విధానానికి ప్రతీక.

తాజా సవరణల వల్ల ప్రమాదకరం కాని కుటుంబ వ్యాపారాలు, వృత్తుల్లో 14 ఏళ్ల లోపు పిల్లలు పనిచేసేందుకు అనుమతి లభించింది. వ్యవసాయం, హస్తకళలు వంటి వంశ పారంపర్య కుటుంబ వృత్తుల్లో పిల్లలు పనిచేయడం వల్ల మెలకువలు నేర్చుకోవడం, తల్లిదండ్రులకు సహకరించడం, సామాజిక నిర్మాణం వంటి పరిస్థితుల వల్ల పిల్లలు పనిచేసేందుకు మినహాయింపు ఇచ్చినట్లు ప్రభుత్వం చెపుతుంది. కుటుంబ కులవృత్తుల్లో తల్లిదండ్రులకు సహకరించే అవకాశం పునరుద్ధరించడమంటే కులవృత్తులను ప్రోత్సహించడం తప్ప మరొకటి కాదు. అంతేకాకుండా పేద వర్గాల తల్లిదండ్రులకు, కుటుంబ పనుల్లో బాలలు సహకరిస్తే వారి కుటుంబ ఆర్థిక పరిస్థితి బాగుపడుతుందనే ప్రభుత్వ వాదన తన బాధ్యతను విస్మరించి బాలల బాల్యాన్ని బలి చేయడమే అవుతుంది. కుటుంబ వ్యాపారం అనే నిర్వచనంలోకి అగ్గిపెట్టెలు, బీడీలు, చుట్టల తయారీ, రత్నాలు పాలిష్, తివాచీలు, రైసు మిల్లులు, పీచు పరిశ్రమ వంటివి అనేకం రావచ్చు. బాల కార్మికులకు అత్యధిక డిమాండు ఉన్న రంగాలు కుడా ఇవే. వ్యవసాయ రంగంలోనే 70 శాతం బాల కార్మికులు ఉన్నారన్నది నిజం.

వ్యవసాయంతో పాటు, వివిధ కుటుంబవృత్తుల్లో తల్లిదండ్రులకు సహకరించడమన్నది మరోదారిలేక విధిలేని స్థితిలో జరుగుతున్నదే. పసివయసులో చదువుకూ, కుటుంబానికీ సమన్వాయం చేయడం సాధ్యం కాక, చదువునే క్రమంగా వదులుకుంటున్నవారి సంఖ్య మనదేశంలో తక్కువేమీ కాదు. ముఖ్యంగా నాట్లు వేసే కాలంలో వ్యవసాయ పనుల కారణంగా, పాఠశాలలకు రాని పిల్లల సంఖ్య చాలా హెచ్చుగా ఉంటుంది. ఇటువంటి పరిస్థితుల్లో, సాయంత్రం వేళల్లో, సెలవుల్లో అంటూ మినహాయింపులు ఇవ్వడం పరిస్థితిని మరింత దిగజారుస్తుంది. బడికి వెళ్లివచ్చినంత మాత్రాన చదువురాదు. వారికి ఆడుకోవడానికీ, చదువుకోవడానికీ అవకాశమున్న ఆ కాస్త సమయాన్ని ఇప్పుడు ప్రభుత్వమే అధికారికంగా పనిచేయడానికి కేటాయిస్తే వారికి చదువు అబ్బక, చివరకు కార్మికులుగానే మిగిలిపోతారు.

కుటుంబ వృత్తి పనుల్లో బాలలను అనుమతించడం వల్ల బాలల విద్యావకాశాలకు, కుటుంబ సామాజికార్థిక పరిస్థితులకు మధ్యలో సమతౌల్యం సాధించవచ్చునని ప్రభుత్వం పేర్కొనడం గమనిస్తే మోడీ ప్రభుత్వం మనుధర్మాన్ని అనుసరిస్తుందా? లేక భారత రాజ్యాంగాన్ని అనుసరిస్తుందా అన్న సందేహం కలుగక మానదు. నిజానికి విద్య కుల, మత, లింగ, వర్ణపరమైన అణచివేతను ప్రశ్నించే ప్రక్రియగా ఉండాలా? లేక వాటిపై ఆధారపడిన సామాజిక అల్లికను స్థిరపరిచేదిగా ఉండాల్నా అనే అంశాన్ని పాలకవర్గాలు మరొకసారి ఆలోచించుకోవాలి. ఎందుకంటే ఏది కుటుంబ స్వంత పరిశ్రమ, ఏదికాదు. నిర్ణయించడం లోనూ, అలాగే ఏది ప్రమాదకరమైన పరిశ్రమ, ఏదికాదు నిర్ణయించడం లోనూ చాల సందిగ్ధత ఉంటుంది.

రసాయనాలు, గనులు ఇత్యాది ప్రమాదకరమైన పని పరిస్థితులు ఉన్నచోట 14-18 సంవత్సరాలు ఉన్నవారికి ఉపాధి కల్పించకూడదు. ప్రమాదకరమైన పరిశ్రమల్లో బాలకార్మికులను వినియోగించేవారికి విధించే శిక్ష, జరిమానాలను కూడా పెంచుతూ సవరణలు చేశారు. శిక్షను మూడేళ్ల వరకు, జరిమానాను రు. 50,000లకు పెంచారు. సవరించిన బాలకార్మిక (నిరోధక, నియంత్రణ) చట్టం అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఒ) 138, 182 తీర్మానాలకు అనుగుణంగా లేదు. పనిలో నియామకానికి ఈ రెండు తీర్మానాలు కనీస వయోపరిమితిని నిర్దేశించాయి. 18 ఏళ్లలోపు వారిని ఉద్యోగంలో నియమించడాన్ని నిషేధించాయి. ఇలా నియమించడం వల్ల వారికి ఆరోగ్యం, భద్రత, విశ్రాంతి, వినోదం, వికాసం, నైతిక విలువలకు నష్టం వాటిల్లుతోందని వివరించాయి.

ఇప్పటికీ మన కుటుంబాల్లో ఆడపిల్లలంటే వివక్ష రాజ్యమేలుతోంది. ఈ సడలింపువల్ల ముందుగా నష్టపోయేది ఆడపిల్లలే. దీనివల్ల వారి బతుకులు మరింత దుర్భరంగా మారే ప్రమాదం ఉంది. ఈ కొత్త మినహాయింపులు ఆడపిల్లలకు చదువు దక్కకుండా చేస్తాయి. కుటుంబ పనుల్లో ఇరుక్కుని స్కూలుకు పోలేని దుస్థితి ప్రప్రథమంగా ఉన్నది ఆడ పిల్లలకు మాత్రమే కనుక వారికి మరింత అన్యాయం తప్పదు. వేసవి సెలవుల్లో, పాఠశాల పనిగంటలు ముగిసిన తర్వాతే పిల్లలతో పని చేయించాలనే నిబంధన ఉంది కాబట్టి ఎటువంటి ఇబ్బంది ఉండదనే వాదన ఉంది. బాలకార్మిక నిషేధ చట్టం ఉండగానే దేశంలో 33 శాతానికి పైగా బాలకార్మికులు ఉన్నట్లు అంతర్జాతీయ సంస్థలు వెల్లడిస్తున్న వాస్తవాన్ని గుర్తించినవారెవరూ ఈ వాదనను అంగీకరించరు. అంతేకాదు, పాఠశాల వదిలిన తర్వాత ఆటపాటలతో గడపాల్సిన బాల్యాన్ని పనిలోపెట్టి దెబ్బతీయడం ఏ విధంగానూ సమర్థనీయం కాదు. షరతులతో కూడిన మినహాయింపులని ఎంత స్పష్టంగా చెబుతున్నా, ఆచరణలో షరతులు కాక మినహాయింపులు మాత్రమే అమలవుతాయని బాలల హక్కుల కార్యకర్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

గుజరాత్‌లోని బిటి వ్యవసాయ క్షేత్రాల్లో పని చేయడానికి తెలుగు రాష్ట్రాలతో సహ అనేక రాష్ట్రాల నుంచి పిల్లలను తరలిస్తున్న నేపథ్యంలో ఇప్పుడు అక్రమరవాణా కూడా అధికం కావచ్చును. అలాగే బాలకార్మికుల సంఖ్య అత్యధికంగా తయారీరంగంలో, రైస్ మిల్లుల్లో బీడీ తయారీ, పీచు పరిశ్రమ ఇత్యాది రంగాల్లో బాగా పెరగవచ్చు. కుల వృత్తులలో బాలకార్మికులను ప్రవేశపెట్టడమంటే మళ్లీ పాకీవారినీ, వెట్టివారినీ, చాకలి వారినీ, మంగలి వారినీ, ఇతర బతుకుదెరువు వృత్తుల వారినీ తయారు చేయడం ద్వారా మోడీ సర్కారు మనుధర్మ సూత్రాలను యథాతథంగా అమలు చేయడమే లక్ష్యంగా ఎంచుకొన్నదనే వాస్తవం స్పష్టమవుతోంది. నిజానికి, చేతిలో పైసలున్నవారెవరూ తమ పిల్లల్ని కులవృత్తుల్లో దించాలని అనుకోవడం లేదు. ఇంగ్లిషు చదువులు చెప్పించేందుకు పట్టణాలకు వలసపోతున్నారు. ఎటుతిరిగి రెక్కాడితేగానీ డొక్కాడని కుటుంబాల వారే పిల్లల్ని ఈ వృత్తుల్లోకి ప్రవేశపెట్టే అవకాశం ఉంటుంది. కాబట్టి కిందివాడు కిందనే, పైవాడు పైనే ఉండే వక్రనీతి అసమాన సమాజాన్ని స్థాపించవచ్చనే హిందూత్వ వాదుల భావన అమలు చేసినట్లు అవుతుంది.

# ప్రజాస్వామిక భావాలపై అణచివేత

*మద్రాసు ఐఐటిలో అంబేద్కర్ - పెరియార్ స్టడీ సర్కిల్‌ను నిషేధించి ఉన్నత విద్యాసంస్థలో కూడా భావ ప్రకటన స్వేచ్ఛ లేకుండా చేస్తున్నారనీ, నిషేధాన్ని తొలగించుకున్నా ప్రజలు నిత్యం అప్రమత్తతతో మెలగాల్సిన అవసరముందనీ అంటున్నారు* **బి. రామకృష్ణ**

వ్యవస్థను ప్రశ్నిస్తారా? ప్రధానమంత్రినే విమర్శిస్తారా? ప్రభుత్వ విధానాలను సమీక్షిస్తారా? బ్రాహ్మనీయ భావాలను వ్యతిరేకిస్తారా? మాంసాహారానికి మద్దతుగా నిలబడతారా? స్వామి వివేకానంద లేదా హిందూ ప్రవక్తలు, స్వామిజీలు చెప్పిన ధర్మ సూత్రాలను ఆచరిస్తూ ప్రచారం చేయాలే గానీ, సనాతన హిందూ ధర్మ శాస్త్రాలను ధిక్కరిస్తారా? ఆత్మ గౌరవమని గొంతెత్తుతారా? సమానత్వాన్ని కోరతారా? అంబేద్కర్, పెరియార్‌ల ఆలోచనలతో హిందూమత భావజాలాన్ని ధిక్కరించే సాహసం చేస్తారా? అధికారం మాచేతుల్లో ఉంది. తస్మాత్ జాగ్రత్త. మీ భావాలను అణచివేసే యంత్రాంగం మా చేతుల్లో ఉంది. ఏమైనా చేయగలం అనడానికి నిదర్శనగా ఐఐటి మద్రాస్‌లోని అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్ (ఎపిఎస్‌సి) గుర్తింపును రద్దు చేశారు. ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా వచ్చిన నిరసనల నేపథ్యంలో జూన్ 7న ఈ సంస్థ గుర్తింపును పునరుద్ధరించారు. గుర్తింపు రద్దు నిర్ణయాన్ని వెనక్కితే తీసుకున్నారు గానీ, ఈ నిర్ణయం వెనుకున్న హిందూత్వ భావజాల నిరంకుశత్వం, దాని కనుసన్నల్లో నడుస్తున్న బిజెపి అధికారం నీడలో ప్రజాస్వామిక ఆలోచనలపై ఉండబోయే ఆంక్షల గురించి ఆలోచించాల్సి ఉంది.

ప్రస్తుతం బిజెపి అధికారంలోకి వచ్చాక హిందూమత అగ్రకుల బ్రాహ్మణీయ భావజాలానికి మరింత బలం చేకూర్చినట్లైంది. బిజెపి యేతర ప్రభుత్వాలు అధికారంలో ఉన్నప్పుడు కూడా ఈ భావజాలమే రాజ్యమేలుతూ వచ్చింది. సమాజంలో వేళ్లూనికుని ప్రత్యక్షంగా పరోక్షంగా ఈ భావజాలం ప్రజల మెదళ్లలో ఇమిడేలా చేయబడింది. ఈ భావజాలానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఎన్నో నిరసనలు, పోరాటాలు వచ్చాయి. వస్తున్నాయి. అవి తీవ్ర నిర్బంధాలకు, అణచివేతలకు గురవుతున్నాయి. దేశ మూలవాసులైన ఆదివాసులు కొనసాగిస్తున్న ఉద్యమాలు, దళిత ఉద్యమాలు వీటన్నిటితో సంఘీభావంగా మౌలిక మార్పు కొరకు సమానత్వం కొరకు ప్రతివారూ ఆత్మగౌరవంతో బతికేలా శ్రమకు తగిన గౌరవం, ఫలితం దక్కే సమాజం కోసం జరుగుతున్న ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమాల్లో ఈ నిరసనలు చూడవచ్చు.

అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్ అనే విద్యార్థి గ్రూప్ మానవవనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ (ఎంఎచ్‌ఆర్‌డి), కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఐఐటి మద్రాస్‌లో ఎస్‌సి, ఎస్‌టి విద్యార్థులను సమీకరిస్తోందని ప్రధానమంత్రి, హిందువులకు వ్యతిరేకంగా ద్వేషాన్ని పురికొల్పుతున్నదని శాఖాహారులకు ప్రత్యేక భోజనశాలలు, ఐఐటిలలో హిందీ వాడకానికి సంబంధించి ఎంహెచ్‌ఆర్‌డి జారీ చేసిన సర్క్యులర్లకు వ్యతిరేకంగా పోస్టర్లు, కరపత్రాలు తీసిందని, ఎపిఎస్‌సి వారు తీసిన కరపత్రం జత చేస్తూ ఎపిఎస్‌సిని నియంత్రించాల్సిందిగా కోరుతూ ఎంహెచ్‌ఆర్‌డికి ఆకాశరామన్న ఉత్తరం రాశారు.

ఎపిఎస్‌సి వారు తీసిన కరపత్రంలోని విషయాలను చూస్తే గనుక ఆకాశరామన్న ఉత్తరం డొల్లతనం అర్థమవుతుంది. అందులో ఏముందో ఒకసారి చూద్దాం. 21 శాతం ఉన్న అగ్రకులం వారు అధికారంలో, ప్రభుత్వ, ప్రైవేటు రంగాల్లో ఉన్నత స్థానాల్లో 75 శాతం ఉన్నారు. కిందిస్థాయి, కాయకష్టం చేసే ఉద్యోగాలు వందశాతం దళితులకే రిజర్వ్ చేయబడ్డాయి. కుల్లి కంపుకొడుతున్న కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఎందరో పోరాటం చేశారు, చేస్తున్నారు. బ్రాహ్మణాధిక్యతను దాని గుత్తాధిపత్యాన్ని ఎండగడుతూ శాస్త్రీయమైన, మేధోపరమైన కృషిని డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ చేశారు. మోదీ ప్రభుత్వం హిందూత్వ అజెండాను ముందుకుతెస్తూ అదే సమయంలో మల్టీనేషనల్ కార్పొరేట్లు తల్లిభారతిని

---

చట్టం బలంగా ఉన్నా అమలు కాని దేశం మనది. బాలలు పని చేయడానికి ఎటువంటి మినహాయింపులూ లేనప్పుడే బాలకార్మిక (నిషేధ – నియంత్రణ) చట్టాన్ని సంపూర్ణంగా అమలు చేయలేని దుస్థితి మనది. చట్టాలు అమలు చేయడం సాధ్యంకాక, వాటిని సన్నగిల్లచేయడం ఇప్పుడు జరుగుతున్నది. ఇప్పటి వరకు బాలకార్మిక నిషేధ చట్టాల అమలుకు వీలుగా కనీసచర్యలు తీసుకోని ప్రభుత్వం ఒక ఆదర్శంగా కూడా చట్టాన్ని నిలబెట్టుకోకుండా, సామాజిక స్థితిగతుల పేరిట మినహాయింపులు ఇస్తూ చివరకు వాటిని ఎందుకూ కొరగానివిగా మార్చే ప్రయత్నం ఇప్పుడు కనిపిస్తున్నది. ఫలితంగా బాలలు విద్యాపరంగా, మానసికంగా, శారీరకంగా వికాసం చెందే అవకాశాలను ఈ చట్టం హరిస్తుంది.

బాలకార్మిక వ్యవస్థ సమాజంలోని అనేక సమస్యలకు మూల కారణంగా ఉంది. రాజకీయార్థిక, సామాజిక సమస్యలను విస్మరించి బాలకార్మిక వ్యవస్థనే బాలల సమస్యగా గుర్తించినంత కాలం సమస్యకు పరిష్కారం దొరకదు. బాలకార్మిక వ్యవస్థను సామాజికార్థిక సమస్యగా గుర్తించాల్సిన అవసరం ఉంది. బాలలకు వ్యవసాయంతో పాటు మరికొన్ని పనులు చేసేందుకు అనుమతించే చట్టాల వల్ల విద్యాహక్కు చట్టం కూడ అమలు కాక బాలల విద్యా ప్రయోజనాలకు ప్రతికూలంగా ఈ సవరణలు మారనున్నాయి. అందువలన 18 సంవత్సరాల వయోపరిమితి వరకు బాల కార్మికులకు ఎటువంటి మినహాయింపులు ఇవ్వకుండా నిషేధించాలి. బాలలందరికీ సమాన అవకాశాలు అందించడానికి 1990 బాలల హక్కుల కన్వెన్షన్ నిర్ణయానుసారం 1986 బాలకార్మిక నిషేధ చట్టాన్ని, 2009 విద్యా హక్కు చట్టాన్ని మరింత మెరుగు పరచాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

కొల్లగొట్టడానికి సహకరిస్తున్నది. భూసేకరణ బిల్లు, ఇన్సూరెన్స్ బిల్లు, కార్మిక చట్టాల సవరణ, కార్పొరేట్ అనుకూల బడ్జెట్, పబ్లిక్ సెక్టార్ యూనిట్లలో వందశాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతి వంటి విధానాలను అనుసరిస్తూ భారత ప్రజల జీవితాలను కొల్లగొట్టడానికి కార్పొరేట్ శక్తులకు అనుకూలంగా బాటలు వేస్తున్నది మోదీ ప్రభుత్వం. గోవధను నిషేధిస్తూ, వేదాలను ప్రోత్సహిస్తూ ఘర్‌వాపసీ పేరుతో సాధారణ ప్రజానీకాన్ని మతపరంగా ఏకీకరణ చేస్తున్నారు. స్వదేశీ పేరుతో తల్లిభారతిని అమ్ముతున్నారు. మతం పేరుతో భారత ప్రజలను విభజిస్తున్నారు. అని రాసిన కరపత్రం అభ్యంతరకరం ఎలా అవుతుంది? ఇవేమైన నిషిద్ధ అభిప్రాయాలా? ప్రజాస్వామిక దేశంలో భావవ్యక్తీకరణలో భాగమే ఇవి కాదా! కాని ఆకాశరామన్నకు మాత్రం స్టడీసర్కిల్ పంచిన కరపత్రాల్లో పోస్టర్లలో విద్వేష భావజాలం కనిపించింది. అవిచూసిన ఎంఎచ్ఆర్‌డికి సైతం అలాగే కనిపించాయి. మోడీ ప్రభుత్వం కార్పొరేట్ అనుకూల నిర్ణయాలు తీసుకుంటున్నదని అన్నందుకు అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్ గుర్తింపు రద్దు చేయబడితే ఈ దేశంలో ఏ ఒక్కరు కూడా ప్రభుత్వాన్ని గానీ, ప్రభుత్వాలు అవలంభిస్తున్న విధానాలను గానీ వ్యతిరేకించగూడదు. శాఖాహారమే ఉన్నతమైనదని మాంసాహారాన్ని చిన్నచూపుగా చూడడం, అసహ్యకరంగా భావించడం బీఫ్ పట్ల తీవ్ర వ్యతిరేకతను కలిగిస్తూ కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు గోవధను నిషేధిస్తూ బీఫ్‌ను అమ్మడమే నేరంగా చట్టాలు తెచ్చాయి. దీనికి వ్యతిరేకంగా భిన్నాభిప్రాయాన్ని ప్రకటించడం నేరంగా మారింది. అంబేద్కర్ మాటలను చర్చలో పెట్టడాన్ని సహించని ఆకాశరామన్నకున్న తెలివి ఏపాటిదో అలాగే ఏ భావజాలానికి చెందినవారో తెలుసుకోవచ్చు. ఆకాశరామన్న ఉత్తరం ఆధారంగా ఎంఎచ్ఆర్‌డి ఉత్తరం రాయడం అంటే ప్రజాస్వామిక, విలువలపై దానికున్న గౌరవం ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు. ప్రచారం కోసం ఐఐటి మద్రాస్ పేరును తమ కరపత్రంలో వాడుకున్నారని (నిజానికి తమ స్టడీ సర్కిల్ పేరుకింద చిరునామాగా ఐఐటి మద్రాస్ అని రాసుకున్నారు.) ఇది సంస్థ మార్గదర్శకాలకు విరుద్ధమని చెపుతూ ఎపిఎస్‌సి గుర్తింపును రద్దు చేశారని 2015 మే 29న ఐఐటి మద్రాస్ వివరణ ఇచ్చింది. గుర్తింపు రద్దు చేసిన వారం రోజులకు ఈ వివరణ వస్తుంది. బయట సమాజంలో వస్తున్న ఒత్తిడికి ప్రతిగా ఈ వివరణ వచ్చిందని అర్థం చేసుకోవచ్చు. ఈ ఆరోపణలో బలం లేదు, సహేతుకత లేదు కేవలం అణచివేత కోసం సాకుగా ఉపయోగించారన్నది తెలుస్తున్నది.

ఆకాశరామన్న ఉత్తరం ఎంఎచ్ఆర్‌డికి 2015 ఏప్రిల్ 29న చేరింది. దీని ఆధారంగా ఎంఎచ్ఆర్‌డిలోని ఉన్నత విద్యాశాఖ భారత ప్రభుత్వ కార్యదర్శి ప్రిస్కామాథ్యూ 2015 మే 15న ఐఐటి మద్రాస్ డైరెక్టర్‌కు ఉత్తరం రాశారు. ఆ ఉత్తరంలో వివాదస్పద కరపత్రాలు పంచుతూ, పోస్టర్లు వేస్తూ విద్యార్థుల్లో ద్వేషపూరిత వాతావరణాన్ని సృష్టిస్తున్న ఎపిఎస్‌సికి సంబంధించి అభిప్రాయాలను (కామెంట్స్) పంపమని కోరారు. ఈ ఉత్తరం ఆధారంగా డీన్ ఆఫ్ స్టూడెంట్స్ శివ కుమారన్ ఎన్.శ్రీనివాసన్ ఎపిఎస్‌సి వారు ఐఐటి సంస్థ కల్పించిన వెసలుబాట్లను దుర్వినియోగం చేసినందుకు ఎపిఎస్‌సి గుర్తింపును రద్దు చేస్తున్నామని చెపుతూ ఏక వాక్య సమాచారంతో 2015 మే 22న మెయిల్ పంపారు. ఆకాశరామన్న ఉత్తరం చేరిన 15 రోజుల్లోనే ఎంఎచ్ఆర్‌డి స్పందిస్తుంది. ఎంఎచ్ఆర్‌డి నుండి ఉత్తరం వచ్చిన ఏడో నాడే ఎపిఎస్‌సి గుర్తింపు రద్దవుతుంది. ఎంత త్వరగా ఈ ప్రక్రియ పూర్తైందో చూడండి. ఎపిఎస్‌సివారి నుండి కనీస వివరణలు కోరకుండానే లేదా ఎపిఎస్‌సి వారి కార్యకలాపాలను పూర్తిగా తెలుసుకోకుండానే వెంటనే గుర్తింపును రద్దుచేశారు. ఎపిఎస్‌సి వారి కార్యకలాపాలన్నీ కూడా వారికి కేటాయించబడిన స్టూడెంట్ ఫ్యాకల్టీ అడ్వైజర్ సంప్రదింపులతోనే జరిగాయని విద్యార్థులు చెపుతున్నారు. అప్పుడు లేని అభ్యంతరాలు ఇప్పుడెలా వస్తున్నాయో వారికే తెలియాలి.

'అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్' పేరులోని అంబేద్కర్, పెరియార్ పదాలను తీసేయమని ఈ సంస్థ మొదలైనప్పటి నుండి (2014 ఏప్రిల్ 14) డీన్ ఆఫ్ స్టూడెంట్స్ రెండు సార్లు ప్రతిపాదించారు. ఈ పేర్లు రాజకీయాలను సూచిస్తున్నాయని ఆయన గారి అభిప్రాయం. అయితే ఇదే సంస్థలో వివేకానంద స్టడీ సర్కిల్ అనే విద్యార్థి సంస్థ ఒకటుంది. అందులో హిందుత్వాన్ని తెలిపే వివేకానందుడి పేరుంటే తప్పుగా మాత్రం కనిపించడం లేదు. అంబేద్కర్, పెరియార్‌లు దేశంలోని అమానవీయ కులవ్యవస్థపై హిందూమత దురన్యాయాలపై, బ్రాహ్మణీయ భావజాలానికి వ్యతిరేకంగా బలమైన గొంతును వినిపించారు. వీటిపై అధ్యయనం చేసి విస్తారమైన సాహిత్యాన్ని, సిద్ధాంతాలను సృష్టించారు. అలాంటి వారి పేర్లపట్ల వ్యతిరేకత చూపిన డీన్ ఆఫ్ స్టూడెంట్స్ ఆలోచనలు ఏం సూచిస్తున్నాయో అర్థం చేసుకోవడం కష్టమేమీ కాదు.

ప్రభుత్వ విధానాలను సమీక్షించే, విమర్శించే, వ్యతిరేకించే, అవసరమైతే ఆందోళనలు నిర్వహించే కనీస ప్రజాస్వామిక హక్కు ప్రతి పౌరునికి అలాగే విద్యార్థులకు ఉంటుంది. ఇది లేకుండా చేయాలనుకోవడం ఫాసిస్టు చర్య అవుతుంది. భావిసమాజానికి విజ్ఞానవంతులైన శక్తులు ఉన్నతస్థాయి విద్యా సంస్థల నుండి వస్తున్నప్పుడు ఆ విద్యార్థులకు సమాజం పట్ల, సామాజిక సమస్యల పట్ల, సామాజిక దృక్పథాల పట్ల విమర్శనాత్మకమైన, శాస్త్రీయమైన అవగాహనలు ఏర్పడాల్సి ఉంటుంది. కేవలం పుస్తక పురుగులుగానో, పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించడం కోసం కష్టపడి చదివేవారు గానో లేదా కేవలం టెక్నీషియన్‌లు గానో, అకాడమిషియన్‌లు గానో, వృత్తి పర నిపుణులుగానో మాత్రమే తయారైతే సమాజానికి జరిగే మేలు తక్కువే. సామాజిక సమస్యలపై అవగాహనతో, వాటి పరిష్కార దిశలో తమ మేధస్సును వినియోగించేలా సమానత్వ విలువలు, ప్రజాస్వామిక దృక్పథాలు పెంపొందించేలా వారి విజ్ఞానం వికసించాల్సి ఉంటుంది. అందుకొరకు విద్యాసంస్థల్లో భిన్నాభిప్రాయాలకు, అలోచనలకు, అధ్యయనాలకు, భిన్న ప్రాపంచిక దర్శనాలపై చర్చలకు, అవగాహనలకు చోటుండాలి. అలా ఉన్నప్పుడు అసమానతలకు, అవమానాలకు, కులం, మతం ప్రాంతం పేరుతో వివక్షతలకు గురవుతున్నవర్గాల సమున్నత అభివృద్ధికొరకు విద్యార్థుల్లో మానవీయ, మేధోపరమైన వికాసం జరుగుతుంది. భిన్నాభిప్రాయాలకు తావులేకుండా కేవలం బిజెపి, హిందూమత సంస్థలు నమ్మే అభిప్రాయాలకు, వారి ఆచరణలకు మాత్రమే వీలుండేలా ఎంఎచ్ఆర్‌డి గాని, దాని ప్రోద్భలంతో ఎపిఎస్‌సి గుర్తింపును రద్దు చేసిన ఐఐటి మద్రాస్‌గానీ నిరంకుశంగా వ్యవహరించడం, ఈ నిర్ణయానికి మద్దతుగా మానవ వనరుల మంత్రి నిలబడడం ఈ దేశంలోని మోడీ పాలన స్వభావాన్ని ప్రతిబింబిస్తుంది.

ఇలా స్వతంత్ర ఆలోచనలపై ఆంక్షలను విధిస్తూ మరోవైపు ఉన్నత స్థాయి విద్యాసంస్థల్లో ఆర్ఎస్ఎస్ విశ్వాసాలను నెలకొల్పడం కోసం తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ఎన్‌సిఇఆర్‌టి డైరెక్టర్‌గా ఉన్న ప్రొఫెసర్ పర్విన్ సింక్లైర్‌ను డైరెక్టర్ పదవి నుండి తప్పుకోమని ఎంఎచ్ఆర్‌డి చెప్పింది. అయితే ఆమెపై ఎలాంటి విచారణగానీ, చార్జ్‌షీట్‌గానీ లేకుండా విధుల నుండి విధినిర్వహణ కాలం ముగియక ముందే పక్కకు

పెట్టారంటే, తమకు అనుకూలమైన భావజాలన్ని పాఠ్య ప్రణాళికలో చేర్చగలిగే వారి కోసం ఈ పదవిలో నుండి ఆమెను తొలగించారని అనుకోవచ్చు. కేంద్రీయ విద్యాలయాల్లో జర్మన్‌ను తొలగించి సంస్కృతాన్ని ప్రవేశ పెట్టమని గత విద్యా సంవత్సరం మధ్యలో ఉన్నఫలంగా ఉత్తర్వులు ఇచ్చారు. హిందూ మతతత్వవాదులు సంస్కృతాన్ని అన్నిభాషలకు మాతృక అని నమ్ముతారు. ఇది శాస్త్రీయంగా నిరూపించబడలేదు. భారత రాజ్యాంగంలో సంస్కృతాన్ని ఆధునిక భారతీయ భాషా జాబితాలో చేర్చలేదు. అయినా కూడా సంస్కృతాన్ని విద్యార్థులపై రుద్దే పనికి పూనుకున్నారు.

కులవ్యవస్థను సమర్థిస్తూ పుస్తకం రాసిన వై. సుదర్శనరావును భారతీయ చరిత్ర పరిశోధన సంస్థ (ఐసిహెచ్‌ఆర్) కు అధ్యక్షునిగా నియమించారు. ఇతడు ఆర్‌ఎస్ఎస్ చే ప్రారంభించబడిన జాతీయవాద దృక్పథంతో చరిత్రను రాయడానికి, సంస్కృతాన్ని ప్రోత్సహించే లక్ష్యంగా పనిచేసే అఖిల భారతీయ ఇతిహాస్ సంకలన యోజన అనే సంస్థ ఆంధ్రప్రదేశ్ విభాగానికి అధ్యక్షునిగా పని చేశాడు.

గుజరాత్ రాష్ట్రంలోని పాఠశాలలో సప్లమెంటరీ రీడర్‌గా బోధించబడే తేజోమయ భారత్ అనే పుస్తకంలో ఎన్నో అశాస్త్రీయమైన అభూత కల్పనలు ఉన్నాయి. ఈ పుస్తక సలహాదారులు ఆర్‌ఎస్ఎస్‌చే నియంత్రించే విద్యా భారతికి చెందినవారితో కలిసి పని చేస్తున్నారు. ఆర్‌ఎస్ఎస్ మౌత్‌పీస్ అయిన 'పాంచజన్య పత్రిక ఎడిటర్ బల్దేవ్ శర్మను నేషనల్ బుక్ ట్రస్ట్‌కు ఛైర్మన్‌గా నియమించారు. ముంబై, ఢిల్లీ ఐఐటిలకు చెందిన ఛైర్మన్, డైరెక్టర్‌లను రిజైన్ చేసేలా చేశారు. ఉన్నతస్థాయి విద్యా సంస్థల్లో ఆర్‌ఎస్ఎస్ భావజాలం ఉన్న వారిని నియమించి హిందూ మతతత్వ భావాలను ముందుకు తెస్తున్నారు. ఉన్నత విద్యాసంస్థల్లో హిందూ మతతత్వ భావజాలం ఉన్నవారిని నియమిస్తూ లౌకిక, ప్రజాతంత్ర భావాలను నిలువరించే ప్రయత్నాలు బలంగా జరుగుతున్నాయి. ఈ క్రమంలో భాగంగానే ఎపిఎస్‌సి గుర్తింపు రద్దు చేయడాన్ని చూడాలి.

ఘర్‌వాపసి పేరుతో దేశంలో మైనారిటీ మతస్తుల్లో భయాం దోళనలను మతపర ఉద్రిక్తతలను, మతకల్లోలాను సృష్టించడం అవాసవ్తమైనవేమి కాదు కదా? రాజ్యాంగం ప్రకారం భారత పౌరులు తమకు నచ్చిన మతాన్ని పాటించే స్వేచ్ఛ ఉన్నది. కులాల విభజనతో పుట్టుకతోనే మనుషులు అసమానులుగా, అవమానపరచబడేవారుగా, ఆత్మగౌరవం లేనివారుగా ఉండే స్థితిని కల్పించిన హిందూమతాన్ని అంబేద్కర్, పూలే, పెరియార్‌లు చీల్చి చెండాడినది చారిత్రక వాస్తవమే కదా? ఇవే విషయాలను ఎపిఎస్‌సి చర్చల్లో పెట్టడం, ప్రచారం చేయడం తప్పెలా అవుతుంది?

భూసేకరణ బిల్లు, కార్మిక చట్టాల సవరణ, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతి వంటి అనేక కార్పొరేట్ అనుకూల విధానాలు పాటిస్తున్న మోడీ ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని అభాసుపాలు చేస్తున్న విధానాన్ని వ్యతిరేకించకుండా ఉండడం సరైందెలా అవుతుంది? బిజెపి తను అధికారంలోకి రాకముందు యుపిఎ పాలనను తిట్టిన తిట్టు తిట్టకుండా తీవ్రంగా విమర్శించిన మాట నిజం కాదా? అలా అనే హక్కు కేవలం బిజెపి దాని అనుంగు సంస్థలకే ఉండాలా? మరెవ్వరికీ ఉండకూడదా? అలాంటప్పుడు ఇది ప్రజాస్వామ్యం ఎలా అవుతుంది? ఆకాశ రామన్న ఉత్తరం సాకుతో ఎంఎచ్‌ఆర్‌డి తమ విధానాలపై వ్యతిరేకతను సహించలేని తన నిజస్వరూపాన్ని ఎపిఎస్‌సిపై ఐఐటి మద్రాస్‌కు ఉత్తరం రాయడం ద్వారా బయటపెట్టుకుంది.

ఇదేదో ఎపిఎస్‌సి విద్యార్థుల సమస్యగానో చూడడం సరైందికాదు. మొత్తంగా హిందూ మతసంస్థలు తమ ప్రమాదకర భావజాల వ్యాప్తి కోసం, అలాగే తమ భావజాలానికి వ్యతిరేకంగా ఉన్న ఏ ఆలోచనలను సహించకుండా అణచివేయడానికి, వాటిని కలిగి ఉన్నవారిని భయ భ్రాంతులకు గురిచేయడానికి పడరానిపాట్లు పడుతున్నారు. ప్రస్తుతం వారికి ప్రభుత్వ రాజకీయాధికారం అంద దొరికింది. కేంద్ర ప్రభుత్వం ద్వారా అలాగే పలు రాష్ట్రాల్లో అధికారంలో ఉన్నారు కాబట్టి వారి మతపరమైన అఖండ భారత్, హిందూ రాష్ట్రం అనే అజెండాను ముందుకు తీసుకుపోవడంలో భాగమే ఐఐటి మద్రాస్ విద్యార్థులపై తీసుకున్న చర్యను చూడాలి. ఎపిఎస్‌సికి ఒక ఝలక్‌ను ఇచ్చిన బిజెపి ప్రభుత్వం ముందు ముందు తానేం చేయాలనుకున్నదో సంకేతాలు పంపుతున్నది. తమకు వ్యతిరేకంగా మాట్లాడితే, ఏం చేస్తారో చెప్పదలుచు కున్నది. ఎలా అధికార దుర్వినియోగానికి, రాజ్యాంగ ఉల్లంఘనలకు పాల్పడుతున్నారో లేదా పాల్పడతారో చెప్పదలుచుకున్నారన్న మాట.

విమర్శనాత్మక, హేతుబద్ధ, తార్కిక, వివేచనాత్మక, ఆలోచనా స్రవంతులను ధ్వంసం చేస్తేగానీ తమ అశాస్త్రీయ, మతతత్వ భావజాల వ్యాప్తికి దారులు సులభం కావు. మతతత్వం అనేది స్వతంత్ర ఆలోచనలను, ప్రజాస్వామిక చైతన్యాన్ని, సమానత్వ భావజాలాలను, హేతుబద్ధమైన సంవాదాలను అంగీకరించదు. ఇప్పుడిప్పుడే విద్యారంగం లో ఉన్నత చదువులకు చేరుకుంటున్న బిసి, ఎస్‌సి, ఎస్‌టి మైనారిటీలపై ఆంక్షలు పెడుతూ, వారి ఆలోచనలకు అడ్డుకట్టలు వేస్తున్నారు. స్వేచ్ఛగా ఆలోచించనీయకుండా పరిమితులు నిర్ణయిస్తున్నారు.

ఐఐటి మద్రాస్‌లో చినజీయర్ స్వామి ఉపన్యాసాలు ఇవ్వవచ్చు, హిందూమత భావజాలాన్ని సనాతన ధర్మం పేరుతో ప్రచారం చేసుకోవచ్చు, మరెందరో హిందూమత స్వాములు తరచుగా ప్రవచనాలు చెప్పుకోవచ్చు వాటికి లేని అడ్డంకి ఎపిఎస్‌సి వారికెందుకు? ఐఐటిలే కాకుండా కేంద్రీయ ఉన్నత విద్యాసంస్థల్లో అధ్యాపకవర్గం కాని, మరితర ఉన్నతస్థాయి ఉద్యోగాల్లో అత్యధిక శాతం అగ్రవర్ణాల వారే ఉండడం నిజం కాదా? ప్రభుత్వ లెక్కలే దీన్ని ధృవీకరిస్తున్నాయి. దళితులు, ఆదివాసులు, మైనారిటీలు ఈ స్థానాలను చేరుకోవద్దా? స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు కావస్తున్నా ఇదే పరిస్థితి కొనసాగాల్సిందేనా? ఇలా ఉండకూడదని దీని గురించి రాబోయే తరానికి వివరించడానికి ఎపిఎస్‌సి చేస్తున్న కృషిని అడ్డుకునే ప్రయత్నం చేసి ఎంఎచ్‌ఆర్‌డి భంగపడింది.

ఎపిఎస్‌సి గుర్తింపును రద్దు చేయడాన్ని నిరసిస్తూ దేశవ్యాప్తంగా తీవ్ర నిరసనలు వచ్చిన నేపథ్యంలో చివరకు ఈ నిర్ణయాన్ని ఐఐటి మద్రాస్ వెనక్కు తీసుకోనైతే తీసుకుంది. ఇది ఒక రకంగా ప్రజాస్వామిక వాదుల విజయం అలాగే తమ నిర్ణయాలపై గట్టిగా నిలబడిన ఎపిఎస్‌సి విజయం. ఇంతటితో ఐఐటి మద్రాస్‌లో సమస్య ముగిసిందనో ఇక దాని గురించి మాట్లాడాల్సిన పనిలేదని అనుకోవడానికి వీలులేదు. ఇక్కడ భంగపడ్డారు. మరో చోట మరింత దూకుడుగా మరో రూపంలో వస్తారనేదాన్ని కాదనలేము. ఇది ఒక సంకేత హెచ్చరికగా భావించాలి. ఈ నేపథ్యంలో బిజెపి అధికారంలోకి వచ్చిన ఏడాదిలో ప్రజాస్వామిక భావాలపై, మత మైనారిటీలపై పెరుగుతున్న అణచివేతలను, విద్యారంగంలో హిందూ మతతత్వ శక్తుల పట్టు పెరుగుతుండడాన్ని నిలువరించే దిశలో ప్రజా ఒత్తిడి పెరగవలసి ఉన్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

# బాల నేరస్తులు వయోజన ముద్దాయిలా?

***సమాజంలో పేరుకుపోయిన సామాజిక దుస్థితి కారణంగానే బాల నేరస్తులు తయారవుతున్నారనీ, వారిని సంస్కరించాల్సిన బాధ్యత ప్రభుత్వాలదేననీ అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

**బా**లలు చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడినప్పుడు వారిలో పరివర్తన తీసుకరావడమే లక్ష్యంగా, 1992లో ఐక్యరాజ్య సమితి ఒడంబడిక ప్రకారం మొదటిసారిగా 2000లో భారతదేశంలో జువెనైల్ జస్టిస్ చట్టం (జెజె) తెచ్చారు. ఈ చట్టానికి 2006లో, 2011లోనూ ప్రభుత్వం సవరణలు చేసింది. 2012 డిసెంబర్‌లో ఢిల్లీలో 'నిర్భయ' అత్యాచార సంఘటన జరిగినప్పటి నుండి జువెనైల్ చట్టాన్ని కఠినతరం చేయాలన్న డిమాండ్ కొంతమంది రాజకీయ నాయకులు, మధ్యతరగతి ప్రజల నుండి పెరిగింది. న్యాయమూర్తుల్లో కూడా భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. బాలలు, పెద్దల మధ్య 18 ఏళ్ల వయస్సును విభజనరేఖగా చట్టం నిర్ణయించి రాజ్యాంగబద్ధంగా సమ్మతించినపుడు బాల నేరస్తులకు ఎటువంటి శిక్ష వేసే అవకాశం లేదని న్యాయమూర్తులు స్పష్టం చేశారు. 2000 జువెనైల్ జస్టిస్ (జెజె) చట్టం ప్రకారం బాలలకు మరణశిక్ష, జీవిత ఖైదు నిషిద్ధం. నేరస్తుడిది పిన్న వయస్సు కాబట్టి తాను చేసిన పని ఎక్కడికి దారితీస్తుందో తెలియదనుకోవాలి. అతడి మనసు ఎదగలేదు కాబట్టి అతడు చేసింది నేరం కాదని భావించాలి. అయితే బాల నేరస్తుడి దృష్టిలో హతుల ప్రాణాలకు విలువలేదా? అని సుప్రీంకోర్టు ప్రశ్నించింది. స్త్రీలపై అత్యాచారం, దోపిడీ, హత్యవంటి ఘోర నేరాలకు పాల్పడే బాలల సంఖ్య పెరిగిపోతోంది. మొత్తంగా దేశంలో జరుగుతున్న అత్యాచార నేరాల్లో బాలనేరస్తులు రెండు శాతం వరకు ఉన్నారు.

బాలనేరస్తులకు పెద్దల మాదిరి శిక్షలు విధించాలంటే బాల నేరస్తుల గరిష్ట వయో పరిమితిని తగ్గించాలన్న ఆలోచన అప్పటి యుపిఎ ప్రభుత్వంలో వచ్చింది. జువెనైల్ జస్టిస్ చట్టం 2000 స్థానంలో నూతన చట్టం తీసుకరావాలని యుపిఎ ప్రభుత్వం భావించింది. బాల నేరస్తుల గరిష్ట వయో పరిమితిని 18 ఏళ్ల నుండి 16 ఏళ్లకు తగ్గిస్తూ సవరణ తేవడానికి తీవ్రంగానే ఆలోచించింది. బాల నేరస్తుల న్యాయ చట్టం ప్రకారం ఉన్న గరిష్ట వయో పరిమితిని తగ్గించడాన్ని వ్యతిరేకిస్తూ 2013 జూలైలో సుప్రీంకోర్టు రూలింగ్ ఇచ్చింది. ఐరాస బాలల హక్కుల ఒప్పందంపై 1992లో భారత్ సంతకం చేసింది. ఢిల్లీ సామూహిక అత్యాచారం ఘటన అనంతరం ఏర్పాటు చేసిన జస్టిస్ జె.ఎస్. వర్మ కమీషన్ బాల నేరస్తుల వయస్సు గరిష్ట పరిమితిని తగ్గించాలన్న డిమాండును తీవ్రంగా వ్యతిరేకించింది. దీంతో ప్రభుత్వం తన ఆలోచనను విరమించుకుంది.

నిజానికి దేశంలో బాలలు రకరకాల హింసకు, వేధింపులకు గురవుతున్నారు. ఇటువంటి పిల్లల సంఖ్య రోజురోజుకు పెరుగుతూ ఉంది. ప్రతిరోజు ఎంతో మంది పిల్లలు తప్పి పోతున్నారు. కిడ్నాపులకు గురవుతున్నారు. చాలామంది ఆచూకీ తెలియడం లేదు. తప్పిపోయిన వారిలో అత్యధికులు విద్రోహశక్తుల చేతులలోకి చేరవేయబడుతున్నారు. అక్రమ రవాణా (ట్రాఫికింగ్)కు గురవుతున్నారు. అసాంఘిక కార్యకలాపాల కొరకు వినియోగించ బడుతున్నారు. వీరంతా జువెనైల్ జస్టిస్ కింద ఆదరణ-సంరక్షణ అవసరమైన బాలలు. మరోవైపు బాలలు తెలిసీ తెలియక ఎన్నో తప్పులు చేస్తుంటారు. వారి చర్యల వెనుక సాంఘికార్థిక పరిస్థితుల ప్రభావం, మిత్రుల ప్రోత్సాహం, కుటుంబ ప్రోత్సాహం, క్షణికావేశం, మానసిక అపరిపక్వత లాంటి ఎన్నో కారణాలు ఉంటాయి. న్యూరో వైద్యులు, మానసిక వైద్య నిపుణుల అభిప్రాయాల ప్రకారం మంచి చెడ్డల విచక్షణ చేసే మానసిక పరిణతి బాలల్లో 16-18 ఏళ్ల వయస్సులోనే ఏర్పడుతుంది. బాల నేరస్తులను వయోజన నేరస్తుల వలె విచారించి వారికి విధించే శిక్షలను పిల్లలకు కూడా విధిస్తే భవిష్యత్తులో వీరు మరింత తీవ్రమైన నేరాలకు పాల్పడే అవకాశం ఉందని మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు చెపుతున్నారు. అంతేకాకుండా లైంగిక దాడికి పాల్పడే వ్యక్తిపై అతని సాంఘిక, ఆర్థిక నేపథ్యం, అతని విద్య, మానసిక వికాసం, మానసిక పరిస్థితి ప్రభావం చూపుతాయని వారు విశ్లేషించారు. బాలల నేరాలను ప్రత్యేకంగా పరిగణించి విచారణ జరపడం సముచితంగా ఉంటుంది. పైన తెలిపిన రెండు రకాల పిల్లలకు తగిన ఆదరణ, రక్షణ ఇవ్వడం, వారిలో మానసిక వికాసం – పరివర్తన తీసుకు రావడానికి స్నేహపూర్వక వాతావరణాన్ని ఏర్పరచవలసి ఉంటుంది.

బిజెపి 2014 ఎన్నికల మెనిఫెస్టోలో తమ పార్టీ గెలిస్తే జువెనైల్ జస్టిస్ చట్టం 2000 స్థానంలో నూతన చట్టాన్ని తీసుకు వస్తామని ప్రకటించింది. ఎన్నికల మెనిఫెస్టోలో చెప్పినట్లు జువెనైల్ జస్టిస్ చట్టం 2000 స్థానంలో 'కేర్ అండ్ ప్రొటెక్షన్ ఆఫ్ చిల్డ్రన్' చట్టం 2014ను రూపొందించింది. ఈ నూతన చట్టం ప్రకారం 16 ఏళ్ల వయసున్న బాల నేరస్తులను వయోజనుల చట్టాల ప్రకారం విచారణ జరుపుతారు. దీన్ని 2014 ఆగస్టులో లోక్‌సభలో ప్రవేశపెట్టారు. ప్రతిపక్షాల నుండి, బాలల హక్కుల రక్షణ కార్యకర్తల నుండి తీవ్ర విమర్శ వచ్చింది. సభ్యుల కోరిక మేరకు బిల్లును పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ పరిశీలనకు అప్పగించారు. ఈ బిల్లును యథాతథంగా లోక్‌సభ 2015 మే 7న ఆమోదించింది. ఘోర నేరాల విచారణ నిమిత్తం బాలల వయోపరిమితిని 18 ఏళ్ల నుంచి 16 ఏళ్లకు తగ్గించడం ఐక్యరాజ్య సమితి, ఇతర అంతర్జాతీయ సంస్థలకు సంబంధించిన నిబంధనలకు విరుద్ధమని జాతీయ బాలల హక్కుల సంఘం (ఎన్‌సిపిసిఆర్) హెచ్చరించింది. పాత జెజె చట్టాన్ని రద్దు చేయాలన్న ప్రభుత్వ నిర్ణయం వాస్తవాల మీద కాకుండా, భావోద్వేగాల మీదే ఆధారపడి తీసుకున్నదిగా కనిపిస్తోందని వ్యాఖ్యానించింది. 16 ఏళ్ల పైబడిన బాల నేరస్తులను పెద్దల కోర్టుల్లో

విచారించడమనే అమెరికా సాంప్రదాయాన్ని పాటించదలచిన భారత ప్రభుత్వం అమెరికా అవసరాలను, అనుభవాలను పరిశీలించడం అవసరం.

2012లో దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించిన నిర్భయ సామూహిక లైంగిక దాడి కేసులో తీవ్ర ఆరోపణలు ఎదుర్కొన్న బాలనేరస్తుడు తక్కువ శిక్షతో బయటపడటంపై విమర్శలు వెల్లువెత్తాయి. అమ్మాయి మానభంగం, హత్యకు కారకుడైన దోషి వయసు అప్పట్లో 16 ఏళ్లు కావడంతో అతడిని జువెనైల్ హోమ్‌కు పంపించారు. ఇప్పుడు అతడు 18 ఏళ్లకు చేరుకున్నాడు. పాత చట్టం ప్రకారం మరో ఏడాదిలో అతడు విడుదల అవుతాడు. దీన్ని నిరోధించేందుకు కేంద్రం జువెనైల్ చట్టానికి సవరణలు చేసింది. అంతవరకూ బాగానే ఉంది. దాని ప్రకారం అతడు ఇప్పుడు మామూలు జైలుకు వెళ్తాడు, శిక్ష అనుభవిస్తాడు సరే. ఈ చట్ట సవరణ చేసిన తర్వాత పరిస్థితిలో మార్పు ఏమైనా వస్తుందా అన్నదే అసలు ప్రశ్న. నేరాల నిరోధానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా వేటి దారి వాటిదే అనే రీతిలో సాగిపోతున్న స్థితిలో దీనికి ఎవరిని బాధ్యులను చేయాలి? పౌరులనా, సమాజాన్నా, బాల నేరస్తులనా? అన్నిటికీ మించి ప్రభుత్వాలనా? ఈ బిల్లుకు సంబంధించి పార్లమెంటరీ స్థాయీ సంఘం చేసిన 13 సిఫార్సుల్లో బాలనేరస్తుల గరిష్ట వయోపరిమితిని తగ్గించడాన్ని తిరస్కరించడం ప్రధానమైంది. ప్రభుత్వం తరపున మొత్తం 42 సవరణలు సభలో ప్రతిపాదించారు. వీటన్నింటినీ లోక్‌సభ ఆమోదించింది. విపక్ష నాయకుడు శశిథరూర్ (కాంగ్రెస్), ఎన్.కె. ప్రేమ్‌చంద్రన్ (ఆర్ఎస్‌పి) మొదలగు వారు 18 ఏళ్ల వయస్సును తగ్గించకూడదని ప్రతిపాదించిన సవరణలను సభ ఆమోదించలేదు.

తాజా బిల్లు ప్రకారం 16-18 ఏళ్ల వారు చేసే నేరాలను సాధారణ, తీవ్రమైన, హేయమైన నేరాలుగా వర్గీకరించారు. వాటి విచారణ విధానాలను వేర్వేరుగా నిర్వచించారు. హేయమైన నేరాలను పెద్దల చట్టాల ప్రకారం విచారిస్తారు.. తీవ్రమైన నేరాలకు పాల్పడిన వ్యక్తుల వయసు 16 నుంచి 18 ఏళ్ల మధ్య ఉంటే వారిని వయోజనులుగా గుర్తించాలా లేదా పిల్లలుగానా అనే విషయాన్ని బాలల న్యాయ బోర్డులు నిర్ణయిస్తాయి. నేరం రుజువైతే శిక్ష వేయవచ్చు. అయితే మరణ శిక్ష, జీవిత ఖైదు వీరికి ఉండదు. వారికే ఉద్దేశించిన ప్రత్యేక కేంద్రంలో 21 ఏళ్ల వయసు వచ్చే వరకు ఉంచుతారు. అప్పుడు వారి ప్రవర్తనను మదింపు చేసి పరివర్తన వచ్చిందని భావిస్తే శిక్షలో మార్పు చేయవచ్చు. ప్రవర్తన సరిగ్గా లేకపోతే శిక్షను కొనసాగించవచ్చు. బాలల న్యాయ బోర్డులో సామాజిక శాస్త్రవేత్త ఒకరు, పిల్లల హక్కుల కార్యకర్త ఒకరు సభ్యులుగా ఉంటారు. అయితే వయోజనుల చట్టాల ప్రకారం విచారించడానికి 16 ఏళ్ల వయసు మరీ తక్కువన్న విపక్షాల వాదనను కేంద్ర శిశు సంక్షేమ శాఖ మంత్రి తిరస్కరించారు.

దేశంలో బాలనేరస్తులపై హత్య కేసుల సంఖ్య 2002లో 531 ఉండగా 2013 నాటికి 1007కు పెరిగాయి. మహిళలపై అత్యాచారాలు, లైంగిక దాడుల సంఖ్య 2002లో వరుసగా 485, 522 ఉండగా 2013 నాటికి 1884, 1424కు పెరిగాయి. 2013లో బాల నేరస్థులపై 933 కిడ్నాపింగ్, అక్రమ నిర్బంధం కేసులు నమోదయ్యాయి. అక్రమ దత్తత, బాలల రక్షణ కేంద్రాల్లో తీవ్రశిక్షలు, ఉగ్రవాద గ్రూప్‌లు పిల్లలను తమ కార్యకలాపాలకోసం ఉపయోగించడం, బాల వికలాంగులపై నేరాలకు పాల్పడడం వంటి నేరాలను ప్రతిపాదిత శాసనంలో చేర్చారు. దత్తత తీసుకునే విధానాలను, ముఖ్యంగా అనాథలను, వదిలి వేసిన వారిని, దత్తత తీసుకునే వ్యవస్థను సమగ్రంగా సంస్కరించాలని సవరించిన బిల్లు నిర్దేశిస్తుంది. శిశు సంరక్షణ కేంద్రాల రిజిస్ట్రేషన్‌ను తప్పనిసరి చేస్తుంది. బాలబాలికల పునరావాసం, గాడిన పెట్టడానికి, సమన్వయానికి అనేక చర్యలను ప్రతిపాదిత బిల్లు నిర్దేశించింది.

అంతర్జాతీయ ఒప్పందాల ప్రకారం వయసు నిర్వచనమనేది, ఆయా దేశాల సామాజిక, ఆర్థిక, ఇతర పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ఇంగ్లాండ్, ఆస్ట్రేలియాలలో బాలలుగా పరిగణించే వయో పరిమితి 10 ఏళ్లు కాగా, అర్జెంటీనాలో 16 ఏళ్లు. బాల నేరస్తుల వయసును 16 ఏళ్లకు తగ్గించాలన్న అభిప్రాయాలు చాలా కాలంగా వినిపిస్తున్నవి. కొన్ని సందర్భాల్లో ఈ వయసును 14 ఏళ్లకు తగ్గించినా తప్పులేదన్న అభిప్రాయాన్ని కూడా కొందరు వ్యక్తం చేస్తున్నారు. కేంద్ర ఆరోగ్యశాఖ మంత్రి జగత్ ప్రకాశ్ నడ్డా నేతృత్వంలోని 32 మంది పార్లమెంట్ సభ్యుల కమిటీ బాల నేరస్తుల వయసును 18 ఏళ్ల నుంచి తగ్గించడానికి వీల్లేదని స్పష్టం చేసింది. ప్రస్తుతం ఉన్న చట్టం ప్రకారం మైనారిటీ తీరని నేరస్తుడికి మూడేళ్లకు మించి శిక్షపడదు.

నూతన చట్ట ప్రకారం 16 ఏళ్ల కుర్రవాడు తప్పుచేస్తే శిక్ష పడుతుంది. అదే 16 ఏళ్ల కుర్రవాడు సినిమా తెరపై హీరోయిజం పేరుతో నాయికని ఏడిపించవచ్చు. ఏదైనా చెయ్యవచ్చు. 14 ఏళ్లు నిండని హీరోయిన్‌తో అర్ధనగ్న వ్యాపారం చేయించే వారికి ఎలాంటి చట్టాలూ వర్తించవు. అనుకరణ స్వభావం ఉన్న పిల్లలు హింసలో, పోర్న్ (వ్యభిచార) ప్రపంచంలో తీవ్ర ఒత్తిడిలో పెరిగినా వారి స్వభావం మారకూడదని కోరుకోవడం సబబేనా? చెడుకు అడ్డుకట్ట వేసే చర్యలేవీ లేనందునే పిల్లలు బాధితులుగా, సమాజానికి ప్రమాదకర సంకేతాలుగా మిగిలారన్న సంగతి గుర్తించడం అంత కష్టమైనదేమీ కాదు కదా. జువెనైల్ హోమ్స్ నుంచి బయటికి వచ్చిన తరువాత 80 శాతం మంది నేర ప్రపంచంలోనే బతుకుతున్నారని జువెనైల్ సిస్టమ్ సంస్కరణ కోసం జాతీయ స్థాయిలో జరిపిన సర్వేలో తేలింది. అంటే జువెనైల్ హోమ్స్ వారిని కాస్త అదుపులో ఉంచగలుగుతున్నాయేగానీ, మంచి పౌరులుగా తయారుచేసే ప్రయత్నం ఎంతమాత్రం చేయడం లేదని అర్థం చేసుకోవాలి.

2011-12 వరకు మొత్తం నేరాలతో పోల్చినట్లయితే బాలల నేరాలు తక్కువగానే ఉన్నప్పటికీ, క్రైమ్ రేట్ ఇన్ ఇండియా - 2011 ప్రకారం బాలలు, మహిళలపై పాల్పడిన నేరాల సంఖ్య దారుణంగా పెరిగింది. 2001లో బాల నేరస్తులు మహిళలపై జరిపిన అత్యాచారాల సంఖ్య 399 కాగా, 2011 నాటికి అవి 1149కి చేరుకున్నాయి. అయితే అధికార మార్పిడి జరిగి 68 ఏళ్లు గడిచిన తర్వాత కూడా భావి భారత పౌరులకు ఆరోగ్యకర ఆవరణ కల్పించలేని నేరానికి పాలకులకు ఏ శిక్ష విధించాలి? తరం మారుతున్న కొద్దీ కొత్త తరాన్ని కొత్త నైపుణ్యాలు, కొత్త విలువలు, సరికొత్త యుక్తులతో బాల్యాన్ని తీర్చిదిద్దే వ్యవస్థే లేకుండా పోయింది? ఇది ఎవరు చేసిన నేరం? నేటి పిల్లల నేరాలకు మన పెద్దల క్రూరత్వం కారణం కాదా? ఆలోచించాలి.

ఐక్యరాజ్యసమితి 'కన్వెన్షన్ ఆన్ రైట్స్ ఆఫ్ ఛైల్డ్-1989' చట్టంలోని 1వ అధికరణ, 18 సంవత్సరాలు నిండని వారు మైనర్లని స్పష్టం చేసింది. ఐరాస నిర్వహించిన బాలల హక్కుల సదస్సులో భారత్ కూడా పాల్గొంది. ఈ కారణంగా భారత్‌లో 18 ఏళ్లు నిండిన వారిని మాత్రమే మేజర్లుగా పరిగణిస్తారు. అలాగే భారత్ బాల నేరస్తులకు సంబంధించిన 'ది యుఎన్

స్టాండర్డ్ మినిమమ్ రూల్స్ ఫర్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ జువెనైల్ జస్టిస్ 1985' (దీనిని బీజింగ్ రూల్స్ అని కూడా పిలుస్తారు), 'యుఎన్ రూల్స్ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ జువెనైల్ డిప్రైవ్డ్ ఆఫ్ దేర్ లిబర్టీ-1990' సదస్సులపై సంతకాలు చేసింది. ఐరాస బాలల హక్కుల సదస్సు - 1992 తీర్మానంపై భారత్ సంతకం చేసింది. దీంతో తప్పనిసరి పరిస్థితిలో 2000లో కేంద్ర ప్రభుత్వం బాలుర వయసును 18కి పెంచింది. వాస్తవానికి బాలల్లో పూర్తిస్థాయి నడవడి, మానసిక పరిణతి ఉండదు కాబట్టి, వీరికి శిక్షల బదులు పునరావాసం ఏర్పాటు చేయడమే ఉత్తమమన్న అంశానికి ప్రాధాన్యత సర్వత్రా ఏర్పడింది.

దేశంలో నేర ప్రవృత్తి గుర్తించే వయసు కేవలం ఏడు సంవత్సరాలు మాత్రమే. ఇది ప్రపంచ దేశాలన్నింటి కంటే తక్కువ. దక్షిణాసియా, జోర్డాన్, లెబనాన్, యెమన్ దేశాలు ఇదే వయసును అమలు పరుస్తున్నాయి. అమెరికా, కరేబియన్ దేశాల్లో ఈ వయస్సు 11 కాగా, పశ్చిమ ఐరోపా దేశాల్లో ఇది 13 ఏళ్లు. మధ్య ప్రాచ్యం తూర్పు ఆఫ్రికా దేశాల్లో ఈ వయస్సు 9 ఏళ్లు, పాకిస్థాన్‌లో నేరప్రవృత్తి గుర్తించే వయసు 12 ఏళ్లు. భారతీయ శిక్షాస్మృతి (ఐపిసి) 12 ఏళ్ల వయసు వచ్చే వరకు పిల్లలు నేరానికి పాల్పడే సామర్థ్యం గల వారిగా గుర్తించదు. భారతదేశంలో బాల నేరస్తులను ప్రత్యేకంగా చూడడం అనాది కాలం నుంచి వస్తున్నది. క్రీ.శ. 1883లో మొదటిసారిగా లార్డ్ కారన్ వాలీస్ చిన్నపిల్లల కోసం రాగ్గెడ్ స్కూల్‌ను ప్రారంభించారు. భారత్‌లో మొట్టమొదటి బాల నేరస్థుల చట్టాన్ని 1850లో ఒక అనుబంధ చట్టంగా రూపొందించారు. తర్వాత 1986లో బాల నేరస్తుల చట్టం అమలులోకి వచ్చింది. దీని ప్రకారం 16 ఏళ్లలోపు మగ పిల్లలు, 18 ఏళ్లలోపు బాలికలను బాల నేరస్థులుగా ఈ చట్టం నిర్వచించింది.

అభం శుభం తెలియని బాల్యంలో చేస్తున్న నేరాల తీవ్రత, స్వభావం గురించి పూర్తిగా తెలియని బాల నేరస్తులను సంస్కరణ పేరిట ఉంచే జువెనైల్ హోమ్స్ వారిని ఆ దిశలో మార్చలేకపోగా నరకం చూపిస్తు న్నాయని మానవ హక్కుల సంఘాలు ఎప్పటి నుంచో ఆరోపిస్తున్నాయి. చాలా సందర్భాలలో వారి వివరాలను ఏమాత్రం బయటకు పొక్కకుండా హోమ్స్ నిర్వాహకులు జాగ్రత్తలు తీసుకుంటున్నారు. నిజంగానే వారిని సంస్కరించే దిశగా అవి నడుస్తుంటే ఈ గోప్యత ఎందుకన్నది ప్రశ్న. హోమ్స్‌లో ఏమి జరుగుతుందో తెలుసుకోవడం అనేది బ్రహ్మ పదార్థంగా మారిపోయిందని జాతీయ మానవ హక్కుల కమీషన్ 2013లో విడుదల చేసిన నివేదికలో స్పష్టంగా పేర్కొన్నది. నిబంధనల ప్రకారం ఈ హోమ్స్‌ను ప్రతి ఆరు మాసాలకు ఒకసారి అధికారులు సందర్శించి బాలనేరస్తుల స్వభావంలో పురోగతిని సమీక్షించాల్సి ఉంది. అవేవీ ఏ రాష్ట్రంలోనూ జరగడం లేదన్నది కఠిన వాస్తవం అని ఆ నివేదిక స్పష్టం చేసింది. మరో దారుణం ఏమిటంటే ఈ హోమ్స్‌లో ఉండే బాల నేరస్తుల పైనే లైంగిక అత్యాచారాలు సైతం జరుగుతున్నట్టు కూడా పలుమార్లు వార్తలు వచ్చాయి. అందుకే చాలా మంది బాల నేరస్తులు ఈ దారుణాల నుంచి తప్పించుకునేందుకు పారిపోతుంటారని కూడా ఆ వార్తలు తెలిపాయి. ఇంకా విచిత్రం ఏమిటంటే కొత్తగా ఈ హోమ్స్‌కు పంపిస్తున్న వారిపై అప్పటికి ముందే ఉన్న సీనియర్ బాలనేరస్తుల ప్రభావం విపరీతంగా ఉంటున్నదని, వారే కొత్త కొత్త నేరాలను వీరికి నూరిపోస్తుంటారని కేరళ హైకోర్టు మాజీ చీఫ్ జస్టిస్ మంజులా చెల్లూర్, కేరళ రాష్ట్ర జువెనైల్ హోమ్స్ అథారిటీ ఎగ్జిక్యూటివ్ చైర్మన్ సి.ఎస్.రామచంద్రన్ నాయర్ రెండేళ్ల క్రితం కేంద్రానికి సమర్పించిన నివేదికలో తెలిపినప్పటికీ పరిస్థితిలో ఎలాంటి మార్పు రాలేదు.

నేరం తీవ్రమైనదైనా, వారు బాల నేరస్తులే. అందుకోసం చట్టం ఉంది. 2000లో తయారైన జువెనైల్ జస్టిస్ యాక్ట్ ప్రకారం హోమ్స్‌లో ఉండే బాలలకు విద్యా బుద్ధులు నేర్పించడంతో పాటు ఆహారం, వస్తువులు దాచుకునేందుకు గది, వస్త్రధారణ, ఆరోగ్య పరిరక్షణ లాంటి విషయాలలో సామాన్య పౌరులకు ఉండే హక్కులన్నీ ఉన్నాయి. మరి అవేవీ దేశ వ్యాప్తంగా ఉన్న హోమ్స్‌లో కనిపించవని మానవ హక్కుల సంఘాలు ఘోషిస్తున్నాయి. హోమ్స్‌లో ఏం జరుగుతున్నదో చూసేందుకు వెళ్లే అధికారులు తీవ్ర స్థాయి నిర్లక్ష్యం కనబరుస్తూ లోపలికి రానిచ్చేందుకు నిరాకరిస్తున్నారని హక్కుల సంఘాలు ఆరోపిస్తున్నాయి. ఇంకా దారుణం ఏమిటంటే హోమ్స్‌కు గంజాయి లాంటి మాదక ద్రవ్యాలు అక్రమంగా వచ్చి చేరుతుంటే, బాల నేరస్తులు వాటికి బానిసలు అయిపోతున్నా చూస్తూ ఊరుకుంటున్నారే తప్ప వారిని ఒక దారిలోకి తెచ్చేందుకు అధికారులు కృషి చేయడం లేదన్న విమర్శలు కూడా చాలా ఏళ్ల నుంచి వెల్లువెత్తుతున్నాయి. బాల నేరస్తులను సంస్కరిస్తామని, వారిని సమాజంలో మంచిగా బతికేలా చేస్తామని పంపిస్తున్న జువెనైల్ హోమ్స్ నుంచి బయట పడుతున్న వారు నిజంగా మారుతున్నారా అనే ప్రశ్న ఉత్పన్నం అవుతున్నది.

బాల్యం అనేది తెలియని వయస్సు, కౌమారం అనేది తెలిసీ తెలియని వయస్సు. బాల్యం 0-15 ఏళ్లు అయితే కౌమారం 16-18 ఏళ్ల మధ్య వయస్సు. అందువలన అవగాహన లేమి, సామాజిక ఒత్తిడి, విశృంఖల బూతు సాహిత్యం, సెక్స్ సంబంధిత ప్రసారాలు బాలలను నేర ప్రపంచంలోకి తప్పటడుగులు వేసే విధంగా ప్రోత్సహిస్తున్నాయి. నేరాల నివారణకు కఠిన చట్టాలు తీసుకురావడంతో ప్రభుత్వం బాధ్యత తీరిపోదు. నేరాలు తగ్గవు. కాబట్టి నేరాలను ప్రోత్సహించే అంశాలను అరికట్టాలి. బాల్యాన్ని సంస్కరించే దిశలో చర్యలు తీసుకోవాలి. 'ఇండియన్ డాటర్' డాక్యుమెంటరీ రూపకర్త 'లెస్లీ ఉడ్విన్' భారత సమాజంలో ఉన్న పురుషాధిక్య భావజాలాన్ని, స్త్రీల పట్ల ఉన్న చులకన భావాన్నీ, స్త్రీ పురుష అసమానతలనూ తొలగించి నూతన మానవీయ సమాజం ఏర్పడితే తప్ప స్త్రీలపై అత్యాచారాలు ఆగవన్న పరిష్కారాన్ని ఆవిష్కరించడం గమనార్హం.

నూతన చట్టం నేర సంస్కృతికి కారణమైన సామాజికార్థిక, రాజకీయ, సాంస్కృతిక నేపథ్యాలను అర్థం చేసుకోకుండా బాలనేరస్తులకు కఠినతరమైన శిక్షలు విధించడం ద్వారా ఏమి సాధించదలచిందో అర్థం కాదు. బాల్యాన్ని పెడదోవ పట్టిస్తున్న సామాజిక చీడపీడలపై ఏం చేయనున్నారో స్పష్టత లేదు. దుర్భరమైన పేదరికంలో ఉన్న బాలలు ఎందుకు హేయమైన నేరాలకు పాల్పడుతున్నారో మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు చేసిన పరిశోధనాత్మక విశ్లేషణలను పరిగణనలోకి తీసుకోవడం లేదు. ప్రజాస్వామిక వ్యవస్థలో చట్టాలకు, ప్రభుత్వాలకు, న్యాయస్థానాలకు కక్ష్య సాధింపు దృక్పథం ఉండకూడదు. చట్టాల ద్వారా విధించే శిక్షలు వ్యక్తిత్వ సంస్కరణకు తోడ్పడే విధంగా ఉండాల్సిన అవసరం ఉంది. నిర్భయ చట్టం తెచ్చినా అటువంటి సంఘటనలను ఆపలేకపోతుంది. అలాగే ఉరిశిక్షలు హత్యలను నిరోధించలేక పోతున్నాయని మన అనుభవమే తెలుపుతుంది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# మావోయిస్టు కావడం నేరం కాదన్న కేరళ హైకోర్టు

***ఏ వ్యక్తి అయినా మావోయిస్టు విశ్వాసాలు కలిగి ఉండడం దానికదిగా శిక్షార్హమైన నేరం కాదని ఇటీవల కేరళ హైకోర్టు తీర్పు ఇచ్చిన నేపథ్యంలో ఆ తీర్పు పూర్వాపరాలను వివరిస్తున్నారు* ఎన్ వేణుగోపాల్**

న్యాయమూర్తులు, న్యాయస్థానాలు, న్యాయవ్యవస్థ, చట్టాలు దోపిడీ, పీడనల రాజ్యంలో భాగమైన అంగాలే అయినా, తమకు తాము సాధికారత ఇచ్చుకునేందుకో, ఒక మినహాయింపుగా కనబడేందుకో, ఆ ప్రత్యేక న్యాయమూర్తి స్వతంత్ర అభిప్రాయాల వల్లనో అప్పుడప్పుడు ప్రగతిశీలమైన, ప్రజాస్వామికమైన తీర్పులు వస్తుంటాయి. ఆ ఒకటో రెండో మంచి తీర్పులను చూసి ఈ సమాజంలో న్యాయవ్యవస్థకు స్వాతంత్ర్యం ఉన్నదనీ, న్యాయం జరుగుతున్నదనీ మురిసిపోనక్కరలేదు గాని, న్యాయవ్యవస్థ ఎలా పనిచేయాలో ఉదాహరణ చూపడానికి, ప్రజానుకూలమైన, ప్రజాస్వామికమైన తీర్పులు ఎలా ఉండే అవకాశం ఉందో చెప్పడానికి ఆ తీర్పులను ఉపయోగించుకోవచ్చు.

అటువంటి ఒక మంచి తీర్పును 2015 మే 22న కేరళ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎ ముహమద్ ముస్తాక్ ప్రకటించారు. మావోయిజం నేరం కాదనీ, మావోయిస్టు విశ్వాసాలున్నంత మాత్రాన ఏ వ్యక్తినీ నిర్బంధించే అధికారం భద్రతా బలగాలకు లేదనీ ఆయన ఆ తీర్పులో చెప్పారు. ఎవరినైనా వారు చేసిన నేరాలకు విచారించి శిక్షించాలి గాని వారు కలిగి ఉన్న అభిప్రాయాలకు చెరసాల పాలు చేయడం సరికాదని అన్నారు. 'దేశంలో అమలులో ఉన్న చట్టాలను ఉల్లంఘించే మావోయిస్టుల కార్యకలాపాలను అణచివేయవలసిందే కాని, వేటాడే క్రూర మృగం ఎర మీద దూకినట్టుగా రాజ్యం మావోయిస్టుల మీద పడుతున్నది. ఇది యూనిఫారం ముసుగులో చట్ట ఉల్లంఘన తప్ప మరేమీ కాదు. అంటే రక్షకులే దురాక్రమణదారులుగా మారారు' అని ఆయన ఆ తీర్పులో స్పష్టం చేశారు.

శ్యాం బాలకృష్ణన్ వర్సస్ స్టేట్ ఆఫ్ కేరళ అనే కేసులో తీర్పు అది. శ్యాం బాలకృష్ణన్ అనే యువకుడు కేరళ హైకోర్టు జడ్జిగా పదవీ విరమణ పొందిన కె బాలకృష్ణన్ కొడుకు. తన సహచరి, నాట్యకారిణి గీతిప్రియతో కలిసి వైనాడు జిల్లాలో మత్తిలియం గ్రామంలో వన్ వరల్డ్ యూనివర్సిటీ, ఎ కలెక్టివ్ టు స్టడీ డయలెక్టిక్స్ అండ్ జియోపాలిటిక్స్ (గతితర్కాన్నీ, భౌగోళిక రాజకీయాలనూ అధ్యయనం చేసే సామూహిక కేంద్రం) పేరుతో సేంద్రియ వ్యవసాయం, యోగ లాంటి కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు. ఆయన 2014 మే 20న సమీపంలోని చిన్న పట్టణానికి తన మోటర్‌సైకిల్‌పై వెళ్తుండగా ఇద్దరు కానిస్టేబుళ్లు అడ్డగించి వెల్లముండ పోలీసు స్టేషన్ కు తీసుకువెళ్లారు. అక్కడ థండర్ బోల్ట్ అనే ప్రత్యేక నక్సలైట్ వ్యతిరేక కమాండోదళం ఎస్ఐ, దాదాపు ఇరవై మంది పోలీసులు ఆయన మీద పడి, బట్టలు విప్పి, సోదా చేసి, వేధించారు. ఆయనను నిర్బంధంలో ఉంచుకున్నారు. ఆ రాత్రి ఆయనను తమ అదుపులో ఇంటికి తీసుకువచ్చి ఇల్లంతా సోదా చేసి ఆయన ఫోన్లు, ల్యాప్‌టాప్ తీసుకుపోయారు. ఆ మర్నాడు మానంతవాడి డిఎస్‌పి ఆయనను ఇంటరాగేషన్ పేరుతో వేధించాడు. ఈ వేధింపులన్నీ ఆయన మావోయిస్టు అనే ఆరోపణతో జరిగాయి.

తనను చట్టవ్యతిరేకంగా నిర్బంధించారని, హింసించారని, ఆ పోలీసు అధికారుల మీద చర్య తీసుకోవాలని శ్యాం బాలకృష్ణన్ కేసు దాఖలు చేశారు. కేరళలో, ముఖ్యంగా వైనాడు, కోళికోడ్, మలప్పురం, కన్నూరు జిల్లా అటవీ ప్రాంతాల్లో గత ఏడాదిన్నరగా మావోయిస్టుల కార్యకలాపాలు పెరుగుతున్నాయని, ఇది దేశానికంతా పెను ప్రమాదమని, ప్రత్యేకించి కేరళ ఉత్తరాది జిల్లాలకు ప్రమాదమని పోలీసులు వాదించారు. ఆ ప్రాంతాల్లో మావోయిస్టులు షెడ్యూల్డ్ కులాల, తెగల ప్రజల్లో స్థానం సంపాదించుకున్నారని, వాళ్లు ఆయుధాలు, మందుగుండు సామగ్రి పట్టుకుని తిరుగుతున్నారని, ఉపన్యాసాలు ఇస్తున్నారని, కరపత్రాలు పంచుతున్నారని అన్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడడానికి తమ సంస్థలో చేరమని మావోయిస్టులు యువకులను ప్రోత్సహిస్తున్నారని, ఇది దేశం మీద యుద్ధం ప్రకటించడం కంటె తక్కువ కాదని, అందువల్ల వాళ్ల కార్యకలాపాల మీద పోలీసులు అనేక చర్యలు తీసుకోవలసి వచ్చిందని రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన న్యాయవాది వాదించాడు. అటువంటి ప్రాంతాల్లో శ్యాం బాలకృష్ణన్ నడుపుతున్న కార్యకలాపాలు అనుమానాస్పదంగా ఉన్నాయని, అందువల్ల ఆయనను అనుమానించామని, అరెస్టు చేయలేదని, సోదా చేయలేదని ప్రభుత్వం వాదించింది.

ఈ వాదనలన్నీ విన్న తర్వాత, 'మావోయిస్టు కావడం నేరం కాదు. మావోయిస్టుల రాజకీయ భావజాలం మన రాజ్యాంగానికి సరిపోనిదే అయినప్పటికీ, మానవ ఆకాంక్షల గురించి ఆలోచించడం మౌలిక మానవ హక్కు. ఆలోచించే హక్కు, స్వేచ్ఛాయుతమైన విశ్వాసాలను కలిగి ఉండే హక్కు సహజమైన హక్కులు. వాటిని ఏ వ్యక్తీ వదులుకోనక్కరలేదు. స్వేచ్ఛ మనిషి మస్తిష్కంలోనూ, ఆత్మలోనూ సహజంగా, అంతర్గర్భితంగా ఉంటుంది' అని న్యాయమూర్తి అన్నారు.

ఫిర్యాదీని నిర్బంధించడానికి అతను మావోయిస్టు కావచ్చునన్న అనుమానం తప్ప మరే కారణమూ లేదు అని న్యాయమూర్తి అన్నారు. 'ఏదైనా నేరం చేశాడనే ఆధారమేమీ లేకుండా ఫిర్యాదిని పోలీసులు తమ అదుపులోకి తీసుకుని ఆయన వ్యక్తిగత స్వేచ్ఛకు భంగం కలిగించారు. ఒక బాధ్యతాయుతమైన ప్రభుత్వం తాను పొరపాటు చేశానని అంగీకరించడానికి, క్షమాపణ కోరడానికి నిరాకరించడం దురదృష్టకరం. మావోయిస్టులను ఎదుర్కోవడం అనే విధినిర్వహణలో భాగంగానే పోలీసులు ఆ చర్యకు పాల్పడ్డారని ప్రభుత్వం గట్టిగా వాదించింది. ఒక మనిషి సామాన్యుడైనా, ప్రముఖుడైనా అతని స్వేచ్ఛను పరిరక్షించవలసిందే. పోలీసులు తమకు సంక్రమించిన అధికారాన్ని వినియోగిస్తున్నప్పుడు సున్నితంగానూ, వివేకంతోనూ ప్రవర్తిస్తున్నామని చూపుకోవాలి' అంటూ, శ్యాం బాలకృష్ణన్ స్వేచ్ఛను హరించినందుకు, రాజ్యం ఆయనకు ఒక లక్ష రూపాయలు నష్ట పరిహారం చెల్లించాలని, ఆయనకు ఈ కేసుకోసం అయిన కోర్టు ఖర్చులను కూడ ప్రభుత్వమే

భరించాలని, కోర్టు ఖర్చులుగా మరొక రు. 10,000 చెల్లించాలని ఆదేశించారు.

ఈ తీర్పు 'చట్టవ్యతిరేకమైనద'ని, శ్యాం బాలకృష్ణన్‌కు లక్ష రూపాయల నష్టపరిహారం ఇవ్వాలనే తీర్పును కొట్టివేయాలని కోరుతూ కేరళ రాష్ట్ర ప్రభుత్వం జూన్ 25న హైకోర్టులో అప్పీలు దాఖలు చేసింది. చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (యుఎపిఎ) లోని నిబంధనల ప్రకారం హింసాత్మక చర్యలు చేసేవారు మాత్రమేగాక వారికి సహకరించే వారు, వారి భావాలు ప్రచారం చేసేవారు, సలహాలు ఇచ్చేవారు, పరోక్షంగానైనా మద్దతు ఇచ్చేవారు అందరూ శిక్షార్హులేనని, మావోయిస్టు పార్టీ యుఎపిఎ నిబంధనల కింద నిషిద్ధ సంస్థ అని, అది చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని కూలదోసే ఉద్దేశంతో సాయుధ పోరాటం నడుపుతున్నదని ఈ అప్పీలులో వాదించారు. తాము ఫిర్యాదీని అసలు అరెస్టే చేయలేదని, అనుమానం మీద ప్రశ్నించడానికి అదుపులోకి తీసుకున్నామని, ఇల్లు సోదా చేయలేదని, హైకోర్టు న్యాయమూర్తి అవాస్తవాల మీద ఆధారపడి తీర్పు ఇచ్చారని అప్పీలులో వాదించారు.

ఈ అప్పీలు మీద తుదితీర్పు ఎలా వస్తుందో తెలియదు గాని, గత నలభై సంవత్సరాలలో ఇదేవిధంగా మావోయిస్టు విశ్వాసాలు కలిగి ఉండడం దానికదే నేరం కాదని గుజరాత్, ఆంధ్రప్రదేశ్, బొంబాయి హైకోర్టులు, సుప్రీం కోర్టు కూడ ఎన్నోసార్లు తీర్పులు ఇచ్చాయని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవలసి ఉంది.

మొట్టమొదట, 'మావో సూక్తులు' గుజరాతీ అనువాదాన్ని గుజరాత్ ప్రభుత్వం రాజద్రోహంగా ప్రకటించి, నిషేధించి, జప్తు చేసినప్పుడు, ప్రచురణకర్త మనుభాయి టి పటేల్, ఇద్దరు కమ్యూనిస్టు కార్యకర్తలు చందూభాయి ఎచ్ పటేల్, దినకర్ మెహతా ఆ ఉత్తర్వులను హైకోర్టులో సవాలు చేశారు. ఆ కేసులో ప్రభుత్వ ఉత్తర్వులను కొట్టివేస్తూ గుజరాత్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పిఎన్ భగవతి, న్యాయమూర్తులు జస్టిస్ బిజె దివాన్, జస్టిస్ డిఎ దేశాయి 1971 సెప్టెంబర్ 30న ఇచ్చిన తీర్పులో మావో సూక్తులు పుస్తక ప్రచురణ రాజద్రోహం కాదనీ, కమ్యూనిజం సూత్రాలనూ, ఆచరణనూ అధ్యయనం చేసే అవకాశం ప్రజలకు ఇవ్వడానికే ఆ పుస్తకాన్ని ప్రచురణకర్తలు అచ్చువేశారని అన్నారు.

'వాటిని రాజద్రోహకరమైనవిగా చిత్రించి ఖండించడమంటే, జ్ఞానానికి తలుపులు మూసుకోవడమే. ఒక తత్వశాస్త్రాన్ని వెలివేయడమే. అది ప్రస్తుత సమాజం గొప్పగా భావించే విలువలను సవాలు చేస్తూ, మన ప్రజలకు ప్రస్తుతం అలవాటైన జీవన విధానం కన్న పూర్తిగా భిన్నమైన ఒక కొత్త జీవన విధానాన్ని ప్రతిపాదించింది. మన ప్రజలకు ఏ సిద్ధాంతం, ఏ తాత్విక దృక్పథం మంచిదో నిర్ణయించే పని ఆ రోజున అధికారంలో ఉన్న ప్రభుత్వానిది కాదు. న్యాయస్థానాలపై అధిష్టించిన న్యాయమూర్తులదీ కాదు. తమకు ఏది మంచిదో ఎంపిక చేసుకునే హక్కు ప్రజలకే ఉంది. ప్రజలు ఒక తెలివైన, వివేకవంతమైన ఎంపిక చేసుకోవడంలో సహాయపడేందుకు, అన్నిరకాల భావాల స్వేచ్ఛా యుతమైన ప్రచారం అత్యవసరం' అని ఆ తీర్పు చెప్పింది.

ఆ పుస్తకంలో ఉన్న అభిప్రాయాలు సంప్రదాయానికి భిన్నమైనవీ, కొద్దిమందికి ఇబ్బందికరమైనవీ కూడ కావచ్చుననీ న్యాయమూర్తులు అన్నారు. 'మనలో లోతుగా ఉన్న పవిత్రమైన భావాలను అవి సవాలు చేయవచ్చు. మన సామాజిక, రాజకీయ, ఆర్థిక ఆలోచనల ప్రాథమిక పునాదులనే అవి కదిలించవచ్చు. ఐనా అది మన ఆదుర్దాకూ ఆందోళనకూ కారణం కాగూడదు. ముఖ్యంగా ఎల్లప్పుడూ సత్యాన్వేషణ దిశలో సాగుతూ వచ్చిన మన దేశం వంటి దేశంలో ఆందోళన అవసరమే లేదు. ఆ సత్యాన్వేషణలో ఎప్పటికప్పుడు కొత్త భావాలను స్వీకరించడానికీ, ఆమోదయోగ్యమైతే సంలీనం చేసుకోవడానికీ మన దేశం ఎప్పుడూ వెనుకాడలేదు' అని న్యాయమూర్తులు అన్నారు.

ఒకవేళ ప్రజలు మావో సే టుంగ్ ప్రతిపాదించిన కమ్యూనిజం తాత్విక దృక్పథాన్ని అనుసరించదలచుకుంటే, ఒక పుస్తకాన్ని నిషేధించడం, దాన్ని జప్తు చేయడం వారిని ఆ పని నుంచి అడ్డుకో జాలవని న్యాయమూర్తులు అన్నారు. ప్రజలు ఆ ఎంపిక చేసుకుంటే అందుకు లోతైన కారణాలు ఉంటాయనీ, ప్రభుత్వం కమ్యూనిస్టు భావజాలాన్ని అడ్డుకోవాలని భావిస్తే ఆ కారణాలు లేకుండా చేయడం మీద దృష్టి పెట్టాలి గాని, ఒక పుస్తకాన్ని నిషేధించడం లాంటి చర్యలు చేపట్టగూడదని అన్నారు.

దాదాపు ఆ సమయంలోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రీకాకుళం విప్లవోద్యమాన్ని అణచివేయడానికి వందలాది మందిని బూటకపు ఎన్ కౌంటర్లలో చంపివేసింది. ఎంతోమంది విప్లవ కార్యకర్తలను, విప్లవ రచయితలను అరెస్టు చేసి అక్రమ కేసులు పెట్టింది. పుస్తకాలను నిషేధించింది. ఆ వరుసలో 1971 ఆగస్ట్ లో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు లను ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం కింద అరెస్టు చేసినప్పుడు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఒ చిన్నపరెడ్డి, జస్టిస్ ఎడివి రెడ్డి, ఆ అరెస్టులు చెల్లవని, అసలు వారిని అరెస్టు చేసిన ప్రివెంటివ్ డిటెన్షన్ చట్ట నిబంధన చెల్లవని కొట్టివేశారు. వారిని విడుదలచేస్తూ, 'విశ్వాసాలు అదుపులో పెట్టబడేవి కావు. ఎవరినీ అతనికి ఉన్న విశ్వాసాల గురించి జైలులో పెట్టడానికి వీలు లేదు' అని తీర్పు ఇచ్చారు.

గత నాలుగైదు సంవత్సరాలలో ఇటువంటి తీర్పులు మరెన్నో వచ్చాయి.

గుజరాత్‌లో సిపిఐ (ఎంఎల్) జనశక్తికి చెందిన ఐదుగురు కార్యకర్తల దగ్గర విప్లవ సాహిత్యం దొరికిందని, అందులో గెరిల్లా యుద్ధం గురించి కూడ రచనలు ఉన్నాయని ఆరోపణలతో సూరత్ పోలీసులు వారిని నిర్బంధించినప్పుడు, గుజరాత్ హైకోర్టు వారికి బెయిల్ మంజూరు చేసింది. ఆ ఉత్తర్వులో న్యాయమూర్తి జస్టిస్ అనంత్ ఎస్ దావే ఎవరి దగ్గరైనా కేవలం సాహిత్యం ఉన్నంత మాత్రాన దాన్ని నేరంగా పరిగణించగూడదని, ఆ భావాలను ఆచరణలో పెట్టి చట్టప్రకారం నేరంగా గుర్తించబడిన పని చేసేవరకూ నేరంగా పరిగణించడానికి వీలులేదని 2010 నవంబర్ 18న తీర్పు ఇచ్చారు.

కేరళలో పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా అనే నిషిద్ధ సంస్థలో సభ్యుడనే ఆరోపణపై అరెస్టు చేసిన ఎర్నాకుళం దంత వైద్యుడు డా. రనీఫ్ కు హైకోర్టు బెయిల్ మంజూరు చేస్తే, ఆ బెయిల్ రద్దు చేయాలని, హైకోర్టు ఉత్తర్వులను కొట్టివేయాలని కేరళ ప్రభుత్వం సుప్రీం కోర్టుకు వెళ్లింది. ఆ కేసులో 2011 జనవరి 3న తీర్పు ఇస్తూ సుప్రీం కోర్టు న్యాయమూర్తులు జస్టిస్ మార్కండేయ కట్జూ, జస్టిస్ జ్ఞాన్ సుధా మిశ్రా ఒక వ్యక్తి ఒక సంస్థలో సభ్యుడైనంత మాత్రాన నేరస్తుడని చెప్పడానికి వీలు లేదని, ఆ సంస్థ చేసిన నేరాలను సంస్థ సభ్యులందరి మీద ఆరోపించగూడదని తీర్పు ఇచ్చారు.

అలాగే యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ అస్సాం (ఉల్ఫా) అనే నిషిద్ధ సంస్థ సభ్యులనే ఆరోపణపై అరూప్ భూయాన్, ఇంద్రా దాస్ లను టాడా కింద నిర్బంధించినప్పుడు, ఆ కేసులో తీర్పు ఇస్తూ 2011 ఫిబ్రవరి 3న జస్టిస్ మార్కండేయ కట్జూ, జస్టిస్ జ్ఞాన్ సుధా మిశ్రాలు ఒక నిషిద్ధ సంస్థలో సభ్యుడు అని నిరూపించినంత మాత్రాన ఆ వ్యక్తి నేరస్తుడు అనడానికి వీలు లేదు అని స్పష్టం చేశారు.

అలాగే, బినాయక్ సేన్ నిర్బంధ కేసులో సుప్రీం కోర్టు

# హర్యానాలో మత కల్లోలాలు

***అధికార అండదండలతో సంఘపరివార్ శక్తులు దేశ వ్యాప్తంగా మైనారిటీలపై అత్యాచార ఘటనలను కొనసాగిస్తూ, జీవన విధ్వంసానికి పాల్పడుతున్నారనీ, ఈ విధ్వంసానికి అడ్డుకట్ట వేయాలనీ అంటున్నారు అరణ్య***

ఈసారి హిందూ మూకలు హర్యానాలో దౌర్జన్యానికి దిగాయి. ఫరీదాబాద్ జిల్లా, బలాబ్‌గర్‌లోని అతాలీ గ్రామంలో ఈ మూకలు తెగబడి అక్కడి ముస్లిం ప్రజలపై దాడులు చేశాయి. దేశంలోని ఏదో ఒక ప్రాంతంలో మైనారిటీలను లక్ష్యంగా చేసుకుని హిందూ ఉన్మాదాన్ని తలకెక్కించుకున్న హిందూ మూకలు ప్రతిరోజూ కనీసం చిన్నా చితకాగానైనా దాడులకు, హింసలకు దిగుతున్నాయి. ఈ దేశాన్ని తమ ఉన్మాదాన్ని సమర్థించే, ప్రేరేపించే నరేంద్రమోడీ, బిజెపి, ఆర్ఎస్ఎస్‌లు పరిపాలిస్తున్నాయనే ఎదురులేని ధైర్యాన్ని శరీరమంతా నింపుకున్న ఈ గుంపులు దేశంలోని అన్ని ప్రాంతాల మీదా పడి మైనారిటీలను, వారి ఆస్తులను నాశనం చేయాలనే లక్ష్యంగా బయల్దేరుతున్నారన్న విషయాన్ని రోజూ ఏదో ఒక ప్రాంతంలో చూస్తూనే ఉన్నాం. ఈ సారి హర్యానా ఉదంతం నేపథ్యంగా చూస్తున్నాం.

అతాలీలోని ఒక మసీదు భూమికి సంబంధించిన వివాదం కారణంగా మే 25న ఘటన జరిగింది. మసీదు భూమి నిజానికి వక్ఫ్ బోర్డుకు సంబంధించింది. అయితే ఆ భూమి పంచాయితీ భూమి అని అక్కడి హిందూ మత పెద్దలు అనవసర అబద్ధపు వాదనకు దిగుతూ వచ్చారు. 2009లో అక్కడ మసీదు నిర్మాణానికి పూనుకున్నపుడు ఇదే వాదన చేస్తూ అక్కడ జాట్ కులస్తులు కోర్టుకు వెళ్లారు. ఆ స్థలానికి గ్రామ పంచాయితీ యజమాని అని, అది కేవలం ముస్లిం స్మశానానికి మాత్రమే కేటాయించారు. గానీ మసీదుకు కాదని జాట్‌లు విషయాన్ని కోర్టు పరిధిలోకి తెచ్చారు. దాంతో మసీదు నిర్మాణానికి తాత్కాలికంగా అడ్డుకట్ట పడింది. చివరకు మూడు నెలల కిందట మార్చ్ 31న ఫరీదాబాద్ సివిల్ జడ్జి వినయ్‌శర్మ కేసును క్షుణ్ణంగా అధ్యయనం చేసి ఆ స్థలం ముస్లింలకే చెందుతుందని తీర్పునిచ్చారు. అది గ్రామ పంచాయితీ వారిదని నిరూపించడంలో జాట్‌లు విఫలమైనారని కూడా తీర్పులో చెప్పడం జరిగింది. అయినా మసీదు నిర్మాణంపై కోర్టు నుంచి స్టే తేవడం జరిగింది. ముస్లింలు ఆ భూమి హర్యానా వక్ఫ్ బోర్డుకు సంబంధించిందని చూపే సాక్ష్యం, ఆ స్థలం స్మశానానికి కేటాయించ బడిందని చెప్పే 1970 నవంబర్ 21 నాటి గెజిట్ నోటిఫికేషన్‌ను కోర్టులో చూపించారు. అట్లాగే కరెంట్ కనెక్షన్ జామా మసీదు పేరిట ఉన్న సాక్ష్యాన్ని కూడా కోర్టుకు సమర్పించారు. వీటికి తోడు ఎంతో మంది సాక్షులు 'కొన్ని తరాల నుండి ఆ స్థలంలోని చిన్న షెడ్డులో ముస్లింలు ప్రార్థనలు నిర్వహిస్తున్నార'ని చెప్పారు. అయితే రెవెన్యూ రికార్డులో గ్రామ పంచాయితే యజమానిగా ఉందని, 2004 నుంచి

---

న్యాయమూర్తులు జస్టిస్ ఎచ్ఎస్ బేడీ, జస్టిస్ సికె ప్రసాద్‌లు 2011 ఏప్రిల్ 15న బెయిల్ మంజూరు చేస్తూ ఇచ్చిన ఉత్తర్వులలో, మావోయిస్టు సాహిత్యం దగ్గర ఉంచుకోవడమే నేరం కాదని, ఎవరి దగ్గరైనా మహాత్మా గాంధీ ఆత్మకథ ఉన్నంత మాత్రాన అతను గాంధీవాది కానట్టే, మావోయిస్టు సాహిత్యం దగ్గర ఉన్నంత మాత్రాన ఎవరినీ మావోయిస్టు అనడానికి వీల్లేదని అన్నారు.

మహారాష్ట్రలో భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) సభ్యులని, వారి దగ్గర మావోయిస్టు ప్రచార సామగ్రి దొరికిందనే ఆరోపణపై అరెస్టు చేసిన జ్యోతి బాబాసాహెబ్ చోర్గె, సుష్మా హేమంత్ రాంటెకెలకు బెయిల్ మంజూరు చేస్తూ, 2012 అక్టోబర్ 3న ఇచ్చిన ఉత్తర్వులలో బొంబాయి హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎ ఎం తిప్సే, 'ఒక ప్రత్యేక సామాజిక, రాజకీయ దృక్పథాన్ని ప్రచారం చేసే సాహిత్యం కలిగి ఉండడమే నేరం అని అనడం, ఆ సాహిత్యం మీద ఏ చట్ట నిబంధన ప్రకారమూ నిర్దిష్టంగా నిషేధం లేనప్పుడు కూడ అటువంటి ఆరోపణ చేయడం మన దేశం వంటి ప్రజాస్వామిక దేశంలో దిగ్భ్రాంతికరం' అని వ్యాఖ్యానించారు.

ఇన్ని న్యాయస్థానాలు, ఇన్ని సార్లు పదే పదే అదే మాట చెప్పినప్పటికీ పాలకులకూ, పోలీసులకూ చెవికెక్కడం లేదు. నిజం చెప్పాలంటే పాలకులకు, పోలీసులకు న్యాయస్థానాల మీద గౌరవం లేదు. భావాలు కలిగి ఉండడమే, సాహిత్యం దగ్గర ఉండడమే నేరమైనట్టు ప్రగతిశీల భావాలున్నవారి మీద మళ్లీ మళ్లీ దాడులు, వేధింపులు, నిర్బంధాలు సాగిస్తూనే ఉన్నారు. న్యాయస్థానాలు తమ చట్టవ్యతిరేక, అక్రమ పాలనకు సహకరించడం లేదని బహిరంగంగానే అంటున్నారు. ఇలా న్యాయస్థానాల మీద దాడితో పాటు, పాలకవర్గాల అనుకూల సంస్థల సహాయంతో ప్రగతిశీల వర్గాల మీద దాడులు సాగించడానికి ఇటీవల కొత్త పన్నాగాలు పన్నుతున్నట్టు తమిళనాడు తాజా ఉదాహరణ చూపుతున్నది. ఇటీవల కేరళ విప్లవోద్యమ నాయకులు కోయంబత్తూరులో అరెస్టు అయ్యాక ఆ నగరంలోనూ చుట్టుపట్లా కేవలం అనుమానంతోనే పోలీసులు సాధారణ ప్రజల మీద, ప్రగతిశీల వ్యక్తుల మీద వేధింపులు ప్రారంభించారు. ఆ వేధింపులను ఆపాలని కోరుతూ 24 రాజకీయ పార్టీల, ప్రజాసంఘాల ఐక్యవేదిక ఒక ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటనను ఖండిస్తూ మావోయిస్టు సానుభూతిపరుల మీద ఇంకా కఠిన చర్యలు తీసుకోవాలనీ, పోలీసులు ప్రశంసనీయమైన పని చేస్తున్నారనీ కొన్ని సంస్థలు ప్రకటనలు ఇస్తున్నాయి. కోయంబత్తూరు పోలీసు కమిషనర్‌ను కలిసి తమ మద్దతు ప్రకటించాయి. ఈ సంస్థలలో భారతీయ జనతాపార్టీ, రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్, విశ్వ హిందూ పరిషత్, హిందూ మున్నాని, దేశభక్త లాయర్స్, సేవా భారతి, వనవాసి కళ్యాణ్ ఆశ్రమ్, స్వదేశీ విళిప్పునర్వు ఇయక్కం, అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ లాంటి మతోన్మాద సంస్థలు ఉన్నాయి. హిట్లర్ నాజీ పాలనలో లాగనే ప్రగతిశీల శక్తుల మీద ముప్పేటదాడి సాగడానికి రంగం సిద్ధం అవుతున్నది. ఈ దాడులను అర్థం చేసుకుని, ప్రజల సహకారంతో ఐక్యంగా, బలంగా ప్రతిఘటించవలసింది ప్రగతిశీల శక్తులే. వీ

*(రచయిత పాత్రికేయులు)*

2006 మధ్య పంచాయితీ తన సొంత డబ్బులతో కమ్యూనిటీ హాల్ కూడా కట్టించింది కనుక అది పంచాయితీ స్థలమేనన్న జాట్‌ల వాదనను 1954-55 నుండి 2005-06 వరకు గల జమాబందీలు, లాండ్ రికార్డులను పరిశీలించిన తర్వాత కోర్టు కొట్టివేసింది. పైగా అక్కడ మత ప్రార్థనలు జరిగేవని భావిస్తూనే కోర్టు ఆ స్థలం ముస్లింలదేనని తీర్పు చెప్పింది. కేసు కోర్టులో ఉన్నప్పుడే అతాలీలో మసీదును ఆనుకుని హిందువులు ఒక గుడిని కట్టడం ప్రారంభించారు. కేవలం ముస్లింలను రెచ్చగొట్టి, వారిని భయపెట్టి, దాడులకు దిగే ఏకైక ఉద్దేశంతోనే ఈ గుడి నిర్మాణాన్ని ప్రారంభించారు. అందుకే కోర్టు తీర్పు తర్వాత ముస్లింలు మసీదు నిర్మాణానికి గాను గ్రామ పంచాయితీని అనుమతి అడిగారు. అక్కడి సర్పంచ్ రాజేశ్‌చౌదరి కోర్టు కేసును అడ్డంపెడుతూ రాబోయే పంచాయితీ ఎన్నికలలో మైనారిటీ వోటు బ్యాంకు పొందడం కోసం మసీదు నిర్మాణానికి అనుమతిచ్చాడు. ఈ కోపంతో మే 25న హిందూ జాట్ గుంపులు అతాలీ గ్రామంలోని మసీదు పరిసర ముస్లిం ఇళ్లపై దాడులు చేశాయి.

మే 25న ముస్లింలు నివసించే ప్రాంతంపై హిందూ దౌర్జన్యకారులు దాడి చేశారు. అక్కడ ఉన్న 20 కుటుంబాలలో 17 ముస్లిం కుటుంబాలు కాగా ఆ 17 కుటుంబాలనే లక్ష్యంగా చేసుకుని దాడులు చేశారు. దారి పొడుగునా హిందువుల దుకాణాలుండగా వాటికి ఎలాంటి నష్టం చేయలేదు. ఒక ట్రక్కులో నిండుగా రాళ్లు నింపుకుని వచ్చి బజారులో ఉన్న ముస్లింలపై రాళ్లు రువ్వారు. ఇళ్లపై రువ్వారు. పాక్షికంగా కట్టిన మసీదుకు నిప్పుపెట్టారు. ఒకాయననైతే కట్టేసి ఆయన చేతులను కాల్చారు. ఇంకొకాయన ముఖాన్ని కాల్చేశారు. గుజరాత్ గోద్రా తదనంతర మత కల్లోలాన్ని గుర్తు తెచ్చేలా ఇలాంటి చర్యలను హిందూ మూకలు నిర్వహించాయి. సిలిండర్లను ఇద్దరేసి, ముగ్గురేసి పట్టుకుని ఇళ్లల్లోకి విసిరేశారు. బకెట్లతో కిరోసిన్ పోశారు. వాళ్లవెంట కత్తులు, తుపాకులు, కొడవళ్లు ఉండడం కూడా అనేక మంది చూశారు. చుట్టు పక్కల గ్రామాల నుంచి చాలా ప్రణాళికబద్ధంగా హిందువులను ఆ ప్రాంతాలకు తరలించారు. వాళ్లంతా అక్కడి ముస్లింల దుకాణాలను దోచుకున్నారు. ఇళ్లలో డబ్బులు, నగలు దొంగతనం చేశారు. వస్తువులను తగలబెట్టారు.

దాడులు మొత్తం పూర్తయ్యాకగానీ పోలీసులు రాలేదు. గాయపడిన 20 మందిని చాలా ఆలస్యంగా చికిత్సకు తరలించారు. భయభ్రాంతులకు దాడులకు గురైన దాదాపు 400 నుంచి 500 మంది ముస్లింలు బలాబ్‌గర్ పోలీస్ స్టేషన్‌లో 45 డిగ్రీల వేడిలో బిక్కుబిక్కుమంటూ తలదాచుకున్నారు.

ఇదంతా అతాలీలో జరిగిన సంఘటన నరేంద్రమోడీ అధికారంలోకి వచ్చాక దేశవ్యాప్తంగా ఏదో ఒక ప్రాంతంలో ప్రతిరోజూ జరుగుతున్న అనేకానేక ఘటనలలో వెలుగు చూసిన ఒకానొక ఘటన. ఏడాది మోడీ పాలనలో మతహింస పెచ్చుమీరిపోయింది. హిందూ అగ్రకుల ఆధిపత్యం మైనారిటీ మతస్తులను, వారి భావజాలాలను తొక్కిపెట్టే దిశగా కొనసాగుతున్నది. ముఖ్యంగా ముస్లింలను, క్రైస్తవులను ఏ రోజుకారోజు, ఏ క్షణానికాక్షణం నిరంతరం భయభ్రాంతులకు గురి చేస్తున్నది. ఈ పనులు చేయడానికి ఎక్కడికక్కడ హిందూ మూకలు తయారయ్యాయి. ఆర్ఎస్ఎస్, విహెచ్‌పిలు ఈ మూకలకు దిశానిర్దేశం చేస్తుండగా బిజెపి రాజకీయ మద్దతు, రక్షణ అందిస్తుంటే అవి ప్రజల మీద పడుతున్నాయి. అతాలీ లాంటి ఘటనలను సృష్టిస్తున్నాయి. ముస్లింలు ఉన్న ప్రాంతాలపై విరుచుకుపడి ప్రజల ధన, మాన, ప్రాణాలను హరిస్తున్నాయి. గూండాల గుంపులు ఒక ముందస్తు లక్ష్యంతో దాడులకు దిగుతూ దౌర్జన్యాలకు పాల్పడుతూ దేశం మొత్తం భయోత్పాతాలను సృష్టిస్తున్నాయి.

ఒకవైపు 'ఈ దేశంలో పౌరులుగా జీవించాలంటే హిందువుల కోరికలను అంగీకరించాల్సిందే' అని అశోక్ సింఘాల్, 'హిందువులకు తప్ప ఇంకెవరికీ ఈ దేశంలో ఉండే హక్కులేద'ని మరోవైపు సాధ్వి నిరంజన్ లాంటి వాళ్లు అంటుంటే వారి మాటలందుకుని ఉన్మాదంతో ఊగిపోతూ హిందూ మూకలు ఇతర మతస్తులపై హింసలకు దిగుతున్నాయి. అట్లాంటి మతోన్మాదాన్ని రెచ్చగొట్టే సంస్థల ప్రతినిధులనే తన మంత్రి వర్గంలో చేర్చుకుని వికాస పురుషునిగా ప్రధానమంత్రి పదవిలో ఊరేగుతున్న నరేంద్రమోడీ ఆజ్ఞా అంగీకారాలతోనే ఈ మతోన్మాదం పెరిగిపోతూ వస్తున్నది. పోలీసుల నుంచి, న్యాయస్థానాల నుంచి రక్షణ పొందుతూ వస్తున్నది.

ఒకవైపు భావజాల ఆధిపత్యం దుర్మార్గమైన ఘర్‌వాపసి, లవ్‌జిహాద్, భగవద్గీత వంటి అంశాలతో ప్రజల మనసులను కలుషితం చేస్తుండగా, ఇంకొకవైపు మసీదులు కూలగొట్టి, చర్చిలను తగలబెట్టి మైనారిటీ ప్రజలపై భౌతికదాడులకు దిగుతూ వస్తున్నారు. రేపు బాబ్రీమసీదు సహా దేశంలోని అనేక మసీదులను నేలమట్టం చేసి వాటిస్థానే గుళ్లుకట్టే ఒక భారీ ప్రణాళిక కోసం రంగం సిద్ధమవుతున్నది. కాశీ, మధురలలోని మసీదులపై ముస్లింలు ఆశలు వదులుకోవాలని ఇప్పటికే అశోక్ సింఘాల్ హెచ్చరించి ఉన్నాడు. ఈ ప్రణాళిక అమలులో భాగంగా లౌకికతత్వపు కోణం నుంచి ఎవరూ ప్రశ్నించకుండా ఉండేందుకే ఈ రోజు మోడీ దేశదేశాల గడపలు తొక్కి అంతర్జాతీయ మద్దతు కూడగట్టే ప్రయత్నం చేస్తున్నాడు.

విదేశాంగ విధానంలో భాగంగా, భారతదేశాన్ని అగ్రస్థానంలో నిలిపేందుకే తాను దేశాలు తిరుగుతున్నానని అబద్ధం చెప్తూ మోడీ దేశ ప్రజలను మభ్యపెడుతున్నాడు. అతని లోకసంచారానికి ప్రధాన కారణం రేపు ఈ దేశంలో జరగబోయే మత మారణహోమాలను ప్రశ్నించకుండా ఉండేందుకు దేశాలను అభ్యర్థించడమే. అందుకు ప్రతిఫలంగా భారతదేశంలో వాటికి మార్కెట్‌లు అప్పగించే ఒప్పందాలు చేసుకోవడమే. ఈ దేశాన్ని హిందూ దేశంగా మార్చే ఆర్ఎస్ఎస్ లక్ష్యాన్ని సాధించే విశ్వసనీయ కార్యకర్తగా మోడీ ప్రధానమంత్రి పదవిని ఒకమెట్టుగా వాడుకుంటున్నాడు. సీరియస్‌గా పని చేస్తున్నాడు. అతాలీ ఒక చిన్న ప్రయోగం మాత్రమే. ఇది కేవలం ఒక పైలట్ ఎక్స్‌పరిమెంట్. మున్ముందు కాలంలో జమ్మూ - కశ్మీర్ మొదలు దేశ వ్యాప్తంగా జరగబోయే మత మారణహోమాల ప్రణాళికలు ఆర్ఎస్ఎస్ కలలుగంటున్న హిందూ రాజ్యాన్ని సాధించి పెట్టేందుకే దేశ ప్రధాని మొదలు చిల్లర హిందూ మూకల మెదళ్లలో పురుడు పోసుకుంటున్నాయి. ఈ దేశాన్ని మొదట ఆర్యీకరణ, తర్వాత హైందవీకరణ, చివరకు బ్రాహ్మణీకరణ గావించాలనే దఫాల వారి ఆర్ఎస్ఎస్ ప్రవచిత ప్రయాణాన్ని పక్కనబెట్టి, ఐదేళ్ల అతి స్వల్ప వ్యవధిలో తనకు క్షుణ్ణంగా తెలిసిన మతమారణకాండల ప్రయోగాన్ని అమలు పరిచి ఏకబిగిన ఈ దేశం మొత్తాన్ని బ్రాహ్మనైజ్ చేయడానికి మోడీ ఉద్యుక్తుడవుతున్నాడు. ప్రజల, ప్రజాస్వామ్యవాదుల, ప్రగతిశీలుర స్పందనను చూడడానికి రోజుకో చోట అతాలీ వంటి ఘటనలను సృష్టించి ప్రయోగాలుగా వదులుతున్నాడు. ఈ ప్రయోగాలపై ప్రజల ఉదాసీన స్పందనను గమనించిన తక్షణమే శరవేగంగా తన ప్రణాళికను అమలు చేసే ఆలోచనలో ఉన్నాడు. అందుకే ఉదాసీనత అతి ప్రమాదకరమని ఇప్పుడు మనమంతా గుర్తించాల్సి ఉంది. వికాస పురుషుని వినాశకర ప్రణాళికలను తిప్పికొట్టేందుకు ఉద్యుక్తులవ్వాల్సి ఉంది.

*(రచయిత సామాజిక కార్యకర్త, కాలమిస్టు)* వీ

# మ్యాగీ సరే, మిగిలిన ఉత్పత్తుల మాటేమిటి?

*బహుళజాతి కంపెనీల నుంచి రాజకీయ పార్టీలకు భారీగా కమిషన్లు వస్తుండడం వల్లనే, అవి చేసే నాసిరకం ఆహార ఉత్పత్తులపై ప్రభుత్వాలు ఎలాంటి చర్యలు తీసుకోవడం లేదని, ఈ ఉత్పత్తులకు వ్యతిరేకంగా ప్రజలే పోరాడాలని అంటున్నారు* **ఎం.కె. కుమార్**

మ్యాగీ నూడుల్స్ నిషేధం దేశవ్యాప్తంగా చర్చకు దారితీసింది. మ్యాగీ నూడుల్స్‌తో పాటు మిగిలిన రెడీమేడ్ ఫుడ్‌లను పరీక్షలకు పంపి వాటిలో హానికర రసాయనాలు కలిపారా లేదా అనే విషయాన్ని నిగ్గు తేల్చాలని పిల్లల తల్లిదండ్రులు డిమాండ్ చేస్తున్నారు. హానికారక రసాయనాలు నెస్లే ఇండియా సంస్థ ఉత్పత్తి చేస్తున్న మ్యాగీ నూడుల్స్‌లో ఉన్నట్లు నిర్ధారణ అయిన దరిమిలా ఢిల్లీ, బీహార్, ఉత్తరప్రదేశ్, ఉత్తరఖండ్, తమిళనాడు, గుజరాత్, జమ్ము - కశ్మీర్, కేరళ రాష్ట్రాల ప్రభుత్వాలు మ్యాగీపై నిషేధం విధించాయి.

గుజరాత్ ప్రభుత్వం మ్యాగీ నూడుల్స్‌తో పాటు ఎస్‌కెఎస్ నూడిల్స్, సన్‌ఫీస్ట్ నూడుల్స్‌లలోను లెడ్ (సీసం) మోతాదు పరిమితికి మించి ఉన్నట్టు పరీక్షల ద్వారా నిర్ధారణ చేసుకుని వాటిపై కూడా నిషేధం విధించింది.

సీసంతో పాటు హానికరమైన మోనోసోడియం గ్లూటామేట్ (ఎస్ఎస్‌జి) ఆనవాళ్లు కూడా కొన్ని రాష్ట్రాల్లో నూడుల్స్ ప్యాకెట్లలో కనుగొన్నట్టు వైద్యులు నిర్ధారించారు. కొన్ని కార్పొరేట్ సంస్థలైన వాల్‌మార్ట్, జర్మనీకి చెందిన మెట్రో ఎజి సంస్థలు, ఫ్యూచర్ గ్రూప్, కేంద్రీయ బండార్ భారత్‌లోని తమ స్టోర్లలో మ్యాగీని అమ్మడం నిలిపివేశాయి.

పిల్లలు అతి ఇష్టంగా తినే మ్యాగీ నూడుల్స్ విషాహారమని తెలిసిన పిమ్మట ప్రజలు ఆందోళనకు గురవుతున్నారు. ఇన్ని ఏళ్లుగా బహిరంగం గా మార్కెట్‌లో అమ్ముతున్నా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చోద్యంగా చూస్తుండడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. స్టాక్ మార్కెట్లో నెస్లే షేర్లు పది శాతం మాత్రమే పడిపోయాయి.

అజినోమోటోగా పిలువబడే సీసం, మోనోసోడియం రెండు చూడడానికి, రుచికి ఉప్పులానే ఉంటాయి. ఇది మంచి రుచిని కలుగజేయడం వల్ల పిల్లలు దీనికి బానిసలయ్యే ప్రమాదం ఉంది. మ్యాగీని తరుచుగా తినే పిల్లల మెదడు, నాడీ వ్యవస్థ దెబ్బతినడాన్ని తాము గ్రహించినట్లు కేరళ వైద్యులు పేర్కొంటున్నారు. భారత సైన్యం, పోలీసు బలగాలు మ్యాగీని తినకూడదని ఆదేశాలు వచ్చినట్లు మీడియాలో వార్తలొచ్చాయి.

గతంలో నెస్లే ఉత్పత్తి చేస్తున్న పాలపొడిలో పురుగులున్నట్లు కనుగొన్నప్పటికీ, దానిపై చర్యలు తీసుకోకుండా ప్రభుత్వం మీనమేషాలెక్కించింది. బరితెగించిన నెస్లే మ్యాగీ లో సీసం మోతాదును పెంచేసుకుని, లాభాల కోసం పిల్లల ప్రాణాలను ఫణంగా పెడుతోంది. బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ (బిఐఎస్), ఆహార భద్రత, ప్రమాణాల సాధికార సంస్థ (ఎఫ్ఎస్ఎస్) లాంటి పలు సంస్థలు వాటి విధిని సక్రమంగా నిర్వర్తించడం లేదు. దానికి ప్రధాన కారణం అధికారంలోకి వచ్చిన రాజకీయ పార్టీలు బహుళజాతి సంస్థలైన నెస్లేలాంటి సంస్థల దగ్గర పెద్దఎత్తున ఫండ్‌లు తీసుకోవడమే. కార్పొరేట్ సంస్థలు ప్రభుత్వాలనే శాసిస్తున్న విషయం మనకు తెలిసిందే. అందుకే ఒక్క మ్యాగీ అమ్మకాల ద్వారానే ఏటా 1500 కోట్ల రూపాయల ఆదాయాన్ని గడిస్తున్న నెస్లే సంస్థను కట్టడి చేసే దిశగా అడుగులు పడడం లేదు. అన్ని రాష్ట్రాలు మ్యాగీ అమ్మకాలపై ఆరు నెలలకి మించి నిషేధం విధించకపోవడం గమనార్హం.

అన్నిరకాల నిల్వ ఉండే ఆహార పదార్థాలలో హానికరమైన మోనో సోడియం మోతాదుకు మించి ఎక్కువుగా ఉంటుందని నిపుణులు పేర్కొంటున్నారు. అన్ని సూపర్‌మార్కెట్లలో నిల్వ ఉండే ఆహార పదార్థాలు, రెడీమేడ్ ఫుడ్‌లకు ఇప్పుడు కొదవలేదు. కూల్‌డ్రింక్స్ అన్నింటినీ చీడ పురుగుల నివారణకు, టాయిలెట్లను శుభ్రపరచడానికి, పొలాల్లో పిచికారి చేయడానికి వాడవచ్చని ప్రాక్టికల్‌గా చూపిస్తున్నా వాటిపై ఇంత వరకు ప్రభుత్వాలు ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. కోకోకోలాపై ఈ నేపథ్యంలోనే నిషేధం విధించారు. అయినప్పటికీ తిరిగి అది భారత్‌లో ప్రవేశించింది.

కార్పొరేట్ సంస్థలు లాభాలే పరమావధిగా, ప్రజలందరిని రోగిష్టి వాళ్లుగా తయారు చేస్తున్నాయి. దీనికితోడు అధిక డబ్బుకు ఆశపడి సినీతారలు, క్రీడాకారులు, సెలబ్రిటీలు ఈ చెత్త తిండ్లు తిని తమ ఆరోగ్యం, సౌందర్యం రెట్టింపు అయిందని ప్రకటనలు గుప్పిస్తూ తమ అభిమానులను వంచిస్తున్నారు. నిజానికి మ్యాగీని ప్రమోట్ చేసిన మాధురీదీక్షిత్, అమితా బచ్చన్, ప్రీతి జింటాలపైనా ప్రభుత్వం చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. డబ్బును తీసుకునే సెలబ్రిటీలు వారు ప్రచారం చేస్తున్న ఉత్పత్తులలో లోపాలు ఉన్నాయని తెలిసిన వారు తమ ఆదాయాన్ని వదులుకోవడానికి ఏ మాత్రం ఇష్టపడడం లేదు. ప్యాకెట్ ఫుడ్లను ఎప్పటికప్పుడు తనిఖీ చేసి, పరీక్షలు నిర్వహించాల్సిన ఆహార కల్తీ నిరోధక శాఖ అధికారులు ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారో మ్యాగీలాంటి ఉదంతాలు తెలుపుతున్నాయి. రెండు తెలుగు రాష్ట్రాలలో శాంపిళ్లను పరీక్షించే సాంకేతిక పరిజ్ఞానం ఎక్కడా లేదు. ఒక్క హైదరాబాదులో మాత్రం కేవలం మోనో సోడియం గ్లోటోమైట్ శాతాన్ని మాత్రమే నిర్ధారించే సాంకేతికత ఉంది.

అన్నిరకాల జంక్‌ఫుడ్స్‌లో టేస్టింగ్‌సాల్ట్‌గా పిలుచే సీసం, సోడియం గ్లూటామేట్ కలయిక ఉంటుంది. ఇవి క్యాన్సర్ కారకాలుగా పని చేస్తాయి. మహిళల్లో రొమ్ము క్యాన్సర్‌కు, గర్భిణీల్లో పుట్టబోయే పిల్లలపైన వీటి ప్రభావం తీవ్రంగా ఉంటుంది. నాలుకకు మంచి రుచిని కలుగజేసే

సోడియం గ్లూటామేట్ కండరాలను, సూక్ష్మ నాళాలను దెబ్బతీస్తుంది. ఎముకలు, కాలేయం, గుండెపైన ప్రభావాన్ని చూపిస్తుంది.

30 ఏళ్లుగా నెస్లే సంస్థ తన ఉత్పత్తులను అమ్ముకుంటోంది. ఘనమైన చరిత్రను కలిగి ఉన్నప్పటికీ, కనీసమైన ప్రమాణాలను పాటించడాన్ని గాలికి వదిలేసింది. పిల్లలను మ్యాగీ రుచికి బానిసలను చేసి, తన అమ్మకాలను పెంచుకోవాలనుకుంది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ ఆహార, ఔషధ నిర్వహణ సంస్థ యాథలాప తనిఖీల్లో మ్యాగీ బండారం బయటపడింది.

**రెండు నిమిషాల్లో మ్యాగీ**

భారతదేశంలోని మొట్టమొదటి రెడీమేడ్ ఫుడ్ (తక్షణ ఆహారం). స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి (1947) నెస్లే సంస్థ అమ్మకాలు ఇండియాలో ఉన్నాయి. జంక్‌ఫుడ్స్ లాంటి నిల్వ ఉండే ఆహార పదార్థాల్లో సీసం స్థాయి 0.01 పిపిఎం మాత్రమే ఉండాలని ప్రమాణాలు చెప్తుండగా, శాంపిల్లకు పంపించిన మ్యాగీలో 17 పిపిఎం సీసం శాతం ఉన్నట్లు గ్రహించారు. ఇదే ప్రస్తుత మ్యాగీ నిషేధానికి కేంద్ర బిందువుగా మారింది. అయాన్లు, లవణాలతో కూడిన మోనోసోడియం గ్లూటామేట్ పదార్థాల అధిక రుచి కోసం కలుపుతారు. నాలుక మీద ఉండే రుచి కణాలు ఈ గ్లూటామేట్‌కు అతి ఎక్కువుగా స్పందిస్తాయి. దీని మోతాదును మించి తీసుకుంటే ఇరిటేషన్, తలనొప్పి, అధిక కోపం లాంటి లక్షణాలను పెంపొందిస్తాయి.

శాస్త్రీయ పరిభాషలో దీన్ని చైనీస్ రెస్టారెంట్ సిండ్రోమ్ అని పిలుస్తారు. అంటే చైనీస్ రెస్టారెంట్లలో తయారయ్యే గోబీలు, నూడుల్స్ లాంటి నిల్వ ఉండే పదార్థాలు అధికంగా, అలవాటుగా తీసుకోవడం వల్ల వెన్నుముక నొప్పి, పంటి నొప్పి, మత్తు లాంటివి ఏర్పడతాయి. చాలామందిలో అలర్జీ వస్తుంది. సీసం స్థాయి అధికంగా ఉన్న తక్షణ ఆహార పదార్థాలలో (ఫాస్ట్ ఫుడ్) సీసం విష పూరితంగా మారుతుంది. దీనివల్ల తలనొప్పి, కడపు తిప్పడం, చికాకు కలుగుతుంటాయి. ముడి పదార్థాలు, గాలి, నీరు ద్వారా పదార్థంలోకి చేరే సీసం వల్ల కొన్నిసార్లు ప్రాణాలు సైతం కోల్పోయే ప్రమాదముంది.

మ్యాగీ తరహాలోనే కురుకురే, లేస్ వంటి ప్యాకెట్ ఫుడ్లలోను హాని కారకాలున్నాయని వాటి నమూనాలను సైతం పరీక్షించాలనే డిమాండ్ ఈ నేపథ్యంలో ఊపందుకుంటోంది. వీటిని పిల్లలు తినే విధంగా ప్రచారం కల్పిస్తున్న సినీతారలపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు. కేంద్ర ప్రభుత్వం నెస్లే సంస్థపై జాతీయ వినియోగ దారుల వివాదాల పరిష్కార కమీషన్‌కు ఫిర్యాదు చేసినప్పటికీ, ఇప్పటి వరకు ప్యాకేజీ ఫుడ్ల పట్ల ఉదాసీనంగా ఉండడంపై కొన్ని స్వచ్ఛంద సంస్థలు కేంద్ర ప్రభుత్వాన్ని దోషిగా చేయాలని కోర్టులో వాజ్యం వేయబోతున్నట్టు ప్రకటించాయి. ఈ నేపథ్యంలో హాని కారకాలున్న రెండు లక్షల మ్యాగీ ప్యాకెట్లను మార్కెట్ నుండి వెనకకు తీసుకున్నట్టు నెస్లే ప్రకటించింది.

వ్యాపారులు తమ లాభాల కోసం ప్రజల ప్రాణాలను ప్రమాదంలో పడవేయడం మ్యాగీతోనే మొదలుకాలేదు. కోల్గేట్ పేస్ట్‌లో జంతువుల ఎముకల నుండి తీసిన డైకాల్షియం ఫాస్ఫేట్ అనే రసాయనం కలుపుతారు. రాతి ఉప్పుకు బదులుగా ఎముకల పొడిని మనదేశంలో అమ్ముతున్న కోల్గేట్ ఫేస్ట్‌లనే కోల్గేట్ సంస్థ కలపడం కొసమెరుపు. రాక్‌సాల్ట్ కిలో రు. 7,000 ఉండడమే దీనికి ప్రధానకారణం. జంతువుల ఎముకల పొడితో తయారు చేసే ఫాస్ఫేట్ కిలో రు. 80కి దొరుకుతుంది. అంతేగాకుండా ఎక్కువ నురుగు వచ్చేదానికి బట్టలసోపులో వాడే డిటర్జెంట్ పౌడర్‌ను ఈ ఫేస్ట్‌లో వాడుతారు. అయినా ఇప్పటివరకు కోల్గేట్‌పై ప్రభుత్వం చర్యలు తీసుకోలేదు. ఎందుకంటే ఇది శాఖాహారుల మనోభావాలను దెబ్బతీసి వారికి తెలియకుండానే వారిని మాంసాహారుల ను చేయడమే. చక్కెర తెల్లగా ఉండడానికి నీళ్లలో వేసినప్పుడు సొంతం కరగడానికి ఎముకల పొడిని చక్కెరలో కలుపుతారు.

ప్రతి వస్తువుపై అది ఏ విధంగా తయారవుతుందో, అందులో వాడే ముడి పదార్థాలు, ఏవో సామాన్యుల పరిభాషలో ఆ ప్యాక్‌పై ప్రచురించాల్సిన అవసరం ఉంది. హార్లిక్స్, బూస్ట్ తదితర వాటిలో ఉండే పదార్థం జంతువులు తినే గుప్పెడు తౌడు కంటే బలహీనమైనదని అందరికీ తెలిసిందే. గోధుమ పొట్టును అధికశాతం ముడిపదార్థంగా వాడే ఈ ఉత్పత్తులు లాభాలకోసం అతి శక్తివంతమైనవిగా ప్రచారం చేసుకుంటున్నాయి. ఈ విధంగా ప్రజల్ని మోసం చేస్తూ, వారిని నిలువునా దోచుకుంటున్న ఇటువంటి ఉత్పత్తులపై ప్రభుత్వం చర్యలు తీసుకోవడం లేదు.

ప్రభుత్వం ప్రత్యేకంగా ఇప్పుడే మ్యాగీపై దృష్టిసారించడానికి కారణం ఉత్తరప్రదేశ్ ఎఫ్ఎస్‌డిఐ అధికారి వి.కె.పాండే అని చెప్పకతప్పదు. నిజాయితీ పరులైన బ్యూరోక్రాట్స్ అప్పుడప్పుడు తమ నిబద్ధతతో ప్రభుత్వాలను ఇరుకున పడేస్తుంటారు. విదేశీ బహుళ జాతి సంస్థలకు ఎర్రతివాచీ పర్చి స్వదేశానికి ఆహ్వానిస్తున్న మోడీకి తాజా సంఘటన కొంచెం ఇబ్బందికర పరిణామమే. నెస్లేపై నిషేధాన్ని విధిస్తే, రాబోయే కార్పొరేట్ సంస్థలకు ఎటువంటి చట్ట రక్షణ కల్పిస్తారో సెలవియ్యాల్సి ఉంటుంది.

2.5 పిపిఎం కన్నా సీసం అనేక రెట్లున్నప్పటికీ త్వరలోనే మ్యాగీ మరింతగా తన మార్కెట్‌ను ప్రభుత్వ సహాయ సహకారాలతోనే పెంచుకుంటుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

ఆహార పదార్థాల లో ఎంత శాతం పిపిఎం ఉండాలో అనేదానిపైనే నిపుణుల్లో గందరగోళం నెలకొని ఉంది. పిల్లలను జబ్బులకు గురిచేసే మ్యాగీ ఇన్ని ఏళ్లుగా దేశంలో ఎలా అమ్మకాలు సాగించిందో, దానికి కారకులు ఎవరో బహిర్గత పరచాల్సిన అవసరం ఉంది. ఫాస్ట్‌ఫుడ్ ప్యాకేజీలపై నియంత్రణ సాధించాల్సిన ఆహార, ప్రమాణ ప్రాధికార సంస్థ బడ్జెట్‌లో వార్షిక కేటాయింపు 56 కోట్లే ఉండడం ప్రభుత్వం ప్రజలు తినే రెడీమేడ్ ఆహారం పట్ల ఎంత నిర్లక్ష వైఖరిని ప్రదర్శిస్తుందో అర్థమవుతుంది.

రెడీమేడ్ ఆహార పదార్థాల అంతర్జాతీయ మార్కెట్‌లో మ్యాగీనే ప్రథమ స్థానంలో ఉంది. 80 దేశాలలో 450 తయారీ కేంద్రాలను కలిగి ఉంది. పేద దేశాల పిల్లలందరికి నాణ్యమైన పోషక పదార్థాలను తక్కువ ధరకే అందించి మానవాభివృద్ధికి తోడ్పడుతున్నట్టు బాకా ఊదుకుంటోంది. 1970లోనే పేద దేశాల పిల్లల కోసం ప్రవేశపెట్టిన పాల పౌడరు అనతి కాలంలోనే పిల్లలను జబ్బులకు గురిచేసిందని తేటతెల్లమైంది.

# భద్రత ప్రజలకా - కంపెనీలకా?

***బహుళజాతి కంపెనీలు తమ లాభాల కోసం నాసిరకం ఆహార పదార్థాలను తయారు చేస్తుంటే, వాటిని నియంత్రించాల్సిన పాలకులు, అధికారులు వాటికి అండగా నిలుస్తున్నారని అంటున్నారు ఆర్. లక్ష్మి***

ప్రజలందరికీ ఆహారం అందేలా చూడడం మాత్రమే ఆహార భద్రత కాదు. సురక్షితమైన ఆహారం అయి ఉండేలా చూసుకోవడం కూడా ప్రభుత్వం బాధ్యతే! స్వేచ్ఛా వాణిజ్యం, 'అందరికీ అందుబాటులో ఆహారం' వంటి నినాదాల పేరుతో బహుళ జాతి కంపెనీలకు పెద్దపీట వేస్తున్న ప్రభుత్వాలు – ఆహారం తయారీ, నిల్వ, పంపిణీ వంటి అంశాలకు సంబంధించి ఆ కంపెనీలు ప్రమాణాలను పాటిస్తున్నాయో లేదో ఎప్పటికప్పుడు తనిఖీ చేస్తూ ఉండాలన్న బాధ్యతను విస్మరిస్తున్నాయి. అదే నెస్లే కంపెనీ ఉత్పత్తి 'మ్యాగీ నూడిల్స్' వివాదానికి కారణం.

గ్లూటిన్, సీసం వంటి హాని కారకాలు నూడిల్స్‌లో పరిమితులకు మించి ఉండడం ఆలస్యంగానైనా బయటపడడం ఒకరకంగా చూస్తే కొంతలో కొంత మేలే. 10 శాతం పి.పి.ఎం. సీసం చట్ట ప్రకారం అనుమతి ఉందన్న విషయాన్ని జీర్ణించుకోగలగడమూ కష్టమే. సీసం నేరుగా కేంద్ర నాడీ మండలంపై ప్రభావం చూపుతున్న సంగతి తెలిసిందే. నూడిల్స్ మెజారిటీ శాతం వినియోగదారులు పిల్లలే. అంటే ఇటువంటి ఉత్పత్తుల వలన వాళ్ల మెదడు పని తీరుకు చిన్న తనం నుండే అవరోధం ఏర్పడుతుందన్న మాట.

వ్యవహారం మొత్తం రచ్చకెక్కాక ప్రభుత్వం వీటి పంపిణీపై తాత్కాలికం గానైనా నిషేధం విధించింది. అయితే కంపెనీ నిషేధాన్ని సవాలు చేస్తూ బాంబే హైకోర్టులో పిటిషన్ వేసింది.

షరామామూలుగా వాద ప్రతివాదనలు, విపరీతమైన కాలహరణం, ఈ లోపుగా అనధికారిక అమ్మకాలు వంటి వ్యవహారాలన్నీ అనుభవాలు నేర్పిన అంచనాలే. సమాజానికి జరుగుతున్న నష్టం జరిగిపోతూనే ఉంటుంది. ఈ హానికారకాలన్నీ తయారీలో ఏర్పడినవి కావు. ముడి సరుకుల ఉత్పత్తుల సమయంలో నేరుగా భూమిలోంచి సరుకులోనికి చేరుతున్నవి కాబట్టి తమ పొరపాటేమి లేదన్న అసంబద్ధ వాదనలూ వినిపిస్తున్నాయి.

ముడి ధాన్యాల రూపంలోగాని, పండ్లు, కాయగూరలు వంటి వాటిని తీసుకుంటున్నప్పుడు కాని మన లోపలికి చేరుతున్న విష పదార్థాలను నిరోధించగల అవకాశం ఎలాగూ లేదు. ఆహార ఉత్పత్తుల విషయానికి వస్తే తయారీ సమయంలో హానికారకాలను వదపోయవలసిన బాధ్యత నుండి కంపెనీలు ఏ రకంగా తప్పించుకో గలుగుతాయి? ఆహారం, మందుల నియంత్రణ శాఖ పర్యవేక్షణ మాటేమిటి?

భూ కాలుష్యం, జలకాలుష్యం వంటి వాటి కారణంగా సహజంగా లభించే పండ్లు, కూరలు, పాలు వంటి ఆహార పదార్థాలు ఆరోగ్యానికి మేలు చేయడానికి బదులు హాని చేస్తున్న ఉదాహరణలు కోకొల్లలు.

ఒకవంక ఉత్పత్తుల్లోని పోషక విలువల గురించి వాటిని తీసుకోవడం వలన కలిగే లాభాలను గురించి కంపెనీల ప్రచారపు హోరు. ఆరోగ్యానికి మేలు జరగడం మాట అటుంచి ఉత్పత్తుల నాణ్యత లోగుట్టు చూస్తే ఇదీ. సగటు మనిషికి ఏం చేయాలో తెలియని అయోమయ పరిస్థితి. ప్రజలకు మార్గదర్శకం వహించవలసిన ప్రభుత్వాలు తమకు వచ్చే పన్నులు, వాణిజ్యపరమైన వెసులుబాటు వంటి అంశాలను దృష్టిలో ఉంచుకుని ఇటువంటి అపరాధాలను చూసీ చూడనట్లు వదిలివేయడం మాత్రం క్షమించరాని నేరం

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

బయపడ్డ నెస్లే డబ్ల్యుహెచ్ఓ మద్దతుతో తన పాల పౌడరును ఉచితంగా పేదల పిల్లలకు పంపిణీ చేసి మార్కులు కొట్టేయాలని చూసింది. 2007లో బంగ్లాదేశ్‌లో నెస్లే పాలపౌడరుపై వెల్లువెత్తిన వివాదాల నేపథ్యంలో తాత్కాలిక నిషేధానికి గురైంది. తర్వాత తన ఫార్ములాను మార్చి ఫీజర్స్ ఫార్ములాను ప్రవేశపెట్టి తన పాలపౌడరు ఉత్పత్తులను 11 బిలియన్ డాలర్లకు పెంచుకుంది. 2005లో నెస్లే సంస్థ పాకిస్తాన్‌లో మంచి నీళ్ల వ్యాపారం చేసి అబాసు పాలైంది.

యాక్షన్ ఎయిడ్ అనే స్వచ్ఛంద సంస్థ నెస్లేపై పాక్ కోర్టులో అనేక వాజ్యాలను వేసింది. అమెరికాలోను నెస్లే ఉత్పత్తులు వివాదాలకు గురయ్యాయి. 2013లో నెస్లే తన బీఫ్ ఉత్పత్తుల మార్కెట్ నుండి నిషేధాన్ని చవి చూసింది. బీఫ్‌లో గుర్రం మాంసం కలపడం వల్లే యూరప్‌లో దాని మాంసాహార ఉత్పత్తులు నిషేధానికి గురయ్యాయి.

2010లో గ్రీన్‌పీస్ ఇంటర్నేషనల్ అనే సంస్థ నెస్లే పామాయిల్ ఉత్పత్తులపైన, కిట్‌కాట్ బార్స్ ఉత్పత్తులపైనే అంతర్జాతీయ ఉద్యమాన్ని నిర్వహించింది. ఈ ఉత్పత్తులను తయారు చేస్తున్న కేంద్రాలు అత్యంత విషపూరిత వాయువులను, పదార్థాలను ఫిల్టర్ చేయకుండానే వదులుతున్నాయని ఆధారాలతో సహా నిరూపించింది. 2005లోనే అంతర్జాతీయ కార్మిక హక్కుల ఫండ్ సంస్థ అమెరికాలోని నెస్లే కంపెనీలు కార్మికుల చేత వెట్టిచాకిరి చేయించు కుంటూ మానవహక్కుల ఉల్లంఘనకు పాల్పడిందని ఉద్యమాలు చేసింది.

ఇంత దుష్టచరిత్రను కలిగి ఉన్న నెస్లే సంస్థపై జీవితకాల నిషేధాన్ని విధించడమే గాకుండా, భారత్‌లోని దాని అన్నిరకాల తయారీ కేంద్రాలను మూసివేసే దిశగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు, చిత్తూరు జిల్లా)* వీ

# నాలుగు పర్యావరణ, జీవావరణ సూత్రాలు

*పెట్టుబడిదారీ సూత్రాలకూ, పర్యావరణాన్ని పరిరక్షించే సూత్రాలకూ మౌలికంగానే తేడా ఉందని వివరిస్తున్నారు*

**జాన్ బెల్లామీ పాస్టర్**

**జీ**వావరణం మీద పెట్టుబడిదారీ విధానం వేసే ప్రభావాన్ని అర్థం చేసుకోవాలంటే, ముందు బ్యారీ కామనర్, తదితరులు రూపొందించిన నాలుగు జీవావరణ సూత్రాలని అర్థం చేసుకోవాలి.

అవి:

- ప్రతి ఒక్కటీ వేరేవాటితో ముడిపడి ఉంది.
- ప్రతీదీ ఎక్కడో ఒక చోటికి వెళ్తుంది.
- ఏది మేలైనదో ప్రకృతికి తెలుసు.
- ఏదీ శూన్యం లోంచి రాదు.

జీవావరణ వ్యవస్థలోని క్లిష్టతని, అందులోని అంశాల పరస్పర సంబంధాలని మొదటి సూత్రం సూచిస్తుంది. హైలా, లెవిన్స్‌లు రాసినట్టుగా 'ఈ క్లిష్టత, పరస్పర సంబంధాలు ఒక జీవికి ఉండే అవయవాల మధ్య సంబంధాల వంటివి కావు. ఒక జీవి అవయవాలు ఆ జీవి మనుగడకీ, పునరుత్పత్తికీ తగినట్టుగా పరిణామం చెందాయి.' ఐతే, ప్రకృతి ఒక జీవి కన్నా చాలా క్లిష్టమైనది, వైవిధ్యమున్నది, చేవ కలిగినది. ఒక జంతు జాతి పూర్తిగా తుడిచిపెట్టుకు పోయినా, ముఖ్యమైన పరివర్తనలు జరిగినా జీవావరణం కుప్ప కూలిపోదు. కాని, ప్రకృతిలోని పరస్పర సంబంధాల మూలాన, విపరీతమైన ఒత్తిడి కింద జీవావరణం అనూహ్యమైన విపత్తులని ఎదుర్కోవచ్చు. కామనర్ రాసినట్టుగా 'జీవావరణ వ్యవస్థ మారుతున్న స్వీయ సవరణ / పరిహార లక్షణాల వలన నిలకడగా ఉంటుంది. ఇవే లక్షణాలు మరీ ఎక్కువ ఒత్తిడికి గురైతే, వ్యవస్థ నాటకీయంగా కూలిపోతుంది. జీవావరణ వ్యవస్థ ఒక రకమైన యాంప్లిఫయర్ లాంటిది – ఒక ప్రదేశంలో చిన్న మార్పు ఇంకెక్కడో దూరాన, చాలాకాలం తర్వాత పెద్ద మార్పులకి దారి తీయవచ్చు.'

రెండో సూత్రం థర్మోడైనమిక్స్‌లోని మౌలిక సూత్రాన్ని పునరుద్ఘాటిస్తుంది. దీని ప్రకారం ప్రకృతిలో వ్యర్థమనేది ఉండదు; పదార్థం, శక్తి నిల్వలు అట్లాగే ఉంటాయి; ఒక ప్రక్రియలోని వ్యర్థం ఇంకో చోట ఉపయోగపడుతుంది. ఉదాహరణకి, అడవిలో కొట్టేసిన చెట్టు వివిధ జంతు జాతులకి జీవిత మూలం అవుతుంది. అట్లాగే, జంతువులు గాలిలోకి వదిలిన బొగ్గుపులుసు వాయువు, మట్టిలోకి విసర్జించిన వ్యర్థాలు చెట్ల పెరుగుదలకి పనికి వస్తాయి, అవే చెట్లు మళ్లీ జంతువులకి ఆహారం అందిస్తాయి.

మూడవ సూత్రం గురించి కామనర్ ఇలా అన్నాడు: 'సహజ వ్యవస్థలో మనిషి చేసిన ఏ ముఖ్యమైన మార్పైనా ఆ వ్యవస్థకి హాని కలిగించేదిగా ఉండవచ్చు'. ఐదువందల కోట్ల సంవత్సరాల పరిణామంలో, జీవజాలం పెంపొందించుకున్న పదార్థాలు, స్పందనలు కలిసి ఒక సజీవ జీవావరణాన్ని సృష్టించాయి. కాని, ఆధునిక పెట్రో కెమికల్ పరిశ్రమ ఇంతకు ముందు ప్రకృతిలో లేని ఎన్నో కొత్త పదార్థాలని సృష్టించింది. సహజంగా లభించే పదార్థాల లాగానే ఈ కొత్త పదార్థాలు కూడా ఉనికిలో ఉన్న జీవరసాయన ప్రక్రియల్లో పాలుపంచుకుంటాయి. ఐతే, వీటి ప్రభావం ఎక్కువగా జీవితానికి హాని కలిగించే విధంగా ఉండి, క్యాన్సర్ వంటి జబ్బులకి, మృత్యువుకి దారితీస్తుంది. కామనర్ ప్రకారం 'ప్రకృతిలో సహజంగా లభించని ఏ పదార్థానికైనా జీవ రసాయన ప్రక్రియల్లో చోటు లేదు'.

ప్రకృతి దోపిడీకి మూల్యం జీవావరణంలో చెల్లించాల్సి వస్తుందని నాలుగో సూత్రం సారాంశం. పర్యావరణ దృష్ట్యా చూస్తే మానవులు వినియోగదారులు, ఉత్పత్తిదారులు కాదు. థర్మోడైనమిక్స్ రెండవ సూత్రం ప్రకారం, మనిషి శక్తిని వాడుకునే క్రమంలో, ఆ శక్తి పనికి రాని వేరే రూపాల్లోకి మార్పు చెందుతుంది. ఉదాహరణకి, కారుని నడిపే ఇంధనంలోని రసాయనిక శక్తి ఉపయోగకరం. కాని కారు వదిలే థర్మల్ శక్తి ఉపయోగపడదు. శక్తి రూపాంతరం చెందిన ప్రతిసారీ అందులో కొంత నష్టం జరుగుతుంది. అందుకే, ఉత్పత్తి కోసం పర్యావరణ పరంగా మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుంది.

### పెట్టుబడిదారీ విధానపు నాలుగు సూత్రాలు

పైన పేర్కొన్న నాలుగు జీవావరణ సూత్రాల దృష్ట్యా చూస్తే, పెట్టుబడిదారీ విధానం అవలంబిస్తున్న అభివృద్ధి నమూనా కచ్చితంగా జీవావరణానికి వ్యతిరేకమైనది. పెట్టుబడిదారీ విధానంలో నాలుగు జీవావరణ వ్యతిరేక ధోరణులున్నాయి:

- వస్తువుల మధ్య ఉన్న సంబంధం కేవలం నగదు సంబంధం మాత్రమే.
- తిరిగి పెట్టుబడి వ్యవస్థలోకి రానంతవరకు ఏ వస్తువు ఎక్కడికి వెళ్లినా ఫర్వాలేదు.
- ఏది ఉత్తమమో స్వయం నియంత్రణ గల మార్కెట్ కి తెలుసు.
- ప్రకృతి సంపద ఆస్తిపరులకి ఉచితంగా వచ్చిన కానుక.

పెట్టుబడిదారీ విధానంలో మనుషుల మధ్య సామాజిక సంబంధాలు, మనుషులకి ప్రకృతికి మధ్య సంబంధాలు అన్నీ కూడా కేవలం డబ్బు సంబంధాలేననే వాస్తవాన్ని మొదటి సూత్రం చెప్తుంది. ప్రాకృతిక ప్రక్రియలు విడిపోవడం, అతిగా సరళీకరించబడడం పెట్టుబడిదారీ విధానపు స్వాభావిక ధోరణి. డొనాల్డ్ వోర్టర్ చెప్పినట్టు:

'స్థల కాల పరిస్థితుల్లో తేడాలున్నప్పటికీ, పెట్టుబడిదారీ వ్యవసాయ– పర్యావరణ వ్యవస్థ ఆధునిక చరిత్రలో స్పష్టమైన ధోరణి ఒకటుంది. అదేమిటంటే – సహజ జీవావరణ క్రమాన్ని విపరీతంగా సరళీకరించే దిశగా ప్రయత్నాలు. అది ఒక ప్రదేశంలోని జంతు జాతుల సంఖ్య లోనూ, వాటి మధ్యనున్న పరస్పర సంబంధాలలోనూ ప్రతిఫలిస్తుంది. దీన్నే ఇవాళ్టి పరిభాషలో మోనోకల్చర్ అంటాం. అంటే, ప్రకృతి ఎంతగా పునర్నిర్మించ బడుతుందంటే ఒక్క జాతి మాత్రమే మిగులుతుంది – అది కూడా దానికి ఎక్కడో మార్కెట్ డిమాండ్ ఉంది కాబట్టి.'

భారతీయ భౌతిక – పర్యావరణ శాస్త్రవేత్త వందన శివ, వాణిజ్య పెట్టుబడికున్న కుదింపు విధాన ధోరణి గురించి అన్నట్టుగా 'అది ప్రత్యేక వస్తూత్పత్తి మీద ఆధారపడి ఉంది. దానికి ఉత్పత్తిలో ఏకరూపము, సహజ వనరుల ఏక వాడకము అవసరమవుతాయి.' ఉదాహరణకి, నదులని పర్యావరణ పరంగా అస్థిర పరచకుండా మానవావసరాలు తీర్చడానికి వినియోగించవచ్చు కాని ఇప్పుడు కడుతున్న పెద్ద ఆనకట్టలకి సంబంధించిన నదీలోయ ప్రాజెక్టులు 'నది ప్రవాహానికి అనుగుణంగా కాక వ్యతిరేకంగా పని చేస్తాయి. ఏకరూపము, ఏక వాడకము, ప్రత్యేకత అనే అంశాల మీద ఆధారపడిన ఈ ప్రాజెక్టులు, నీటి వాడకాన్ని ప్రాకృతిక ప్రక్రియలకి సంబంధించినదిగా కాకుండా, ఆదాయాన్ని, లాభాన్ని ఉత్పత్తి చేసే ప్రక్రియలకి సంబంధించినదిగా చూస్తాయి.'

మనిషికి, ప్రకృతికి మిగిలిన ఒకే ఒక సంబంధం డబ్బు అనే విషయాన్ని ఈ పరిణామాలు తేటతెల్లం చేస్తాయి. పెట్టుబడిదారీ విధానంలోని ప్రకృతి విభజన వల్ల, ప్రకృతిలోని అంశాలన్నీ మారకపు విలువ అనే ఒకే స్థాయికి కుదించబడ్డాయి. – ఆ కోణంలోంచి చూస్తే, ఉత్పత్తి కాఫీ ఐనా, బొొచ్చైనా, పెట్రోల్ ఐనా, చిలుక ఈకలైనా ఇంకేదైనా ఒక్కటే, దానికి మార్కెట్ ఉన్నంతవరకు.

సమకాలీన పెట్టుబడిదారీ విధానంలోని ఆర్థిక ఉత్పత్తి, (ప్రకృతికి భిన్నంగా) వృత్తాకార వ్యవస్థ కాదనే విషయాన్ని రెండవ సూత్రం ప్రతిఫలిస్తుంది. అది మూలం నుండి గమ్యం దాకా సరళరేఖ లాగ సాగుతుంది. పర్యావరణ ఆర్థికవేత్త నికొలాస్ జార్జెస్క్యు – రోజన్ గమనించినట్టు 'పెట్టుబడికి తగ్గ ఫలితం అనేది ఆర్థిక జీవనం పట్ల వ్యాపారవేత్తకున్న దృష్టి'. ఈ దృష్టిలో, ఉత్పత్తి మూలాన ఉత్పన్నమయ్యే కాలుష్యం ఖరీదు, ఉత్పత్తి చేస్తున్న సంస్థ వ్యయంలో భాగం కాకుండా బాహ్య వ్యయంగా పరిగణించబడుతుంది.

పెట్టుబడిదారీ విధానానికి ముందున్న సమాజాల్లో, వ్యవసాయోత్పత్తి నుంచి వచ్చిన వ్యర్థాలని పర్యావరణ సూత్రాలకనుగుణంగా తిరిగి ఉపయోగించేవారు. ఇందుకు విరుద్ధంగా, అభివృద్ధి చెందిన పెట్టుబడి దారీ సమాజాల్లో, ప్రకృతిలోని తీవ్ర విభజన వల్ల తిరిగి ఉపయోగించడం చాలా కష్టం. ఉదాహరణకి, పశు పోషణ పచ్చిక బయళ్లలో కాకుండా, విడి ఆవరణల్లో జరగడం మూలాన, వాటి వ్యర్థాలు నేలని సారవంతం చేసే బదులు కాలుష్యాలుగా తయారయ్యాయి. అట్లాగే, చెక్క, ఉక్కు వంటి పదార్థాల స్థానంలో వచ్చిన ప్లాస్టిక్ పదార్థం పర్యావరణంపై తీవ్ర ప్రభావం చూపుతుంది.

కామనర్ పెట్టుబడిదారీ విధానపు ఉత్పత్తి గురించి రాసినట్టు 'వస్తువులు వ్యర్థాలుగా; పంటలు మలినాలుగా; యురేనియం రేడియో ధార్మికత కలిగిన అవశేషాలుగా; పెట్రోలు, క్లోరిన్ విషపదార్థాలుగా; ఇంధనం బొగ్గుపులుసు వాయువుగా మార్పు చెందుతాయి. చివరికి మిగిలేది వ్యర్థాలే, జీవమండలం కొనసాగడానికి అవసరమైన ప్రక్రియల మీద దాడే.'

ఏది ఉత్తమమో ప్రకృతికి కాకుండా మార్కెట్ కే తెలుసనే పర్యావరణ విరుద్ధ ప్రాతిపదిక మీద పెట్టుబడిదారీ వ్యవస్థ నడుస్తుంది. ఉదాహరణకి, ఆహారాన్ని పోషణనిచ్చేదిగా కాకుండా, లాభాలను ఆర్జించేదిగా చూడడంతో, పోషక విలువలని పక్కన పెట్టేసి పెద్దఎత్తున ఉత్పత్తి చేయడమే ముఖ్యమవుతుంది. అతిగా నత్రజని ఎరువులని వాడడంతో నేలలోని ఖనిజ సమతుల్యత దెబ్బ తింటుంది, దీని ఫలితంగా కూరగాయలలోని ఖనిజాల పైన కూడా ప్రభావం ఉంటుంది. రవాణా, నిల్వ సౌకర్యాలు ఆహార నాణ్యత కన్నా ముఖ్యమైనవి అవుతాయి. ఉత్పత్తులని ఆకర్షణీయంగా చేసి తద్వారా వాటి మార్కెట్ పెంచడం కోసం, కొన్ని సార్లు వాటి మీద పురుగు మందులు వాడతారు. అంతిమంగా, ఆహారం నాణ్యత కోల్పోతుంది, పక్షులు ఇతర జాతులు ప్రాణాలు కోల్పోతున్నాయి, మనుషులు విషాన్ని తింటున్నారు.

సహజ వనరులను, శక్తిని వాడుకునే క్రమంలో వాటికి సంబంధించిన పర్యావరణ ఖర్చులు ఆర్థిక లెక్కల్లోకి రావనే విషయాన్ని పర్యావరణ విరుద్ధ పెట్టుబడిదారీ నాలుగో సూత్రం తెలియజేస్తుంది. మార్క్స్ చెప్పినట్టుగా ఉదారవాద అర్థశాస్త్రం ప్రకృతిని పెట్టుబడికి ఉచితంగా వచ్చిన లాభంగా చూస్తుంది. అందుకే దాని ఆర్థిక నమూనాల్లో ఎక్కడా ప్రకృతి వనరులు లెక్కలోకి రావు. పర్యావరణ ఆర్థికవేత్త కె. విలియం కాప్ అన్నట్టుగా 'పెట్టుబడిదారీ విధానాన్ని చెల్లించని వ్యయాల ఆర్థిక వ్యవస్థగా చూడాలి. చెల్లించని వ్యయాలెందుకంటే ఉత్పత్తి కయ్యే అసలు ఖర్చుల్లో అధిక భాగం సంస్థల వ్యయాల లెక్కల్లోకి రావు. అంతే కాక, ఆ ఖర్చులన్నిటినీ బైటి వ్యక్తులో, మొత్తం సమాజమో భరిస్తారు'. ఉదాహరణకి, ఒక ఫ్యాక్టరీ మూలాన జరిగిన వాతావరణ కాలుష్యాన్ని ఆ ఫ్యాక్టరీ ఉత్పత్తి వ్యయంలో భాగంగా కాక, ప్రకృతి, సమాజము భరించాల్సిన వ్యయంగా చూడడం జరుగుతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ సహజ సంపదలకి ఎటువంటి విలువ ఇవ్వకుండా, ముడి పదార్థాలను, సహజ శక్తిని వీలైనంత ఎక్కువగా వినియోగించుకుని, తద్వారా లాభాలని పెంచుకోవడానికి ప్రయత్నిస్తుంది. శ్రామిక శక్తిని వీలైనంత తక్కువగా వాడే ఉద్దేశంతో అది సహజ శక్తిని ఎక్కువగా వాడే, పెట్టుబడి ఆధారిత హై టెక్ మీద ఆధారపడుతుంది. వీటన్నిటి పర్యవసానం – పునరుత్పాదకత లేని వనరుల తరుగుదల, వాతావరణ కాలుష్య పెరుగుదల. ఉదాహరణకి, రెండో ప్రపంచ యుద్ధం తర్వాత పర్సులు, బూట్ల ఉత్పత్తిలో చర్మం బదులు ప్లాస్టిక్ వాడకం పెరిగి పోయింది. ప్లాస్టిక్ పరిశ్రమ అంతే విలువ గల ఉత్పత్తిని తయారు చేయడానికి చర్మ పరిశ్రమ ఉపయోగించే శ్రామికుల్లో నాలుగో వంతు మాత్రమే ఉపయోగిస్తుంది, కాని పది రెట్లు ఎక్కువ పెట్టుబడిని, ముప్పై రెట్లు ఎక్కువ శక్తిని (ఇంధనాన్ని) వాడుతుంది. అంటే, ఈ వస్తువుల తయారీలో చర్మం బదులు ప్లాస్టిక్ వాడిన కారణంగా శ్రామికుల డిమాండ్ తగ్గి, పెట్టుబడికి శక్తికి డిమాండ్ పెరిగి, వాతావరణ కాలుష్యం బాగా పెరిగింది.

# రోహింగ్యా శరణార్థుల విషాద గాథలు

***తీవ్ర అణచివేతలకు గురవుతూ, తమ దైనందిన కార్యకలాపాలలో కూడా నిత్యం నరకయాతన అనుభవిస్తున్న బర్మాలోని రోహింగ్యాల జీవన స్థితిగతులను వివరిస్తున్నారు బైరెడ్డి సతీష్***

మూడు దశాబ్దాల క్రితం వచ్చిన స్వయంవరం అనే తెలుగు సినిమాలో భగ్న ప్రేమికుడు 'గాలి వానలో వాన నీటిలో పడవ ప్రయాణం – తీరమెక్కడో గమ్యమేమిటో తెలియదు పాపం' అని నిర్వేదంలో పాడుకుంటాడు. సరిగ్గా ఇవాళ మయన్మార్‌గా పిలువబడుతున్న బర్మాలోని పశ్చిమ ప్రాంతంలో రఖైనే రాష్ట్ర రోహింగ్యా ముస్లిం మైనారిటీ తెగ స్థితి కూడా అలాగే ఉంది. నడువ నేలలేక నిలువనీడలేక పొట్టచేత పట్టుకుని పరదేశాలకెళ్లి పొట్ట నింపుకుందామంటే నౌక ఎక్కిన వారికి ఆ దేశాల ఛీత్కారంతో తీరమెక్కడో గమ్యమేమిటో తెలియక తీరని విషాదంలో సముద్రంపైన తేలియాడుతున్న శవపేటికలుగా రోహింగ్యాల నౌకలు తిరగాడుతున్నాయి.

బతుకుదెరువు ఆశ చూపెట్టి వందల మందిని మోసుకెళ్లే నౌకలలో వేలాది మందిని జంతువుల్లా కుక్కి మానవ రవాణా దారులు (హ్యూమన్ ట్రాఫికర్స్) థాయిలాండ్, మలేషియా, ఇండోనేషియాలకు అక్రమ రవాణా చేస్తున్నారు. అనేకమందికి ఆహారం, నీరు లభించక మృత్యువాత పడుతున్నారు. పిల్లలు, వృద్ధులు, మహిళలు అనారోగ్యం పాలై ప్రాణాలు కోల్పోతున్నారు. ఆహారం లభించక ప్రాణాలు పోవడం కంటే ఉన్న కొద్ది ఆహారం కోసం జరిగిన ఘర్షణలో 100 మందివరకు చనిపోయారు.

తమ మూత్రాన్ని తామే తాగాల్సిన దీనమైన స్థితికి నెట్టబడ్డారు. రోహింగ్యాల దుర్భర జీవన పరిస్థితులకు తోడు ఆధిపత్య జాతి హింసాకాండ తోడవడంతో ఆ స్థితి నుండి బయటపడే ప్రణాళికలు వారి వద్ద లేకపోవడం, ఏ దేశం వారిని అక్కున చేర్చుకోకపోవడం వంటి స్థితిలో మనుషులను రవాణా చేసే మాఫియాకు ఉన్నదంతా అర్పించుకొని మృత్యుయానం చేస్తున్నారు. గత మే నెలలో థాయిలాండ్, మలేషియా సరిహద్దు దట్టమైన అటవీ ప్రాంతంలో వందలాది శవాలను పూడ్చిన ఆనవాళ్లను కనుగొన్నారు.

అవన్నీ కూడా పొట్టకూటి కోసం పొరుగు దేశం వెళ్లడానికి మాఫియా చేతుల్లో పడి పైసలివ్వలేక ప్రాణాలు కోల్పోయిన అభాగ్యులైన రోహింగ్యాలవే అవడం ప్రపంచాన్ని కలవర పరుస్తుంది. సరిహద్దు దేశాలైన ప్రధానంగా థాయిలాండ్, మలేషియా, ఇండోనేషియా లాంటి దేశాలకు వెళ్లే ప్రయత్నాల్లో ఆయా దేశాల తిరస్కరణకు గురై నడి సముద్రంలోనో, తీర ప్రాంతాల్లోనో, గుడారాల్లోనో మగ్గిపోతున్న మానవ సంక్షోభం ఇప్పుడిప్పుడే బయటి ప్రపంచం దృష్టికి వస్తున్నది.

ఈ క్రమంలో అనేకమంది స్త్రీలు మానభంగాలకు, శారీరక హింసకు గురవుతున్నారు. ఇవాళ ప్రపంచవ్యాప్తంగా అభివృద్ధి చెందని ప్రాంతాల

---

**లాభానికున్న అధికారం**

మనిషికి – మనిషికి, మనిషికి – ప్రకృతికి మధ్య ఇప్పుడు మిగిలి ఉన్న ఒకే ఒక సంబంధం లాభాల సంబంధం. అదే పర్యావరణానికి, ఆర్థిక రంగానికి ఉన్న వైరుధ్యాలకి మూలం. పర్యావరణ సమస్యలని పరిష్కరించ గలిగిన టెక్నాలజీలని తయారు చేయగల స్తోమత మనకి ఉంది కాని, అవి జరగకుండా పెట్టుబడిదారులు, వారి ఉత్పత్తి విధానం అడ్డుపడతాయి. మనం ఏ టెక్నాలజీలని వాడాలి అనే నిర్ణయం పెద్ద కార్పొరేషన్స్ చేతుల్లో ఉంది, అవి కేవలం లాభదాయకత ఆధారంగా నిర్ణయాలు తీసుకుంటాయి.

డెట్రాయిట్‌లోని కారు ఉత్పాదకులు పెట్రోల్ అధికంగా వాడే పెద్ద కార్లనే ఎందుకు తయారు చేస్తారనే దానికి హెన్రీ ఫోర్డ్ ఇచ్చిన వివరణ ఇది: 'చిన్న కార్ల నుంచి చిన్న మొత్తం లాభాలొస్తాయి'. జాన్ జెడ్. డిలోరియన్ అనే మాజీ జనరల్ మోటర్స్ అధికారి ఈ విషయాన్నే ఇంకా విపులంగా చెప్పాడు: '1960లలో మార్కెట్ డిమాండ్‌కి అనుగుణంగా మేము చిన్నవైన, తేలికైన, ఇంధనం తక్కువగా వాడే కార్ల తయారీ చేపట్టాల్సింది కాని పెద్ద కార్ల మీద వచ్చే లాభాలు రావని జీఎం యాజమాన్యం అందుకు ఒప్పుకోలేదు.'

పైన చెప్పిన జీవావరణ విరుద్ధ ఉత్పత్తి విధానానికి అంతర్లీనమైనది వృద్ధి గురించిన ప్రశ్న. విశేషమైన వృద్ధి అనేది పెట్టుబడిదారీ విధానపు స్వాభావిక లక్షణం. అందులో, డబ్బిచ్చి వస్తువులను కొనుగోలు చేసి మళ్లీ ఆ వస్తువులని మరింత డబ్బు కోసం అమ్మి... ఇట్లా సంపద పెంచుకుంటూ పోతారు.

రాబర్ట్ హైల్‌బ్రోనర్ అన్నట్టు 'ఆడంస్మిత్, మార్క్స్, కీన్స్ వంటి ఆర్థికవేత్తలు చెప్పినట్టుగా చలనంలేని పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడి అవకాశాలు తగ్గడంతో లాభాలు పడిపోతాయి. విస్తరణకి అవకాశం లేనప్పుడు పెట్టుబడులు తగ్గి, దాని పర్యవసానంగా ఉపాధి, ఆదాయం రెండూ తగ్గిపోతాయి.' దీని అర్థం ఏమిటంటే, ఉత్పత్తిని నిరాటంకంగా విస్తరించకపోతే, పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగజాలదు. విస్తరణలో ఎటువంటి ఆటంకమైనా ఏర్పడితే, అది ఆర్థిక సంక్షోభానికి దారి తీస్తుంది. ఐతే, ఉనికిలో ఉండడానికి ఈ వ్యవస్థ డిమాండ్ చేస్తున్న వేగవంతమైన ఆర్థికవృద్ధి జీవావరణ దృష్ట్యా చూస్తే ఇక ఎంత మాత్రం సాధ్యం కాదనేది స్పష్టంగా తెలుస్తుంది.

*(http://climateandcapitalism.com/2012/04/02/four-laws/ John Bellamy Foster)*

*(అనువాదం పి. అరవింద)* వీ

నుండి, యుద్ధ సంక్షోభ ప్రాంతాల నుండి లక్షలాది మంది ప్రజలు వలస వెళ్తున్నారు. ప్రధానంగా సిరియా, లిబియా, జింబాబ్వే, ఇథియోపియా, దక్షిణ సూడాన్, ఆఫ్రికా దేశాల నుండి యూరప్ దేశాలకు వలసవెళ్తున్నారు. ఈ దేశాల ప్రజల వలసకు, బర్మా రోహింగ్యాల వలసకు తేడా అంతా కనీసం ఆయా దేశాల్లో వారు పౌరులుగా అయినా గుర్తించబడినారు. రోహింగ్యాలది మరీ దారుణమైన పరిస్థితి – కనీసం పౌరులుగా కూడా గుర్తించక, నిలువ నీడలేక పరాయి నీడ కోసం ప్రాణాల్ని ఫణంగా పెట్టి మరీ వలస వెళ్తున్నారు. ప్రపంచంలోనే అత్యంత వేధింపులకు గురౌతున్న మైనారిటీ వర్గంగా రోహింగ్యాలను ఐక్యరాజ్య సమితి పేర్కొంటున్నది.

### ఎవరీ రోహింగ్యాలు?

నేడు మయన్మార్‌గా పిలువబడుతున్న మెజారిటీగా బుద్ధిస్టు ప్రజలను కలిగిన బంగ్లాదేశ్ సరిహద్దున పశ్చిమ బర్మాలో రఖైనే అనే రాష్ట్రంలో అనేక శతాబ్దాలుగా ఆవాసం ఉంటున్న బంగ్లా ముస్లిం తెగనే ఈ రోహింగ్యాలు. ప్రస్తుతం వీరి జనాబా 13 లక్షల వరకు ఉంటుంది. వీరి చరిత్రకు సంబంధించి చరిత్రకారుల్లోనే భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. 7వ శతాబ్దంలో అరబ్బు సెటిలర్స్ నుండి ఈ ప్రాంతానికి వచ్చారని, ఈ ప్రాంతాన్ని బర్మా స్వాధీనం చేసుకుందని ఒక వాదన ఉండగా, అసలు వాళ్లు ఎక్కడ నుండి రాలేదని అక్కడే పుట్టిన స్థానిక జాతి ప్రజలని మరో పరిశోధన చెపుతున్నది. 1820లో బ్రిటిష్ కాలంలో బెంగాల్ నుండి తక్కువ జనాభా కలిగిన రఖైనే (అరకాన్) ప్రాంతానికి వ్యవసాయ కూలీలుగా వెళ్లడం, అక్కడ స్థానిక ప్రజలతో ఘర్షణకు దారితీసిందనే మరో వాదన ఉన్నది. వీరి ఘర్షణ తీవ్రతకు మూలాలు రెండవ ప్రపంచ యుద్ధకాలం నుండే ఉన్నాయి. ఆ సమయంలో బ్రిటిష్ సైన్యంలోని రోహింగ్యా ముస్లిం సైనికులకు, స్థానిక రఖైనే బుద్ధిస్టులకు మధ్య మత ఘర్షణ తలెత్తింది. ఆ ఘర్షణ తీవ్రమై రెండు వైరి వర్గాలుగా చీలిపోవడానికి కారణమైంది. 1948లో స్వాతంత్ర్యం పొందిన బర్మా 1982లో సైనిక ప్రభుత్వం తెచ్చిన పౌర చట్టం ఈ వర్గాల మధ్య ఘర్షణ తీవ్రతను పెంచింది. ఈ చట్టం రోహింగ్యాలను దేశ పౌరులుగా గుర్తించ నిరాకరించింది. ఇక్కడ నివసిస్తున్న పరాయి దేశీయులుగా వర్గీకరించింది. ఈ చట్టం తర్వాతే రోహింగ్యా ప్రజల్లో భయంకర సంక్షోభం చోటుచేసుకుంది. పౌరసత్వం లేకపోవడం వల్ల పౌర సదుపాయాలకు వేటికీ అర్హులు కాకుండా పోయారు. విద్యకు, వైద్యానికి దూరం చేయబడ్డారు. ప్రభుత్వ ఉద్యోగాలు, ఉపాధి పొందే వీలులేదు.

తమ మత విశ్వాసాలను కూడా ఆచరించలేని స్థితి. రాజకీయ వ్యవహారాల్లో అయితే అసలే ప్రవేశం లేదు. వీరి కదలికలపైన నిరంతరమైన నిఘా ఉంటుంది. ఒక ఊరు నుండి మరో ఊరికి వెళ్లాలంటే పోలీసులకు లంచాలు సమర్పించుకోవాల్సిందే. రాజదాని నగరమైన యంగూన్‌కి వెళ్లాలంటే నాలుగు వేల డాలర్లు ఖర్చు అవుతాయి అంటే ఎటువంటి స్థితి ఉందో ఊహించుకోవచ్చు. 1982 మిలటరీ రాజ్యాంగం ప్రకారం 1823 నుండి స్థిరపడిన అధికారిక గుర్తింపు పొందిన 135 తెగల జాబితాలో రోహింగ్యాలకు చోటులేదు. బెంగాలీలుగా మాత్రమే గుర్తింపబడాలి. అదీ మూడు తరాలుగా నివాసం ఉన్నట్లు నిరూపించుకోవాలి. ఏ గుర్తింపుకు సంబంధించిన ప్రభుత్వ పత్రాలు ఇవ్వబడవు, ప్రత్యామ్నాయ పౌరసత్వం అడిగే హక్కు వీరికి లేదు. పాస్‌పోర్టు గానీ, ఏ గుర్తింపు పత్రం కానీ వీరికి ఉండవు. కొత్త ప్రాంతాలకు వెళ్లాలంటే ముందస్తు అనుమతి తీసుకొని వెళ్లాలి. ఇద్దరు పిల్లల కంటే ఎక్కువ కనడానికి అనుమతి లేదు. ఈ తెగ రోజు వారి వ్యవహారాల్లో తీవ్రమైన వివక్షను ఎదుర్కొంటున్నది. బర్మా తెగలతో చూసినప్పుడు కాస్త ముదురు వర్ణంలో ఉండే రోహింగ్యాల పట్ల వర్ణవివక్ష కూడా తీవ్రంగానే ఉంది. దక్షిణ బంగ్లాదేశ్ మాండలికాన్ని మాట్లాడే రోహింగ్యాలతో వెట్టిచాకిరితో పాటు సరైన వేతనం ఇవ్వని పనులను మాత్రమే చేయించుకుంటారు. రాజకీయ పదవులేమో కానీ కనీసం ఓటు హక్కు కూడా వీరికి లేదు. భూ యాజమాన్య పత్రాలు పొందడానికి వీరు అర్హులు కారు. బుద్ధిస్టులు వీరిని అక్రమ వలసదారులు అంటే, రోహింగ్యాలు తాము వలసపాలన ముందు నుండే నివసిస్తున్న స్థానిక జాతి ప్రజలమని చెపుతున్నారు. మిడిల్ ఈస్ట్ ఇనిస్టిట్యూట్ మాత్రం 1799లోనే 'రోహింగ్య' అనే పదం వెలుగులోకి వచ్చిందని తమ అధ్యయనం ద్వారా చెపుతున్నది. సుదీర్ఘకాలం సైనిక పరిపాలనలో మగ్గిన బర్మాలో 2010–11లో నామమాత్రపు ఎన్నికల ప్రజాస్వామ్యానికి సైనిక పాలకులు అనుమతిచ్చారు. ఈ ప్రజాస్వామ్య ప్రక్రియలో రోహింగ్యాలకు స్థానం దక్కకపోగా బుద్ధిస్టుల దాడులు అధికమైనాయి. 2012లో ఈ దాడులకు పరాకాష్ఠగా మతపరమైన విద్వేషాలతో కూడిన విచ్చలవిడి దాడులకు, గృహదహనాలకు బుద్ధిస్టులు పాల్పడడంతో ఆ ఒక్క ఏడాదిలోనే లక్షానలభైవేల మంది రోహింగ్యాలు చెల్లాచెదురై గుడారాల్లో తలదాచుకున్నారు.

రోహింగ్యాల పట్ల మెజారిటీ బుద్ధిస్టులకు ఎంత అసహ్యం పేరుకు పోయిందంటే ఇటీవల ఒక బర్మా సినీనటి ఇంటర్‌నెట్‌లో 'ఐ హేట్‌దెమ్ హండ్రెడ్ పర్సెంట్' అని పెడితే తెల్లారే సరికి వేలాది 'లైక్'లు వచ్చేశాయి. అక్కడి రచయితలు, జర్నలిస్టులు, ప్రముఖుల్లో కూడా రోహింగ్యాల పట్ల తీవ్రవ్యతిరేక భావన నెలకొని ఉన్నది. ఇంటర్‌నెట్‌లో రోహింగ్యాలను విదేశీయులని, టెర్రరిస్టులని, అల్‌ఖైదాతో సంబంధాలు ఉన్నాయని విపరీతమైన విష ప్రచారం జరుగుతున్నది. అంతర్జాతీయంగా ఏర్పడిన 'ఇస్లామోఫోబియా' బర్మాలో కూడా తీవ్రంగా ఉంది. బర్మా ప్రజాస్వామిక హక్కుల కోసం పోరాడి నోబెల్ శాంతి బహుమతి పొందిన ప్రతిపక్ష నాయకురాలు, నేషనల్ లీగ్ ఫర్ డెమోక్రటిక్ పార్టీ నేతైన అంగ్‌సాన్‌సూకీ ప్రజాస్వామ్య ఉద్యమంలో కూడా రోహింగ్యాలకు చోటులేకపోవడం అత్యంత విశాదకరం. మెజారిటీల ఓట్ల కోసం రాజకీయ ప్రయోజనాల కోసం మైనారిటీలను వారి ప్రయోజనాలను బలిపెట్టడం అంతటా ఉన్నట్టే ఈ దేశం దానికేమీ మినహాయింపు కాదని రోహింగ్యాల ఉదంతంలో రుజువవుతున్నది. ఈ మైనారిటీ ముస్లింల పట్ల ఎంత ద్వేషం పాలక వర్గాలకు ఉన్నదంటే మెజారిటీ బుద్ధిస్టులు 'యాంటీ రోహింగ్యా 969 ఉద్యమం' అనే (భారత దేశంలో సల్వాజుడుం లాంటి) రోహింగ్యా వ్యతిరేక హింసాయుత సంస్థను మిలిటరీ పాలకుడైన థేన్‌సేన్ శాంతికి చిహ్నంగా వర్ణించడం. ఈ మెజారిటీ జాత్యాహంకార హింసను దృష్టిలో ఉంచుకొని దక్షిణాఫ్రికా శాంతిదూత అయిన ఆర్చిబిషప్ డెస్మండ్ టుటు 'నెమ్మదిగా జరుగుతున్న జాతి నిర్మూలన' అని అభివర్ణించాడు.

**అంతర్జాతీయ స్పందన**

పొట్ట నింపుకోవడానికి పొరుగు దేశానికి ప్రమాదకర ప్రయాణం చేస్తున్నారు రోహింగ్యాలు. యూరప్‌లో, పశ్చిమ దేశాల్లో ఉన్న ఇస్లాం వ్యతిరేక భావనవల్ల కూడా పెద్దగా అంతర్జాతీయ సమాజాన్ని ఆకర్షించ లేకపోయింది రోహింగ్యాల సమస్య. సిరియా, ఇరాక్‌లో, ఐసిస్ చేతుల్లో హింసకు గురవుతున్న క్రిష్టియన్ మైనారిటీ తెగలకు వచ్చిన ప్రచారం కూడా దశాబ్దాలుగా కనీసం మనుషులుగా జీవించే పరిస్థితిలేని రోహింగ్యాలకు రాకపోవడం కూడా ఇస్లాం పట్ల ఉన్న వ్యతిరేకత వల్లనే. ఆసియా దేశాల్లో ఏ దేశం కూడా శరణార్థుల పట్ల మానవీయంగా స్పందించలేదు. ఈ విషయంలో యూరప్ సమాజం కొంత మెరుగ్గానే ఉంది. అయితే చాలా ఆధిపత్య దేశాలు తమకు అవసరమైనప్పుడు చౌకగా లభించే శ్రమశక్తిగా వీరిని ఉపయోగించుకొని వదిలేస్తున్నవే. మలేషియా, ఇండోనేషియా వంటి ఇస్లామిక్ దేశాలు కూడా వీటికి మినహాయింపేమీ కావు.

ఆయా దేశాల సంపదను పెంచే నైపుణ్యం ఉన్న కార్మికులు, వారి ఉత్పత్తులకు మార్కెట్‌గా ఉపయోగపడే ఎగువ మధ్యతరగతి వలసను మాత్రమే ప్రోత్సహిస్తున్నాయి. ఇటువంటి అభాగ్యులను మాత్రం అక్కున చేర్చుకోవు. ఆస్ట్రేలియా లాంటి దేశమైతే చాలా కఠినంగా వ్యవహరించి తనదేశంలోకి ఎవరిని రానీయనని బాహాటంగానే ప్రకటించింది. రోహింగ్యా వలసకు ప్రభావితమవుతున్న ప్రధాన దేశాల్లో ఒకటైన థాయిలాండ్‌లో వలసలపై ఇటీవల జరిగిన సదస్సుకు 'రోహింగ్య' అనే పదం వాడితే మయన్మార్ రానని ఖరాఖండిగా చెప్పింది. వేలాది మంది సముద్రంలోనూ, తీర ప్రాంతంలోనూ, అటవీ ప్రాంతంలోనూ బర్మాలోని క్యాంపుల్లోను బతుకులెల్లదీస్తున్నా ఐక్యరాజ్య సమితి, అమెరికా, ఇతర దేశాలు మాత్రం విన్నపాలకు, విజ్ఞప్తులకు మాత్రమే పరిమితమయ్యాయి.

**భారత్ స్పందన**

వసుదైక కుటుంబం గురించి ప్రపంచానికి పాఠాలు చెప్పే ప్రస్తుత భారత పాలక వర్గానికి రోహింగ్యాలకు సహాయం కాదు కదా, సానుభూతి కూడా తెలియజేసే కనీస మానవీయత లేదు. మోడీ ప్రధాని అయిన తరువాత మొదటి విదేశీ పర్యటన మయన్మార్‌కే. అక్కడికెళ్లి ప్రజాస్వామ్యం, సుపరిపాలన గురించి మాట్లాడినాడు కానీ మనుషులుగా గుర్తించబడని రోహింగ్యాల గురించి మాట్లాడలేదు. తాను తన దేశంలో మైనారిటీల పట్ల అలాగే ఉన్నాడు కాబట్టి ఏం మాట్లాడగలడు? విశేషమేంటంటే అస్సాంలో 2014 ఎన్నికల సందర్భంలో మాట్లాడుతూ పాకిస్థాన్, బంగ్లాదేశ్ దేశాలలో హిందువులను అక్కున చేర్చుకోవడానికి సిద్ధమని ప్రకటిస్తూనే బంగ్లా ముస్లిం శరణార్థుల ప్రస్తావన చేయక పోవడం ఆయన ముస్లిం వ్యతిరేకతను తెలియపరుస్తున్నది. రోహింగ్యాలు హిందువులు అయి ఉంటే ఈ దేశంలోని హిందువుల కాపలాదారులం మేమే అని చెప్పుకుంటున్న సంస్థలు ఎంత గగ్గోలు పెట్టేవి? మరి ఇప్పుడు ఏ స్పందనా లేదే? అంటే వాళ్ల వసుదైక కుటుంబంలో హిందువులు మాత్రమే ఉంటారని వేరే చెప్పాలా?

**ఏం జరగాలి?**

అంతర్జాతీయ సమాజం స్పందించాల్సింది ఎంతో ఉంది. ఈ మానవ విషాదం ఆగాలంటే తక్షణమే మయన్మార్‌పై ఒత్తిడి పెంచాలి. ఆ దేశ పౌరులుగా రోహింగ్యాలను వెంటనే గుర్తించేలా చేయాలి. మెజారిటీ ప్రజలు అనుభవించే అన్ని హక్కులను రోహింగ్యాలు పొందేలా అక్కడి పాలకవర్గాన్ని ఒప్పించేలా అన్ని ప్రయత్నాలు జరగాలి. పొరుగు దేశాలను ఆశ్రయం ఇవ్వమని అడిగే ప్రయత్నం కంటే సొంత నేల మీద స్వేచ్ఛగా, స్వతంత్రంగా, భద్రతతో కూడిన బతుకు ఉండేలా చేయాలి. అసలు మూలాలను అన్వేషించి శాశ్వత పరిష్కారం కనుక్కోవల్సిందే కానీ తాత్కాలిక ఉపశమన చర్యలు ఏ మాత్రం ప్రయోజనకరం కావు. అక్కడి సైనికపాలనపై ప్రజాస్వామిక వ్యవస్థ కోసం ఉద్యమించిన పార్టీలు, సంఘాలపైన అంతే బాధ్యత ఉందన్న విషయాన్ని గ్రహించేలా చేయాలి. రోహింగ్యాలను బయట విడిచే ప్రక్రియ ఏదీ కూడా ప్రజాస్వామికం కాదు. ఆ సంస్థలు, పార్టీలు సాధించిందేదీ కూడా పరిపూర్ణం అంతకంటే కాదు. మయన్మార్ లోపటి శక్తులు ప్రజాస్వామికంగా, సమ్మిళిత దృష్టితో ఉండడం, బయటి దేశాలు మతం, ప్రయోజనాల కంటే మానవీయ కోణంలో స్పందించి రోహింగ్యాలను అక్కడి సమాజపు అంతర్భాగంగా చేయడంలో జరిగే అన్ని ఉద్యమ ప్రయత్నాలకు బాసటగా నిలవాలి.

ప్రజాస్వామ్యం, మానవహక్కులు, స్వేచ్ఛా సమానత్వాల గురించి ప్రపంచ దేశాలకు పాఠాలు బోధించే అమెరికా తనదేశంలోని దుర్నీతి గురించి మాట్లాడదు. చర్మం రంగు ఆధారంగా మనుషుల్ని మనుషులుగా చూడలేని దుర్మార్గం, ఆటవిక న్యాయం తన నేల మీద అమలు జరుగు తుండగా ప్రపంచ ప్రజలకు న్యాయం అందడం గురించి మాట్లాడడం ఎంత విడ్డూరం. దేశాల అంతర్గత వ్యవహారాల్లో జోక్యం చేసుకోకుండా, దేశాల మధ్య లేని చిచ్చును పెట్టి ఆయుధాలను అమ్ముకోకుండా, ప్రపంచ పోలీసులా వ్యవహరించకుండా తన దేశ పోలీసులకు మానవ విలువలు, మానవ హక్కుల గురించి నేర్పుకుంటే మంచిది. నువ్వు చెప్పే చట్టబద్ధ పాలన, సమన్యాయం, నీ పౌరులకే అందడం లేదనే విషయాన్ని ఇతర దేశాలు చెపితే ఊరుకోనపుడు జన హనన ఆయుధాలున్నాయనే నెపంతో ఇరాక్‌పై దాడిచేసి లక్షలాది మంది చావుకు కారణమైన నీ ఉన్మాదాన్ని ఆపుకుంటే ప్రపంచం భద్రంగా ఉంటుంది. పాలస్తీనా పసిపిల్లలపై ఇజ్రాయిల్ యుద్ధోన్మాదాన్ని ప్రేక్షకుడిలా చూసిన నీకు మానవ హక్కుల గురించి మాట్లాడే హక్కు ఎక్కడుంది. నీ దేశ నల్లవాడికే న్యాయం చేయలేనివాడివి నీవు ప్రపంచ న్యాయం గురించి మాట్లాడడం ఎంత హాస్యాస్పదం. ప్రపంచమెప్పుడూ ఒకలా ఉండదు ఒక్కోసారి వియత్నాంలా మారుతుంది. తస్మాత్ జాగ్రత్త.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.

విన్నపం

# ఈ పత్రికను నిలబెట్టుకుందాం

***అరవై ఆరు సంవత్సరాలుగా ప్రపంచవ్యాప్తంగా ప్రగతిశీల శక్తుల ఆదరణను చూరగొన్న సుప్రసిద్ధ అమెరికన్ స్వతంత్ర సోషలిస్టు మాసపత్రిక మంత్లీ రివ్యూకు పాఠకుల సహకారాన్ని అర్థిస్తూ రాబర్ట్ మెక్ చెస్నీ రాసిన లేఖ***

(ప్రచ్ఛన్న యుద్ధకాలంలో అమెరికన్ మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్త పాల్ స్వీజీ, సోషలిస్టు రచయిత లియో హ్యూబర్‌మన్‌లు 1949 మే సంచికతో, స్వతంత్ర సోషలిస్టు పత్రిక అనే ఉపశీర్షికతో మంత్లీ రివ్యూ పత్రికను ప్రారంభించారు. గత అరవై ఆరు సంవత్సరాలలో ఆ పత్రిక, దాని పుస్తక ప్రచురణ విభాగం ఎంఆర్ ప్రెస్ అంతర్జాతీయంగా మార్క్సిస్టు దృక్పథంతో ప్రపంచాన్ని విశ్లేషించే కృషికి ఎంతో దోహదం చేశాయి. ప్రపంచవ్యాప్తంగా విస్తృతమైన ఆదరణ ఉన్నప్పటికీ, ఆర్థిక సమస్యలతో కొనసాగుతున్న ఆ పత్రికకు సహకరించవలసిందిగా పాఠకులకు విజ్ఞప్తి చేస్తూ రాజకీయార్థశాస్త్రవేత్త, ప్రచారసాధనాల విశ్లేషకుడు, బహుగ్రంథ రచయిత రాబర్ట్ మెక్ చెస్నీ రాసిన ఉత్తరం ఇది.)

గత సంవత్సరకాలంగా నేను రాజకీయార్థ శాస్త్రం మీదా, ప్రచార సాధనాల మీద ఉపన్యాసాలు ఇస్తూ యూరప్, లాటిన్ అమెరికాల్లోనూ, యుఎస్ఎ అంతటా తిరిగాను. ఈ ఉపన్యాసాలలో అత్యధిక భాగం యువకులనూ, విద్యార్థులనూ ఉద్దేశించినవే. నేను మాట్లాడిన ప్రతిచోటా యువజనులు ఈసారి సోషలిజం అనే మాటకు కొన్ని సంవత్సరాల కింది కన్న భిన్నంగా ఎక్కువగా స్పందించడం నాకు కొట్టవచ్చినట్టుగా కనబడింది.

ప్రతి సందర్భంలోనూ నేను ఇచ్చిన విశ్లేషణ మంత్లీ రివ్యూ పత్రిక అవగాహన నుంచే అని చెప్పవచ్చు. నా శ్రోతల్లో ఎక్కువమంది అటువంటి అవగాహనలను అంతకు ముందు ఎప్పుడూ వినలేదని స్పష్టంగానే తెలిసింది. తమ కళ్లముందర ఇన్నాళ్లూ పరచుకున్న ముసుగు తొలగిపోయిందని వాళ్లు చెప్పారు. ఇటువంటి అవగాహన కావాలని వాళ్లు ఎప్పటినుంచో కోరుకుంటున్నారు గాని, అందుకు తగిన మేధో సాధనాలు వాళ్లకు అందుబాటులో లేవు. పెట్టుబడిదారీ విధానం మీద అర్థవంతమైన మౌలిక విమర్శ కోసం, ఆచరణసాధ్యమైన పరిష్కారాల కోసం వాళ్లు ఎదురుచూస్తున్నారనీ, నిజానికి ఆకలిగొని ఉన్నారనీ నాకు నా అనుభవాలు నేర్పాయి. సరిగ్గా వాళ్లు కోరుకుంటున్నటువంటి విమర్శనే, వ్యవస్థమీద పటిష్టమైన విమర్శనే మంత్లీ రివ్యూ పత్రిక గత ఆరున్నర దశాబ్దాలుగా నిరంతరాయంగా నిర్మిస్తున్నది. వాళ్ల స్పందన ఒక మౌలికమైన మలుపు. ఈ చారిత్రక సందర్భం కోసమే నేను దశాబ్దాలుగా ఎదురుచూస్తున్నాను. ఇది నిజంగా మన సందర్భం, సోషలిజం వైపు, ఇరవై ఒకటో శతాబ్ది సోషలిజం వైపు ప్రయాణం సాగించే దశ వచ్చిన సందర్భం.

ఈ మౌలిక పరివర్తన పెరుగుతుండడం ఎంతమాత్రం ఆశ్చర్యకరం కాదు. ప్రపంచవ్యాప్తంగా నిరుద్యోగం పెద్ద ఎత్తున పెరుగుతున్నది. సైనికీకరణ, సామ్రాజ్యవాదం విపరీతంగా పెరుగుతున్నాయి. వాతావరణ మార్పు ఇంతకాలం ఉన్నట్టుగా కేవలం బెదిరించేదిగా మాత్రమే లేదు, ప్రమాదకరమైన స్థాయికి పెరుగుతున్నది. అసాధారణ స్థాయిలో అసమానత, ఆర్థిక దుబారా ఒకవైపు ఉండగా పొదుపు పిలుపులు అంతకంతకూ ఎక్కువగా వినబడుతున్నాయి. ఈ పరిణామాలన్నిటికీ పైన అంతకంతకూ ఎక్కువగా దొంగలముఠాల పాలకవ్యవస్థలు ప్రజాస్వామ్యం పేరుతో ఊరేగుతున్నాయి. ప్రపంచం చేజారిపోయినట్టు కనబడుతున్నది. ఇంకా కచ్చితంగా చెప్పాలంటే మనను విధ్వంసం వైపు తీసుకుపోతున్న శక్తుల అదుపులో బందీ అయినట్టు కనబడుతున్నది.

సరిగ్గా ఈ చారిత్రక సందర్భం కోసమే పాల్ స్వీజీ, లియో హ్యూబర్‌మన్ లు 66 సంవత్సరాల కింద మంత్లీ రివ్యూ పత్రికను ప్రారంభించారు. అవి చీకటి రోజులు. మరీ ముఖ్యంగా అమెరికాకు చీకటి రోజులు. అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ అండ్ కాంగ్రెస్ ఆఫ్ ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్స్ (ఎఎఫ్ఎల్ – సిఐఒ) (అమెరికా కార్మిక సంఘాల సమాఖ్య) నుంచి వామపక్ష వాదులందరినీ తొలగించారు. ఎన్నో వృత్తులనుంచీ ఉద్యోగాల నుంచీ విప్లవవాదులను తొలగిస్తూ నిషిద్ధ జాబితాలు తయారు చేశారు. ఇంకా ఉద్యోగాలలో కొనసాగగలిగినవాళ్లను లొంగిపోయేలా చేశారు. విప్లవకరమైన మౌలిక మార్పుకు అవకాశం అనేదే లేదని, అది సుదూరమైనదని భావించేలా అమెరికన్ల మనసులను మార్చేశారు. అప్పుడు ప్రగతిశీలవాదులకు మనుగడే ప్రధాన సమస్య అయిపోయింది.

తన మొదటి సంవత్సరం నుంచే, మొదటి రోజు నుంచే మంత్లీ రివ్యూ దీర్ఘకాలిక దృష్టితో విశ్లేషణలు చేసింది. ఆ కాలానికి కొత్తొక వింతగా ఉండి, వామపక్షవాదుల్లో కూడ చలామణీలో ఉన్న మేధావిత్వపు మోజులను పక్కన పెట్టింది. అమెరికన్ పెట్టుబడిదారీ విధానం ఇరవయో శతాబ్దిలోకెల్లా మెరుగైన పరిస్థితిని అనుభవించిన రెండు దశాబ్దాలలో, 1960ల మధ్య, పాల్ బారన్, పాల్ స్వీజీలు రాసిన మోనోపలీ కాపిటల్ ఆ ఆర్థిక వ్యవస్థ మాంద్యాన్నీ, అసమానత పెరుగుదలనూ చవిచూడ బోతున్నదని చెప్పింది. ఆ ఆర్థిక వ్యవస్థ అంతకంతకూ ఎక్కువగా సైనికీకరణ పొందుతుందనీ, దాని రుణభారం హాస్యాస్పద స్థాయికి చేరుతుందనీ, స్పెక్యులేషన్ జూదపు వ్యాపారానిది పైచేయి అవుతుందనీ చెప్పింది. ఆ విశ్లేషణ, దానికి అనుగుణంగా తర్వాతి దశాబ్దాలలో మంత్లీ రివ్యూలో వచ్చిన లెక్కలేనన్ని వ్యాసాలు, పెట్టుబడిదారీ విధానపు ప్రస్తుత స్వభావాన్ని అంతకు ముందరి రచనల కన్న మెరుగ్గా వివరించాయి.

మీరే ఆ పత్రికను చదవండి. దాని విలువ పూర్తిగా తెలుసుకోండి. అయినా ఒక వామపక్ష పత్రిక అద్భుతమైన కృషి చేస్తున్నప్పటికీ, దానికి నిబద్ధులైన పాఠకులు ఉన్నప్పటికీ ఆ పత్రికను ప్రచురించడంలోని ఆర్థిక సూత్రాలు ప్రస్తుతం ఎంత ప్రమాదకరంగా ఉన్నాయో మీరు అర్థం చేసుకోలేరు. మంత్లీ రివ్యూ బలపడడానికి, నిలబడడానికి కారణం మీరే. మంత్లీ రివ్యూ పాఠకులే. మంత్లీ రివ్యూ ఖర్చులకు అవసరమైనంత సంపాదించడానికి, కృషిని కొనసాగించడానికి తగిన వనరుల కోసం పాఠకుల మీదనే ఆధారపడుతుంది.

మంత్లీ రివ్యూకు సహకరించమని మిమ్మల్ని అడగడానికి మరొక కారణం ఉంది. మాకు అందిన డబ్బు తగిన, మంచి అవసరాలకే

ఉపయోగపడుతుంది. అది కేవలం మా రోజువారీ ఖర్చుల కోసం మాత్రమే కాదు, అవి అవసరమైనవే అయినప్పటికీ. అంతకన్న ముఖ్యంగా మా కృషిలో వ్యవస్థాగత మెరుగుదల సాధించడానికి, భవిష్యత్తులో మరింత గట్టి పునాది మీద నిలబడి పనిచేయడానికి ఆ నిధులు ఉపయోగపడతాయి. మీ సహకారం, మరొక మాటల్లో చెప్పాలంటే, మూలనిధి మదుపుగా ఉంటుంది. మంచి సోషలిస్టు ప్రణాళికను ప్రతిఫలిస్తుంది.

గత రెండు సంవత్సరాలలో మీరు అందించిన సహాయంతోనే పూర్తిగా ఎలక్ట్రానిక్ కామర్స్ నిర్వహించగల మంత్లీ రివ్యూ వెబ్ సైట్ ను తయారు చేయగలిగాం. ఆ వెబ్‌సైట్ నిండా మంత్లీ రివ్యూ అందించిన అత్యుత్తమమైన విశ్లేషణ, అవగాహన ఉన్నాయి.

మొట్టమొదట, మంత్లీ రివ్యూ పాత సంచికలన్నిటినీ, 1949 నుంచి ఇవాళ్టి దాకా అన్వేషించడానికి వీలైన సమాచార నిధిగా మార్చడం ఇటీవలనే పూర్తి చేశాం. ప్రతి వ్యాసాన్నీ పూర్తిగా సూచికల ద్వారా వెతకడానికి వీలుగా తయారు చేశాం. అంటే అరవై ఆరు సంవత్సరాల వ్యాసాల పూర్తి పాఠాలను, రచయితల పేర్లతో, సంపుటితో, సంచికతో, తేదీతో, లేదా కీలక పదాలతో పాఠకులు వెతకడానికి వీలవుతుంది. అదే సమయంలో మంత్లీ రివ్యూ పాత సంచికలను ఒక ప్రామాణిక విద్యాసంబంధమైన పత్రిక వెబ్‌సైట్ తో సమానంగా ఉండేలా పునర్నిర్మించడం జరిగింది. మంత్లీ రివ్యూ కొత్త సంచికలు వచ్చినవి వచ్చినట్టుగా ఈ వెబ్ సైట్ మీద వెంటనే తాజాగా నమోదవుతున్నాయి. మామూలుగా కనబడకుండా జరిగే ఇటువంటి పనిని చాల ఖర్చుతో బైటివాళ్లతో చేయిస్తారు. ఆ పని చేయడానికీ ఖర్చవుతుంది. ఆ తర్వాత వచ్చే ఆదాయంలో కూడ ఆ బైటివాళ్లకు వాటా ఉంటుంది.

రెండవది, మరొక ముప్పై ఐదు ప్రామాణిక మంత్లీ రివ్యూ ప్రెస్ ప్రచురణలను ఎలక్ట్రానిక్ బుక్స్ (ఇబుక్స్) గా మార్చాం. ఈ పుస్తకాలలో హాల్ డ్రేపర్ రాసిన నాలుగు సంపుటాల ఉద్గ్రంథం కార్ల్ మార్క్స్ థియరీ ఆఫ్ రెవల్యూషన్, ఇ పి థాంప్సన్ రాసిన పావర్టీ ఆఫ్ థియరీ, డానియెల్ గ్వెరిన్ రాసిన అనార్కిజం వంటి విమర్శనాత్మక మహా రచనలున్నాయి. ప్రస్తుతం మా డిజిటల్ ఆర్కైవ్స్ లో వందకు పైగా పుస్తకాలున్నాయి, ఇంకా పెరుగుతున్నాయి. ప్రస్తుతం మేం మా వెబ్ సైట్ మీద ఇబుక్స్ కూడ అమ్ముతున్నాం.

చివరిగా, ఎన్నో సంవత్సరాలుగా పాఠకులు కోరుతున్నట్టుగా, మేమూ చాల కాలంగా ఆలోచిస్తున్న ఎలక్ట్రానిక్ చందాలు ప్రారంభించాం. అంతర్జాతీయంగా ఒక కొత్త డిజిటల్ పాఠకుల తరం పెరుగుతున్నందువల్ల ఈ రూపం వారి అవసరం తీరుస్తుంది. త్వరలోనే ఇ-అసోసియేట్స్ పథకాన్ని కూడ ప్రారంభించబోతున్నాం. ఎంతోకాలంగా ఉనికిలో ఉన్న అసోసియేట్ సభ్యత్వం లాగనే, ఈ ఇఅసోసియేట్స్ కు కూడ ఒక ఇ-చందా, ఒక ఉచిత ఇబుక్, మరే పుస్తకాన్నయినా సగం ధరకే కొనగలిగే సౌకర్యం ఉంటుంది.

నిజంగా ఈ పనుల్లో ఏ ఒకటైనా మీ సహాయం లేకుండా సాధ్యమయ్యేవి కావు. ఈ పనిలో ఎక్కువభాగం కార్యాలయంలోనే చేశామంటే, ఖరీదైన కాంట్రాక్టర్లను, బైటి వేతన సహాయకులను ఉపయోగించలేదంటే అదంతా మీరు ఎప్పటికప్పుడు అందిస్తూ వచ్చిన సహాయం వల్లనే. అరవై ఆరు సంవత్సరాలుగా మంత్లీ రివ్యూ అలవరచుకున్న పట్టుదల వల్లనే.

మాకన్న ఎన్నో ఎక్కువ రెట్ల వనరులున్న బహుళజాతి ప్రచురణ సంస్థలతో సమానంగా మా డిజిటల్ సేవలను పాఠకులకు విస్తరించగలగడానికి మీ సహాయమే కారణం. మేం మరిన్ని అడుగులు వేయదలచుకున్నాం. ఎప్పటిలాగనే మీ సహకారానికి స్పష్టమైన రాజకీయ ప్రభావం ఉంటుందని హామీ ఇస్తున్నాం. అలాగే మీపట్ల మా కృతజ్ఞత కూడ. మంత్లీ రివ్యూ ప్రాథమిక కర్తవ్యం పాఠకులకు చైతన్యం అందించడం. మా ప్రస్తుత వ్యాసాలను గాని, ఇటీవలి వ్యాసాలను గాని డబ్బు చెల్లిస్తేనే చదివేలా చేయడం లేదు. ప్రతినెలా మా వెబ్ సైట్ ను ఒక లక్ష మంది పాఠకులు చూస్తున్నారు. అందులో అతి చిన్న భాగం మాత్రమే డబ్బు చెల్లించే పాఠకులు.

మీరు ఎంత సహాయం చేయగలిగితే అంత చేయండి. మంత్లీ రివ్యూకు ఎంతంటే అంత ఇవ్వగలిగితే బాగుండునని కోరుకునేవాళ్లు ప్రపంచవ్యాప్తంగా వేలాది మంది ఉన్నారని నాకు అనుభవపూర్వకంగా తెలుసు. కాని వనరుల కొరత వల్ల వారు అటువంటి సహాయం చేయలేకున్నారు. మీరు కనీసం వారి పేరుమీద ఇవ్వండి. ఒక కొత్త ప్రపంచాన్ని సృష్టించడానికి దోహదం చేయడంలో మాకు సహకరించండి. మీరు సహాయం అందిస్తారనే మా ఆశ. వీ

## వీక్షణం విడి ప్రతి కొనుగోలుదారులకు ఒక క్షమాపణ, ఒక విజ్ఞప్తి

వీక్షణం పాఠకులలో దాదాపు సగం మంది వీక్షణంకు చందాదారులు కారు, ఏనెలకానెల తమ తమ ప్రాంతాలలో వార్తాపత్రికలు అమ్మే దుకాణాలలో విడి ప్రతి కొనుక్కుని చదువుతుంటారు. గత ఆరు నెలలుగా ఆ దుకాణాలలో వారికి వీక్షణం దొరకడం లేదు. రెండు రాష్ట్రాలలోని దాదాపు 300 న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం పంపిణీ చేస్తూ ఉండిన ఆనంద్ ఏజెన్సీస్ వీక్షణంను ఇప్పుడు పంపిణీ చేయడం లేదు. మరొక రాష్ట్ర వ్యాప్త సోల్ ఏజెన్సీ గాని, ఎక్కడికక్కడ ఏజెన్సీలు గాని ఏర్పడేవరకూ న్యూస్ ఏజెంట్ల దగ్గర వీక్షణం దొరకదని చెప్పడానికి చింతిస్తున్నాం. పాఠకులకు కలుగుతున్న ఈ అసౌకర్యానికి క్షమించవలసిందిగా కోరుతున్నాం.

ఇప్పటిదాకా ఏనెలకానెల విడిప్రతి కొనుక్కుంటున్న పాఠకులు, అభిమానులు చందాదారులుగా చేరవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. ఎక్కువ కాపీలు అమ్మకం అయ్యే ప్రాంతాలలో, పట్టణాలలో కొత్త, నమ్మకమైన ఏజెంట్లను ఏర్పాటు చేయవలసిందిగా మిత్రులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

**– సర్క్యులేషన్ మేనేజర్**
*9949391028*

# ఎవరిదీ స్వచ్ఛ భారత్?

***తరతరాలుగా పారిశుధ్యపు పనులు చేస్తున్న కార్మికులను పట్టించుకోని పాలకులు స్వచ్ఛ భారత్ పేరుతో కార్మికుల కులంతో, పారిశుధ్యపు పనులను ముడివేసి వారిని అభివృద్ధికి మరింత దూరం నెడుతున్నారని అంటున్నారు* వివేక్ కుమార్**

ఇటీవల మొదలెట్టిన 'స్వచ్ఛ భారత్ అభియాన్' అనివార్యంగా కుల వ్యవస్థను పట్టి చూపుతుంది. ఇది మొత్తం పారిశుధ్యపు పనితోనూ, పారిశుధ్యపు పనివాళ్ల హక్కుల్తోనూ ముడిపడి ఉంది. దీనికొక సాధికారత తేవడం కోసం, గాంధీ సూచించిన ఆరోగ్యం, పరిశుభ్రత సూత్రాలను ఓ అసంబద్ధమైన ముడివేశారు.

ప్రధానమంత్రి మోడీ 'స్వచ్ఛ భారత్ అభియాన్' (దేశాన్ని శుభ్రం చేయండి) అనే నినాదాన్ని తెచ్చి, 2019 నాటికి దేశం మొత్తం శుభ్ర భారత్‌గా మారిపోవాలని పిలుపునిచ్చారు. సింబాలిక్‌గా ఉంటుందని, గాంధీ 150వ జయంతి సందర్భంగా అక్టోబర్ 2న మొదలెట్టారు. మోడీ మొత్తం దేశ ప్రజలకైతే పిలుపునిచ్చాడు కాని, ఆ సందర్భంలో కొన్ని ముఖ్యమైన విషయాలు మరుగున పడిపోయాయి.

**గత కాలపు కృషి**

'స్వచ్ఛ భారత్' పిలుపును గమనిస్తే, మనకు అనివార్యంగా సంత్‌గాడ్గేబాబా (1876–1956) గుర్తుకొస్తారు. ఆయన మహారాష్ట్రలోని అమరావతి జిల్లాకు చెందిన వ్యక్తి. ఆయన ఎక్కడికెళ్లినా, ఆరోగ్యానికీ, పారిశుధ్యానికీ ప్రాముఖ్యతనిచ్చేవాడు. ఆ మహానీయుడు పల్లెలు తిరుగుతూ, పారిశుధ్యాన్నీ, ఆరోగ్య సూత్రాల్నీ బోధిస్తూ పల్లెల్లో విప్లవమే తెచ్చాడు. ఆయన చెప్పిన సూత్రాలే తర్వాతి కాలంలో ప్రభుత్వానికీ, ఐక్యరాజ్య సమితికీ మార్గదర్శకాలయ్యాయి. అంబేద్కర్ లాంటి వారు ఆయన వల్ల విశేషంగా ప్రభావితులయ్యారు.

ఆయన తన వృత్తి చిహ్నమైన చీపురు కట్టను చేత్తో పట్టుకొని, నెత్తి మీద కుండ పెట్టుకొని (ఆహారం కోసం) తిరిగేవాడు. గ్రామంలోకి ప్రవేశించిన వెంటనే, ముందుగా వీధుల్నీ, మురికి కాలువల్నీ శుభ్రం చేసేవాడు. ప్రజలెవరైనా ఆయన పనిని పొగిడితే, తనపని పూర్తయిన దాకా ఆగమనేవాడు. ఆయన చేత ప్రేరణ పొందిన మహారాష్ట్ర ప్రభుత్వం ఆ తర్వాత కేవలం పారిశుధ్య పనులకే వారం రోజులు కేటాయించేది.

1999 ఏప్రిల్‌లో మహారాష్ట్ర ప్రభుత్వం సంపూర్ణ పారిశుధ్య క్యాంపెయిన్ మొదలెడుతూ, 'పెద్ద సబ్సిడీల స్థానంలో చిన్న సబ్సిడీలు ఉండాలనీ, ప్రతి కుటుంబం, ప్రతివ్యక్తీ పారిశుధ్యానికి బాధ్యత వహించాలని, అందరికీ టాయిలెట్ సౌకర్యాలు కల్పించాలని' ఆదేశించింది. దీనికి అనుగుణంగా ప్రభుత్వం, 'సంత్‌గాడ్గేబాబా గ్రామ్ స్వచ్ఛతా అభియాన్' (పల్లెల్ని శుభ్రపర్చండి) అనే కార్యక్రమం మొదలెట్టింది. ఈ కార్యక్రమంలో తమ పల్లెల్ని శుభ్రంగా తీర్చిదిద్దుకున్న వాళ్లకి అవార్డులు కూడా ఇచ్చారు. విషాదమేమంటే మోడీ హై – ఓల్టేజీ టెక్నాలజీ ప్రచారం కింద గతంలోని ఇట్లాంటి కృషి అంతా మరుగున పడిపోయింది.

**వాల్మీకి కాలనీ**

ఓవైపు మోడీ 'స్వచ్ఛ భారత్' ప్రచారం హోరెత్తుతుంటే, అసలీ ప్రచారం అనేది పారిశుధ్యపు పనులు చేసే వాల్మీకి కాలనీ నుండే ఎందుకు మొదలు పెడుతున్నారు? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దాన్ని వాళ్లు సింబాలిక్ గానే భావించవచ్చు. కాని అది ఓ కులాన్ని ప్రత్యేకంగా వేలెత్తి చూపించినట్లయింది. వాళ్లు ప్రత్యేకించి పారిశుధ్యానికీ, వాల్మీకి కులానికీ, వాల్మీకి కాలనీకీ లంకె కలుపనీకే చూస్తున్నారు. మరోవైపు అక్కడి నుండే మన ప్రధాని నుండి అనేక మంది ప్రముఖుల వరకు (పుండు మీద కారం చల్లినట్లు) పెద్దపెద్ద కొత్తకొత్త చీపుర్లతో పేపర్లకు పోజులిస్తూ రోడ్లు ఊడ్వడం మొదలెడ్తారు.

**గగుర్పొడిచే వాస్తవాలు**

దేశంలో పారిశుధ్యపు పనివాళ్ల జీవితాల్లోకి చూస్తే ఒళ్లు గగుర్పొడిచే వాస్తవాలు కనపడతాయి. రోడ్డు ఊడ్వడం, లెట్రిన్లు (తడి, పొడి) కడగడం, మురికి కాలువలు శుభ్రం చేయడం, మ్యాన్ హోల్స్ శుభ్రం చేయడం, చెత్తా, చెదారాన్ని తీసివేయడం లాంటి పారిశుధ్యపు పనులన్నీ కేవలం ఒక కులం వారు మాత్రమే చేస్తుంటారు. అన్నింటికన్నా, అత్యంత హీనమైన, మానవ సమాజానికే మచ్చుతెచ్చే విషయం పొడి లెట్రిన్లు (డ్రై లెట్రిన్స్) కడగడం. అతిపెద్ద ప్రజాస్వామిక దేశంగా గొప్పలు చెప్పుకునే ఈ దేశంలో ఇప్పటికీ లక్షల మంది పారిశుధ్యపు పనివాళ్లు మానవ మలాన్ని తమ తలలపై మోస్తూ తీసుకుపోతుంటారు. ఒక ఇంటర్వ్యూలో ఒకానొక అభాగ్యజీవి చెప్పిన మాటల్ని వినండి.

'వానాకాలంలో మాకు చాలా ఇబ్బందిగా ఉంటది. వెదురు బద్దల్తో తయారు చేసిన బుట్టల్లో మేం మలాన్ని తీసుకుపోతుంటాం. వర్షం పడినప్పుడు, అదంతా పలుచనయి, సందుల గుండా (మలం) ముఖం మీదకు జారుతుంది. ఇది ఇలా ఉంటే, ఎండాకాలం మాకు మరో సమస్య ఎదురవుతుంది. మధ్యాహ్నం భోజనం చేయాలంటే, చేతులు కడుక్కోవడానికి నీళ్లు దొరకవు. ఒకటి రెండు కిలోమీటర్లు నడిచి వెళ్లాల్సిందే. అంతదాకా మా కడుపు మాడాల్సిందే'.

మరోవైపు మురికి కాలువల్ని, డ్రైనేజీ కాలువల్ని శుభ్రం చేయడం కష్టమే కాదు, చాలా ప్రమాదమైంది కూడా. అస్పృశ్యుల్ని ఈ పనికి వినియోగిస్తుంటారు. ప్రతి ఏటా కొన్ని వేల మంది డ్రైనేజీ కాలువల్ని

శుభ్రం చేస్తూ విష వాయువుల పాలుపడి చనిపోతూ ఉంటారు. కాని మున్సిపాలిటీ వాళ్లు ఈ పనివాళ్లకు ఎటువంటి భద్రతా పరమైన చర్యలు కల్పించరు. ఢిల్లీ, ముంబాయి, కలకత్తా, చెన్నై వంటి మహానగరాల్లో ఎందుకు ఇలాంటి అకారణ మరణాలు జరుగుతున్నాయనే ప్రశ్నకు ఢిల్లీ మున్సిపాలిటీలో పనిచేసే ఓ సీనియర్ పారిశుధ్యపు పనివాడు ఇలా జవాబిస్తాడు.

'ఎందుకంటే, ప్రయాణికుల ఒత్తిడి వల్ల, మేం రాత్రిపూటనే డ్రైనేజీ పనుల్ని మొదలెడుతాం. రాత్రిపూట నీటిసరఫరా మొత్తంగా బంద్ పెడతారు. కాలువల్లో నీటి ఒరవడిలేనందున, విషవాయువులు విపరీతంగా పెరిగిపోతాయి. సాధారణంగా ఇట్లాంటి పనుల్ని కాంట్రాక్టరుకు అప్పగించడంతో అతను నైపుణ్యంలేని పనివాళ్లను దించుతాడు. వాళ్లకు ఆక్సిజన్ మాస్క్ లాంటి సౌకర్యాలు ఏమీ ఉండకపోవడంతో, అక్కడికక్కడే చనిపోతూ ఉంటారు'.

అత్యంత క్రూరమైన విషయమేమంటే, మృతుడి భార్య పిల్లలు పరిహారం కోసం ఆఫీసుల చుట్టూ నిస్సహాయంగా తిరుగుతుంటారు. తాము ఈ పనులన్నీ కాంట్రాక్టరుకిచ్చామని చెప్పి, మున్సిపాలిటీ వాళ్లు చేతులు దులిపేసుకుంటారు. మరోవైపు చావు సంగతి తెలిసిన వెంటనే కాంట్రాక్టరు పారిపోతాడు. ఇంత ప్రమాదకరమైన పని అయినప్పటికీ, వాల్మీకి కులస్తులు ఈ పనికి ఎందుకు పూనుకుంటున్నారు? అత్యంత అట్టహాసంగా మొదలెట్టిన 'స్వచ్ఛ భారత్' కార్యక్రమంలో మొట్ట మొదట అడగాల్సిన ప్రశ్న ఇదే.

**పౌరుల బాధ్యత**

పౌరులు తమతమ పరిసరాల్ని పరిశుభ్రంగా ఉంచుకోవాలన్నది మరో ఆదేశం. దీన్ని అమలు పరచడం పేద ప్రజలకు ఎంత కష్టమో ఎవరూ ఆలోచించరు. 2011 జనాభా లెక్కల ప్రకారం, మనదేశంలో 68 మిలియన్ల ప్రజలు మురికి వాడల్లో బతుకునీడుస్తున్నారు. వాళ్లు తమ పరిసరాల్ని శుభ్రపరచడానికి ఏమైనా ఏర్పాట్లు ఉన్నాయా? తాము జమచేసిన చెత్త, చెదారాన్ని ఎక్కడ పారబోయాలి అనే ప్రశ్నలొస్తాయి.

ఈ సందర్భంలో సఫాయి వాళ్లు, వాళ్లకు సహకరించి, చెత్తను పారబోయడమో, రీసైకిల్ చేయడమో చేస్తుంటారు. అయితే ఈ పనిని ఫలానా కులస్తులే చేయాలన్న నియమం ఏమీ లేదు. ఎవరైనా ఈ పని చేయగలిగినప్పటికీ కేవలం వాల్మీకి, భంగి లేదా మేతరి కులస్తులే ఈ పనికి పూనుకుంటారు. వాళ్లు చెత్తనంతా పోగుచేసినప్పటికీ, దాన్ని రీసైకిల్ చేయడానికో, అట్లా చేసిన తర్వాత తిరిగి దానిని ఇంధనంగా వాడడానికి తగిన టెక్నాలజీ ఉండదు. సరిగ్గా ఇక్కడే ప్రభుత్వం బాధ్యత వహించి చెత్తనంతా పంపించే ఏర్పాటు చేయాల్సి ఉంది.

ఇంతాజేసి, 2019 నాటికి 'స్వచ్ఛ భారత్' ఏర్పడాలనే ప్రభుత్వం, పారిశుధ్యపు పనుల కోసం కేటాయించే నిధులు ఎంతో తెలుసా... 2011–12లో కేటాయించింది కేవలం 0.04 శాతం మాత్రమే. ఇంత చిన్న బడ్జెట్‌తో ఇంత పెద్ద దేశాన్ని ఎట్లా స్వచ్ఛంగా మారుస్తారో, వాళ్ల చేతుల్లో ఏదైనా అల్లా ఉద్దీన్ అద్భుతదీపముందో తెలియదు.

**గాంధీతో పోలిక**

మోడీ, తన స్వచ్ఛ భారత్ కార్యక్రమాన్ని గాంధీతో పోల్చుకోవడం హాస్యస్పదమైంది. ఆయన తన కార్యక్రమానికి సాధికారత కోసం గాంధీతో పోల్చుకున్నా, గాంధీ అసలు ఉద్దేశం పక్కన పెట్టినట్టయింది. పారిశుధ్యపు పనులతో ముడిపడి ఉన్న కుల వ్యవస్థను రూపుమాపాలన్నదే ఆయన అసలు ఉద్దేశం. ఆయన వ్యక్తిగత పరిశుభ్రతను ఎంతగా బోధించినా, పరిశుభ్రతతో ముడిపడి ఉన్న కుల వ్యవస్థను స్పష్టంగానే గుర్తించాడు. 1925 సెప్టెంబర్ 13న 'నవజీవన్'లో తాను రాసిన 'మన అపరిశుభ్ర విధానాలు'లో ఆయన వ్యక్తిగత పరిశుభ్రత గురించి, చాలా విలువైన సూచనలే ఇచ్చాడు.

అయితే ఆయన ఎంతసేపూ వ్యక్తిగత పరిశుభ్రత గురించి మాట్లాడేదు గాని, సామూహిక అపరిశుభ్రత, డ్రైనేజీ, మురికి కాలువలు, పాకీపని గురించి ప్రస్తావించలేదు. పారిశుధ్యం అనేది ఎల్లప్పుడూ ఓ కులంతో ముడిపడినదిగానే ఆయన గుర్తించాడు. అందుకనే, ఈ మచ్చను తొలగించడానికి, ఆయన ఢిల్లీలో పాకీ పనులు చేసే వాల్మీకి వాడలో 1946–47 లలో 214 రోజులు గడిపాడు. మోడీ ఆ పని చేయాలేగాని, సింబాలిక్‌గా ఉంటుందని, తన కార్యక్రమాన్ని ఈ కాలనీ నుండే మొదలెట్టాడు. దీనితోపాటు, దళితులకు, అంటరాని వారికి దేవాలయ ప్రవేశం కల్పించడం ద్వారా అంటరాని తనాన్ని నిర్మూలించవచ్చని గాంధీ భావించాడు. అయితే అంబేద్కర్ దీన్ని తీవ్రంగా ఖండించాడు. దేశంలో అంటరాని తనాన్ని నిర్మూలించడానికి ఈ విధానాలు ఏమాత్రం సరిపోవని ఆయన దృఢంగా అభిప్రాయపడ్డాడు.

**ముగింపు**

ఒకవేళ 'స్వచ్ఛ భారత్'ను నిజం చేయాలనుకుంటే, ప్రభుత్వం, ప్రజలు కలిసి అన్నిరకాల పారిశుధ్యపు పనులు (ఊడ్వడం, పాకీపని, డ్రైనేజీ పని, మ్యాన్‌హోల్స్ పని వంటివి) చేయాలి. మురికి వాడల్లో పారిశుధ్యపు సౌకర్యాల్ని పెంచాలి. మున్సిపాలిటీల్లో కాంట్రాక్టు వ్యవస్థను రద్దుచేసి తగు నిధుల్ని సమకూర్చాలి. చెత్తా, చెదారాన్ని దూరంగా డంప్ చేయడమో, లేక రీసైక్లింగ్ ద్వారా ఇంధనంగా మార్చడమో జరగాలి. వాతావరణ సమతుల్యతను పాటించడానికి తగు జాగ్రత్తలు పాటించాలి. లేకపోతే ప్రచారపు పటాటోపాలు, ఆకర్షణీయ డైలాగులు పెద్ద తేడాను చూపించవు. పారిశుధ్యపు బిల్లు (సానిటేషన్ బిల్) అనేది 1878లోనే ప్రవేశ పెట్టారనేది మనం గమనించాలి.

*(ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ,* Vol - XLIX No. 43-44, *నవంబర్ 1, 2014 సంచికలో వచ్చిన 'హూస్ క్లీన్లినెస్?' వ్యాసానికి స్వేచ్ఛానువాదం. ఉదయ మిత్ర)*

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.*

# తాత్కాలిక చర్యలూ దీర్ఘకాలిక పరిష్కారమూ

- ఎచ్. శ్రీకాంత్

దాదాపు 20 ఏళ్ల క్రితం 'ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ'లో (ఇపిడబ్ల్యు) లో, స్వలింగ సంపర్కుల హక్కుల మీద జరిగిన చర్చలో పాల్గొన్నాను. ఇప్పుడు వీక్షణంలో రంగనాయకమ్మ వ్యాసాన్ని హిజ్రా సమస్య గురించీ, స్వలింగ సంపర్కం గురించీ జరుగుతున్న చర్చనూ శ్రద్ధగా గమనించాను.

హిజ్రాలు (ట్రాన్స్‌జెండర్), స్వలింగ సంపర్కులూ (హోమో సెక్స్‌వల్స్) సమాజంలో రకరకాలుగా వివక్షకు గురవుతున్నారనీ, హక్కుల విషయంలో పరలింగ సంపర్కులతో ఎలా వ్యవహరిస్తామో, అలాగే వీరితోనూ సమానంగా వ్యవహరించాలి అనే వాదనతో నేను ఏకీభవిస్తాను. వారు కూడా పౌరులే కాబట్టి, పెంకకమూ, విద్యా, ఆరోగ్యం, ఉపాధి, రాజకీయాలూ, ప్రజా భద్రతా, కళలూ, సంస్కృతి వంటి విషయాలలో బాధ కలగకుండా హామీ పడాలి. హిజ్రాలైన కారణంగా గానీ, స్వలింగ సంపర్కులైన కారణంగా గానీ వారిపై శారీకంగా, మానసికంగా ఎవరూ దాడి చేయకూడదు. ఈ రకం జనాలలో ఉండే శారీరక సమస్యల్నీ, మానసిక సందిగ్ధతనీ (డైలెమానీ) సానుభూతితో అర్థం చేసుకోవాలి. ఆత్మగౌరవంతో జీవించడానికి వీరికి ఉన్న హక్కులకి రంగనాయకమ్మ వ్యతిరేకి కారని నేను గట్టిగా నమ్ముతున్నాను. అయితే, ఇక్కడ ఒక విషయం చెప్పాల్సిన అవసరం ఉంది. అన్ని బూర్జువా దేశాల్లోనూ ఉన్న మౌలిక సమస్యలు ఆకలి, నిరుద్యోగం, వర్గ దోపిడి, రాజ్యాంగ యంత్రపు అణచివేత మొదలైనవి.

ఈ మౌలిక సమస్యల్ని పరిష్కరించలేని పాలక వర్గాలు సెక్స్ పట్ల ఉండే దృక్పథాలు (సెక్స్‌వల్ ఓరియంటేషన్) మిగతా మౌలిక సమస్యల కన్నా ముందు తక్షణమే పరిష్కరించవలసిన సమస్యలుగా చూసే సాహిత్యాన్నీ, సినిమాలనూ, బహిరంగ చర్చలనూ ఉద్దేశపూర్వకంగా ప్రోత్సహిస్తోంది. భారతదేశం వంటి దేశాల్లో కూడా బూర్జువా ప్రచార హోరులో మేధావుల్లోని ఒక విభాగం వారు (వామపక్ష వాదులుగా చెప్పుకునే వారు కూడా) హిజ్రాల్నీ, స్వలింగ సంపర్కులనూ స్వతః సిద్ధ అభ్యుదయ కాముకులుగానూ, వర్గదోపిడికీ, స్త్రీ – పురుష వివక్షకీ వ్యతిరేకులుగానూ చిత్రిస్తున్నారు. అలాగే, వర్గ దోపిడీనీ, కుల అణచివేతనూ స్త్రీ – పురుష వివక్షనీ, సామ్రాజ్యవాద పెత్తనాన్నీ ఎన్నడూ వేలెత్తి చూపని వారిని, కేవలం స్వలింగ వివాహాల్ని సమర్థించిన కారణంగా బూర్జువా మీడియా వారిని ధైర్యశాలులుగా, అభ్యుదయ వాదులుగా గౌరవిస్తున్నది. వాస్తవంలో, సెక్స్ పట్ల వ్యక్తులకు ఉండే దృక్పథాలకూ (స్వలింగ సంపర్కమా, పరలింగ సంపర్కమా అనే దానికీ) అభ్యుదయ దృక్పథానికీ ప్రత్యక్ష సంబంధం లేదు.

కొంతమంది హిజ్రాలుగా, స్వలింగ సంపర్కులుగా ఎందుకు అవుతున్నారూ అనే ప్రశ్నకి సంతృప్తికరమైన జవాబు ఇచ్చేంత స్థాయిలో ప్రస్తుతం సైన్స్ అభివృద్ధి చెందలేదన్నది నిజమే! అలాంటి సెక్స్ దృక్పథాలకి శారీరక అంశాలు ఎంతవరకూ కారణం అవుతాయి; సామాజిక సాంస్కృతిక కారణాలు ఏ మేరకు ప్రభావం చూపుతాయి అనే అంశాలు ఇంకా నిర్ధారణ కావాల్సే ఉంది. సర్వ సాధారణ దృక్పథం (నార్మ్) నుంచే, భిన్నమైన దృక్పథానికి (డీవియేషన్), శారీరక అంశాలు ఏ మేరకు కారణం అయితే, ఆ మేరకు అలాంటి వ్యక్తులతో సంపూర్ణమైన సానుభూతితో వ్యవహరించాలి.

సామాజిక – సాంస్కృతిక అంశాలు కారణం అయిన మేరకు స్వలింగ సంపర్కుల్నీ, హిజ్రాలనూ సృష్టిస్తున్నామనే సమాజ స్వభావాన్ని నిశితంగా పరిశీలించాలి.

మనం జీవిస్తున్న సమాజం, వర్గ సమాజం మాత్రమే కాకుండా, స్త్రీ–పురుషులకి భిన్నమైన పాత్రల్ని కచ్చితంగా నిర్దేశించే పితృస్వామ్య సమాజం కూడా! స్త్రీ – పురుషులకి చిన్నతనం నుండీ ఏ రకం బట్టలు వేసుకోవాలీ, ఎలా మాట్లాడాలీ. ఎలా నడవాలీ, దేన్ని లక్ష్యంగా పెట్టుకోవాలీ, ఎవర్ని అనుసరించాలీ – అనే విషయాల్ని ఈ సమాజం నేర్పుతుంది.

కొందరు మగవాళ్లు, ఆడవాళ్లుగా మారాలనీ, కొందరు ఆడవాళ్లు మగవాళ్లుగా ప్రవర్తించాలనీ ఉవ్విళ్లూరడం ప్రధానంగా ఎందుకు జరుగుతుందంటే, స్త్రీ – పురుషులు తమ వేషంలో, చర్యలో భిన్నంగా ఉండేలా మన సమాజం వారిని నిర్దేశిస్తుంది. స్త్రీ – పురుషుల మధ్య అలా గిరిగీసిన భేదాలులేని సమాజాన్ని ఊహించండి. అక్కడ స్త్రీ – పురుషులకి ఒకేరకం వేషధారణ ఉంటుంది. ఇంటా, బయటా ఒకేరకం పనులూ, ఉద్యోగాలూ చేస్తూ ఉంటారు. ప్రతీ స్త్రీ – పురుషుడూ అటు తండ్రి పాత్రనీ, ఇటు తల్లి పాత్రనీ పోషిస్తారు. వారిద్దరి మధ్య ఆర్థికంగా ఆధారపడడమో, సాంఘికంగా ఒత్తిడో కాక కేవలం ప్రేమ మాత్రమే ఉంటుంది. అలాంటి సమాజంలో కూడా స్వలింగ సంపర్కులూ, హిజ్రాలూ ఉంటారా? బహుశా అలా జరగదు. ఎందుకంటే, స్త్రీ – పురుష సాంఘిక భేదాలూ, వివక్షా అదృశ్యమైనప్పుడు పరలింగంగా ఉండాలనే తహతహకూ స్వలింగుల పట్ల ఆకర్షణకూ ఆస్కారం ఉండదు. అలాంటి భవిష్యత్ సమాజాలలో కూడా, జీవశాస్త్ర సంబంధమైన కారణాల వల్ల కొందరిలో హిజ్రా లక్షణాలు కొనసాగినట్లయితే, సమాజం వారిని అర్థ చేసుకుని వారి స్వేచ్ఛకి వారిని వదిలిపెడుతుంది. సామాజిక – సాంస్కృతిక అంశాలను సమాజం సరిదిద్దినప్పుడు, అలాంటి సమాజంలో మనుషులు హిజ్రాలుగానో, స్వలింగ సంపర్కులుగానో అయ్యే అవకాశం తక్కువ ఉంటుంది.

అవును అలాంటి సమాజం ఇంకా రావాల్సే ఉంది. అప్పటి వరకూ సెక్స్ పట్ల వ్యక్తులకు ఉండే దృక్పథం కారణంగా వారికి పౌరహక్కులూ, రాజకీయ హక్కులుగా నిరాకరించకూడదు. హిజ్రాల పట్లా, స్వలింగ సంపర్కుల పట్లా జనాలలో ఉండే దురభిప్రాయాలూ, భయాలూ తొలిగేలాగానూ, వారు హుందాగానూ ఆత్మగౌరవంతోనూ జీవించడానికి, వారికి గల హక్కుల్ని గౌరవించేలా గానూ జనాలకు బోధించాలి. నేర పూరిత చర్యలకు ఎవర్నీ అనుమతించరాదు. అయితే, ఈ తాత్కాలిక చర్యలన్నీ హిజ్రాల, స్వలింగ సంపర్కుల సమస్యల్ని పరిష్కరించవు అనే విషయం అందరికీ స్పష్టం కావాలి. వారు నిజమైన స్వేచ్ఛని ఏ సమాజంలో పొందుతారంటే, ఎక్కడైతే వారు హిజ్రాలుగానో, స్వలింగ సంపర్కులుగానో జీవించేలా, ఒత్తిడి తెచ్చే సామాజిక, ఆర్థిక సాంస్కృతిక స్థితిగతులు ఉనికిలో ఉండవో, అటువంటి సమాజంలోనే అది సాధ్యం. వర్గాలుగా విడిపోయిన పితృస్వామిక సమాజాలలో, సెక్స్ పట్ల మైనారిటీ దృక్పథం ఉన్న వారి (సెక్సువల్ మైనారిటీల) హక్కుల్ని సమర్థించినంత మాత్రాన మనం అభ్యుదయ వాదులం కాలేం. సెక్స్‌కి సంబంధించిన హక్కులను డిమాండ్ చేయాల్సిన పరిస్థితులు అంతమయ్యే సమాజం కోసం మనం పని చేసినప్పుడే సామాజిక పురోగతికి మనం దోహదపడగలం. రంగనాయకమ్మ కూడా తన వ్యాసంలో ఇదే ఆశిస్తున్నారని నేను భావిస్తున్నాను.

*(రచయిత షిల్లాంగ్ యూనివర్సిటీలో రాజనీతి శాస్త్ర ప్రొఫెసర్)* వీ

# హిజ్రా సమస్యపై ప్రతిస్పందన

- తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి సభ్యులు

హిజ్రా సమస్య పేరుతో వీక్షణం పత్రికలో వచ్చిన వ్యాసానికి ప్రతిస్పందన ఇది. సమాజం నుంచి దూరంగా ఒక మూలకు నెట్టేసిన సమూహానికి సంబంధించిన రేవతి అనే హిజ్రా ఆత్మకథను ఉద్దేశించి తనకు తాను భౌతికవాదినని చెప్పుకునే రంగనాయకమ్మ వీక్షణం పత్రికలో నాలుగు నెలలుగా రోతరాతలు రాశారని మేం భావిస్తున్నాం. 12 పేజీల సుదీర్ఘ వ్యాసంలో అర్థంలేని వాగుడు, చర్చ చేశారు. ప్రతివాక్యంలో అర్థం లేని వ్యంగ్య, వితండవాదం చేశారు.

మొట్టమొదట ఒక వ్యక్తి పేరును గౌరవించాలనే కనీస ప్రజాస్వామ్య విలువను ఆమె పాటించలేదు. వ్యాసం నిండా భౌతికవాదాలు, మార్క్సిజాలు, సైన్స్ గురించి పెద్ద పెద్ద ఉపన్యాసాలు ఇచ్చిన అంత పెద్ద రచయిత్రికి అది తప్పుగా అనిపించలేదు. రేవతి పేరును గుర్తించేందుకు నిరాకరించారు. ఇక్కడ నుంచి మొదలుపెట్టి వ్యాసం నిండా అర్థం లేని వాదనలు చేశారు. ఒక వైపు హిజ్రాల గురించి ఏమీ తెలియదంటూనే, సమాజంలో అన్నిరకాల పీడన, వివక్షలను ఎదుర్కొంటున్న ట్రాన్స్‌జండర్‌ల మీద విషం కక్కారు. ఇంతకూ నాలుగు నెలలపాటు ఈ వ్యాసాలను చదివినా, మొత్తంగా ఈ వ్యాసం పుస్తకంపైన రివ్యూనో, విమర్శనో, లేదా, హిజ్రా కమ్యూనిటీ మీద విమర్శనో అర్థం కాలేదు. అయితే వ్యాసం ఆద్యంతం హిజ్రా సమస్యను అవగాహన చేసుకునేందుకు చాలా ప్రయత్నాలు చేసినట్లు చెప్పుకున్నారు. కానీ ఆ ప్రయత్నం అంతా పైపై ప్రయత్నంలాగే అనిపించింది.

ఇక విషయంలోకి వస్తే, రంగనాయకమ్మ హిజ్రాల గురించి తెలుసుకోవాలనే కోరికతో రేవతి ఆత్మకథను చదివారు. డాక్టర్లు, తెలిసిన వాళ్ల వద్ద వాకబు చేశారు. అక్కడ పెద్దగా వివరాలు దొరకలేదు. ఇక నెట్ మీద కూడా చాలానే వెతికానని రాశారు. అక్కడ కూడా హిజ్రాల గురించిన నాలుగు సానుభూతి మాటలు తప్ప పెద్దగా వివరాలు దొరకలేదని చెప్పారు. అందువల్ల ఆమె రాసిన సుదీర్ఘ వ్యాసంలో లేవనెత్తిన పలు సందేహాలకు సమాధానాలు ఇచ్చే ప్రయత్నం చేయాలని తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి భావిస్తోంది.

మొదటి విషయం రంగనాయకమ్మ, హిజ్రాల గురించి సైన్స్ విషయాలు తెలుసుకునేందుకు ఎంచుకున్న పుస్తకం సరైంది కాదు, రేవతి ఆత్మకథ, కేవలం ఆమె అనుభవాలు మాత్రమే. ఆ విషయాన్ని రంగనాయకమ్మ విస్మరించారు. అంతే కాదు, వ్యాసం తొలి పేరాలోనే రేవతికి సైన్స్ విషయాలు ఏవీ తెలియవని తేల్చేశారు. రేవతి పుస్తకంలో తనకు కావలిసిన సమాచారం దొరకలేదు అనిందే కానీ, దానిని తెలుసుకునే ప్రయత్నం ఏ మాత్రం చేయలేదు. తను వ్యక్తుల గురించి ఒక కమ్యూనిటీ గురించి మాట్లాడుతున్న విషయం మరిచిపోయినట్టుంది. తనకు నిజంగానే హిజ్రాల గురించి తెలుసుకోవాలంటే, తను ఉంటున్న హైదరాబాద్‌లో ఉన్న ఎంతో మంది హిజ్రాలలో కొందరినైన కలిసి మాట్లాడి అర్థం చేసుకునే ప్రయత్నం చేయలేదు. తను వ్యాసం మొదలు పెట్టి దానిని తీసుకువెళ్లిన తీరు చూస్తే, తను వాస్తవాలకు దూరంగా తన ఉహాజనిత లోకంలో ఏర్పరచుకున్న వ్యక్తిగత అభిప్రాయాలను ద్వేషపూరితమైన, అవమాన పూరితమైన భాషలో రాసింది తప్పా వేరే ఏమి కాదు. రేవతి తన జీవిత అనుభవాలను రాస్తే రంగనాయకమ్మ కేవలం అనుభవం లేని యాంత్రికమైన అభిప్రాయాలను రాసింది.

హిజ్రా సమస్య అంటే రంగనాయకమ్మ అనుకున్నట్లు శారీరక సమస్య, హార్మోన్ల సమ్యస కాదు, ఇది మొత్తంగా సామాజిక సమస్య. రేవతి తన పుస్తకంలో సామాజిక అనుభవాన్ని తెలిపేందుకు ఆత్మకథ రాశారు. సమాజం తమకు సంబంధించిన ఈ విషయాలు తెలుసు కోవాలనే ఉద్దేశంతో తన జీవితాన్ని అక్షరీకరించారు. ఎలా అయితే జాతి వివక్ష గురించి రాసే వ్యక్తి తన అనుభవాలు రాస్తారో,. రేవతి కూడా తను హిజ్రా కావడం వల్ల ఇంటా, బయట ఎదుర్కొన్న వివక్ష, గేలి, హేళనలను వ్యక్తీకరించారు. హిజ్రాలకు సంబంధించిన సైన్స్ విషయాలు రాయకపోతే,. దానర్థం, ఆమెకు తెలియకపోవడం కాదు,. ఈ విషయంలో విఫలమైంది రంగనాయకమ్మ మాత్రమే. హిజ్రాల గురించిన సైన్స్ విషయాలు కావాలంటే, గూగుల్ స్కాలర్, పబ్‌మెడ్ వంటి సాంకేతిక పనిముట్ల సహాయం తీసుకునే బదులు, తనకు తెలిసిన ఇద్దరు డాక్టర్ల్లు,. కొంత మంది సామాన్య జనాలు, ఉద్యోగులను అడిగి తెలుసుకునేందుకు ప్రయత్నించారు. పైగా ట్రాన్స్‌జెండర్‌ల గురించి డాక్టర్లు చెప్పిన అభిప్రాయాలను కూడా పరిగణలోకి తీసుకోకుండా,. హిజ్రాల మీద బురదజల్లే తన ఎజెండాను సమర్థించుకునేందుకు వక్రీకరించారు.

కనీసం కమ్యూనిటీతో కాకపోయినా 2014లో వచ్చిన ట్రాన్స్‌జెండర్స్ హక్కులను సమానత్వాన్ని చట్టబద్ధం చేస్తూ వచ్చిన సుప్రీంకోర్టు ఎన్ఎఎల్ఎస్ఎ తీర్పును కూడా చదివినట్లుగా లేరు, ఎక్కడ దాని ప్రస్తావన కూడా లేదు. దీన్ని భట్టి అర్థమవుతుంది ఎంతగా తనలో ఉన్న ద్వేషాన్ని సమర్థించుకోడానికి సరిపోయే వాధాలనే పట్టుకుని మిగిత వాటిని వదలిపెట్టి జనాలనూ తప్పుతోవ పట్టించే ప్రయత్నం చేసింది.

రంగనాయకమ్మ నిజంగా వాస్తవాలను తెలుసుకోవాలనే ప్రయత్నం చేసి ఉంటే, శారీరక లింగానికి, (బయోలాజికల్ సెక్స్) సామాజిక లింగానికి (జెండర్) ఉన్న భేదం తెలుసుకోవడం పెద్ద విషయం ఏమి కాదు, దానికి సంబంధించి బోలెడు రచనలు ఉన్నాయి. శారీరక లింగం అనగా వ్యక్తుల శరీరాలకు సంబంధించినది (పురుషాంగం, యోనికి సంబంధించినది, కొంత మంది జన్మతః రెండు అంగాలతో జన్మిస్తారు వారిని ఇంటర్సెక్స్ అంటారు) , సామాజికంగా లింగం సమాజం చేత నిర్మించబడిన ఒక వ్యవస్థ. పురుషాంగంతో పుడితే మగవాడు అని యోనితో జన్మిస్తే స్త్రీ అని, మగవాడికి ఎలా ఉండాలో, ఏం బట్టలు వేసుకోవాలో, ఏం పని చేయాలో, అలాగే స్త్రీ అయితే ఎలా ఉండాలో, ఏం చేయాలో, ఏం చేయకూడదో నిర్ణయించే ఒక వివక్ష పూరితమైన వ్యవస్థ. ఈ వ్యవస్థ శతాబ్దాల తరబడి స్త్రీలపై వివక్ష చూయించడం ప్రపంచానికి తెలిసిన వాస్తవం. శారీరక అంగాలు ఆధారితం చేసుకొని పుట్టుక సమయంలో వ్యక్తులకు జెండర్‌ని ఆపాదిస్తారు. ఎదిగే కొద్ది శరీరాల ఆధారంగా వారికీ ఆపాదించిన జెండర్‌తో పోల్చుకోలేక ఇబ్బంది పడేవాళ్ళు, అసహనానికి గురయ్యే వాళ్లు చాల మంది ఉంటారు. వారే ట్రాన్స్‌జెండర్స్. వారు సమాజంలో ఉన్న వ్యతిరేకతను ఎదుర్కొని వారు పోల్చుకోదగ్గ జెండర్‌తో జీవించడం మొదలు పెడతారు. సమాజం ఏర్పరచిన జెండర్ కట్టుబాట్లను దాటి బయటకు వచ్చి జీవించే

వీరిపై వివక్ష చూపించడం, హింసకు గురిచేయడం సమాజం అత్యంత పకడ్బందిగా చేస్తుంది. రంగనాయకమ్మ చాలా తేలికగా ఈ వస్తువులన్నిటినీ పక్కన పెట్టేసింది.

ఇక రంగనాయకమ్మ లేవనెత్తిన ట్రాన్స్‌జెండర్ల శారీరక సమస్యను గురించి చెప్పుకునే ముందు, మార్క్సిస్టు, ఫెమినిస్ట్ వైపు నుంచి చెప్పాలంటే,. రేవతి, సమాజం తనకిచ్చిన జెండర్ గుర్తింపును కాలదన్ని మహిళల శ్రమ విధానాన్ని ఎంచుకున్నారు. స్టీరియో టైప్‌లను బద్దలుకొట్టే సాహసం చేసినందుకు మెచ్చుకోవడానికి బదులు, రంగనాయకమ్మ రేవతిని తూలనాడారు. దీనర్థం రంగనాయకమ్మ మార్క్సిస్టు, ఫెమినిస్ట్ విరోధని అర్థమవుతోంది. తన వ్యాసంలో రంగనాయకమ్మ రేవతి, తండ్రి, అన్నలు రేవతి ఇంటి పనులు చేయకుండా అడ్డుకోలేక పోవడం బాధించినట్లుంది. కుటుంబంలో పురుషులు మిగిలిన కుటుంబ సభ్యుల పై పెత్తనం చేయాలనే భావన కలిగిస్తోంది. పురుషుడుగా పుట్టిన రేవతి, ఇంటి పనులు చేయడం మార్క్సిస్టు రంగనాయకమ్మకు పిచ్చి చేష్టలుగా కనిపించాయి. ఇది అశాస్త్రీయ విధానం.

రేవతి ఎస్ఆర్ఎస్ (సెక్స్ రీఅసైన్‌మెంట్ సర్జరీ) చేయించుకోవడం రంగనాయకమ్మకు తీవ్ర స్థాయి పిచ్చిలా అనిపించింది. కానీ నిజానికి ట్రాన్స్‌జెండర్ల శారీరక సమస్యల కారణంగానే సర్జరీలు చేసుకుంటారు. ట్రాన్స్‌జెండర్స్‌కు తమ శరీరాల వల్ల తీవ్ర అసౌకర్యం (బాడీ డిస్ఫోరియా) ఉంటుంది. సర్జరీ వల్ల శరీరాలు మార్పుచెంది, అసౌకర్యం కాస్త ఉపశమిస్తుంది. ట్రాన్స్‌జెండర్ అంటేనే, బ్రెయిన్, శరీరాల మధ్య జెండర్ గ్యాప్ అని ఇప్పటికే కొన్ని పరిశోధనలు తేల్చాయి. చాలా మంది డాక్టర్లు ఇప్పటికే ట్రాన్స్‌జెండర్‌ల బ్రెయిన్‌లో మార్పులు చేయడం సాధ్యం కాదు కాబట్టి శరీరాల్లో అవసరమైన మార్పులు చేయాలని చెపుతున్నారు.

రంగనాయకమ్మ చెప్పినట్లు, స్త్రీ, పురుషుల మధ్య సామాజిక అంతరం లేని సమాజంలో పెంచినా, ట్రాన్స్‌జెండర్ వ్యక్తి శారీరక అసౌకర్యం అలాగే ఉంటుంది. అలాంటి పరిస్థితుల్లో కూడా ట్రాన్స్‌జెండర్స్ తన శరీరాలను మార్చుకునేందుకు ప్రయత్నం చేస్తారు. సమాజం ట్రాన్స్‌జెండర్ల శరీరాల గురించి చాలా అవమానకరంగా మాట్లాడుతుంది. అందువల్ల ట్రాన్స్‌జెండర్ల ప్రధాన సమస్య అయిన, బాడీ డిస్ఫోరియాను, రేవతి లాంటి చాలా మంది ట్రాన్స్‌జెండర్స్ బహిరంగంగా మాట్లాడేందుకు విముఖంగా ఉంటారు. ఎందుకంటే, రేవతి పుస్తకంలోనే రాసినట్లు రోడ్డు మీద పోకిరీల నుంచి కుటుంబ సభ్యుల వరకూ అంతా ట్రాన్స్‌జెండర్‌ల శరీరాల గురించి ఎగతాళిగా మాట్లాడతారు.

ఉదాహరణకు రంగనాయకమ్మ చాలా సునాయాసంగా, ట్రాన్స్‌జెండర్ల ప్రైవేట్ బాడీ పార్ట్స్ గురించి చర్చించారు. ఇదే స్థాయికి దిగజారి మహిళల శరీరాల గురించి కూడా రచయిత మాట్లాడగలరా? ఇక్కడ ట్రాన్స్‌జెండర్లను అవమానించే ఉత్సాహంలో రంగనాయకమ్మ మహిళల రొమ్ములు, పిల్లలకు పాలివ్వడానికే అంటే సూత్రీకరించే స్థాయికి వెళ్లారు. ట్రాన్స్‌జెండర్లకు బ్రెస్ట్ అంటే తమ శరీరంలో ఒక భాగం. రంగనాయకమ్మ ఏకంగా స్త్రీల రొమ్ములు పిల్లలకు పాలు ఇవ్వకపోవడానికి కాకపోతే, సెక్స్‌కి కాకపోతే మరి ఎందుకు అని లేవనెత్తిన ప్రశ్న కొత్తది ఏమి కాదు. అంటే స్త్రీల రొమ్ములు కేవలం ఈ రెండు పనులకేనా? పిల్లలను కనని స్త్రీలంతా రొమ్ములు తీయించుకోవాల? ఎన్నో తరాల నుంచి పితృస్వామ్య సమాజంలో స్త్రీల శరీరాన్ని కట్టుదిట్టం చేస్తూ వచ్చిన ధోరణే రంగనాయకమ్మ ఈ ప్రశ్నలో కూడా కనిపిస్తుంది. స్త్రీలలో కూడా పితృస్వామ్యజాలం ఉంటుందంటే ఇదేనేమో !

ట్రాన్స్‌జెండర్ల శరీరాలపై రంగనాయకమ్మ వ్యక్తం చేసిన ఉత్సుకత సమాజంలో చాలా మంది హిజ్రాలపై లైంగిక దాడికి కారణం అవుతోంది. రంగనాయకమ్మకు ఉన్నటువంటి సందేహాలను తీర్చుకునేందుకు చాలా మంది వ్యక్తులు, ట్రాన్స్‌జెండర్లను బహిరంగంగానే అవమానిస్తారు. ఉదాహరణకు ఈ ఏడాది జనవరిలో కూకట్‌పల్లి పోలీసులు, ఒక హిజ్రాను నగ్నంగా చేసి, రాత్రంతా స్టేషన్‌లో హిజ్రాల శరీరాల గురించి అవమానకర ప్రశ్నలతో వేధించారు. మనుషుల శరీరాలకు సాధారణంగా లభించే గౌరవం, ప్రైవసీ, హిజ్రాలకు కూడా లభించాలని కోరుకోవడం, అప్రజాస్వామికమేమీ కాదు. ఇలాంటి అవమానాలే, రేవతి గురువు లాంటి పెద్ద వయసు ఉన్న హిజ్రాలు, యువ ట్రాన్స్‌జెండర్‌లను హిజ్రా కావద్దని హితవు చెప్పేందుకు ప్రేరేపిస్తాయి. అంతే కాదు, బాడీ డిస్ఫోరియా హెచ్చు స్థాయిలో ఉన్న ట్రాన్స్‌జెండర్లు మాత్రమే శస్త్ర చికిత్సలకు సిద్ధపడతారు, మిగిలిన వాళ్ళు, కేవలం సామాజిక గుర్తింపుతో సరిపెట్టుకుంటారు.

హిజ్రాలకు ఉండే శారీరక అసౌకర్యం, బాధలను రంగనాయకమ్మ అర్థం చేసుకోలేక పోగా, వారిపై చిన్నచూపుతో క్రూరంగా విమర్శించారు. సంప్రదాయ ఎస్ఆర్ఎస్ చికిత్స (నిర్వాణ్) చేసుకునే హిజ్రాలు, తమ లింగాన్ని కోల్పోవడమే కాక, సెక్స్ స్పందనలను కూడా కోల్పోతారు. అయినా, హిజ్రాల శరీరాలపై వారికున్న అసౌకర్యం, ఇంతటి సాహసానికి పురిగొల్పుతుంది. ఆధునిక సెక్స్ రీఅసైన్‌మెంట్ సర్జరీలు, హార్మోనల్ థెరపీలు, హిజ్రాలను శారీరకంగా పూర్తిస్థాయి మహిళగా మార్చగలుగు తున్నాయి. ఈ సెక్స్ రీఅసైన్‌మెంట్ సర్జరీలు, కేవలం సెక్స్ కోసం మాత్రమే కాదు. డిస్ఫోరియాను తగ్గించుకునే ప్రయత్నం మాత్రమే. ఇక రంగనాయకమ్మకు తెలియని మరో విషయం ఏంటంటే, భారతదేశంలో పలు రాష్ట్రాల్లో ప్రభుత్వ ఆసుపత్రులు సెక్స్ రీఅసైన్‌మెంట్ సర్జరీ చేస్తున్నాయి. ఉదాహరణకు తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, పాండిచ్చేరి ప్రభుత్వ ఆసుపత్రులు ఈ తరహా శస్త్ర చికిత్సలు అందిస్తున్నాయి. చికిత్స తర్వాత, సమాజంలో చిన్నచూపు లేకపోతే, హిజ్రాలు సంతోషకరమైన సాధారణ జీవితం గడప గలరు.

రంగనాయకమ్మ వంటి మనువాద బ్రాహ్మణ భావజాలమే సమాజం లో హిజ్రాల పట్ల చిన్నచూపు, వివక్షకు ప్రధాన కారణం. అందువల్లే హిజ్రాలకు ఉద్యోగాలు దొరకడం కష్టంగా మారుతోంది. అందువల్లే చారిత్రకంగా, హిజ్రాలు అడుక్కోవడం, సెక్స్‌వర్క్ వంటి పనులకే పరిమిత మయ్యారు. భారత్‌వంటి అర్ధ భూస్వామ్య వ్యవస్థలు, వెనుకబడిన పీడిత సామాజిక కులాలు, వర్గాలు, సమూహాలను ఇలాంటి పనులకే పరిమితం చేసే ప్రయత్నం చేస్తాయి. ఆపై వారు చేసే పనుల కారణంగా చిన్నచూపు ప్రదర్శిస్తారు. ఏ సమూహాన్నైనా, వారు చేసే పనులను బట్టి వివక్ష చూపడం వర్గ వివక్షే అవుతుంది. వృత్తులు, శ్రమల మధ్య అంతరాలను చూడడం మార్క్సిస్టు దృక్పథం కాదు.

ఈ హింసా, వివక్షా పూరిత కారణాల వల్ల హిజ్రాలు పెద్ద వయస్సు వచ్చే వరకూ బతికే అవకాశం లేదు. సామాజిక వివక్ష వల్ల తరచుగా, హిజ్రాలు ఆత్మహత్యలకు పాల్పడడమో, హత్యకు గురికావడమో జరుగుతుంది. చాలా అరుదుగా మాత్రమే హిజ్రాలు పెద్ద వయస్సు వచ్చే వరకూ బతుకుతారు. తెలంగాణ హిజ్రా ట్రాన్స్‌జెండర్ సమితి గత ఏడాది కాలంలో హైదరాబాద్ పట్టణంలో బహిర్గతంగా జీవిస్తున్న 300 మంది హిజ్రాలలో 60 మందికి పైగా హింసాత్మక దాడులకు గురయ్యారు. ఈ స్థాయిలో జరిగే దాడులను తట్టుకుని బతికి బట్టకట్టడం అంటే దినదిన గండమే. అయినా, పాతకాలంలో రాజుల చలవతో సామాజిక రక్షణ

→

(... 4వ పేజీ తరువాయి)

దలుచుకున్నారు' – అంటే, వీక్షణం పాఠకులందరూ, ఎవరేది రుద్దితే అదే రుద్దించుకునే దద్దమ్మలా?

9) 'వీక్షణంలో హిజ్రాల సమస్య వ్యాసం వచ్చి ఉండవలిసింది కాదు' – హిజ్రాల గురించి చర్చించ వలసిన అంశాలు ఎన్నో ఉన్నాయి – అని ఒక చోట చెప్పి, ఈ హిజ్రాల సమస్య వ్యాసం ప్రచురించవల్సిందే కాదనడం అర్థ రహితం.

10) టైపు చేయించి, ప్రూఫులు కూడా చూసి రచయితలు రచనలు పంపడం తప్పు అయినట్టు మాట్లాడడం, ఇంగిత జ్ఞానం లేని వాదన. చేతి రాతతో పంపినా, కంపోజ్ చేసి పంపినా, ఎడిటోరియల్ పాలసీకి అనుగుణంగా ప్రచురించడమో, తిరస్కరించడమో జరుగుతుంది. అక్షరాలు మార్చినందుకు కోపం ప్రదర్శించడం కాదు అది. తన గురించి మాత్రమే చెప్పడం కాక, రచయితలు రాసింది రాసినట్టు ఉంచాలని చెప్పడం అది.

11) 'రంగనాయకమ్మది మార్క్సిజం కాదు' అని ఈ మేధావి వాదన. 'రంగనాయకమ్మది మార్క్సిజమేనా అని నిశితంగా పరిశీలించవలసి ఉందని కూడా వక్కాణింపు. మార్క్స్ 'కేపిటల్'ని యథాతథంగా, అదే వరసలో, పరిచయం చేసిన సంపుటాలు నలభై ఏళ్ల నుంచీ ఉన్నాయి. రంగనాయకమ్మ మార్క్సిజాన్ని తప్పుగా చెపుతోందని ఇన్నాళ్లూ ఎందుకు మాట్లాడలేదు? ఇప్పటికైనా, ఆ తప్పులేమిటో శ్రామిక ప్రజలకు వివరించే బాధ్యత ఈ మేధావి నిర్వహించాలి. ఎక్కడా ఒక్క రుజువు కూడా చూపకుండా, 'రంగనాయకమ్మ చెప్పినది మార్క్సిజం కాదు అనడం చర్చ అవదు, రచ్చ అవుతుంది!

– జె.యు.బి.వి. ప్రసాద్

క్యూపర్టినో, కాలిఫోర్నియా

**జి.** లింగమూర్తి వీక్షణం జూన్ సంచికలో రాసిన 'రంగనాయకమ్మిజమా, మార్క్సిజమా?' చదివాక, ఈయనకు విషయాన్ని తలకిందులుగా అర్థం చేసుకునే ధోరణి ఉందని అర్థమవుతోంది. ఎందుకంటే లింగమూర్తి వ్యాసంలో ఒకదానికొకటి పొంతనలేని వ్యాఖ్యానాలు, అసత్యాలను సత్యాలుగా భ్రమింప చేయాలనే తపన చాలా కనబడుతోంది. మచ్చుకు కొన్ని:

1) హిజ్రాల సమస్యను గురించి రంగనాయకమ్మ 'మనుషుల ప్రవర్తన జన్యుపరమైన, శారీరక కారణాల వల్ల రూపొందుతుందనే తప్పుడు ప్రాతిపదికను ఆధారంగా డాక్టర్‌తో మాట్లాడినట్లు, చివరికి 'శారీరక కారణాలు లేవు' అని నిర్ధారణకు వచ్చినట్లు, ఒక చోట రాశారు. వెంటనే, '...నాట్ ఇన్ అవర్ జీన్స్' అని 'నిజమైన సైన్స్ ఈ శారీరక కారణాల సాకులను సకారణంగా తోసివేసినా, రంగనాయకమ్మ లాంటి వాళ్లు ఇంకా దాన్ని పట్టుకొని వేలాడుతున్నారు' అనీ, 'శారీరక కారణాల మీద పేజీల కొద్దీ వాదన చేశారు' అనీ, ఇంకోచోట రాశారు. ఈ రెండు పొసగని వ్యాఖ్యానాలు ఆయన ద్వంద్వ వైఖరిని చెపుతున్నాయి.

2) '...చరిత్రలో, సమాజంలో, ...ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉన్న ఎన్నో కారణాలు వెతకాలి. అదంతా చాలాకాలం పాటు జరగాల్సిన అకడమిక్ చర్చ' అన్నారు. రంగనాయకమ్మ చేసిన ప్రయత్నం అదే కదా! 13 పేజీల వ్యాసంలో బాధితుల పట్ల ఆమె చూపించిన ఆర్తి, బాధ్యత, సమస్యను లేకుండా చేసుకోవడం లోని మార్గాలు, శారీరక కారణాలతో పాటు సామాజిక కారణాలను విశ్లేషించడం, మానసిక వైద్య నిపుణుల అవసరం, ప్రభుత్వం, తల్లిదండ్రులు, సమాజం హిజ్రాల పట్ల చూపించవలసిన బాధ్యత – ఇవన్నీ సుదీర్ఘంగా చర్చించారు. ఇంత మంచి వ్యాసాన్ని గుర్తించకుండా, బాధితుల మీద ఆమె బండలు వేసినట్లు, రాళ్లతో కొట్టి చంపాలని చెప్పినట్లు పెడార్థాలు తీయడం – అపరిణిత వాదనకు సూచన.

3) ఏ సమస్యలోనైనా ఏది సహజమో, ఏది వికృతమో గ్రహించాలంటే ప్రకృతి సైన్స్ జ్ఞానమూ, సమాజ సైన్స్ జ్ఞానమూ రెండూ కావాలి' అని రంగనాయకమ్మ ఈ వ్యాసంలోనే వివరించారు. కానీ, దాన్ని అర్థం చేసుకోకుండా, 'ప్రకృతి శాస్త్రాల సహాయంతో సామాజిక అంతరాలను పరిశీలించడానికి పూనుకోవడం మొరటు సైన్స్ అని, సైన్స్ కాదని ఈమెకు తెలిసినట్టు లేదు' అని అనడం తలకిందుల వ్యవహారం కాక, మరేమిటి?

4) ఏ అంతరాల సమాజంలోనైనా న్యాయాన్యాయాలు సాపేక్షికాలని రంగనాయకమ్మకు తెలుసు. ఆమె రచనలు బాధితులకు న్యాయం చేసే వైపుగానే ఉంటాయి. వర్గపోరాటం ద్వారానే అన్ని వివక్షలూ పోతాయని పదేపదే తన రచనల ద్వారా చెప్పే బాధ్యత గల రచయిత్రి రంగనాయకమ్మ.

5) ఎంతకీ కొరుకుడుపడని మార్క్సిస్టు పుస్తకాలను సామాన్యులకు, పిల్లలకు కూడా అర్థమయ్యే రీతిలో మళ్లీ మళ్లీ రాస్తున్న మార్క్సిస్టు రంగనాయకమ్మ మార్క్సిజం అందరూ నేర్చుకోవాలనే, నేర్పించాలనే తపన 'రామాయణ విష వృక్షం' నుండి 'ఇదండీ మహా భారతం' వరకూ ప్రతి రచనలోనూ కనబడుతోంది. ఆ పుస్తకాలను పాఠకులు కొని చదవగలిగే ధరలలో అందుబాటులో ఉంచగలగడంలోనూ ఆమె మార్క్సిస్టు ధోరణే కనబడుతోంది. అలాంటప్పుడు ఆమె పాలక వర్గ భావజాలాన్ని ఆమోదిస్తోందని ఎలా అనగలరు?

6) మార్క్సిజంలోని సంపద్వంతమైన, సారభూతమైన అంశాలు ఆమెకు అర్థమే కాలేదనడం – ఆమె రచనల్లో ఒక్క వాక్యం కూడా తెలియని తనం. ఆమెకు అర్థమవడమే కాదు, అర్థం చేసుకోలేని స్థాయిలో ఉన్న వారికి కూడా ఆమె తేలిగ్గా అర్థం చేయించగలరు.

7) 'రంగనాయకమ్మిజమా, మార్క్సిజమా?' అని ఒక అసంబద్ధ ప్రశ్న వేశారు. మార్క్సిజాన్నే రంగనాయకమ్మ చెప్పింది. మార్క్స్ చెప్పిన శ్రమ దోపిడీ, అదనపు విలువ, శ్రమ విభజన, ఉపయోగపు విలువా – మారకపు విలువా, ఉత్పాదక శ్రమా – అనుత్పాదక శ్రమా, శ్రమ విలువ – శ్రమ శక్తి విలువ, జీతాలూ – వడ్డీ లాభాలూ, మొదలైన విషయాలు రంగనాయకమ్మ రచనల ద్వారానే మాకు అర్థమయ్యాయి.

– హను

ఇల్లందు, ఖమ్మం జిల్లా

**రం**గనాయకమ్మ హిజ్రా సమస్యపై రాసిన వ్యాసం చదివి ఇది రాస్తున్నాను. ఆవిడ హోమో సెక్సువాలిటీ పైన రాసిన దానిపైనే ఈ స్పందన. హోమో

→

ఇచ్చే హవేలీల్లో ఉంటున్న హిజ్రాలకు సెక్స్‌వర్క్, అడుక్కోవాల్సిన అవసరం లేని ప్రశాంత జీవితం దొరుకుతుంది. వీరు మాత్రమే ప్రశాంత వృద్ధాప్యాన్ని గడుపుతున్నారు. ఇలాంటి ఎన్నో సమూహాలను వదిలి, హిజ్రాల గురించిన సమాచారం కోసం రంగనాయకమ్మ ప్రపంచ మంతా ప్రయత్నాలు చేశారు.

హిజ్రాలు పురుషాధిక్య మనువాద సమాజంపై ఒక ప్రత్యేక వర్గ పోరాటం చేస్తున్నారు. నిజమైన కమ్యూనిస్టులు స్వప్నించే బృంద జీవితాన్ని గడుపుతున్నారు. అక్కడ కులాలు, మతాలు, జాతులు, వర్గాల గొడవలు ఉండవు. పనుల పంపకాల వైరుధ్యాలు ఉండవు, అంతా కలిసిమెలిసి ఒకే కుటుంబంలా జీవిస్తారు. ఈ రకంగా భిన్న కోణాల నుంచి హిజ్రా బృందాలు రెవల్యూషనరీ బృందాలుగా చెప్పవచ్చు.

ఇక సుదీర్ఘకాలంగా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నడుపుతున్న క్యూబా దేశం 2008లో ట్రాన్స్‌జెండర్లను గుర్తించడంతో పాటు, సెక్స్ రీఅసైన్‌మెంట్ సర్జరీలను పూర్తి ఉచితంగా నిర్వహించేందుకు సహకరిస్తోంది. అంతే కాదు, ఎల్‌జిబిటి అస్తిత్వాలను బూర్జువా అస్తిత్వాలుగా భావించడం తాము చేసిన పొరపాటని క్యూబా మాజీ అధ్యక్షుడు ఫిడెల్ కాస్ట్రో పశ్చాత్తాపం ప్రకటించారు. 1960 నుంచి విప్లవాన్ని కొనసాగిస్తున్న క్యూబా ఎల్‌జిబిటిల హక్కులకు కృషి ఈ విశ్రాంత మార్క్సిస్టు దృష్టిలో పడకపోవడం ఆశ్చర్యంగానే ఉంది.

క్యూబాతో పాటు, ప్రపంచ వ్యాప్తంగా పలు సోషలిస్ట్ , ప్రజాస్వామిక దేశాలు ఎల్‌జిబిటిల అస్తిత్వాలను, హక్కులను గుర్తించాయి. భారత్‌లో కూడా అలాంటి వాతావరణం వస్తున్న తరుణంలో ఇలాంటి వ్యాసాలు ప్రజలను తప్పుదారి పట్టిస్తాయని సమితి భావిస్తోంది.

(telanganahts@gmail.com) వీ

సెక్సువాలిటీకి కారణం ఏమిటని కొందరు స్నేహితులను అడిగినప్పుడు, అది శరీరంలో ఇన్సిటింక్ట్‌గా ఉంటుందని (అది సైన్సుపరంగా నిరూపించినప్పటికీ) కొందరూ, చిన్నప్పుడు చైల్డ్ సెక్స్ అబ్యూజ్‌కి గురవడం, వారు హోమో సెక్సువల్లా తయారవడానికి కారణం అవుతుందని కొందరూ, పోటీ ప్రపంచంలో చదువులూ, ఉద్యోగాల కారణంగా పెళ్లిళ్లు త్వరగా అవక హోమో సెక్సువాలిటీ వైపు వెళతారని కొందరూ చెప్పుకొచ్చారు. పట్టణ ప్రాంతాల్లో ఇది ఎక్కువ అని కూడా వాళ్లు అన్నారు. మొత్తంగా హోమో సెక్సువాలిటీకి శాస్త్రీయ కారణాలు ఇంకా తెలియనప్పటికీ, సామాజిక కారణాలు ఉన్నయనేది స్పష్టం.

ఆడా-ఆడ, మగా-మగ సంబంధాలు ప్రకృతి సిద్ధమో, కాదో ఆలోచించేంత జ్ఞానం బూర్జువా సమాజంలోని మనుషులకు ఉండదు. బూర్జువా హక్కుల సంఘాలు లెస్బియన్, గే, బైసెక్సువల్, ట్రాన్స్‌జెండర్, క్వీర్ (ఎల్, జి, బి, టి, క్యు) హక్కులంటూ, దాన్ని ఒక అస్తిత్వంగా ఒకవైపు ప్రచారం చేస్తుండగా, ఆ ప్రచారాన్ని బూర్జువా మీడియా మరొకవైపు ప్రసారం చేస్తుండగా - హోమో సెక్సువాలిటీ ప్రకృతి సిద్ధమా? కాదా? అనే ప్రశ్న లేక ఆలోచన వాళ్లకి ఎలా కలుగుతుంది? రేవతి పుస్తకం రావడం వల్ల హిజ్రా సమస్యపై ఒక చర్చ అంటూ మొదలైంది. ఆ సమస్యను అర్థం చేసుకొనే, పరిష్కార మార్గాలను కనుగొనే దిశగా మనం ఆలోచిస్తున్నాం! అలాగే హోమో సెక్సువాలిటీ సమస్య కూడా! హోమో సెక్సువాలిటీని వాళ్ల జీవితంలో ఒక సమస్యగా గుర్తించని వాళ్లూ, గుర్తించినా దాని గురించి స్నేహితుల దగ్గరో, డాక్టర్ల దగ్గరో మాట్లాడడానికే సిద్ధంగా లేనివాళ్లూ ఉన్నప్పుడు, వాళ్ల సమస్య పట్ల (తాగుడూ, వ్యభిచారాల్లాగ ఇది కూడా ఒక సామజిక సమస్య కాబట్టి) కూడా మనకు ఒక శాస్త్రీయ దృక్పథం, దాని మూలాలూ, పరిష్కార మార్గాలూ కనుగొనే దిశగా ఉండడం అవసరం. అంతేగాని, బూర్జువా భావాల మకిలిలో మునిగిపోయి, ఆ వర్గం అంటిస్తున్న అనేకానేక సామాజిక, శారీరక సమస్యలతో సతమతమవుతూ, ఆ సమస్యల మూలాలను అర్థం చేసుకునే పరిస్థితిలో లేని మనుష్యులను, జ్ఞానమేలేని మనుషులను మలద్వారంతో తిని చూపిస్తారా అనీ, హోమో పశుతుల్యుల (వాళ్లు పశువులుగా ప్రవర్తిస్తే తప్ప) ఈనీ అనడం అమానుషం.

**- ఎస్.ఎన్. సంపత్ రాజా రామ్**
హైదరాబాద్

**జూ**న్ 2015 'వీక్షణం'లో జి. లింగమూర్తి రాసిన వ్యాసాన్ని చదివాను. దీన్ని 'చర్చ' శీర్షికలో ప్రచురించారు గానీ వ్యాసం పొడవునా రంగనాయకమ్మ మీద ద్వేషం, వ్యతిరేకతలే కనిపించాయి. ఆమె రచనలను అభిమానించే పాఠకులను 'భక్తులు' అని హేళన చేశారు.

హిజ్రాల సమస్యలో రంగనాయకమ్మ కొన్ని అభిప్రాయాలు ప్రకటించారు. వాటిని అంగీకరించేవారు అంగీకరిస్తారు. లేకపోతే లేదు. అంతేగానీ వ్యాసం రాసినంత మాత్రానే '...తన ఇష్టాయిష్టాలనే వీక్షణం పాఠకుల మీద రుద్దదలచుకున్నారు' అనడం కేవలం అర్థరహితం.

భాష వాడకం విషయంలో ఒక్కో పత్రిక ఒక్కో స్టైల్ బుక్‌ను అనుసరిస్తుంటుంది. కానీ ఇతర రచయితలు రాసే వ్యాసాల్లో ఏమైనా పదాలనూ, వాక్యాలనూ మార్చదలిస్తే పత్రికల వారు ఆ రచయితలను సంప్రదించడమంటే అది మంచి సంప్రదాయమే! ఇలా చేస్తే రచయితల శైలికీ, వ్యక్తీకరణకూ విలువ ఇచ్చినట్టు అవుతుంది గానీ వ్యాసకర్త భావిస్తున్నట్టు 'రచయితల ఇష్టారాజ్యం'గా పత్రిక నడిచినట్టు అవ్వదు.

'గారు' వాడకుండానే క్రియ ద్వారా గౌరవం సూచించాలనేది పత్రికా విధానమైనప్పటికీ సంభాషణల్లోని 'గారు'ను కూడా తొలగించవచ్చా? 'డాక్టరు గారూ' అని సంబోధిస్తూ మొదలైన వాక్యాన్ని 'డాక్టరు! వాళ్లు బాగా ఉన్నారా లేరా అన్నది కాదండీ సమస్య' అంటూ 'గారు'ను తొలగిస్తే గౌరవ సూచకాన్నే తొలగించినట్టయింది. (వీక్షణం 61వ పేజీ- ఏప్రిల్, 2015).

'కొన్ని సందర్భాల్లో 'గారు' లేకుంటే బాగుంటుందా?' అని రంగనాయకమ్మ తన లేఖలో అడిగింది ప్రధానంగా ఈ సందర్భాన్ని ఉద్దేశించే. ఈ విషయం వ్యాసకర్త గమనించకుండా '... (శ్రీ, గారు) పత్రికల్లో యూనిఫార్మిటీ కోసం ఉంచితే అందరికీ ఉంచాలి, తీసేస్తే అందరికీ తీసేయాలి' అంటూ యాంత్రికంగా సూత్రీకరించేశారు.

'అసలు వీక్షణంలో రంగనాయకమ్మ రచనలు ఎక్కువైపోతున్నాయి' అంటూ వ్యాసకర్త ఆందోళనపడ్డారు. ఆయనలాంటి వాళ్లకు ఇది హృదయశల్యంగా ఉంటోందేమో గానీ ఆమె రచనలు తరచూ వస్తుండడం వల్ల నాలాంటి పాఠకులెందరికో క్రమం తప్పకుండా 'వీక్షణం' చదవడం అలవాటైంది. మౌలిక భావాలూ, పదునైన తర్కం, వాదనా పటిమా, సరళమైన భాషా శైలీ... ఇవీ ప్రధానంగా రంగనాయకమ్మ రచనల్లోని ప్రత్యేకతలు. ఆమె రచనల మూలం గానే మార్క్సిజం పరిచయమైన నాలాంటి వారెందరో.

కానీ 'మార్క్సిజంలోని సారభూతమైన అంశాలు చాలా భాగం ఆమెకు అర్థం కాలేదు' అని వ్యాసకర్త లింగమూర్తి ధాటిగా చెప్తున్నారు. అంటే ఆయనకు అర్థమైందన్నమాటే కదా? మరికనేం? ఆ సారభూత అంశాలేమిటో వివరంగా రాసి, తనది స్వీపింగ్ కామెంట్ కాదని ఆయన నిరూపించుకోవాలి.

ఒకే ఒక షరతు ఏమిటంటే... వ్యక్తిగత దూషణలేమీ లేకుండా రాయాలి!

**- సిఎచ్. వేణు**
కూకట్‌పల్లి, హైదరాబాద్

**వీ**క్షణం జూన్ సంచికలో 'జర్మనీతో శాంతికై లెనిన్ పోరాటం' వ్యాసంలో ఎన్‌విఎస్ నాగభూషణం వ్యాసం మొదటిలోనే ట్రాట్‌స్కీ ద్రోహ బుద్ధితో ద్రోహం చేశాడు అని రాశారు. ఏమి ద్రోహం చేశాడో అని మే సంచికలో వెదికాను రెండు వ్యాసాలలోను వివరాలే లేవు. అంత పెద్ద ద్రోహం చేస్తే వాటి ఆనవాళ్లు ఉండాలి కదా? ఏ ప్రాథమిక మూలాలలో, లేక వాటిని పరిశీలించిన వారు రచనల్లో వివరాలు ఉన్నాయో రాయలేదు.

ఏమైన వివరాలు దొరుకుతాయని నాకు తెలిసిన ప్రాథమిక మూలాలు వెదికాను కాని ఏమి లభ్యం కాలేదు. ఆఖరికి, అంత పెద్ద ద్రోహం చేశాడని చెబుతున్నా ట్రాట్‌స్కీ గురించి లెనిన్ అక్టోబర్ విప్లవం తరువాత లెనిన్ కూడ ఎక్కడా ప్రస్తావించిన ఆధారాలు లేవు. లెనిన్ ఆఖరి లేఖలో కూడా స్టాలిన్ గురించి ఆందోళన వ్యక్తం చేశాడు గాని ట్రాట్‌స్కీ 'ద్రోహం', 'ద్రోహ బుద్ధి' గురించి ఏమి రాయలేదు.

ఇక ఒకే దేశంలో సోషలిజం సాధ్యం అని లెనిన్ వాదించాడు అనడానికి ఆధారం విప్లవానికి ముందు 'అన్ ద స్లోగన్ ఆఫ్ ఎ యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ యూరప్' అనే రచనలో ప్రపంచ వ్యాప్త విప్లవం అనే వాదనను వ్యతిరేకిస్తూ చేసిన ఒక వ్యాఖ్య మాత్రం ఉంది. అక్టోబర్ విప్లవం తరువాత లెనిన్ ఒకే దేశంలో సోషలిజం గురించి చర్చించిన ఆధారాలు లేవు. (ఒక వేళ లెనిన్ విప్లవం తరువాత అలా వాదించిన దానిని వేదం లాగా అంగీకరించాలి అని నా భావం కాదు.)

ట్రాట్‌స్కీ 'ద్రోహం' గురించి ఆరోపణలు స్టాలినిస్టు రచనల్లో (రష్యాలో వెలుపల కూడా) ఉన్నాయి. స్టాలిన్ అధీనంలో జరిగిన చరిత్ర వక్రీకరణ, బోల్షివిక్ నాయకుల షో ట్రాయల్స్ గురించి ఐజాక్ డ్యూశ్చర్ సుదీర్ఘంగా రచనలు చేశాడు.

ఒకవేళ నాగభూషణం స్టాలినిస్టు రచనల ఆధారంగా ఈ ఆరోపణ చేస్తే, వాటిపై డ్యూశ్చర్ విశ్లేషణ ఎలా తప్పో, ఈ ప్రాథమిక ఆధారాలతో డ్యూశ్చర్ వాదనలు తప్పు అని నిరూపించవచ్చో చూపించాలి. ఏ రచన ఆధారంగా ఈ ఆరోపణ చేస్తున్నారో వివరిస్తే, విప్లవానికి ఎంతో అవసరమైన పొలెమిక్స్‌కు అవకాశం ఉంటుంది.

స్టాలిన్, ట్రాట్‌స్కీ వివాదానికి పశ్చిమ దేశాల విప్లవ ఉద్యమాలు అంతం పలికాయి. (స్టాలిన్ నాయకత్వంలోనే అక్టోబర్ విప్లవానికి ద్రోహం జరిగింది అనేది దాదాపు అన్నీ విప్లవ పార్టీలు అంగీకరించే విషయం) భారతదేశంలో మాత్రం ఆ పొలెమిక్స్ ఇంకా ప్రారంభం అయినట్లు కనబడదు.

**- నరేంద్రమోహన్,**
ఆస్ట్రేలియా

(దాదాపు ఒకే రకమైన వాక్యాలతో, వ్యక్తీకరణలతో వేరు వేరు పేర్లతో, వేరు వేరు ఊర్ల పేర్లతో 'పాఠకుల వీక్షణం'కు ఉత్తరాలు వస్తున్నాయి. అటువంటివి ఎన్ని రాసినా ఒకటే ప్రచురిస్తామని తెలియజేస్తున్నాం. ఏ ఉత్తరం, రచన ప్రచురించాలో లేదో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం. - సం.) వీ

### వోటుకు నోటు కేసులో రేవంత్‌రెడ్డి అరెస్టు

తెలంగాణలో ఆరు శాసన మండలి స్థానాలకు జూన్ 1న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలకు ముందే తెలుగుదేశం పార్టీ అభ్యర్థి వేం నరేందర్‌రెడ్డికి వోటు వేసేందుకు ఆంగ్లో ఇండియన్ ఎంఎల్ఎ ఎల్విన్ స్టీఫెన్‌సన్‌కి, ఆ పార్టీ ఎంఎల్ఎ రేవంత్‌రెడ్డితో పాటు సెబాస్టియన్, ఉదయ్ సింహాలు రు. 50 లక్షలు ఇస్తుండగా ఎసిబి అధికారులు మే 31న హైదరాబాద్‌లోని లాలగూడలో రెడ్‌హ్యాండ్‌గా పట్టుకొని, అరెస్టు చేశారు. వారి మీద సెక్షన్ 102 కేసు నమోదు చేసి రిమాండ్‌కు పంపారు.

### రాష్ట్ర అవతరణ వేడుకలు

తెలంగాణ రాష్ట్ర అవతరణ వేడుకలు జూన్ 2 నుంచి 7 వరకు రాష్ట్ర వ్యాప్తంగా జరిగాయి. ప్రారంభ వేడుకలు సికిందరాబాద్ పరేడ్ గ్రౌండ్‌లో జరిగాయి. ఈ సందర్భంగా ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు పాలమూరు పథకాన్ని రు. 35 వేల కోట్లతో, కాళేశ్వరం ఎత్తిపోతల పథకాన్ని రు. 30 కోట్లతో నిర్మిస్తామని, అలాగే రు. 2500 కోట్లతో పేద ప్రజలకు 50 వేల డబుల్ బెడ్ రూం ఇండ్లను నిర్మిస్తామని హామీ ఇచ్చారు. ముగింపు వేడుకలు హైదరాబాద్‌లోని ట్యాంక్‌బండ్‌పై జరిగాయి. ముగింపు వేడుకలకు రాష్ట్ర గవర్నర్ నరసింహన్, ముఖ్యమంత్రి కె.సి.ఆర్, వివిధ పార్టీల నాయకులు, ఎంఎల్ఎలతో పాటు అనేక మంది ప్రజలు హాజరయ్యారు.

### మహిళా గర్జన

హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద జూన్ 5న మహాజన సోషలిస్టు పార్టీ, ఎంఆర్‌పిఎస్‌ల ఆధ్వర్యంలో 'మహిళా గర్జన' జరిగింది. ఈ గర్జనలో పాల్గొన్న వక్తలు తెలంగాణ రాష్ట్ర మంత్రివర్గంలో మహిళలకు స్థానం కల్పించకపోవడం అన్యాయమని, వారికి స్థానం కల్పించాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమానికి 10 జిల్లాల నుంచి అనేక మంది మహిళలు, వివిధ పార్టీల నాయకులు, ప్రజలు హాజరయ్యారు.

### దాశరథి రంగాచార్య మృతి

ప్రముఖ సాహితీవేత్త, రచయిత దాశరథి రంగాచార్యులు (86) అనారోగ్యంతో బాధపడుతూ జూన్ 8న హైదరాబాద్‌లోని యశోద హాస్పిటల్‌లో చనిపోయారు. ఆయన 1928 ఆగస్టు 24న వరంగల్ జిల్లా చిన్న గూడూరులో జన్మించారు. ఆయన చిల్లరదేవుళ్ళు, మోదుగు పువ్వులు, జనపదం మొదలగు రచనలు చేశారు. ఆయన తెలంగాణ సాయుధ పోరాటంలో పాల్గొన్నారు.

### ఐద్వా నేత టి. ప్రభావతి మృతి

ఐద్వా సీనియర్ నేత, ప్రజా నాట్యమండలి గాయకురాలు తొట్టెంపూడి ప్రభావతి (68) జూన్ 11న పశ్చిమగోదావరి జిల్లా, పాలకొల్లులో అనారోగ్యంతో చనిపోయారు. ఆమె 1947లో విజయవాడలో జన్మించారు. ఆమె అక్షర దీక్ష, బుర్రకథ వంటి కార్యక్రమాలకు సారథ్యం వహించి, ప్రజా నాట్యమండలి ద్వారా అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్ని ప్రజలను చైతన్యవంతం చేశారు.

### మున్సిపల్ కార్మికుల ర్యాలీ

ఆంధ్రప్రదేశ్‌లో మున్సిపల్ రంగంలో పనిచేస్తున్న కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ కార్మికుల సమస్యలను పరిష్కరించి కాంట్రాక్టు, ఔట్ సోర్సింగ్ పద్ధతులను రద్దు చేసి, వారినందరిని రెగ్యులర్ చేసి, వారికి కనీస వేతనం పదిహేను వేలు ఇవ్వాలని డిమాండ్ చేస్తూ మున్సిపల్ వర్కర్స్, ఎంప్లాయిస్ యూనియన్ (సిఐటియు అనుబంధం) ఆధ్వర్యంలో జూన్ 11న కడప పట్టణంలో పాత బస్టాండ్ నుంచి జిల్లా కలెక్టర్ కార్యాలయం వరకు ర్యాలీ నిర్వహించారు. కార్మికులకు, ప్రభుత్వమే నేరుగా వేతనాలను చెల్లించాలని డిమాండ్ చేశారు.

### రోడ్డు ప్రమాదంలో 22 మంది మృతి

తూర్పుగోదావరి జిల్లా, ధవళేశ్వరం బ్యారేజీ వద్ద జూన్ 13న జరిగిన రోడ్డు ప్రమాదంలో ఒకే కుటుంబానికి చెందిన 22 మంది చనిపోయారు. మృతులది విశాఖపట్నం జిల్లా, అచ్యుతాపురం మండలం, మోసయ్యపేట గ్రామం. చనిపోయిన వారిలో ఆరుగురు పురుషులు, తొమ్మిది మంది మహిళలు, ఏడుగురు చిన్నారులు ఉన్నారు. ప్రయాణిస్తున్న వాహనం బ్యారేజీని ఢీకొనడంతో ఈ ప్రమాదం జరిగింది.

### విత్తనాల కోసం రైతుల ఆందోళన

అనంతపురం పట్టణంలో జూన్ 17న వేరుశనగ విత్తనాలను పంపిణీ చేయాలని డిమాండ్ చేస్తూ రైతులు సిపిఐ ఆధ్వర్యంలో జాతీయ రహదారిపై ధర్నా చేశారు. అలాగే అనంతపురం జిల్లా ధర్మావరం మండలంలో రైతులు వేరుశనగ విత్తనాల కోసం వ్యవసాయ మార్కెట్ యార్డ్ వద్ద జూన్ 19న రైతులు ఆందోళన నిర్వహించి, ధర్మవరం – బత్తలపల్లి రహదారిపై ధర్నా చేశారు.

### టి - న్యూస్ ఛానల్‌కు నోటీసు

తెలంగాణ శాసనమండలి ఎన్నికలలో జరిగిన ఓటుకు – నోటు వ్యవహారంతో చంద్రబాబుకు సంబంధం ఉందని, చంద్రబాబుకు, స్టీఫెన్‌సన్‌కు మధ్య జరిగిన సంభాషణను మొట్టమొదటి సారిగా టి – న్యూస్ ఛానల్‌లో జూన్ 7న ప్రసారమైంది. ఈ సంఘటనపై స్పందిస్తూ విశాఖపట్నంలో ఎన్‌వివి ప్రసాద్ అనే న్యాయవాది 'ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి ప్రతిష్టను దిగజార్చేందుకు తెలంగాణ సిఎం కె.సి.ఆర్, నామినేటెడ్ ఎంఎల్ఎ స్టీఫెన్‌సన్, తెలంగాణ ఎసిబి అధికారాలు, టి–న్యూస్ ఛానల్ ప్రయత్నం చేసిందని' పోలీసులకు ఫిర్యాదు చేశారు. పోలీసులు జూన్ 19న టి – న్యూస్‌కు కేబుల్ నెట్‌వర్క్ నియంత్రణ చట్టంలోని సెక్షన్ 9 ప్రకారం నోటీసు జారీ చేశారు.

### గిరిజన మహిళలపై పోలీసుల దాడి

ఖమ్మం జిల్లా, ఇల్లందు మండలం, బొజ్జాయిగూడెం అటవీ ప్రాంతంలో పోడు వ్యవసాయ భూముల్లో అటవీ అధికారులు హరితహారం పేరుతో సరిహద్దు కందకాల పనులు చేపట్టారు. ఈ విషయం తెలుసుకున్న గిరిజన మహిళలు, సిపిఎం (ఎంఎల్), న్యూడెమోక్రసీ నేతలు అక్కడికి చేరుకొని పనులను అడ్డుకున్నారు. అడ్డుకున్న మహిళలపై జూన్ 22న పోలీసులు దాడి చేశారు. 30 మంది మహిళలపై పోలీసులు కేసు నమోదు చేశారు.

### పుల్లెల శ్రీరామచంద్రుడు మృతి

ప్రముఖ రచయిత, అనువాదకులు ప్రొ. పుల్లెల శ్రీరామచంద్రుడు అనారోగ్యంతో బాధపడుతూ జూన్ 24న హైదరాబాద్‌లోని స్టార్ హాస్పిటల్‌లో చనిపోయారు. ఆయన 1927 అక్టోబర్ 24న తూర్పుగోదావరి జిల్లా, అమలాపురం మండలం, ఇందుపల్లి గ్రామంలో జన్మించారు. ఆయన సంస్కృతం నుంచి వాల్మీకి రామాయణాన్ని తెలుగులోకి అనువదించారు. ఆయన తెలుగు, సంస్కృత భాషల్లో అనేక పుస్తకాలు రాశారు. తెలుగు, సంస్కృతం భాషల అభివృద్ధికి కృషి చేశారు.

### లారీల సమ్మె

రాష్ట్ర విభజన నేపథ్యంలో భాగంగా జనాభా ప్రాతిపదికన త్రైమాసిక పన్నును, డీజిల్‌పై వ్యాట్‌ను తగ్గించాలని డిమాండ్ చేస్తూ, తెలంగాణ లారీ యజమానుల సంఘం ఆధ్వర్యంలో జూన్ 24న సమ్మె జరిపారు. సమ్మె కారణంగా రాష్ట్ర వ్యాప్తంగా సరుకుల రవాణా నిలిచిపోవడంతో ప్రభుత్వం స్పందించి, వారి డిమాండ్ల పరిష్కారానికి ఒప్పుకోవడంతో, లారీ అపరేషర్లు జూన్ 25న సమ్మె విరమించారు. వీ

### ఆకలి జాబితాలో భారత్‌కు అగ్రస్థానం

ప్రపంచంలో అత్యధికంగా ప్రజలు ఆకలితో బాధపడుతున్న దేశాల జాబితాలో భారత్ అగ్రస్థానంలో ఉంది. ఆకలిపై ఐక్య రాజ్య సమితి విడుదల చేసిన వార్షిక నివేదిక ప్రకారం భారత్ 19.4 కోట్ల మంది ఆకలితో బాదపడుతున్న వారితో చైనాను అధిగమించింది. ప్రపంచంలో 1990-92లో ఆకలి బాధితులు వంద కోట్లుండగా, 2014-15 నాటికి 79.5 కోట్లకు తగ్గినట్లు ఐరాస సంస్థ ఎఫ్ఏఒ ప్రపంచంలో ఆహార అభద్రత పరిస్థితి, 2015 నివేదికలో వెల్లడించింది.

### సాయుధ బలగాల ప్రత్యేక చట్టం రద్దు

అత్యంత వివాదాస్పద సాయుధ బలగాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని (ఎఎఫ్ఎస్‌పిఎ) రద్దు చేయాలని త్రిపుర లెఫ్ట్‌ఫ్రంట్ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. తీవ్రవాదాన్ని అణిచివేసే పేరుతో 18 ఏళ్ల కిందట రాష్ట్రంలో ఈ చట్టాన్ని అమల్లోకి తెచ్చారు. రాష్ట్రంలో ఇప్పుడు తీవ్రవాదం లేనందున ఎఎఫ్ఎస్‌పిఎను రద్దు చేయాలని మే 27న జరిగిన మంత్రివర్గ సమావేశంలో నిర్ణయం తీసుకున్నట్లు రాష్ట్ర ముఖ్యమంత్రి మాణిక్ సర్కార్ తెలిపారు.

### శేషాచలం ఎన్‌కౌంటర్ కేసు సిబిఐకి అప్పగించండి

శేషాచలంలో ఏప్రిల్ 7న జరిగిన ఎన్‌కౌంటర్ పై దర్యాప్తును సిబిఐకి అప్పగించాలని జాతీయ మానవ హక్కుల సంఘం (ఎన్‌హెచ్ఆర్‌సి) సిఫారసు చేసింది. మృతుల కుటుంబాలకు ఐదు లక్షల రూపాయల మధ్యంతర పరిహారం చెల్లించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని మే 29న సూచించింది. ఎస్.సి, ఎస్.టి చట్టంలోని సెక్షన్ 164 కింద పరిహారం ఇవ్వాలని ఎన్‌హెచ్ఆర్‌సి సభ్యుడు జస్టిస్ మురుగేశన్ కోరారు. ఈ కేసులోని సాక్షులకు తమిళనాడు ప్రభుత్వం ప్రత్యేక భద్రత కల్పించాలని ఆదేశించారు.

### మద్రాస్ ఐఐటిలో విద్యార్థి సంఘంపై నిషేధం, ఎత్తివేత

మద్రాస్ ఐఐటిలోని 'అంబేద్కర్, పెరియార్ అధ్యయన వేదిక (ఎపిఎస్‌సి) ను తాత్కాలికంగా రద్దుచేస్తూ డీన్ ఎం. శ్రీనివాసరావు మే 29న ఆదేశాలు జారీచేశారు. ఎపిఎస్‌సి తమ సమావేశ నిర్వాహణలో నిర్దేశిత మార్గదర్శకాల్ని ఉల్లంఘించిందని కారణాలుగా తెలిపారు. ఎపిఎస్‌సి ముద్రించిన కరపత్రంలో నరేంద్ర మోడీ హిందుత్వ ఎజెండాను అమలుచేస్తున్నారని, కార్పొరేట్ సంస్థలకు భూములు కట్టబెడు తున్నారని, గోవధ నిషేదం ద్వారా ప్రజల్లో మతపరమైన చీలికలు తెస్తున్నారని, ఘర్‌వాపసీ, వేదాలకు ప్రాధాన్యం వంటి అంశాలు కరపత్రంలో ఉన్నాయన్నారు. దీనిపై కొద్ది మంది విద్యార్థులు కేంద్ర హెచ్ఆర్‌డి శాఖకు ఫిర్యాదు చేశారు. దీనిపై హెచ్ఆర్‌డి శాఖ ఐఐటి అధికారులకు లేఖ రాసింది. దేశవ్యాప్తంగా వచ్చిన నిరసనల కారణంగా విద్యార్థి అధ్యయన వేదికపై నిషేధాన్ని వెనక్కి తీసుకుంటూ జూన్ 7న ఆదేశాలు జారీచేశారు.

### మణిపూర్‌లో జవాన్లపై దాడికి ప్రతిదాడి

మణిపూర్‌లోని చందేల్ జిల్లా పారాలాంగ్, చరోంగ్ గ్రామాల మధ్య ప్రాంతంలో జూన్ 4న తనిఖీలో భాగంగా వెలుతున్న 6 డోగ్రా రెజిమెంట్‌కు చెందిన సైనికుల వాహనాన్ని మణిపూర్ తిరుగుబాటుదారులు పేల్చివేసి కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో 18 మంది సైనికులు మృతిచెందగా 11 మంది తీవ్రంగా గాయపడ్డారని సైనిక అధికార ప్రతినిధి కల్నల్ రోహన్ ఆనంద్ తెలిపారు. ఈ ఘటన వెనుక మణిపూర్ తిరుగుబాటు సంస్థ పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ (పిఎల్ఎ) హస్తమున్నట్లు రాష్ట్ర హోంశాఖ కార్యదర్శి జె. సురేశ్‌బాబు అనుమానం వ్యక్తంచేస్తున్నారు. దీనికి ప్రతిదాడిగా భారత సైన్యం జూన్ 9న మయన్మార్ సరిహద్దును దాటి లోపలికి ప్రవేశించి ఈ దాడికి కారకులుగా భావిస్తున్న మిలిటెంట్ల క్యాంపుపై దాడి చేసి ఇరవై మందిని హతమార్చింది.

### పోలీసు కాల్పుల్లో 21 మంది నక్సల్స్ మృతి

చత్తీస్‌గడ్‌లోని కొండగావ్ జిల్లా టిమిడి గ్రామ అటవీ ప్రాంతంలో జూన్ 6న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఆరుగురు మావోయిస్టులు మృతి చెందారు. జిల్లా పోలీసులు కూంబింగ్ నిర్వహిస్తుండగా మావోయిస్టులు ఎదురుపడ్డారని, అప్పుడు ఇరు పక్షాల మధ్య కాల్పులు జరిగాయని బస్తర్ ఐజి కల్లూరి తెలిపారు. ఝార్ఖండ్‌లోని పలామా ప్రాంతంలో జూన్ 9న జరిగిన పోలీసు కాల్పుల్లో 12 మంది మావోయిస్టులు మృతి చెందారు. మావోయిస్టులు రెండు వాహనాల్లో వస్తుండగా పోలీసు గాలింపు దళాలు వారిపై కాల్పులు జరపగా 12 మంది మావోయిస్టులు చనిపోయారని అదనపు డిజి ఎస్.ఎన్. ప్రధాన మీడియాకు తెలిపారు. అలాగే చత్తీస్‌గడ్‌లోని లంకపల్లి అడవుల్లో జూన్ 12న జరిగిన ఎన్‌కౌంటర్ మృతుల్లో కమాండర్ వివేక్, కమల, సోనులు ఉన్నారు. అలాగే ఎలకనగూడెం అటవీ ప్రాంతంలో జరిగిన ఎదురు కాల్పుల్లో ఒక మావోయిస్టు మృతి చెందారు.

### గృహ నిర్బంధంలో గిలానీ

హురియత్ కాన్ఫరెన్స్ ఛైర్మన్ సయ్యద్ అలీషా గిలానీ సహా పలువురు వేర్పాటువాద నాయకులను అధికారులు జూన్ 13న గృహ నిర్బంధంలోకి తీసుకున్నారు. జూన్ 14న వారు నిర్వహించ తలపెట్టిన సదస్సు జాతి వ్యతిరేకమైనదిగా భావిస్తున్నందు వల్లనే ఈ నిర్ణయం తీసుకున్నారని తెలుస్తోంది. భారత నియంతృత్వాన్ని నిరోధించడం ఎలా? అనే అంశంపై హురియత్ కాన్ఫరెన్స్ సదస్సు నిర్వహించ తలపెట్టింది.

### మ్యాగీపై నిషేధం

మ్యాగీ నూడుల్స్‌పై భారత ఆహార భద్రత ప్రమాణాల సంస్థ (ఎఫ్ఎస్ఎస్ఎఫ్) నెస్లే సంస్థకు చెందిన తొమ్మిది రకాల ఆహార ఉత్పత్తులను నిషేధించింది. తక్షణం అమ్మకాలు నిలిపేసి, మార్కెట్ నుంచి ఉపసంహరించు కోవాలని నెస్లే సంస్థను జూన్ 5న ఆదేశించింది. తొమ్మిది రకాల మ్యాగీ నూడుల్స్‌లో లెడ్, మోనో సోడియం గ్లూటామేట్ (ఎంఎస్‌జి) లు నిర్దేశిత ప్రమాణాలకు మించి ఉన్నాయని స్పష్టం చేసింది. మ్యాగీ నూడుల్స్‌ను ఎందుకు రద్దు చేయరాదో 15 రోజుల్లో తెలపాలంటూ నెస్లే సంస్థకు షోకాజ్ నోటీసు జారీ చేసింది.

### ఎన్‌జెఎసి రద్దయినా కొలీజియంను ఒప్పుకోం

జాతీయ జుడీషియల్ నియమకాల కమిషన్ (ఎన్‌జెఎసి) చట్టాన్ని ఒకవేళ సుప్రీం కోర్టు కొట్టేసినా, కొలీజియం ద్వారా న్యాయమూర్తులను నియమించే పద్ధతిని పునరుద్దరించే ప్రసక్తే లేదని ప్రభుత్వం స్పష్టం చేసింది. ఎన్‌జెఎసి రాజ్యాంగ చెల్లుబాటును సవాలుచేస్తూ దాఖలైన పిటిషన్లను విచారిస్తున్న సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనానికి ప్రభుత్వం తరపున సొలిసిటర్ జనరల్ జూన్ 15న ఈ విషయం తెలిపారు. 99 రాజ్యాంగ సవరణతోపాటు ఎన్‌జెఎసి చట్టాన్ని సుప్రీం కోర్టు కొట్టివేస్తే కొలీజియం వ్యవస్థ దానంతట అదే యథాతథంగా పునరుద్దరణ జరుగుతుందంటూ జూన్ 11న న్యాయస్థానం చేసిన వ్యాఖ్యలకు సోలిసిటర్ జనరల్ అభ్యంతరం చెపుతూ చట్టాలు చేసే అధికారం కలిగిన పార్లమెంట్ యోగ్యతను సుప్రీం కోర్టు ప్రశ్నించకూడదని సొలిసిటర్ జనరల్ స్పష్టం చేశారు.

### మాఫియా చేతిలో ముగ్గురు విలేఖరుల హత్య

ఉత్తరప్రదేశ్‌లోని షహజాన్‌పూర్‌కు చెందిన విలేఖరి జగేంద్రసింగ్‌పై జూన్ 1న పోలీసులు కిరోసిన్ పోసి నిప్పంటించగా ఆయన జూన్ 8న మృతి చెందాడని కుటుంబ సభ్యులు తెలిపారు. ఉత్తరప్రదేశ్ మంత్రి రామ్మూర్తిసింగ్ వర్మకు చెందిన అక్రమ మైనింగ్, భూకబ్జా వివరాలను జగేంద్ర ఫేస్‌బుక్‌లో ఉంచారని కుటుంబికులు తెలిపారు. గుజరాత్‌లోని సురేంద్రనగర్ జిల్లాకు చెందిన శైలేష్‌కాంతి పటేల్ అక్రమ మద్యం సరఫరాకు సంబంధించిన వివరాల కోసం జూన్ 15న డిస్ట్రిక్ట్ సూపరిండెంట్ ఆఫ్ పోలీసుకు దరఖాస్తు చేసుకున్నాడు. అదే రోజు రాత్రి ఆయన హత్యకు గురయ్యారు. మహారాష్ట్రలోని బాలాఘాట్ జిల్లాలోని కటన్‌గి హిల్స్‌కు చెందిన విలేఖరి సందీప్ కొఠారిని ఇసుక మాఫియా కిడ్నాప్ చేసి రెండు రోజుల తరువాత చిత్రహింసలకు గురిచేసి, చంపి జూన్ 21న పట్టన సమీపంలోని రైలు పట్టాల వద్ద మృతదేహం పడేశారు. ఇసుక మాఫియాకు వ్యతిరేకంగా న్యాయ స్థానంలో కేసు వేసినందుకే సందీప్‌ను చంపారని కుటుంబ సభ్యులు తెలిపారు. వీ

## సిరియాలో కొనసాగుతున్న దాడులు

సిరియా ఉత్తర ప్రాంతంలో ఐఎస్ఐఎస్ పట్టున్న అలెప్పో ప్రావిన్స్, అల్‌బాబ్ నగరాలపై దళాలపై ప్రభుత్వ దళాలు బాంబు దాడులు జరపడంతో తీవ్ర ప్రాణ నష్టం, ఆస్తి నష్టం జరుగుతోంది. మే 30న హెలికాప్టర్ల ద్వారా జరిపిన బాంబు దాడిలో దాదాపు నలభై ఐదు మంది మరణించారు. ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదుల అధీనంలోని ప్రాంతాలపై ప్రభుత్వ దళాలు టార్గెట్ చేస్తూ దాడులు చేస్తున్నాయి. ఒకవైపు అమెరికా నేతృత్వంలోని సంకీర్ణ దళాల దాడులు, మరోవైపు కుర్దిష్ సైన్యం చేస్తున్న పరస్పర దాడులతో ప్రజలు ప్రాణభయంతో పొరుగు దేశాలకు వలసపోతున్నారు.

## చైనాలో నౌక మునక

చైనాలోని యాంగ్జీ నదిలో జరిగిన పడవ ప్రమాదంలో నాలుగు వందల మందికి పైగా మునిగిపోయారు. వీరిలో ఎక్కువ మంది చైనా యాత్రికులు ఉన్నారు. జూన్ 1న 458 మందితో ఈస్టర్న్ స్టార్ అనే పడవ బయలుదేరింది. అర్ధరాత్రి సమయంలో నదిలో వచ్చిన భారీ తుఫాను కారణంగా బోల్తాపడింది. దీంతో అందులోని ప్రయాణీకులు అందరూ మునిగిపోయారు. కొందరు ఈదుకుంటూ దగ్గరలోని  తీరానికి చేరుకోని ప్రాణాలు కాపాడుకోగలిగారు. 70 ఏళ్ల కాలంలో ఇంతటి పెద్ద ప్రమాదం జరగడం ఇదే మొదటిసారి.

## నైజీరియాలో ఆత్మాహుతి దాడులు

నైజీరియాలోని మైదుగురి నగరంలో ఆత్మాహుతి దాడి జరిగింది. జూన్ 2న గాంబోరు కాటెల్ మార్కెట్‌లో జరిగిన ఈ దాడిలో యాభై మందికి పైగా మరణించారు. నైజీరియాలో బొకోహరమ్ దళాలు చేస్తున్న దాడులలో వందలాది మంది ప్రాణాలు కోల్పోతున్నారు. నైజీరియా అధ్యక్షుడు ముహమ్మద్ బుహారీ మిలిటరీ ప్రధాన కార్యాలయాన్ని మధ్య నైజీరియా రాజధాని అబుజా నుండి మైదుగురి మార్చుతానని ప్రకటించారు. అదే ప్రాంతంలో బాంబు దాడి జరగడంతో అనిశ్చితి నెలకొని ఉంది. జూన్ 13న బొకోహరమ్ దళాలు ఆరు గ్రామాలపై విచక్షణారహితంగా  కాల్పులు జరపడంతో 37 మంది రైతులు చనిపోయారు. జూన్ 23న బొకోహరమ్ దళాలు రెండు గ్రామాలలోని ఇళ్లను తగులబెట్టి, కాల్పులు జరపడంతో నలభై మంది మరణించారు. గత సంవత్సర కాలంగా ప్రభుత్వ దళాలకూ, బొకోహరమ్ దళాలకూ మధ్య పోరులో వేలాదిగా ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. తీవ్ర ప్రాణ నష్టం సంభవించింది. లక్షలాదిగా సురక్షిత ప్రాంతాలకు వలస పోతున్నారు.

## యెమెన్‌పై సౌదీ దాడులు

యెమెన్‌లో తిరుగుబాటు దళాలపై సౌదీ సైనిక, వైమానిక దళాల దాడులు కొనసాగుతున్నాయి. తిరుగుబాటు హూతీ దళాల అధీనంలోని ప్రముఖ నగరాలపై జరిగిన ఈ దాడులలో వంద మంది వరకు ప్రాణాలు కోల్పోయారు. మృతుల్లో సామాన్య ప్రజలు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. యెమెన్‌లో హూతీ తిరుగుబాటు దళాలు, సలేహ్ మద్దతుదారులకూ, స్థానిక తెగకూ మధ్య తీవ్ర ఆధిపత్య పోరు జరుగుతోంది. గత సెప్టెంబర్‌లో రాజధాని సనాను తిరుగుబాటు దారులు చేజిక్కించుకోవడంతో అధ్యక్షుడు అబెద్ రబ్బో మన్సూర్ హదీ సౌదీ అరేబియా పారిపోయి రక్షణ పొందుతున్నాడు.

## మారిషస్ అధ్యక్షురాలిగా అమీనా గరీబ్ ఫకీమ్

మారిషస్ అధ్యక్షురాలిగా ప్రముఖ శాస్త్రవేత్త అమీనా గరీబ్ ఫకీమ్ ఎన్నికయ్యారు. జూన్ 4న పార్లమెంట్‌లో ఆమెను అధ్యక్షురాలిగా నియమిస్తూ ప్రవేశపెట్టిన తీర్మానం ఆమోదం పొందింది. దీంతో మారిషస్‌కు తొలి మహిళా అధ్యక్షురాలిగా ఫకీమ్ చరిత్రకెక్కారు. పార్లమెంట్ ఏకగ్రీవంగా ఆమోదించినట్లు పార్లమెంట్ తొలి మహిళా స్పీకర్ మాయా హనుమాన్జీ తెలిపారు. ఇది దేశ చరిత్రలో చారిత్రాత్మకమైన ఘట్టం అని చెప్పారు. ఫకీమ్ నియామకాన్ని ప్రతిపక్షం కూడా సమర్థించడంతో ఆమె ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఆమె అధ్యక్షురాలిగా నియామకాన్ని ప్రధాని సర్ అనురుద్ జగన్నాద్ సమర్థించారు.

## గ్రీస్‌లో ముదురుతున్న ఆర్థిక సంక్షోభం

తీవ్ర ఆర్థిక సంక్షోభంతో దివాళా తీస్తున్న గ్రీస్‌పై యూరోపియన్ యూనియన్ (ఇయు) సంస్కరణల అమలుకు తీవ్ర ఒత్తిడి చేస్తోంది. సంక్షోభ నివారణ కోసం కఠినమైన ఆర్థిక సంస్కరణలు అమలు చేయాల్సిందేనని ఇయు డిమాండ్ చేస్తోంది. గ్రీస్‌లోని సిరియా ప్రభుత్వానికీ, ఇయుకి మధ్య బ్రస్సెల్స్‌లో జూన్ 11న జరిగిన చర్చలు విఫలమయ్యాయి. భారీ స్థాయిలో ఆర్థిక కోతల్ని విధించాల్సిందిగా గ్రీస్ ప్రధాని అలెక్సీస్ సిప్రాస్‌పై ఇయు ఒత్తిడి చేస్తోంది. పెన్షన్, ఉద్యోగుల జీతభత్యాలపై భారీ కోతల్ని విధించడం, విలువ ఆధారిత పన్నులు, ఇతర అమ్మకపు పన్నులు పెంచడం వంటివి చేయడాన్ని సిరిజా ప్రభుత్వం అంగీకరించడం లేదు.

## దక్షిణ కొరియాలో మెర్స్ వ్యాధి

దక్షిణ కొరియాలో మధ్యప్రాచ్య శ్వాసకోశ రుగ్మత (మెర్స్) తీవ్రంగా ప్రబలుతోంది. రోజు రోజుకూ ఈ వ్యాధికి గురైన వారి సంఖ్య పెరుగుతోంది. ఇప్పటి వరకు 150 మందికి పైగా మెర్స్ వ్యాధి బారిన పడ్డారు. పదిహేను మంది చనిపోయారు. ఇప్పటి వరకు ఇరవై దేశాల్లో మెర్స్ వైరస్ కేసులు నమోదయ్యాయి. వేగంగా వ్యాప్తి చెందుతున్న ఈ వ్యాధి తీవ్రతపై చర్చించేందుకు ప్రపంచ ఆరోగ్య సంస్థ జూన్ 14న దక్షిణ కొరియాలో అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చేసి వ్యాధి నిరోధానికి ఎటువంటి చర్యలు చేపట్టాలో చర్చించింది.

## ఇరాక్‌లో వైమానిక దాడులు

ఇరాక్‌లోని ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులపై సైన్యం వైమానిక దాడులు కొనసాగుతున్నాయి. ఇస్లామిక్ స్టేట్ అధీనంలోని ప్రాంతాలపై సైన్యం అమెరికా సహాయంతో ఈ దాడులు జరుపుతోంది. జూన్ 16న సైన్యం జరిపిన దాడిలో 71 మంది చనిపోయారు. మృతుల్లో సైనికులు, సాధారణ పౌరులు కూడా ఉన్నారు.

## బ్రిటన్‌లో నిరసనలు

ప్రధాని డేవిడ్ కామెరూన్ ప్రభుత్వం చేపట్టిన కఠినమైన ఆర్థిక పొదుపు చర్యలకు నిరసనగా బ్రిటన్ ప్రజలు నిరసన తెలిపారు. జూన్ 20న లండన్, గ్లాస్గో, లివర్‌పూల్, బ్రిస్టల్ వంటి బ్రిటన్‌లోని ప్రధాన నగరాల్లో ప్రజలు వీధులలో ప్రభుత్వ వ్యతిరేక నినాదాలతో ఆందోళన చేపట్టారు. సంక్షేమ పథకాలను కుదించడం, జాతీయ ఆరోగ్య పథకం ప్రైవేటీకరణ, ప్రభుత్వ రంగ సంస్థలకు కోతలు విధించడం వంటి ఆర్థిక పొదుపు చర్యలు చేపట్టాలని కామెరూన్ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్, హౌస్ ఆఫ్ పార్లమెంట్ ముందు జరిగిన ర్యాలీలో లక్షలాది మంది ప్రజలు పాల్గొన్నారు. ఉపాధ్యాయులు, లాయర్లు, డాక్టర్లు, రాజకీయ నాయకులు, వివిధ రంగాల్లోని సెలబ్రిటీలు ఇలా అనేక మంది నిరసన ర్యాలీలో పాల్గొని తమ సంఘీభావాన్ని ప్రకటించారు.

## అఫ్ఘానిస్తాన్ పార్లమెంట్‌పై దాడి

అఫ్ఘానిస్తాన్ రాజధాని కాబూల్‌లో పార్లమెంట్ ప్రాంగణంలో  బాంబు దాడి జరిగింది. జూన్ 22న అఫ్ఘానిస్తాన్ పార్లమెంట్ సమావేశం జరుగుతున్న సమయంలో బాంబు దాడి జరగడంతో పార్లమెంట్ సభ్యులూ, అధికారులూ, మీడియా సిబ్బందీ తీవ్ర భయానికి లోనయ్యారు. ముందుగా పార్లమెంట్‌కు కొద్ది దూరంలో ఒక కారులో ఉన్న వ్యక్తి తనను తాను పేల్చుకుని ఆత్మాహుతికి పాల్పడ్డాడు. ఈ పేలుడు వల్ల ఒక చిన్నారితో సహా ఇద్దరు చనిపోయారు. 30 మంది గాయపడ్డారు. అదే సమయంలో ఆరుగురు ఉగ్రవాదులు పార్లమెంట్‌లోకి చొరబడి రాకెట్ లాంచర్లతో గ్రెనేడ్లు విసురుతూ, బాంబులు విసురుతూ, తుపాకులతో కాల్పులు జరుపుతూ బీభత్సం సృష్టించారు. భద్రతా దళాలు ఎదురు దాడి చేసి ఆరుగురు ఉగ్రవాదులను చంపేశాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మే 1 నుండి మే 31, 2015 వరకు తెలంగాణలోని 9 జిల్లాలు (1943), ఆంధ్రప్రదేశ్‌లోని 10 జిల్లాలలో (2075) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 4018)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 5 | – | 27 | 28 | 4 | 6 | 5 | 2 | 2 | 5 | 4 | 2 | 3 | 28 | 33 | – | – | – | 4 | 42 |
| హైదరాబాద్ | – | – | – | 9 | 13 | – | – | – | 1 | 4 | 6 | 9 | – | – | 25 | 19 | – | – | – | 10 | – |
| కరీంనగర్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ఖమ్మం | – | – | – | 11 | 14 | 7 | 8 | 1 | 1 | 2 | 4 | 4 | – | 3 | 28 | 25 | – | – | – | – | 414 |
| మహబూబ్‌నగర్ | – | 4 | – | 6 | 14 | – | 3 | 1 | 1 | 3 | 7 | 22 | 15 | 5 | 58 | 2 | – | – | – | – | 107 |
| మెదక్ | 12 | 8 | 4 | 6 | 9 | 7 | 12 | 13 | 15 | 16 | 17 | 14 | 9 | 20 | 16 | 12 | – | 19 | – | 6 | 2 |
| నల్గొండ | – | 4 | – | 6 | 4 | 7 | 2 | 1 | – | – | 1 | 3 | 1 | 5 | 32 | 18 | – | – | – | – | 218 |
| నిజామాబాద్ | – | – | – | 3 | 13 | 3 | 6 | – | 1 | 4 | 8 | – | 1 | 3 | 26 | 17 | – | – | – | – | 38 |
| వరంగల్ | – | 1 | 1 | 9 | 10 | 4 | 6 | 1 | – | – | 1 | – | 2 | 2 | 33 | 21 | – | – | – | – | 38 |
| రంగారెడ్డి | 6 | 5 | – | 5 | 2 | 3 | 1 | 1 | 3 | 2 | 1 | 5 | 2 | – | 12 | 19 | – | – | – | – | 38 |
| **తెలంగాణ** | **19** | **27** | **5** | **82** | **107** | **35** | **44** | **23** | **24** | **33** | **50** | **61** | **32** | **41** | **258** | **166** | **-** | **19** | **-** | **20** | **897** |
| అనంతపురం | – | 11 | 3 | 10 | 13 | – | 1 | – | – | 2 | 9 | 8 | 7 | 4 | 49 | 2 | – | – | – | – | 54 |
| చిత్తూరు | – | – | – | 11 | 9 | 6 | 8 | – | – | – | 4 | 7 | 11 | – | 34 | 14 | – | – | – | – | 42 |
| కడప | 3 | – | 5 | 12 | 1 | – | – | – | – | 2 | 16 | 5 | – | 1 | 16 | 6 | – | – | – | – | 26 |
| గుంటూరు | 2 | – | – | 5 | 10 | 4 | 1 | 6 | 2 | 4 | 2 | 6 | 2 | – | 28 | 32 | – | – | – | – | 294 |
| కృష్ణా | – | 1 | – | 2 | 7 | 4 | 3 | 5 | 3 | 3 | 2 | 4 | – | 2 | 20 | 19 | – | – | – | – | 252 |
| కర్నూలు | – | 3 | – | 4 | 3 | 5 | 7 | 4 | 8 | 6 | 3 | 4 | 7 | 4 | 25 | 19 | – | – | – | – | 21 |
| తూర్పు గోదావరి | – | – | – | – | 11 | – | 7 | 2 | 1 | 3 | – | – | 3 | 2 | 29 | 16 | 2 | – | – | – | 181 |
| ప్రకాశం | – | 2 | – | 3 | 4 | 1 | 4 | – | – | – | – | – | – | – | 10 | 7 | – | – | – | – | 7 |
| శ్రీకాకుళం | – | – | 4 | 14 | 4 | 15 | 0 | 1 | 5 | 0 | 0 | 1 | 4 | 32 | 19 | – | – | – | – | – | 160 |
| విశాఖపట్నం | 1 | – | – | 4 | 7 | 1 | 1 | – | – | 4 | – | 2 | 2 | 1 | 25 | 20 | – | – | – | 5 | 188 |
| **ఆంధ్రప్రదేశ్** | **6** | **17** | **12** | **65** | **69** | **36** | **32** | **18** | **19** | **24** | **36** | **37** | **36** | **46** | **255** | **135** | **2** | **-** | **-** | **5** | **1225** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం-<br>ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రె | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |
| రియాలిటీ చెక్ | పూడూరి రాజిరెడ్డి | 250 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమీల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | రు. 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీదేవి ప్రేమ్‌చంద్ | 120 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 168 - July 2015 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/6/2014 • Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

## ‘వీక్షణం’ను ఆదుకుందాం
## ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పన్నెండు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పన్నెండు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao